# ఆంధ్రపత్రిక

## ప్రమాదినామ సంవత్సరాది సంచిక

[అరువదిమూడవ సంచిక]

[1973 - 74]

★

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

[1938 – 1972]

★

**వెల రూ. 3**

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

Supplement to Andhra Patrika Issue Dated 4-4-1973 Regd No. M 1118

| సంచిక | # ప్రవహాదినామ సంవత్సరాది సంచిక | సంవత్సరము |
|---|---|---|
| 63 | విషయానుక్రమణిక | 1973—74 |


తెలుగు వెలుగుల తొలి యుగాదీ! జయోస్తు!—
శ్రీమతి లీలావతి 1

దేవాలయములు—డా॥ నేలటూరు వెంకట రమణయ్య 3

నృసింహ కవిద్వయము—శ్రీ తేరాల సత్యనారాయణ శర్మ 6

ఆధునిక యుగము—గాంధీ సాహిత్యము—
శ్రీ నిడుదవోలు వెంకటరావు 9

వలయం నుండి వలయంలోకి—
శ్రీ మాదిరాజు రంగారావు 36

మొదటి శక్తివర్మ—తూర్పు చాళుక్యుడు—
శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం,
శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావు 38

రక్తం సూర్యుడు!—శ్రీ కె. శివారెడ్డి 48

సాహిత్యము—విమర్శ—శ్రీ చిలమకూరి రామబ్రహ్మం—
శ్రీ సూరపరాజు రాధాకృష్ణమూర్తి 49

కొప్పవత్తి—ద్రాక్ష గుత్తి—శ్రీ దాశరథి 52

వెంకటమఖి: 72 మేళములు, 120 మేళములు—
శ్రీ సరస్వతి రామకృష్ణయ్య 54

పిచ్చి వెంకట్రావు—(కథానిక)—
శ్రీ మధురాంతకం రాజారాం 65

ఆయుర్వేదంలో ఆహార నియమములు—
వైద్యవిశారద చదలవాడ రాజరాజేశ్వర శర్మ 73

తెలుగులో స్వీయచరిత్రలు—
డా॥ అక్కిరాజు రమాపతిరావు 76

మన జాతీయ విహంగం 'నెమలి'—
వేదం రామశాస్త్రి 86

శాసన పరిశోధన—నూతన చరిత్రాంశములు—
శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రి 90

నన్నెచోడుని ప్రయోగ విశేషములు—శ్రీ ఆంగీరస 95

ఆంధ్ర వాఙ్మయ ప్రారంభ కాలమున మహారాష్ట్ర
ప్రభావము—శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి 100

ఎరువు—(కథ)—శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం 112

వ్రాత ప్రతుల లేఖన సంప్రదాయములు—
పరిష్కర్తల చింతధోరణులు—
శ్రీ వంతరాం రామకృష్ణారావు 118

తొల్కాప్పియము—
డా॥ తిమ్మావజ్ఝల కోదండరామయ్య 120

నాటకములు—ప్రదర్శనార్హత—
శ్రీ నోరి నరసింహ శాస్త్రి 128

తెలుగునాట ప్రజనన తంత్రాలు: దేవతలు
శ్రీ తిరుమల రామచంద్ర 134

తిరుపతి వేంకటకవుల దేవీభాగవతము—
శ్రీ పి. గణపతిశాస్త్రి 140

తెలుగులో అసమాపకక్రియ: క్త్వార్థకం—
శ్రీ చేకూరి రామారావు 144

మన ఆర్థిక వ్యవస్థ—స్థితిగతులు—
శ్రీ వి. శ్రీరామచంద్ర 149


★

ముఖచిత్రం: 'రంభనృత్యము'

చిత్రకారుడు: శ్రీ వై. బాలయ్య, సిద్దిపేట.



శ్రీ శివలెంక శంభూప్రసాద్

జననము **26-1-1911** శివసాయుజ్యం **8-6-1972**

ఓమ్

# ప్రస్తావన

పరీధావి సంవత్సరంలో ఆంధ్రపత్రికకి ఎంతో తీవ్రమయిన దెబ్బతగిలింది. ఇంచుమించు మూడున్నర దశాబ్దాలపాటు ఈ పత్రికకి ఆధిపత్యం వహించి దానిని అన్ని విధాలుగా తీర్చిదిద్దిన శ్రీ శివలెంక శంభూప్రసాద్‌గారు 8-6-1972 నాడు శివసాయుజ్యం చెందారు. శ్రీ కాశీనాధుని నాగేశ్వర రావు పంతులుగారు ఆంధ్రపత్రికని ఆధునిక సమాచార ప్రసార సాధనాలు అభివృద్ధి చెందుతున్న కాలంలో నెల కొల్పారు. మొదటినుంచీ ఆంధ్రపత్రిక తెలుగువారి సంస్కృతికి ఒక ప్రతిబింబంగా ఉండటానికే ప్రయత్నిస్తూ వచ్చినదంటే అతిశయోక్తి కాదు. భారతదేశంలో తక్కిన వారందరితోబాటు తెలుగువారిలోనూ జాతీయచైతన్యం మేలుకొన్నప్పుడు ఈ చైతన్యం దాల్చిన వివిధ స్వరూపాల దోహదానికి ఆంధ్రపత్రిక ఎప్పుడూ తోడ్పడుతూనే ఉన్నది.

తమ గతంలోని గొప్పతనాన్ని తెలుసుకుని ఇతరులకి తెలియచెయ్యటమేకాక వర్తమానంలో జరుగవలసిన సంస్కరణని గురించి చెప్పే బాధ్యతని తెలుగురాసేవారు ఎందరో తమమీద వేసుకుంటూనే వచ్చారు. మానవుల చరిత్ర కొన్ని సిద్ధాంతాలు చెప్పినట్లు నడుస్తుందని నమ్మేవారి సంగతి ఎలాగ ఉన్నప్పటికీ మన ముందువారిని గురించి తెలుసుకుందామనే కుతూహలం ఎందరికో ఉంటుంది. తెలుపగలిగినవారు వీలయినంతా తెలుపటానికి ప్రయత్నించవచ్చు. అయితే, ఇన్నివిధాలుగా మారిపోతున్న ప్రపంచాన్ని వదులుకుని గతంలో మునిగిపోదామనుకోవటం అతిముఖ్యమయిన బాధ్యతని వదులుకొన్నట్లే. అందుచేతనే, మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని గురించి రాయటానికి ఇంకా ఎందరో పూనుకోవాలని శ్రీ శంభూప్రసాద్‌గారు ఎప్పుడూ అంటూ ఉండేవారు. సాంప్రదాయకంగా ఒక రకం పాండిత్యానికి అలవాటుపడిన రచయితలు ఈ పని చెయ్యటంలో అంత ఆసక్తి చూపించకపోవచ్చు. ఆసక్తి కలవారు ఎందరో తెలుగులో రాయటానికి ముందుకి రాకపోవచ్చు. కొన్ని దశాబ్దాల ముందుకన్నా నేడు అన్ని దినుసుల విద్యాభ్యాసానికీ అవకాశాలు బాగా పెరిగిపోయి వర్తమానకాలానికి సంబంధించిన విషయాలని చర్చించే వేదికలు కొన్ని ఎక్కువ అవటంచేతకూడా ఈ రకం చర్చ పత్రికలలో తగ్గిపోవచ్చు.

కొంతకాలంగా తెలుగుప్రజల జీవితంలో పెద్ద సంక్షోభం ఏర్పడింది. వారు ఎన్నో కష్టాలకి గురి అవుతున్నారు. అధికారంలో ఉండి తగిన నిర్ణయాలు తీసుకోవలసినవారు తమ బాధ్యతని పూర్తిగా విసర్జిస్తున్నారు. వారి ధోరణి ఏ మాత్రం ఆశాజనకంగా లేదు. ఆంధ్రపత్రికని తెలుగువారి జీవితంలో ఒక భాగంగా తయారు చేసేందుకు ఎప్పుడూ కృషిచేసిన శ్రీ శివలెంక శంభూప్రసాద్‌గారి భావాలని కొన్నిటిని తెలుగువారికి ఈ సందర్భంలో గుర్తు చేస్తున్నాము. పరీధావిలో అలుముకున్న చీకట్లు ప్రమాది సంవత్సరంలో తొలగిపోవాలని ప్రార్థిస్తున్నాము.

ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచికకి తమ రచనలు, చిత్రాలు మొదలయినవి పంపినవారందరికీ మా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాము. ఇకముందుకూడా ఎప్పటిలాగే రచయితలు, రచయిత్రులు, చిత్రకారులు ఆంధ్రపత్రికకి తమ రచనలు, చిత్రాలు పంపి మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

# తెలుగు వెలుగుల తొలియుగాదీ! జయోస్తు!

శ్రీమతి లీలావతి

ఆది యుగాది నీవు తెలుగమ్మ వినూత్న గృహప్రవేశ, భా
గ్యోదయ మబ్బువేళ, ఎల కోయిల పాటల స్వాగతాల—ఆ
హ్లాదము కూర్చుమోయి! తెలుగన్నల తీయని జీవితాలలో
మోదము నించి, అభ్యుదయముల్ విలసిల్ల—ప్రమాది వత్సరా!

కలుగు ప్రమాదముల్, తొలగు
గావుత నీ దయ నో మహాత్మ! నీ
వెలుగులు సోకి మా తెలుగు
వీరుల త్యాగము సార్థకమ్ము గా—
వలె, బ్రతుకుల్ తరింపవలె,
వాంఛితముల్ ఫలియింపగా వలెన్
వలసిన కోర్కెలిమ్ము, భగ
వంతుడ వీవె—ప్రమాది వత్సరా!

తెలుగు తరితీపి చలువ వెన్నెలల పాట
కోటి మధురోహ లొలికించు కోకిలమ్మ
తీయనౌ గొంతులో సాగి దిశల కెల్ల
పంచుగావుత 'జై ఆంధ్ర' వైభవమ్ము

చేయుట కేమిలే చేసిన బలిదాన—
ముల్ త్యాగముల్ వ్యర్థ పుచ్చకుండ
వేయుట కేమిలే వేసిన పథకాలు
కాగితాలనె బూజు కట్టకుండ
పండుటకేమిలే పండిన ధాన్యాలు
గోడౌన్ల నిలవారి కుళ్ళకుండ
పలుకుటకేమిలే పలికిన బాసలు
మరపు శ్మశానాల మసల కుండ

వెడలి ముందుకు వెనుకంజ వేయకుండ
తెలుగు జోదులు వెలుగులై నిలువ వలయు
నీ కటాక్ష వాల్లభ్య సందీప్తి కతన
తెలుగు వెలుగుల తొలియుగాదీ! జయోస్తు!

శ్రీశైల మల్లేశు శిరస్సైన జాబిల్లి
చిందు తెలుంగు చక్కందనాలు
విజయవాటిక లోన వెలసిన దుర్గమ్మ
చూపు తెలుంగుల శౌర్య గరిమ
భద్రాద్రి రామన్న వాత్సల్య దీప్తిలో
పరువులెత్తు తెలుంగు పరిమళాలు
తిరుపతి వేంకటేశ్వరు విందు కొలువులో
పరచికొను తెలుంగు ప్రాభవాలు

మరల యొకమారుగా పొంగి పొరలి పొరలి
వింధ్య తాకుత నూదు తెలుంగు కీర్తి
భవ దపార కృపా పరిపాలనమున
తెలుగు వెలుగుల తొలి యుగాది! జయోస్తు!

ఎవ్వని బాణ మామ్రి సుమమెవ్వని చాపము కింశుకంబు, తా
నెవ్వని నారి తేటికుల మెవ్వని తెల్లని గొడ్గు చందురుం
డెవ్వని దంతి మారుత మదెవ్వని వంది జనంబు కోకిలం
బవ్వల రాజు చైత్రియుతుడై యిడు గొప్పల శోభనమ్ములన్

# దేవాలయములు

డా॥ నేలటూరు వెంకటరమణయ్య



హిందూ దేవాలయములను స్థూలముగా ద్వివిధములుగా విభజింప వచ్చును. (1) గుహాలయములు, (2) రాకట్టు గుళ్ళు. గుహాలయములు కడు ప్రాచీనములు. వీని సంఖ్య యత్యల్పము. ఇవి పర్వత సానువులను తొలచి చేయబడినవి. ఇందు సుప్రసిద్ధమైనవి మహారాష్ట్రములోని యెల్లోరా యెలిఫెంటాలయందు గానవచ్చుచున్నవి. ఇందలి శిల్పములు లోకమున వినుతి కెక్కినవి. ఆంధ్రప్రదేశమందును తదితర దాక్షిణాత్య జనపదములందును గుహాలయములు పెక్కు తావుల గలవు. ఆంధ్ర ప్రదేశములోని గుహాలయములలో బెజవాడ చెంతనుండు ఉండవల్లి మొగలురాజాపురములందున్నవి ప్రసిద్ధి కెక్కినవి. అందలి శిలామయ ప్రతిమల సౌందర్యము శిల్పకళా కోవిదుల మెప్పునకు పాత్రమైనవి. వీనిని గాంచియే పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ ద్రావిడ చోళ దేశములం దనేక స్థలములందు కొండలను దొలిపించి గుహాలయములను నిర్మించెను. దాక్షిణాత్య గుహాలయములలో గొన్నిటియందు చిత్తరువులు గలవు. ఇప్పటి తిరుచిరాపలి జిల్లాలోని చిత్తనవాసల్ గుహాలయమున చిత్తరువులు గలవు. ఆంధ్రప్రదేశ కరీంనగరమండలములో వడవి సోమనపల్లె సమీపమున పెదవరెక్కమధ్యమున పారేడు దక్షిణ తటమున నుండు కొండ యుత్తరముఖమున దొలచియుండు గుహాలయం దొకదాని యాభ్యంతర్భాగము మీద భారత యుద్ధకథ చిత్రింపబడియుండెను. ఈ చిత్రములలో జాలభాగము శిలాతలము చెక్కిపోవుటవలన నాశమందిపోయినను నొక మహా పద్మవ్యూహమును సైంధవ వధయు నింకను నిలచియున్నవి. ఈ గుహాలయములు తపోధ్యాన నిరతులగు మునుల కాశ్రయములై యుండెను.

రాకట్టు గుళ్ళు భరతఖండ మందెల్ల యెడలను గాన్పించుచున్నవి. ఇవి వివిధ దేవతలలో ప్రఖ్యాతుల కంకితము చేయబడియున్నవి. మన దేవతలు మూడుకోట్లు. వీరి సంఖ్య తగ్గదు హెచ్చదు. వీరియందు బహుసంఖ్యాకులు నామధేయులు. పేరుగలవారు కొందరే. వీరు గూడ యెల్లప్పుడును నొక్క తీరుగ ప్రజాదరమునకు పాత్రులై యుండలేదు. కాల ధర్మము ననుసరించి వీరి మహాత్మ్యము మారుచు వచ్చినది. వైదిక కాలమునందు ప్రఖ్యాతులై యుండిన దేవత లిప్పుడు మరుగుపడి విస్మృతులైపోయిరి. అప్పుడు పేరు మూలలయం దణగియుండిన వారి ప్రభావ మతిశయముగాగా వారు ముందుకు వచ్చి యిప్పుడు సర్వత్ర పూజనీయులై వర్ధిల్లుచున్నారు. వీరి కంకితములైనవే యిప్పటి దేవాలయములన్నియు. దేవత లెందరైననేమి? దేవాలయము లెవ్వరి కొరకు నిర్మింపబడిననేమి? వారందరును త్రిజగదధినాయకుండైన పరమేశ్వరుని యంశావతారులే. అతడు స్వయంభువు. ఆది మధ్యాంత రహితుడు, నిత్యుడు, సత్యస్వరూపుడు, సర్వభూతములకధిపతి, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వశక్తి సంపన్నుడు. అతడే జగత్కారణ భూతుడు. అండపిండ బ్రహ్మాండాత్మకమైన యీ ప్రపంచమంతయు నతనియందే యిమిడియున్నది. అద్వైతు లతనిని నామరూప గుణరహితుడైన బ్రహ్మ మందురు. వైష్ణవులు సకల కల్యాణ గుణసంపన్నుడైన విష్ణుడందురు, శైవులు శంకరుడందురు. జగత్కారణభూతుడు పురుష స్వరూప ధ్వైతత్వము కాదనియు స్త్రీరూపిణియైన జగన్మాత యాదిశక్తి యనియు నామెయందు బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులైన మువ్వురు ఉద్భవించిరనియు గొందరు పల్కుదురు. ఏ పేరుతో బిలిచిన నేమి? జగత్తున కంతటికీ కారణ భూతమగు శక్తి యొక్కటియే యని హిందువుల నమ్మకము. కావున భక్తితో నేదేవాలయమునందే దేవుని కర్చ చేసినను నది యా పరమాత్మకె చెందగలదని వారి దృఢ విశ్వాసము. ఈ విషయమునే సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి యను మన సంధ్యావందన వాక్యము ద్యోతించుచున్నది.

దేవాలయ నిర్మాణము పుణ్యకార్యము. అందువలన పాపక్షయమగుటయే కాక, దేవాలయ నిర్మాతలకును వారి పెద్దలకును పుణ్యలోక ప్రాప్తి కలుగునని మనవారి విశ్వాసము. మరియు ఇది సప్తసంతానములలో నొకటి. తన్మూలమున దన్నిర్మాత పేరు లోకమున చిరస్థాయియై నిలకొనునని వారు తలచిరి. దేవాలయ నిర్మాణ కార్యము నొక కట్టడమును గట్టించి యందు దేవుని శిలామయ ప్రతిబింబమును ప్రతిష్ఠించుటతో సరిపోదు. అందు నిత్య నైవేద్య ధూప దీపములు జరుగుటకును, దేవుని రంగ రంగ వైభవములు నిరవధికముగ సాగుటకు దగు యేర్పాటులు గావించిననే పూర్తియగును. దేవాలయ నిర్మాతలే కాక తదితరులును నిత్య నైవేద్య పూజాదికములు నడుపుటకే కాక ఖండ స్ఫుటిత జీర్ణోద్ధారణ నవ సుధా కర్మలకు భూదానాదులను జేయుచుండినట్లు శాసనములు దెల్పుచున్నవి.

మనవారు దేవాలయములను నిర్మింప బూనుకొన్నప్పుడు రాజమందిరములను దృష్టియందుంచుకొని నిర్మాణ కార్యమును కొనసాగించిరి. సామాన్యులైన రాజులును దేశాధిపతులును నివసించుట కొరకు మహాప్రాసాదములను నిర్మించుకొందురట. ఇక త్రిజగన్నాథుడైన పరమేశ్వరుని మనికి వానికి తగ్గగునా? వానికన్న మిన్నగాకున్న దత్తుల్యముగనైన నుండవలదా. కావున దేవాలయములకు రాజమందిరములు మేలుబంతులైనవి. ఈ విషయము కోవెల శబ్దమువలన వ్యక్తమగుచున్నది. 'దేవాలయాహ్వయంబులు కోవెల యన దేవళంబు గుడినా వెలయున్' అని యాంధ్ర నామ సంగ్రహము. మన కోవెల ద్రావిడ కోయిల్ శబ్దభవము. కోయిల్ సమస్తపదము, కో + ఇల్ అను మాటల కూడికవలన నేర్పడినది. కో యన రాజు, ఇల్ అన మందిరము—కోయిల్ అన రాజమందిరము. అరవమున రాజమందిరమువలె దేవాలయమునకు గూడ అరణ్మణి నామము వెల్లును. తెనుగున నగరని పేరు. కావున దేవాలయము చుట్టునుండు ప్రాకారమునకు కోట యని పేరు కలిగెను. విజయనగరమువంటి మహారాజధాని నగరములు సప్తప్రాకార పరివేష్టితములు. అట్లే శ్రీరంగనాథుని నగరమైన శ్రీరంగము చుట్టును ఏడు ప్రాకారములు. రాజమందిరమునకు వలె కోవెలకును నాలుగు దిక్కుల నాలుగు ద్వారములును వానిపై గోపురములును గలవు. దేవాలయ దృష్టిని పరికించిన నీ గోపురముల యునికికి గారణము తెలియరాదు. రాజమందిర దృష్టిని జూచిన నవి రాజమందిర రక్షణార్థము నిర్మింపబడిన గోపురములని తెల్లము కాగలదు. దూరమునుండి వచ్చు

శత్రువుల యాగమనమును గనుగొనుటకును వచ్చినంతటనె యున్నత స్థానమున నిలిచి వారిపైని ఆయుధ వర్షము గురియించి వారిని రూపు మాపుటకును నవి యాద్యమున నిర్మింపబడెను. మహమ్మదీయ యుగమున మన దేవాలయములు కొన్ని ప్రజలకు శరణ్యమై యుండెనని చరిత్ర గ్రంథములవలన దెలియు చున్నది రాజమందిరములవలె మన దేవాలయములందును మజ్జన భోజన గృహములును నాట్య సభ కల్యాణ మంటపములును గలవు. రాజ పరివారమువలె దేవాలయ పరివారము డెబ్బది రెండు నియోగములుగ విభజింపబడి యుండెను. ఆ నియోగములలో పౌరోహిత పౌరాణిక గాయక నర్తక శిల్పి చిత్రకారులు విలాసినీ జనులు గలరు. పౌరోహితులు తిథి వార నక్షత్రములు స్వామి సన్నిధిని విన్నవించుట దేవాలయములందు నడచు ఉత్సవాదులలో బాల్గొనుట వేద పారాయణము సేయుటయు నతని నియుక్త కార్యములు. పౌరాణికుడు వ్యాస విరచిత అష్టాదశ పురాణములను స్వామి సన్నిధి బఠించి యచటికి వచ్చిన వారికి వాని యంతరార్థములను వివరించి చెప్పువాడు. కవి స్వామివారి యంక మాలికను రచించి పఠించువాడు. గాయకులలో వాగ్గేయకారులును వివిధ వాద్య విద్యా కుశలురును గలరు. వీరు స్వామివారి యాలయమున గూడి స్వామిమీది కీర్తనలు బాడుచు మృదంగ వీణా వంశకాహళాది వివిధ వాద్యములను మ్రోయించు వారు. నర్తక నర్తకీ జనులు స్వామి సభా మంటపమున గొలువైన యపుడును నక్షోత్సవ మాసోత్సవ బ్రహ్మోత్సవాది సమయములు నూరేగునపుడును వారి ముంగట నాట్యము సేయువారు. కొన్ని యాలయములందు గాయన గాయకులును నర్తక నర్తకీ జనులును మేళములుగ విడువడి వంతుల ప్రకారము స్వామివారి సేవయందు బని గొనువారు. ఒక్కొక్క మేళమందును పాత్ర యొకరుత్తకయు వైణిక వాంశిక సార్దంగికాది వాద్య విద్యా విశారదులును నుండువారు. శిల్పి చిత్రకారులు దేవాలయ నిర్మాణమప్పుడును వలసిన ప్రతిమలను చిత్తరువులను దయారు సేయువారు. వీనిని గూర్చి యిచ్చట నొక మాట చెప్పవలసియున్నది. ఇవి కేవల మలంకారార్థము సమకూర్చినవి కావు. వీని ముఖ్య ప్రయోజనము మత ప్రచారము. జన సామాన్యమున విద్యావంతుల సంఖ్య తక్కువ. వ్రాయ జదువ నేర్చిన వారు వేయింట కొక్కరు. గ్రంథములను జదివి మత విషయములను గ్రహించుట వారికి సాధ్యముగాదు. కావున మత విషయములను బ్రతిమా ప్రదర్శన మూలముననుు చిత్ర పటములవలనను జన సామాన్యమున కెరుక పరచుటకొరకే యవి యందు సమకూర్చబడినవి. మన దేవాలయముల గోపురములమీదను విమానములయందును కుడ్యోపరితలములను గానవచ్చు చక్కడపు బొమ్మలును మంటపాంత రాచ్ఛాదనముపై చిత్రింపబడియుండు చిత్ర ప్రతిబింబములును మన మత గాథలను భక్తుల జీవ చరిత్రలను బ్రదర్శించు నవియే. శ్రీశైలము, తిరుపతి, కాళహస్తి, కంచి మొదలగు పుణ్య క్షేత్రము లందిట్టివి బహుళముగ గాన్పించును. కొన్ని దేవస్థానములయందు రామాయణ మహా భారత కథలు చెక్కబడియున్నవి. వాని యుద్దేశము గూడ వానిని జన సామాన్యమునకు బ్రదర్శించి చూపుటయే.

దేవుని నిత్య నైవేద్యములకును రంగ రంగ భోగములును దేవాలయ నిర్మాతలేకాక రాజులు, సామంతులు, ధనవంతులు పుణ్యోపలబ్ధికొరకు దేవాలయములకు భూదానాదికములు సేయువారు సాధారణముగ నీ దానముల నర్చకునకే ధారాపూర్వకముగ దత్తము సేయువారు. ఆ దానములవలన వచ్చు వరుంబడినుండియే యర్చకుడు దేవాలయ కార్యములను నిర్వహించి నిజ జీవయాత్రను సాగించుకొనవలసి యుండెను. దేవస్వమునకును నర్చకస్వమునకును భేద ముండెడిది కాదు. తరచుగ దేవాలయములం దర్చకు డొక్కడుకాక పెక్కండ్రుండు వారు. అర్చకత్వము వంశ పారంపర్యముగ వచ్చు కుటుంబ కాణయాచి యగుటవలన నాద్యమున నర్చకుల డొక్కడె యుండినను ఒకటి రెండు పురుషాంతరములలో వారి సంఖ్య యభివృద్ధి యగుటవలన సర్వ సాధారణముగ నన్ని దేవాలయములందును నర్చకత్వము పెక్కండ్ర చేతనే యుండెను. దేవాలయ భూములను వీరు విభజించుకొని యనుభవించ వచ్చును. అమ్మవచ్చు యమ్ముకొనవచ్చును. విక్రయము సేయ వచ్చును. కాని దేవస్వ మెవ్వరి స్వాధీనమునందున్నను వారు దేవాలయార్చనాది కార్యమునకు లోపము రానీయక నిర్వహించి తీరవలయును. తప్పిరేని రాజదండనకు పాలగువారు. రాజ కొలువులోని యమాత్య వర్గమున ధర్మాధికారి యొకడుండువాడు. సర్వ ధర్మ కార్యముల పారుపత్య మతనిచేత నుండెడిది దేవాలయమునకు స్థానమని పేరు అర్చకులకు స్థానికులనియు వారి నాయకునకు స్థానాధిపతియనియు పేర్లు. స్థానాపతియు స్థానికులును నొక్క సభగ కూడి దేవాలయమునకు సంబంధించిన సర్వ వ్యవహారములను నడపుచుండువారు. ఈ సభ వారి తీర్మానముల నమలులోకి తెచ్చుటకు పారుపత్యగాడును లెక్కలను వ్రాయుటకు గరణమును నుండువారు. మధ్యయుగమున శివాలయములు అనేకములు శైవ సన్యాసుల యధీనమందుండెడివి. శైవ మఠాధిపతియైన యాచార్యుడె వానికి స్థానాపతి. తని శిష్యవర్గమే స్థానికులు ఈ శైవాచార్యుల పాదములను గడిగి వారి హస్తములందే రాజులు మున్నగు దానపరులు దానమిచ్చు సహిరణ్యోదక ధార పూర్వకముగ దత్తము సేయువారు.

దేవాలయముల భూస్థితి యల్ప స్వల్పముగాదు. తరచుగ పెక్కు గ్రామములను గాదా చిక్కముగ నొక్కొక సీమ సమస్తమును వానికి జెల్లుచు వచ్చెడిది దేవాలయమునకు వచ్చు పొలము వానినుండి వచ్చు వరుంబడ యందు కొంత మిగిలెడిది ఇదిగాక ధన రూపముగ గొంత యాదాయము చేకూరెడిది. దీనినంతయును స్థానికుల భద్రముగ దేవాలయ శ్రీభండారమున నిక్షిప్తముగ నుంచి దేవాలయ భూములను సాగుచేయు కర్షకులకు వడ్డికొని యప్పిచ్చువారు. ఇతరు లెవ్వరైన దేవాలయ కైంకర్యార్థము శ్రీభండారమున నిక్షిప్తముజేసి యుంచిన ధనమును భూములు మొదలైన యాస్తి నాడమానముంచుకొని ప్రతి వర్షము సమకూడిన ధనమును దేవకార్యములను నిర్వర్తించుటయందు వినియోగించు వారు. అప్పు తీర్చజాలనివారికడనుండి వారు తాకట్టు పెట్టిన భూములను విలిచికొని యప్పులను జెల్లగట్టు కొనువారు. దేవస్థాన గ్రామములందు వ్యవసాయ స్థితిని చక్క బరచుటకొరకు శ్రీ భండారమునుండి ధనము వెచ్చించి చెరువులను వరానుత్తు జేయించువారు నీట పరుదల సాకర్యార్థము కాలువలను త్రవ్వించి బావులను కుంచించువారు దేవాలయము లిట్లు భూస్వాములైన వ్యవసాయమున బనిగొని కృషీవలుల బోషించుటయే కాక పాశుపాల్యమును సైతము నుద్ధరించెను

మధ్యయుగమున మన దేవాలయములలో నఖండ దీపములను వెల్గించుట మహా పుణ్య కార్యముగ బరిగణింపబడెను ఆ ఖండదీప దానములను దెల్పు శాసనములు నూరార్లు మన దేవాలయములందు గానవచ్చుచున్నవి. సర్వ సాధారణముగ నివి యన్నియు నేతి దీపములే. ఈ దీపములకు వలయు నేతిని సరఫరా చేయుటకు దాత నియమిత సంఖ్యగల యుప్ప యెడ్లనుగాని గోవులనుగాని గొఱియలను గాని వాని మూల్యమును గాని యిచ్చువాడు తరచుగ గొల్ల బోయ లీ జంతువులనో, ధనమునో కైకొని నిత్య మీ దీపములకు వలయు నేతిని సమకూర్చువారు. కాని పెక్కు తావులందు దేవాలయములే పశువులనుగాని, ధనమునుగాని దానము గొని దీపారాధనకు వలసిన నేతిని సమకూర్చెడిది. ఈ కారణమువలన దేవాలయములు పశువుల మందలను సమకూర్చవలసి వచ్చెను. వీనికి కీలారములని పేరు. ప్రతి దినమును రేపటను మాపటను దేవుని యభిషేకార్థము పాలును సంధ్యా దీపములకు వలసిన ఘృతమును కీలారమునుండి తెచ్చెడువారు. దేవాలయములు పశువుల బిడ్డ నేర్పు

రించి పశు సంరక్షణ కొరకు గోపాలకులను నియమించి వారి గ్రాస వాసములకు దగిన సౌకర్యములను గల్పించి పోషించవలసి వచ్చెను.

దేవాలయములు విద్యలను కళలను పోషించి వాని యభివృద్ధికి గారణభూతము లాయెను. దేవాలయ పరిజనులలో వాదక గాయక నర్తక శిల్పి చిత్రకారులు గలరని యింతకుముందు చెప్పియున్నాను. నిశ్చింతులై జీవనము సాగించుచు నిజ విద్యల నభ్యసించుటకు దగినన్ని సదుపాయములను భగవత్సేవాతత్పరులు గావించినట్లు శాసనములు దెల్పుచున్నవి. సానులకును మానులకును గాయక పాఠక నర్తక వాద్యకారులకును ప్రత్యేకము మడి మాన్య వృత్తు లుండెడివి. వీనికి దేవబ్రహ్మదేయములకువలెనే పన్నులు లేవు. కావున కలావంతులందరును దేవాలయముల క్రీనీడ నభివృద్ధి నందిరి. దేవాలయముల కిచ్చు దానములలో విద్యా దాన మొక్కటి. అది విద్యార్థుల కుచితముగ నన్న పానీయాదుల నొసగి వేద వేదాంత శాస్త్రాదులను గరపుట కుద్యమింపబడినది. ఈ దాన మూలమున దేవాలయములందు పాఠశాల లేర్పడినవి. కొన్ని దేవాలయములం దొక్కొక్క శాస్త్రము నభ్యసించుటకు ప్రత్యేక స్థానము లుండెడివి. చెన్నపురి సమీపమందలి తిరువత్తియూరు శివాలయమునందు ప్రత్యేక వ్యాకరణ మంటప ముండెనని యచటి శాసనములు దెల్పుచున్నవి. కొన్ని దేవాలయములందు ఘటికలుండెనని తెలియుచున్నవి. అనంతపుర మండలములోని హేమావతి నగరమందలి దోణంబేశ్వరుని దేవాలయమున మహా ఘటికా స్థానము క్రీ. శ. 12వ శతాబ్దియందు వర్ధిలుచుండెను. ఘటికయు విద్యాస్థానమే. దీనిని గూర్చి మరియొక సందర్భమున వ్యాఖ్యానించుచున్నాడను.

మధ్యయుగమున దేవాలయముల కనుబంధములుగ మఠము లుండెడివి. ప్రాయికముగ నివి యన్నియు శైవ సంప్రదాయమునకు జెందినవే. శ్రీవైష్ణవ మాధ్వ సమయములకు జెందిన మఠములు కొన్ని యున్నను వానిని గూర్చి మనకు తెలియవచ్చు విషయము స్వల్పము. శైవ మఠము లన్నియు, కాళాముఖ కాలాముఖ లక్షాధ్యాయి సంతానమునకు జెందినవి. గోళకీ మఠ గురువుల యాజమాన్యము క్రింద నుండెను. దేవాలయము వలెనే మఠమునకు విస్తారమగు భూసంపత్తు లుండెను. రాజులు మండలేశ్వరులు సామంతులు వీరికి శిష్యులై వీరికి చెప్పుచేతలలో నుండిరి. శిష్యవర్గ మొసగిన భూసంపత్తు ననుభవించుచు మఠములందు తపోనిష్ఠాను రతులై యుండలేదు. వీరి సంఘసేవ యద్వితీయము. కుల భేదమును గుర్తింపక యాకలి గొని వచ్చినవారికెల్ల నన్నదానము సేయువారు. వస్త్రహీనులకు వస్త్రము లొసగువారు. మఠములందు వైద్యశాలల నేర్పరచి రోగపీడితులకు నిలయ మొసగి యన్న పానములకు లోటు గలుగనీయక యౌషధముల నిచ్చి రోగ నివర్తి యగు నందాక నందుంచుకొని యారోగ్యవంతులైన పిమ్మట వారి వారి స్థలములకు వారి నంపువారు. కొన్ని కొన్ని మఠములందు సామాన్య వైద్య శాలతోపాటు గర్భిణీ స్త్రీలకు కానుపు సేయుటకు సూతికా గృహము లుండెడివి. ఇట్టి ప్రసవశాల నొకదానిని స్థాపించి యందు స్త్రీలకు సుఖ ప్రసవ మగుటకు దగు నేర్పాటు గావించితినని కాకతీయ గణపతి దేవుని గురువగు విశ్వేశ్వర శివ దేశికుడు తన మల్కాపురము శాసనమునందు వచించియున్నాడు. శైవ గురువులు చేసినన్ని దానము లన్నిటికంటెను విద్యా దానము మిన్నయైనది. శైవ గురువులు వేద వేదాంగ పారగులు, సకల శాస్త్ర విశారదులు. నేటి క్రైస్తవ జెస్యూటులవలె వీరును తా మేగిన చోట్లయం దెల్లను విద్యాశాలలను స్థాపించి విద్యాకాంక్షితుల కెల్ల విద్య జెప్పెడివారు. వీరి మఠము లనేకములు ఘటికా స్థానములై ప్రసిద్ధి నందెను. మధ్య యుగమం దాంధ్ర కర్ణాటములలో పెక్కుచోట్ల ఘటికా స్థానములు వర్ధిలుచుండెనని శాసనములు దెల్పుచున్నవి. క్రీస్తు శకము ఆరవ శతాబ్ది పూర్వార్ధమున తీరాంధ్రమును పరిపాలించిన విష్ణుకుండి ఇంద్ర భట్టారకవర్మ తాను యథావిధి వినివాసిత ఘటికా వాప్త పుణ్యుడనని చెప్పుకొనియున్నాడు. ఇతనిచే ప్రస్థాపితములైన ఘటికలన్నియు నాంధ్ర దేశమందలి వెలయును. క్రీ. శ. 8 వ శతాబ్ది పూర్వార్ధమున వేంగిదేశము నేలిన ప్రథమ జయసింహ వల్లభుడు ఒకానొక శాసనమునం దసనపురమునం దొక ఘటికా స్థాన ముండెనని చెప్పియున్నాడు. ఇది విష్ణుకుండి ఇంద్ర భట్టారక వర్మ స్థాపించిన ఘటికలలో నొకటి కావచ్చును. కల్యాణి చాళుక్యరాజుల కాలము పశ్చిమాంధ్ర కర్ణాటకములందు పెక్కుచోట్ల ఘటికా స్థానములు వర్ధిలుచుండెను. హేమావతియందలి దోణంబేశ్వర మహా ఘటికా స్థానము నింతకుముందె పేర్కొనియున్నాను. ఆదోని తాలూకా కుంబళ బ్రాహ్మణ మహాగ్రహారము నం దొక ఘటికయుండెను. కర్నూలు మండలము పత్తికొండ తాలూకాలోని కుంకనూరునందు రామేశ్వర దేవాలయమున మరియొక ఘటికా స్థాన ముండెను. మధ్య యుగపు ఘటికలలో నెల్ల సుప్రసిద్ధమైనది యుత్తర కర్ణాటకమున గుల్బరిగె జిల్లాలోని నాగవావియందుండెను.

ఘటికా స్థానము లిప్పటి మన విశ్వ విద్యాలయములవంటి విద్యా సంస్థలు. ఇవి రెండు తరగతులుగా విభజింపబడియుండెనని తోచుచున్నది. కొన్ని బ్రాహ్మణ ఘటికలు, మరికొన్ని శైవములవి. ఇవన్నియు నున్నత విద్యాస్థానములే. వీనియందే యే విషయముల నెటుల కరపువారో కనుగొనుటకు తగినంత సాక్ష్యములేదు. కాని నాగవావి ఘటికా స్థానమందలి విద్యా విధాన మచటి శాసనమునం దొక్కించుక వివరింపబడియున్నది. ఈ ఘటికా స్థానము క్రీ. శ. 1042 మొదలు 1068 వరకును కర్ణాటాంధ్రములను పాలించిన చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్లాహవమల్ల బిరుదాంకితుడైన ప్రథమ సోమేశ్వర దేవుని మంత్రులలో నొక్కడైన మధుసూదనునిచే స్థాపింపబడెను. ఇందు రెండు వందల విద్యార్థులు వేదాధ్యయనము సేయుచుండిరి. ఏబది యిద్దరు శాస్త్రముల నభ్యసించుచుండిరి. ఇందు వేదములను జెప్పుటకు ముగ్గురాచార్యులును, భట్ట దర్శనమును న్యాయ శాస్త్రమును ప్రాభాకర మీమాంసను గరపెడు శాస్త్రోపాధ్యాయులు ముగ్గురును గలరు. మరియు నందలి పుస్తక భాండాగారమును రక్షించు సరస్వతీ భాండాగారికు లార్గురుండిరి. వీరి గ్రాస వాసాదులు నడుపుటకు దగినంత భూమియును వసించుటకు దగిన వసతి గృహములను నేర్పరచి యిచ్చెను. ఇట్టి యేర్పాటులే హేమావతి మొదలైన ఘటికాస్థానములందును యుండవచ్చును.

దేవాలయము లపుడపుడు న్యాయస్థానములు గూడ నయ్యెడివి. న్యాయ విచారణకై యిప్పటివలె హిందూ రాజుల పాలన క్రింద నొక ప్రత్యేక శాఖగాని కోర్టులు, న్యాయాధిపతులుగాని, న్యాయవాదులుగాని లేరు. వ్యవహారములు కలిగినప్పుడు తత్సంబంధికులు స్థానిక ప్రభుత్వాధికారిని తమ వ్యాజ్యమును విచారించి పరిష్కారము సేయ గోరువారు. అతడు ధర్మాసనమును సమకూర్చి వారి కా కార్యము నొప్పగించెడివాడు. ధర్మాసనమనగా ధర్మ నిర్ణేతల సభ. వీరు ప్రాయికముగా ధర్మ శాస్త్రజ్ఞులైన మహా జనులు. ఈ ధర్మాసనము వారు సర్వ సాధారణముగా దేవాలయ మంటపములందు కొలువుతీరి దేవుని సన్నిధానమందు వ్యవహారములను విచారించువారు. దీనికి కారణము దేవుని ప్రత్యక్షమున నెవ్వరును అసత్యమాడరను నమ్మకము.

మరియు వర్తకుల సమావేశములు తరచుగా దేవాలయముల మంటపములందే కూడెడివి. స్వదేశి విదేశి పరదేశి నానాదేశి యయ్యావళీ సంఘ వర్తకులందరును దమ వ్యాపార వ్యవహారములను చర్చించి తీర్మానించుట కొరకును ధర్మ కార్యములను నిర్వర్తించుట కొరకును దేవాలయ ప్రాంగణములందే సమావేశ మగువారు. పై బేర్కొనిన సార్థవాహ సంఘములు దేవాలయములందు కొలువుండి తాము దేవాలయ పూజా పురస్కారములను నెరవేర్చుటకు చేసిన ధర్మములను ప్రకటించు ఆగమ శాసనము లెన్నియో నేటికిని గానవచ్చుచున్నవి.

# నృసింహ కవిద్వయము

## శ్రీ తేరాల సత్యనారాయణ శర్మ

సంస్కృత భాషకుగాని తెలుగు భాషకుగాని నిజముగ చక్కని తోడ్పాటుగలిగి దానికి వాస్తవమైన గొప్ప ఉపకారముగలిగిన దన్నచో కాకతీయులకు పిమ్మట అది నూతనముగా అవతరించిన తెలుగురాజ్యము లందే నని చెప్పవలసి యున్నది. ఇందులో భాగస్వామ్యములై సమకాలములో జీవించిన తెలుగు రాజ్యములు నాలుగు. ఒకటి ప్రతాప రుద్రుని తరువాత నున్న వోరుగంటి రాజ్యము. రెండు కొండవీటి రాజ్యము. మూడు రాచకొండ రాజ్యము నాల్గవది దీర్ఘకాలము జీవించినది అయిన విజయనగరరాజ్యము. రాజకీయముగా ఇవి యైనప్పటికిని భాషా, సంస్కృతి, ఆచార వ్యవహారములందు వీటి ఉనికి మొత్తముపై ఒకటే యైనందునను, విశేషించి వీటిని పరిపాలించిన ప్రభువులందరు రసజ్ఞత గలిగిన వారైనందునను భాషా వికాసమునకు చక్కని పోటీ ఒకటి ఏర్పాటైనది. తెలుగు రాజ్యములలో గల ఇట్టి పరస్పర సంబంధములను బట్టి ఏదైనా ఒక భాష లేక సాహిత్య విషయమును ఎత్తవలసి వచ్చినపుడు తక్కిన వాటి చరిత్ర కొంత తెలుసుకొననిదే అది పరిపూర్తి గాజాలదు. అందులో కవి పండితుల విషయమన్నపుడు అది ఒక ప్రాంతమునకో లేక ఒక ఆస్థానమునకో పరిమితమై యుండునది కాదు. స్వల్పకాలపు చరిత్ర గలిగిన దైనను ప్రస్తుతము 'ఓరుగంటిని' పరిపాలించిన ముసునూరి ప్రోలయ — కాపయ నాయకుల కడ పనిజేసిన ఒక అజ్ఞాతకవి మహాశయుని చరిత్ర గురించి కొంత పరిశీలన జేయుదము.

తురుష్కుల దండయాత్ర వలన కాకతీయులు పతనమైన వెంట వారి నాశ్రయించిన కవి పండిత కుటుంబము లనేకము నిరాశ్రయులై తలకొక దిక్కు పట్టవలసి వచ్చినది. అప్పటి రాజకీయ పరిస్థితుల సంపూర్తిగా మనము తెలుసుకొనుటకు అవకాశము లేకపోయినను, ఓరుగంటి పతనము తరువాత దేశమంతయు ఎట్టి ఆపదలకు గురియైనదో, అప్పటి స్థితి గతులేమిటో, కండ్లకు కట్టినటుల తెలుపునది ముసునూరి ప్రోలయనాయకుని విలస శాసనము.[1] శాసనకాలము నాటికి ప్రోలయ నాయకుడు తురుష్కులపై కొంత వరకు విజయము సాధించి కోస్తా ప్రాంతములను వారి నుండి విముక్తి గావించి ధర్మ సంస్థాపనకు గడంగినట్లు దాని వలన తెలియుచున్నది.

ప్రోలయ నాయకుని ఈ విలసశాసనము నుండియే మనకు గణిత, వ్యాకరణ, జ్యోతిష, వేదాంత, దర్శన, గురుతంత్ర, మీమాంసా తర్క, స్మృతి శాస్త్ర, చిత్రావధాన, సంగీత, సాహిత్య, ధర్మశాస్త్రాది వివిధశాస్త్రములకు చెందిన 72 గురు మహాపండితులు అతని నుండి పెక్కు వృత్తులు పొంది ఆదరింప బడినట్లు తెలియు చున్నది. ఇందులోనే భారద్వాజ గోత్రమునకు చెందిన నృసింహకవి యొక్క ప్రస్తావన గూడా చెప్పబడియున్నది.

కాలము చెప్పబడక పోయినప్పటికిని విలసశాసనము క్రీ. శ.— 1340 కి కొద్ది ముందుగనే వచి నట్టిది. ఈ సమయములోనే ముసునూరి కాపయ నాయకుడు ఓరుగంటి మండ తురుష్కులను పారద్రోలి, కోస్తా ప్రాంతములతో సహా రాజ్యమును తన అధికారములో క్రిందికి దెచ్చుకొని ఓరుగంటిని రాజధాని గావించు కొనెను.

ఈ సందర్భములో ఓరుగంటి యందు ఒక నృసింహ కవి, జీవించి యున్నట్లు మరికొన్ని శాసనములందు చెప్పబడినది. దీనిని బట్టి నృసింహకవి నామముతోనున్న కవులు అసలు ఒక్కరా లేక ఇద్దరా అను ప్రశ్న గలుగుట సహజము. ఆయా ఆధారములను బట్టి దీనిని కొంత విపులముగా పరిశీలించవలసి యున్నది.

విలసశాసనములో కవిపేరు, గోత్రమొక్కటి, తక్కిన వివరము లేవియు చెప్పబడలేదు. కాని ఓరుగంటి శాసనములలో కవిపేరుతో బాటు అతడు విశ్వేశ్వర సూనుడని చెప్పబడినది. కొన్ని రచనల పేర్లు చెప్పబడినవి. ముఖ్యముగా ఇతడు కాకతీయ చరిత్ర రచయిత. దీనిని బట్టి ఇతడు కాకతీయులకు రాజ గురువుగా నున్న విశ్వేశ్వర శివాచార్యుల పుత్రుడై యుండునేమోనని భావింప బడు చున్నది.[2]

ఇక విలసశాసన మందు కానవచ్చు నృసింహ కవిని వాఙ్మయ పరిశోధకులిట్లు గుర్తించిరి. లభించిన కృతులను బట్టి ఈతడు 'కాదంబరి' అను నాటకమును సంస్కృత మందు రచించెననియు ఈతని సోదరుడైన విశ్వనాథకవి 'సౌగంధికాపహరణ' మను నాటక మొకటి రచించె ననియు, వీరిరువురును ఓరుగంటి ప్రతాప రుద్రుని కాలమువాడు నగు 'విద్యానాథకవి' సోదరికి భర్తయైన గంగాధర మహాకవికి పుత్రులనియు గుర్తించిరి.[3] ఇదే విషయము కొన్ని శ్లోకములతో సహితము ఇటు చెప్పబడినది.

> 'జాతాస్త్వేవహి యద్వంశే ఋషికులం సత్యే_ద్యతే
> త్పార్థితం, నిత్యం సన్నిధ ధాతి సా భగవతీ
> యస్మిం గిరా దేవతా తత్రాసీ త్కాల సిద్ధనాథ
> తనయో గంగాధరః పండితః, భూమా
> కృత్య విశేష విశృత యశః స్సాహిత్య సాహిత్యభూః.
> 'తస్మాదుమధ్యమః పుత్రో నరసింహ ఇతీరితః
> విశ్రుత స్సతు కర్తాస్య కృతేరి త్యవధారయ.'
>
> (కాదంబరి నాటకము).

ఇక సౌగంధికాపహరణమునుండి విశ్వనాథకవిని గురించి కొన్ని వివరము లిట్లు తెలియుచున్నవి.

---

1. E. P. Ind. Vol. 32. P. 239. to 268 మరియు భారతి మార్చి, 1942.
2. S I I. Vol. X No. 395 pp. 205-209 and A.P A.S. 9. P. 43-46.
3. History of clasical sanskrit literature by late sri M. Krishnamachariar. P. 652.

శాసన పరిశోధన మొదలైనవాటి ప్రాముఖ్యమునుబట్టి దీని పూర్తి భాగమును ఇక్కడ పొందుపరచుట జరుగుచున్నది.

'ఆంధ్రా స్సన్తి గరీయాంసః
కాంచన చ్ఛాయ శాలయః
యథా హాటక శైలస్య
కటకా రత్న శాలినః

కేదారా యత్ర శాలీనాం
తరంగిత జలాంతరాః
కృష్ణాం గచ్ఛాయ హారితా
యథా జల నిధేస్తటాః

శాలి సంరక్షిణీ హస్త
తాళ కంకణ నాదితైః
త్రాసితాః కిల గచ్ఛన్తి
యత్కీరా స్తద్గిరా జితాః

అప్పటికే తెలుగునాడు వరి పంటకు ప్రసిద్ధిగా నున్నట్లున్నది.

రసాల సాల హింతాల
తాల కేతక కేతనే
కాంతారే యత్ర కాంతానాం
జాతః శృంగార సంగరః

రసాల హాలా గంధేన
ఘనే సాంద్రీ కృతా దృశః
అలీనాం యత్ర హా హంత!
లక్షయంతి నగేహినా

శంఖ కంకణ జాలస్య
లలనా కర సంగినః
కళేన యత్ర నాదేనా
కల హంసాః శతం జితాః

లక్ష్యంతే యత్ర నిచితా
లక్ష్యశః శాలి రాశయః
గేహం కణే యథాకాశే
తటిత్కాంతి ధరా ఘనాః

ఏకా స్త్యేక శిలా ఖ్యాత్రి
నగరీ యా గరీయసీ
సాగరాం తాం ధరాం కృత్స్నాం
శ్రితా కాంత్యా నిరీక్ష్యతే.

కాంతాయా ఘ్నంతి యత్కాంతా
కాంతానాం హృదయం దృశా
కాంతాయా ఘ్నంతి యత్కాంతా
కాంతానాం హృదయం దృశా.[9]

నృసింహ కవి సిద్ధోద్వాహ మొక చిన్న కల్పిత గాథ. ఒకానొక సిద్ధ యువతియువకుల ప్రేమగాధ, వివాహ వర్ణనము లందు చెప్ప బడినవి కవి దీని కెట్టి పేరును బెట్టి యుండ లేదు. సందర్భమును బట్టి దీని కిట్టి పేరు సంపాదకులే బెట్టి యుండిరి శైలి దెలియు టకై రెండు శ్లోకము లిచట జూడవచ్చును. సిద్ధ యువకుని వర్ణన.

"కాలే లావతి కాకపక్షక ముఖే నోన్నద్ధ చూడామణి
ర్నిర్గచ్ఛ న్మకరాంక కుండలే శ్రవణయోః కోప్యాగతో గాలకః
నక్షత్ర ద్వయ మధ్యపాతి శశినో బింబం పురోంగారకం
వ్యాకుర్వ న్వదన శ్రియేన్న వదనే త్వామాహ్వయ త్యంభమాతో

నాయికా విరహ వ్యధః—

"ప్రాసాదే క్షణ మంకణే క్షణ మతో లీలా సరస్యాం
క్షణం, క్రీడా పర్వత కేక్షణం ప్రియ సఖీ సం
లాప గోష్ఠ్యం క్షణమ్, శయ్యాయాం క్షణ
మంతరేక్షణ మథ ద్వార్వేది కాయాం క్షణం,
సాత్యామేవ విచిన్వతీవ బహుధా జాతారతిర్వర్తతే''"

మొత్తముమీద కవి ద్వయములోని నృసింహ కవు లిరువురును గీర్వాణమందు ప్రౌఢ కవి పుంగవులే అందులో ఒకరు విద్యానాథ మహాకవికి దగ్గరి బంధువైన గంగాధర మహాకవి పుత్రుడు మరొకరు కాకతీయులకు రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యునికి పుత్రుడు. విశే షించి రెండవ వాడైన నృసింహకవి తక్కిన వాటితోబాటు అమూల్య మైన ఒక చరిత్ర గ్రంధమును తెలుగువారికి రచించి యిచ్చుటకు ప్రయత్నము గావించిన వాడు.

---

9. EP. Ind. Vol. XXXVI. 209-215.

# ఆధునిక యుగము - గాంధీసాహిత్యము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

శ్లో॥ శాంతం సౌంతం నితాంతం నిఖిల జన మనోహ్లాదయంతం విభాంతం
కారాగారేవ సంతం సమధిక తపసా జ్యోతిషా దీప్తిమంతం
ధర్మాహింసాది బీజాన్ సకల జన మన క్షేత్ర నిక్షిప్తవంతం
స్వాతంత్ర్య జ్యోతిమంతం ప్రణమత సతతం గాంధి దేవం మహాంతమే

శ్లో॥ గంభీరాకార వైదేశిక వసన మహా యంత్ర సంతాన సంపద్ద్వారీ కర్తుం సమర్థమ్ సమధిక చరఖా చక్రరాజం వహంతం
ఖాది వస్త్రేణ భాంతం కర కమల లస ద్ధ్వార కార్పాస శంఖం
బిభ్రంతం గాంధిదేవం ప్రణమత సుగదా ధారిణం ధన్వినంతం
(గాంధీ అష్టకము 1)

ఆధునిక యుగమున—ద్వితీయ ఘట్టము. అద్వితీయ ఘట్టము, గాంధీ సాహిత్యమే అయినను ఈ సాహిత్యమునకు పూర్వ రంగము గలదు అది ఆంధ్రదేశమునకు ప్రత్యేకముగా సంబంధించిన రాజకీయోద్యమము.

## వందేమాతరోద్యమము

ఆంధ్రదేశములో ప్రథమముగా రాజకీయ సంచలనము కలిగించినది వందేమాతరోద్యమము. దీనికి స్వదేశీ ఉద్యమమని నామాంతరము గలదు ఈ ఉద్యమము మొదట వంగదేశమున (బెంగాలు) క్రీ. శ. 1907లో ప్రారంభమైనది. ఆనాడాంగ్ల పాలకులకు కేంద్ర రాజధాని వంగ దేశమున కలకత్తా (కాళీ ఘట్టము) నగరము. ఆంగ్లేయాధికారము కరడుగట్టిన కర్జను రాజప్రతినిధి (వైస్రాయి)గా నున్నప్పుడేకైకముగానున్న వంగ రాష్ట్రమును రెండుగా విభజించినాడు. ఈ విభజనలో వంగదేశీయులు దాస్యాంధకారమునుండి మేల్కొనినారు వారిలో స్వాతంత్ర్య వాంఛ పొడ సూపినది. అదియే భావి భారత స్వాతంత్ర్య సమరమునకు నాందీ ప్రస్తావన గావించినది. వంగదేశీయులలో విభజనపట్ల తీవ్రాందోళనము బయలుదేరినది. దానికి స్వరూపము నిచ్చిన వాడు బంకించంద్ర చాటర్జీ.[2] ఈతడు 'ఆనంద మఠ' అను నవల వ్రాసి, ఆ నవలకు ముఖబంధముగా ఈ క్రింది జాతీయ గీతమును వ్రాసినాడు.[3]

వందేమాతరం—
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం వందేమాతరం—
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్ల కుసుమిత ద్రుమ దళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం వందేమాతరమ్.
త్రింశత్కోటి కంఠ కలకల నినాద కరాళే
ద్వాత్రింశత్కోటి కరైర్ధృత ఖర కరవాలే—
మాతరం వందేమాతరం.

ఈ జాతీయ గీతము నేడు స్వతంత్ర భారత జాతీయ ప్రాభాత గీతికగా నున్నది. అయితే ప్రస్తుత కాలానుగుణ్యముగా

"త్రింశత్కోటి కంఠ కలకల నినాదకరాళే
ద్వాత్రింశత్కోటి కరైర్ధృత ఖర కరవాలే"

అనుచరణములు రెండును పరిహరింపబడినవి. ఈ గీతము మూలము ననే ఇది వందేమాతరోద్యమముగా వ్యవహృతమైనది. ఈ వంగదేశ జాతీయ గీతము, వారినే గాక తెలుగు ప్రజలను నుద్రిక్తులను చేసినది. దీనికి హేతుభూతుడు—బిపిన్ చంద్రపాల్ అను వంగ దేశీయ నాయకుడు. ఈతడు కలకత్తాలో నగర కళాశాల (సిటీ కాలేజి)లో పుస్తక భాండాగారాధిపతి (లైబ్రేరియను)గా నుండేవాడు. అప్పటి ఆంగ్ల గ్రంథములన్నియు చదివి అసమానమైన ఆంగ్ల భాషా వాగ్ధోరణి నలవరచుకొని, వందేమాతరోద్యమము ప్రచారము చేయుటకై ఆంధ్ర దేశమునకు వచ్చినాడు.

## రాజమహేంద్రవరము—చిలకమర్తి

బిపిన చంద్రపాలు రాజమహేంద్రపుర మందిరమున క్రీ. శ. 1907లో వందేమాతరోద్యమమును గూర్చి ఆంగ్ల భాషలో ఉపన్యసించినాడు. కాని ఆ సభలోనున్న వారి కాంగ్ల భాష అర్థము కాకపోవుట చేత వారు సభను ఆహ్వానించిన వారిని "పాలుగారి ఆంగ్లోపన్యాసము నందలి విషయములను తెలుగు భాషలో వివరించు నేర్పాటు చేయ" మని కోరిరి. ఆహ్వాన సంఘమువారు చిలకమర్తి వారికీ పనిని యొప్పగించిరి. ఆ సభకు పాలుగారు కూడ వచ్చిరి. చిలకమర్తివారు అద్భుత మేధా సంపన్నులు. పాలుగారి ఉపన్యాసములోని ప్రతి వాక్యమును విడువ

---

1. ఈ గాంధి అష్టకము రచించినది శృంగారశాస్త్రి, ఖాదీశాస్త్రి, కల్యాణిశాస్త్రి అనునామత్రయముచే పేరుగన్న కీ. శే. గంటి సూర్యనారాయణశాస్త్రి. ఇందు మూడు శ్లోకములు మాత్రమే లభించినవి. ఒకటి 1921 సంవత్సరాది సంచికలో ప్రకటితము. తక్కినవి రెండు ఇందు ప్రకటితము.

2. చాటర్జీ అనగా చట్టోపాధ్యాయుడు. ఇట్లే బానర్జీ అనగా భట్టోపాధ్యాయుడనియు, ముఖర్జీ అనగా ముఖోపాధ్యాయుడనియు గ్రహింపవలెను.

3. ఈ ఆనందమఠ నవలను వంగభాషనుండి—ఇది ప్రకటితమైన సంవత్సరము 1907 లోనే. ఒమాండూరి దొరసామయ్యగారు తెలుగులో అనువదించి పై జాతీయ గీతముతో ప్రకటించినారు. మొట్టమొదట వంగ భాషనుండి తెలుగు భాషలోని కనువదితమైన నవలలో ఆనందమఠ మొదటిది.

గతముగా మహాపురుషుడైన గాంధీ మహాత్మునిగూర్చి యొక్క పద్యము వ్రాయలేదు. దనికి కారణము లేక పోలేదు. ఆ యుద్యమ ప్రారంభమునాటినుండి ఆయన శ్రీ పీఠాపురము మహారాజావారి పోషితుడు. మహారాజావారు కాంగ్రెసు ప్రభుత్వ పక్షమువారు. అందుచేతనే ఆయన యూరకొనుట తటస్థించినది.

## పాల్ బాల్ లాల్ త్రయము (అతివాద త్రయము)

వంగదేశమున స్వాతంత్ర్యోద్యమము పాలు ప్రచారము చేసిన కాలమునందే మహారాష్ట్ర దేశమున పంజాబు దేశమున స్వాతంత్ర్యోద్యమములు ప్రవర్తిల్లినవి. మహారాష్ట్ర దేశమునకు బాలగంగాధర తిలకు—పంజాబునకు లాలాలజపతిరాయి నాయకులు. కావుననే రాజకీయముగా వీరికి పాల్ బాల్ లాల్ త్రయమని పేరు గలిగినది. లాలాలజపతిరాయి పంజాబు కేసరి—భారత వర్షమున నిరువురు దేశనాయకులు మాత్రమే కేసరి బిరుదాంకితులు.

పంజాబు కేసరి లజపతిరాయి
ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశము.

వందేమాతరోద్యమ ప్రభావము తెలుగు దేశమున క్రీ. శ. 1910 ప్రాంతమువరకు నుండెను. వందేమాతరము స్వదేశీ ఉద్యమముగాను స్వదేశీ వస్తు ప్రదర్శనశాలలు (ఇవి మహాత్ముని ఖాదీ కార్యక్రమమునకు మూలములు) దేశమున వెలసినవి. క్రీ. శ. 1909లో డాక్టరు పట్టాభి, ముట్నూరి కృష్ణారావు గార్ల ప్రోత్సాహముతో బందరులో కోపల్లె హనుమంత రావుగారు ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపించినారు. స్వదేశీ పేరున కొన్ని కర్మాగారములు, సంస్థలు వెలసినవి.

క్రీ. శ. 1909 లో బొంబాయిలో కైలాసవాసి కాశీనాధుని నాగేశ్వరరావుగారు ఆంధ్రపత్రిక స్థాపనతో ఆంధ్ర జాతీయత స్థిరపడినది. వందేమాతరోద్యమము ఆంధ్ర జాతీయతను పెంపొందించి ఆంధ్రత్వమునకు ప్రాతిపదికయైనదని సారాంశము.

ఆకాలపు ఆంధ్ర సాహిత్యమున వందేమాతర ప్రభావము లేకపోలేదు. దేశాభిమానము, దేశభక్తి ఉద్దీపింపజేయునట్టి రచనలు రెండు మకుటాయమానములైనవి

1. రసపుత్ర విజయ నాటకము
2. గురజాడ దేశభక్తి గీతము

## రసపుత్ర విజయ నాటకము

వందేమాతరోద్యమము దేశమందు సుమ్మరముగా వ్యాపించిన దినములలో దేశాభిమాన ముద్దీపింప జేసిన నాటకములలో కీ. శే. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ గారి రసపుత్రవిజయ మగ్రగణ్యము. ఈ నాటకము యావదాంధ్రదేశమున ప్రఖ్యాతమైనదే గాని— దీనిని కేవలము వీరరస ప్రధానమైన చరిత్రాత్మక నాటకముగా విమర్శకులు పరిగణించిరి. కాని యీ నాటక మంతకన్న గంభీరమైన అర్థము గలది.

ఇది భారత వర్షమును మొగలాయి చక్రవర్తులలో కడపటి వాడైన ఔరంగజేబు పై— రాజపుత్ర స్థానమున చిత్తూరు దుర్గాధిపతియగు రాజసింహునకు జరిగిన సంఘర్షణ ప్రధానముగా రచితమైనది. రాజసింహుడు ఔరంగజేబునకు లొంగలేదు. సరిసకదా స్వాతంత్ర్యము ప్రకటించినాడు— ఇట్లే ఉత్తర భారతమున బుందేల ఖండమున ఛత్రసాలుడు, దక్షిణమున మహారాష్ట్ర రాజైన శివాజీ స్వాతంత్ర్యము ప్రకటించినారు. భారత వర్షమున ప్రథమముగా స్వాతంత్ర్యమును సాధించినవి. (1) రాజపుత్ర స్థానము, (2.) బుందేల ఖండు, (3) మహారాష్ట్రము— అను మూడు ప్రదేశములు—

ఈ చారిత్రక సన్నివేశమును బీజముగా గ్రహించి, రచింపబడినది రసపుత్ర విజయము[7] అందలి ప్రారంభ పద్యమిది.

సీ. అల హిమాద్రియు వింధ్య నగావళియుఁ జుట్టు
పెట్టని గోడలై పెంపుమీర
వరసింధు సింధూ ప్రవాహముల్ త్రవ్వని
పరిఖలై యిరువల నావలను బాఱ
అలరెడింపు "ఖైబరు బోలాను" కొండ కనుమలు
ద్వారంబులై విధాన దనరు చుండ
కాశ్మీర నేపాళ కాంతార సీమలు
కేళీ వనంబులై లీల దనర

గీ. (సర్వసస్య సమృద్ధమై సమర వీర
రక్షితంబయి సర్వ శాత్రవులకెల్ల)
దుర్గమ మగు హిందూస్థాన దుర్గము గని
కన్నతల్లిని గాంచిన కరణి దోచు.

తెరయెత్తగానే యీ పద్యము చదువుచున్నప్పుడు సామాజికుల హృదయములలో— "మాతృదేశము కన్నతల్లి" అన్న భావ మంకురింపజేసెడిది.

ఈ నాటకము పేరు చెప్పగానే మన తలపునకు వచ్చి ఒడలు పులకరింపజేయునది క్రింది పద్యము—

సీ. కొండలయందు నుద్దండులై పెండారు
దండి మరాటీల దండులందు—

---

7. స్వర్గీయులైన శివలెంక శంభుప్రసాదుగారికి నాటకమన్న నత్యంత ప్రీతి. ఇప్పటికి పదేండ్ల క్రిందట మా గోష్ఠిలో— నాతో. "రసపుత్ర విజయము అన్న నాటకాన్ని మీరు చూచినారా? ఈనాడు 'అంత రసవంతమైన నాటకమే రాలేదనుకొండి అన్నారు.' అంతే కాక— "చూడండి మొదటి పద్యము—'అలహిమాద్రియు వింధ్య నగావళియు చుట్టు పెట్టని గోడలై పెంపుమీర" అంటూ పద్యము చదవడము ప్రారంభించినారు. నేను వారితో "దాని రచయిత యగు యజ్ఞనారాయణ గారి శిష్యుడను—ఆ నాటకము నాకును చాలా ప్రియమైనదే" అని కొన్ని పద్యములు చదివినాను. శంభుప్రసాదుగారు వెంటనే తమకా నాటకము తెప్పించి పెట్టమన్నారు— అది యిప్పుడు లభ్యము కాకపోయినా, ఎట్లో ప్రతి సంపాదించి యిచ్చినాను. వారెంతో సంతోషించి, నాటకము చదివి ఆనందిస్తూ ఉండేవారు. ఈనాటి వారి కిట్టి ఉదాత్తమైన నాటకముల యందభిరుచి లేనేలేదని చెప్పవచ్చును. కొన్ని గ్రంథములు శ్రీ శంభుప్రసాదు గారికోసమాటు చదివిన తరువాత వారికి వ్యాప్తమైయుండెను.

ప్రాణాలపై నాస వాని హారా హారి
  పోరాడు రసపుత్ర వీరులుండ
పులి మీసలంది యుయ్యేల బాగు నార్పాటి
  సాత నామీలు గోసాయిలుండ—
గంధ సింధుర యూధ గతి నరాతుల ద్రుంచు
  బుందేలు ఖండు సబ్బందులుండ—
7. బందెలంబున ఛత్రసాల్ బ్రతికి యుండ
రాజసింహుని కంఠాన ప్రాణ ముండ
శ్రీ శివాజీకి బొందెలో జీవుడుండ
భరతవర్షము! నీ కెంత పాటు గలిగె.

పై పద్యమున— మొగలాయి చక్రవర్తియగు ఔరంగజేబు పాలన నున్న, భారతవర్షమెంత పారతంత్ర్యము ననుభవించు చుండెడిదో తెలియగలదు. ఆ చక్రవర్తులలో కడపటివాడైన ఔరంగజేబు కాలమందే మొగలు సామ్రాజ్యము పతనమైనది. ఆతని సమకాలికులు మువ్వురు.

1. రాజపుత్ర స్థానమున రాజసింహుడు
2. బందేలుఖండమున ఛత్రసాలు
3. మహారాష్ట్ర దేశమున శివాజి

తమ,తమ ప్రదేశములను స్వతంత్ర రాజ్యములుగా మలచుకొన్నారు. అయితే— ఉత్తర ప్రదేశమున— రాజసింహుడు, ఛత్రసాలు, దక్షిణమున— శివాజీ ఏకమైనచో— ఆనాడే భారతవర్షము హిందువుల వశమై స్వతంత్రత వహించెడిది. ఈ విషయమును ప్రఖ్యాత చరిత్రకారుడగు యధునాధ సర్కార్ ఇటు స్పష్టపరచినాడు—

**"In the time of Aurangazeb, the last Mogul Emperor, Rajasimha of Rajaputana, Chatrasala of Bundelkand, and Sivajee of Maharastra— Declared their independence and if only these three have joined together India would have been passed to the Hindus from Mogul suzeranity."**

History of Aurangazeb, Vol. IV.
Yadunah Circar.

"రాజసింహుడు, ఛత్రసాలు, శివాజీ ముగ్గురు నేకమైనచో మొగలుల పరిపాలన నుండి భారతవర్షము హిందువులవశమై యుండెడిది" అని పై ఆంగ్ల వాక్యముల యర్థము.[8]

మన భారత వర్షమున కట్టి యదృష్టమానాడు పట్టలేదు. మొగలాయి చక్రవర్తుల వెనుక రెండు శతాబ్దములు మన మాంగ్ల పరిపాలన కాలమున— పారతంత్ర్యభావమును బానిసలమై కావలసి వచ్చినది— ఇరువదవ శతాబ్దినే భారతవర్షమునకు స్వాతంత్ర్యము లభించినది.

రసపుత్ర విజయ మహా ప్రదమ స్వాతంత్ర్య సన్నివేశము తెలుపు నాటకము—

## గురజాడ మేలుకొలుపు

నవ్యయుగ వైతాళికుడగు గురజాడ అప్పారావు క్రీ. శ. 1910 లోనే ఆంగ్లభావ దాస్యమున మునిగియున్న తెలుగువారి దేశభక్తి ప్రబోధము గావించినాడు. ఆతడానాడు రచించిన—

దేశభక్తి గేయము[9]

ఈ నాడు దేశమంతయు మారుమ్రోగు చున్నది— ఒక విధముగా రాజకీయ సాహిత్యమున గేయ రచనకు ప్రథమ తీర్థము గురుజాడయే.

"దేశమును ప్రేమించుమన్నా
మంచియున్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్"

ప్రజలు కార్యశూరులు గావలెను గాని, వాక్శూరులు కాకూడదు— అన్న భావము నిది పెంపొందించును. ఇది కేవలము ఉపన్యాసములు చేసే జాతీయవాదులకు హెచ్చరిక.

మన దేశంలో భిన్న భిన్న జాతులూ మతాలు ఉన్నవి. కాని దేశాభిమానము దేశ భక్తి మతాని కతీతమని— గురజాడ సూక్తి.

"చెట్టపట్టాల్ పట్టుకొని దే
శస్థులంతా నడవవలె నోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలె నోయ్."

అంతేకాదు—

"మతం, వేరైతేను నేమోయ్
మనసు ఒకటై మనుషులుంటే
జాతి యన్నది లేచి పెరిగి
లోకమున రాణించు నోయ్."

అని సర్వ సామరస్య మత సిద్ధాంతాన్ని ప్రకటించినాడు.

గాంధి మహాత్ముడు, ఆయుధములతో కాక శాంతియుతముగా స్వరాజ్యము సాధింపవలెనన్న వాదమును నంతకు పదేండ్లకు ముందే గురజాడ యిట్లు తెలిపినాడు.

"పూచుస్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్."

ఇందు, "స్పర్ధయా వర్ధతే విద్యా" స్పర్థ విద్యార్జనమునందుండవలెను— అందువలన అది అభివృద్ది జెందును— అన్న నీతియు వైరము (కాంపిటిషన్)— వాణిజ్యమందున్న అది విస్తరిల్లును. కాబట్టి వ్యర్థ కలహములు పెంచరాదు— అని న్యాయము వివరింపబడినది ఇక కత్తి వైరము— అను పదమును ఆయుధములతోగాని తెగని వైరమును సమూలముగా నాశనము చేయుము అన్న సత్యము నిరూపితమైనది.

---

8. నేను పాఠశాలా తరగతులు మొదలుకొని, పట్టపరీక్ష వరకు దేశ చరిత్రయే ప్రధానముగా అధ్యయనము చేసిన వాడను—
9. గురజాడ రచనలు— 6 వ భాగము ముత్యాలసరములు— విశాలాంధ్ర ప్రచురణ.

ఈ దేశభక్తి గేయములో మకుటాయమానమైనది యీ క్రింది రచన—

"స్వంత లాభం కొంతమానుకు
పొరుగు వాడికి తోడు పడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్."

ఇందలి చివర రెండు పాదములలో భావమతి గంభీరమైనది. ఆంగ్లేయులు మన దేశమును— కేవలము ఒక మట్టి భూమిగా పరిగణించిరి గాని దేశ ప్రజలు అను మాట మరచి పరిపాలనము చేసినారు—దేశము — మనుష్యులు— శరీర ప్రాణముల వంటి అవినాభావ సంబంధము గల వ్యవస్థలని పై చరణములు వివరించును.

## దేశభక్తి — జాతీయ గీతము

"భారత దేశమున అనేక జాతీయ గీతములు వచ్చినవి. బంకిం చంద్రుని "వందేమాతరం" గీతముగాని, రవీంద్రుని "జనగణమన" గాని, ఇక్బాల్ రచించిన "హిందుస్థాన్ హమారా" గాని పై దేశభక్తి గీతముతో సరికావు— అయినను, ఇది తెలుగుకవి గురజాడ రచన— అందుచేతనే వెనుకబడినది.

రాజకీయముగా ముందంజ వైచిన తెలుగువారు సాహిత్యమున ముందంజ వేయలేదు—

గురజాడ దీనిని చాలాకాలము క్రిందట గుర్తించి యీ దేశభక్తి గీతములో నిట్లు వ్రాసినాడు.

"వెనుక చూచిన కార్యమేమోయ్
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుకపడితే వెనకె నోయ్"

స్వాతంత్ర్యము వచ్చిన తరువాత— ప్రతినిత్య భారత జాతీయ ప్రభాతగీతిక "సుజలాం సుఫలాం", ప్రతినిత్య సమావేశ సమాప్తి గీతిక— "జనగణమన" అను రెండును— అనగా— ఆద్యంతములు గీతికలు రెండును— వంగదేశకవుల రచియించినవియే.

ఈ "జనగణమన" యందైన— ఆంధ్ర దేశ ప్రసక్తి లేనే లేదు— "వింధ్య హిమాచల యమునా గంగా ద్రావిడ ఉత్కల వంగా" అని 'ద్రావిడ' పదమున— తక్కిన, తమిళ, కన్నడ, కేరళ దేశములతో గుదిగ్రుచ్చబడిన కారణమున— భారత వర్షమున— ఆంధ్రదేశ ప్రత్యేకత వ్యర్థమైనది

స్వతంత్ర భారతమున— హిందీ తరువాత అధిక సంఖ్యాకులచే మాట్లాడబడు, దేశ భాషలో ద్వితీయమైనదేగాక అద్వితీయమైన తెలుగు భాష మాతృభాషగా గలిగి, నాలుగు కోట్ల డెబ్బది యైదులక్షల తెలుగువారున్న ఆంధ్ర రాష్ట్రమునకు జాతీయ గీతమున స్థానము లేదు— గురజాడ గీతము, సర్వ, దేశ, సర్వకాల వ్యవస్థలకు సరిపోయెడి జాతీయ గీతము—

## వందేమాతరోద్యమానంతర రాజకీయ చరిత్ర స్వరాజ్యభావోదయము

భారతీయులకు, స్వరాజ్య భావోదయమును గల్పించి దేశ నాయకుడు, భారతపు పితామహుడు——— దాదాభాయి నౌరోజీ—అతడే— దేశీయ మహాసభా (కాంగ్రెసు) సంస్థాపకుడు— ఆ సంస్థాపకుల ముప్వు రిలో భారతీయుడు నౌరోజీ యొక్కడే— తక్కిన వారిరువురు— ఏ. ఓ. హ్యూమ్ విలియమ్ వెడ్డర్ బర్న్— అను వారాంగ్లేయులే— అతడు 1907 వ సంవత్సరమున భారత దేశీయ మహాసభలో—

## స్వరాజ్య మంత్రము

భారతీయుల కుపదేశించెను—

ఉ. భ్రాజిత లిల దేశ సభ ప్రాథమికంబున నిల్పి దాని కు
త్తేజ మెలర్పగా నధిపతిత్వము దాలిచి మూడుమార్లు నా
నోజన భారతీయులకు నొజ్జయునైతగు "దాదభాయి నౌ
రోజి" యొసంగె దివ్యము నిరూఢమునైన స్వరాజ్య మంత్రమున్.

ఆ సభలోనే బాలగంగాధర తిలకు "స్వరాజ్యము నా జన్మహక్కు" అని ప్రకటించెను.

చ. అనుపమ శౌర్య ధైర్య మహిమాతిశయుండయి మాతృదేశ భ
క్తి నిధియునైన నా "తిలకు" ధీరవతంసుడు నాంగిలేయ పా
లన నడగింగ ద్రొక్కగ "స్వరాజ్యము నా దగు జన్మహక్కటం"
చని యొక సింహనాదమును నప్పుడె చేసె, స్వతంత్ర దీక్షతోన్.

## తిలకు నాయకత్వము

మహారాష్ట్ర దేశమునకు తిలకు కిరీటము లేని రాజు. మహారాష్ట్ర రాజ్యమును స్థాపించి స్వాతంత్ర్య మహావీరుడైన శివాజీ వెనుక, నా దేశమున జన్మించిన లోకైక పురుషుడు తిలకు మహాశయుడేయని నిర్వివాదముగా చెప్పవచ్చును.— 'కేసరి మరాటా'[10] పత్రికల మూలమున దేశ భాషలో ప్రజలలో దేశభక్తి ప్రబోధము గావించి, రాజద్రోహము క్రింద పలుమారు శిక్షితుడై, ప్రజానీకమందరిచేత లోకమాన్యుడని కీర్తింపబడిన దేశ నాయకుడు—తిలకు మహా విద్వాంసుడు. ఆయన బర్మాలో మాండలే కారాగారమున, భార్యను గోల్పోయిన సమయమున గీతారహస్యము అను మహా గ్రంథము వ్రాసి భారతీయులను, స్వాతంత్ర్య సమర కర్మమునకునుద్యుక్తులను గావించెను.[11] మహారాష్ట్రుల కీతనియం దపార భక్తి ప్రపత్తులు గలవు. ఈయన షష్టి పూర్తికి వారు లక్ష రూపాయలను సేకరించి యిచ్చిరి. ఆ ద్రవ్యము నంతయు తిరిగి దేశోద్ధారణకై యొసంగెను. దేశనాయకు లతివాదులు, మితవాదులుగా చీలినప్పుడు, తిలకు—అతివాద పక్షము వారికే గాక, తన అమానమాన స్వార్థ త్యాగము వలన —అతడు భారతవర్షమున కంతకు నేకైకముగా నాయకు డయ్యెను.

## తిలకు అస్తమయము — గాంధీ మహోదయము

తిలకు 1—8—1920 తేదిని కీర్తిశేషుడయ్యెను. ఆ సందర్భమున రచితములైన పద్యముల ననుబంధమున జూడనగును—(అనుబంధము 1.)

---

10. మరాటా పత్రిక "అగ్ని బరాటా"గా మండెడిది.

11. తిలకు మహాశయుని గీతా రహస్యము అను భగవద్గీతా కర్మయోగ పర వ్యాఖ్యను తెనుగున కీర్తిశేషులు వ్యాకరణాచార్య వోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రనువదించిరి. వావిళ్లవారు దీనిని ముద్రించిరి. ఇది తెలుగు వారందరును తప్పక పఠింపదగిన మహా గ్రంథము. ఇం దద్భుత విషయము లనేకములు గలవు. క్రీ. శ. 1918 నుండి యిది ముద్రణలో లేకుండుట విషాదకరము. ఇది యావశ్యకముగా, పునర్ముద్రణ చేసి తత్క్షణమే ప్రచారము చేయదగిన యుత్తమ గ్రంథము—భారతీయులను కర్మవీరులనుగా తీర్చిదిద్దునది గీతా రహస్య మొక్కటియే.

ఉపన్యాసమున నేను— 1921 అక్టోబరు నెల 30 తేదీని ఈ వారి పై క్రింది పద్యమును ప్రస్తుతించితిని.

సీ. అనుమానమే లేని యుపన్యాస ధారా స్ఫూర్తి
ప్రస్తుతి గన్న "డెమాస్తనీసు"
సాటిలేదని వాగ్ధాటికి పనువట్టి—
మహిమను గన్న "ఎడ్మండు బర్కు"
సింహగర్జనము కొంచెము సేయు వాక్కు
కనలేదటన్న సురేంద్రనాథు
వక్తృత్వమునను నెవ్వరు నీడు లేరని
కోవిదుల్ గణియింతు గోఖలేను.

గీ. తలపునకు దెచ్చు వక్తృద్వితంబు నీదు
గాంధీతత్త్వ ప్రచారణాఖండ వాక్స్రు
భావ విడి యాంధ్ర జనుల నుత్సాహ పరచి
శాంతి సమరోన్ముఖుల జేసె జయమునకు
నేరకువాడ వేంకట నరసింహాచార్య!

పై పద్యమును 'బర్కు' వక్తృత్వము— ఆంగ్లదేశ చరిత్ర చదివిన వారలకు మాత్రమే తెలియును. ఇక— ఆంగ్లములో సరెండర్ నాట్ (Surrendernot) అను సురేంద్ర నాథ బానర్జి వక్తృత్వము తెలుగు వారెరిగినదే— ఇక గోపాల కృష్ణ గోఖలే— వక్తృత్వమును గూర్చి గాంధీ మహాత్ముడే నొక చోట ఆత్మకథలో వివరించినాడు—

## గాడేపల్లి సూర్యనారాయణ శర్మ

ఆంగ్లప్రభుత్వము— నెత్తికళ్ళ విధాన ప్రభుత్వమని వారిని చిత్తు చేయవలెనని తన యుపన్యాసములవలన ప్రబోధించినాడు— ఆయనను గూర్చి నేను క్రింది పద్యము చెప్పితిని.

మత్తకోకిల— నెత్తికళ్ళ విధానమాత్రమను నొగడు పట్టి ప్రభుత్వమున్
చిత్తు చేయగ పూనగావలె చిత్తశుద్ధిని శాంతిచే
నిత్తరిని నని గాడె పలికుల నేకధాటిని గాంధి సద్
వృత్త మెల్లెడ బోధ చేసెను నేకగళ పతి సూరుడై.

## దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

పెద్ద కుంకుమ బొట్టుతో, గొడ రుద్రాక్షలతో, ఉత్తరీయముతో, గీత గోవిందము, కృష్ణకర్ణామృత శ్లోకములను పఠించుచూ అసహాయోద్యమ దినములలో ఆంధ్రరత్న, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య సంగీతోపన్యాసములను, ఒక్క సారి వినిన, మరచువారు మరి యుండరు— ఒకప్పు డాంగ్లమానసపుత్రుడైన గోపాలకృష్ణయ్య గాంధి ప్రభావము వలన నెంత ఉద్దర్శదికుడుగా మారెనో మా కాశ్చర్యము గలిగించెడిది. ప్రజా సామాన్యము నాకర్షించుటలో నియనకు గల శక్తి వేరొ రెవ్వరికి లేదు— వీరా పేరాల నాయకుడైన, ఆంధ్రరత్న శ్రీ గోపాల కృష్ణయ్య తెలియని తెలుగువాడు లేడు.

మురళీగాన వినోదితాత్ములయినన్ ముఖ్యక్రియల్ సేయు నె
వ్వరు లేరో నీ ఘన వక్తృగాన సుధల న్బాలగోపాలమునన్
గురు స్వాతంత్ర్య రణోర్విదూకిద రహో! గోపాలకృష్ణయ్య! త
త్పురుతం బొల్చిన ఆంధ్రరత్న! మతిగైకొ! దుగ్గిరాలా న్వయా,

## ప్రబోధ సాహిత్యము—పద్య రచనలు

### భారతీయ ప్రబోధము

సీ. చిరుతల్ల గోల్పోయి జీర్ణాంశుకము దాల్చి
తల్లి దుస్థితినైన తలచకుండ
మానభంగము గాంచి మహి నీడ్చ దలచెడి
సోదరీమణులను చూడకుండ
సుకుమారులై కష్ట నికరంబు నోర్వని
చిన్నితమ్ముల ముద్దు సేయకుండ
తల్లికై ప్రాణంబు ధారవోసెడు నట్టి
నాయకులను బట్టి నడువకుండ

గీ. ధర్మ రణ భూమి సత్య శస్త్రమును దాల్చి
అల నెదిరించి స్వర్గంబు నంద కుండ
బ్రదికి యున్నాడవే యింక వసుధ పైని
భారతాత్మజ! జీవచ్ఛవంబ వగుచు. 1

సీ. పుట్టినా వెందుకు పూత చరిత్రయౌ
భారతమాత గర్భంబునందు
బ్రదికినా వెందుకు కతులిత ధర్మ సం
స్థాపన నొనరించు సమయమందు
విని నాడవెందుకు ఘనతర స్వాతంత్ర్య
కలిత ధ్వనులు ప్రమోదయుకాలమందు
కవినాడ వెందుల కమనమౌ దీక్షతో
నసువు లర్పించెడి యదనునందు

గీ. శాంతి సమయంబు నందు నీవంత యేని
పాల్గొనక యుంట నీకిది పాడి యగునె?
తరుణ మరు దెంచె భారతాత్మజుడ లెమ్ము
తల్లి ఋణమును దీర్పని తనయుడేల? 2

సీ. మన తల్లి దుఃఖాగ్ని మలగుచు నుండగ
నంత సింపుచు నున్న శాంతి యుతులు?
మనతల్లి స్వాతంత్ర్యమునకు బోరుచు నుండ
వెనుక జంకుచు నున్న వీర వరులు
మన తల్లి ధర్మసన్మహిమ నిల్పగ గోర
దేశంబుతో బోవ దివ్యమతులు
మనతల్లి స్వేచ్ఛావిధిని గోరు చుండగ
దాస్య భావము నెంచు ధర్మ పరులు.

గీ. స్వార్థమే పరమార్థ మటంచు నెంచి
యూడిగము సల్పి జీవించు చున్నవారు
కలిగి యున్నారు తల్లికి కడుపు చేటు
వారితో నేమి నీ పట్టు వదల కయ్యా! 3

సీ. ధర గనవట్టి దుర్భర దాస్య భారంబు
నింక నెన్నాళ్ళు భరింపగలవొ?
విపరీత మతి నయి అపకీర్తి పాలయి
యింక నెన్నాళ్ళు చరింప గలవొ?

ఆత్మ గౌరవమున కతిదూరమై భూమి
యింక నెన్నాళ్లు వసింపఁ గలవొ?
కడ గండ్లతోఁ గ్రాగి కలఁగు తల్లిని జూచి
యింక నెన్నాళ్లు తరింపఁ గలవొ?

గీ. భారతాత్మజ! తరుణంబు బాసితేని
స్వేచ్ఛ యమునది గగ నార వింద మగుసు
దేశమాత ఋణంబును దీర్పలేని
సౌఖ్య మది యేల? చదువేల? జన్మమేల? 4

సీ. నిఖిల ప్రపంచ శాంతి స్థాపన ఖ్యాతి
తమ్ముఁడా! నీకింక దక్కబోదు
పరమ ధర్మక్రియాచరణ యశః కాంతి
సోదరా! నీవింక చూడఁ బోవు,
మాతృ దాస్యచ్ఛేద మహనీయతర కీర్తి
అవరజా! నీ వింక నందలేవు
దేశ సేవార్పిత ధీ జీవిత ఫలంబు
నను జాఁడా! నీ వింక నందరావు.

గీ. దివ్య తరుఁడైన యట్టి గాంధీ మహాత్ము
నాజ్ఞచే ధర్మ యుద్ధంబు నందు మతికి
నేడు పోరాడి నీ విధి నిలుప లేని
జడుఁడవే గాని భరతాత్మజుడవుఁ గావు. 5

ఉ. చిరతర పుణ్య సంతతులచే దుల దూగి సమస్త సత్కళా
కరమని పేరుగాంచిన నఖండ యశో విభవాభి రామయై
ధరణిని వెల్గినట్టి మనతల్లిని భారతమాతఁ బ్రోవ ని
తరుణము దక్క నొక్కటి దక్కదు భారతపుత్ర రత్నమా? 6

ఉ. పూరుష ముఖ్యులై, భువన పూజ్యులునై, జనరాశికెల్ల నా
ధారులునై సమస్త విమతా జనతా దురితాగ్ని కల్పులౌ
వీరుల గన్న తల్లి పరివిశ్రుత కీర్తి సతీమతల్లి, శ్రీ
భారత మాత దివ్య ప్రతిభన్మతి నెంచుము కూర్మి సోదరా! 7

సీ. శిథిల భారత యశః ప్రథిత మందిర పున
రుద్ధారణా మహోద్యోగమునకు
ప్రవిహిత భారత ప్రాచీన విజ్ఞాన
వల్లికా దోహద వ్రతమున కుసు
మర రాజ్య కవిత, సంపన్మగ్న నిజ సంప
ద ప్రాతపు నర వతరణమునకు
విగత చాతుర్యైక వివిధ చతుష్షష్టి
కమనీయ సత్కళా గ్రహణమునకు

గీ. శాంతి, సంస్థాపన క్రియాచరణమునకు
ధర్మ సంస్థాపనాది, సత్కర్మమునకు
తరుణ మరుదెంచె భారతాత్మజుఁడ నేఁడు
నీ విధినిఁ దీర్చి చిరకీర్తి నిల్పుమయ్య! 8

గీ. వందల కొలంది యేండ్లుగా వనట గుందు
మాతృ దేవత దాస్యంబు మాన్పినట్టి
అల గరుత్మంతు పోలిక, నధిక శక్తి
భారతీ మాత దాస్యంబు బాపుమయ్య 9

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1922)

## మాతృ వందనము

శ్రీ రమణీయ నిర్మల సమృద్ధ జలాంచిత పుణ్యవాహినీ
పార పునీత! సర్వ ఫల పాదప మంజుల పుష్పవల్లరీ
హారి వనీ సమేత! సదహస్కర చంద్ర విభా ప్రపూత! స
తత్సౌరభ వాత! తుంగ గిరి జాత! సమస్త సుశస్య సం
భార శుభ ప్రజాత! మణిమానిత కాంచన ముఖ్యలోహ ని
స్తార ఖని ప్రతీత! ఘన శైల శిఖాంబు ఝరీ ప్రపాత! సం
ధ్యారుణ రక్త కాంతి విభవాతి శయాంబర దిక్ప్రభూత! కా
సార సరోజ షండ విలసన్మధుప భ్రమరద గీత! పక్షి వా
గారవ సుప్రభాత! మహదబ్ధి పరీత! నిరామయ ప్రథా
భారతమాత! సేతు హిమవన్నగ మధ్య ధరాస్థలీ భవ
త్సార శరీర సంజనిత సంతతిలో జనియించి మించి, స
ద్వీరులు, రాజశేఖరులు, ధీరులు, జ్ఞానులు, సత్కవుల్, కళా
స్ఫార దిగంతపూరిత యశస్వులు, దాతలు, మౌనిసత్తముల్
భూరి మహత్త్వ భక్తులు, సుపూజిత ధార్మిక రాష్ట్ర
మంత్రులున్
జారు మహా పతివ్రతలు, శౌర్య గుణాన్విత వీరమాతలున్
బేరు గడించి పోయిరి యమేయ రుచిన్ వెలయించి నిన్ను నే
పారెడు భక్తి గొల్చి మహిమాన్విత! తావక నామ సంతతో
చ్చారణ మాత్రవం బడయఁ జాలరె? చాలఁగ నాత్మశక్తి వి
స్ఫారిత సత్సమర్థతఁ బ్రపుణ్య గుణోజ్జ్వల! ధారుణీ సతీ
హార విరాజమాన తరళా కృతి సౌష్ఠవ సుస్వరూపిణి
భారత పుత్ర పుత్రికలు పావన గర్వ! త్వదాప్త నిస్తులా
పార ధన ప్రపుష్టి గొని భాసిలు సర్వ విదేశముల్; భవ
త్సార మెఱుంగ లేక మత జాతి వివాదము లంది నీ సుతుల్
పోరులు తెచ్చిపెట్టుకొని బుద్ధి విహీనత భక్తిమాలి, సై
వారల కెల్లఁ దావొసగి బానిసలై యొరు పోత గంజికిం
జేరలు సాచికొంచుఁ దమ జీవిత మెట్టొ టొ గడ్పు
కొంచు సం
సార భృతి ప్రయత్నముల శక్తులు యుక్తులు దేహ
దార్ఢ్యముల్
ధారగ బోవనిచ్చి సతత శ్రమలందుచు నాత్మ వృద్ధికిన్
దారులు గాంచలేక వివిధంబగు బాధలఁ దోగు చుండి యే
తీరున నీదు వారమని తృప్తి యొటం గన రాని వారలై
తీరును మారియుండ, వెలితిం బడి మాతరో! సాటి వారిలో
పోరును దప్పియుంటివి విచారము జెందకు మమ్మ! నెమ్మదిం
జేరఁగ వచ్చె కాలమిదె చీకటి తీరి విశుద్ధ చంద్రికా
స్మేర సుఖాప్తి గాంచెదవు చేసిన పూర్వ తపః ఫలంబుచే
గారణ మాలికా వితతి గల్గుచు నుండె దినాభివృద్ధిగా
స్వైర విహార సుస్థితికి, సఖ్యత చేకుఱె నీ సుతాళిలో
బేరెను నూత్న సత్త్వము, పవిత్ర చరిత్రలు నీతనూజలున్ /

పౌరెకుం బాడుచుండ్రి మృదు సన్నుత తావక కీర్తి గీతముల్
కేరుచ బాల బాలికలు క్రీడ పచింతురు త్వజ్జయార్భటుల్
తోరణ గట్టి యెత్తిరదె తోయద వీథికి నీదు కేతనముల్
కోరి ధరించుచుండ్రి నవ కోమల దేహులు దేశవస్త్రముల్
పౌరుష మొప్ప సేవకులు పంతము లాడుచు శాంతి పద్ధతిన్
వైరి నెదుర్కొనం గడగి బాధల కోర్చి జయాభిలాషులై
దీరత గోరుచుండిరి విధేయులు గాగ త్వదాజ్ఞ కెప్పుడున్
జేరిమి మంచి దీవెనలు వెట్టివి మాతన కార్యదీక్ష య
వ్వారిగ వారి కిచ్చి విభవంబులు గూర్పుము; దేశమాత! స
త్కారముగ గ్రహింపు మసితంబగు నుత్పల మాలికన్, నమ
స్కార పురస్కృతంబుగ నొసంగితి గణ్య సుపుణ్య మాతరో!

కవయిత్రీతిలక బుర్రా కమలాదేవి.

## గేయ సాహిత్యము పదములు

ప్రజలను స్వాతంత్ర్య సమున్ముఖులుగా జేయుటలో పదములు ప్రధానములని నిస్సందేహముగా చెప్పవచ్చును. వానిలో యావదాంధ్ర దేశమున నాబాల గోపాలము పతి వేలముగా నాకర్షించి, శాంతి సమరమున పాల్గొనునట్లు చేసినవి రెండు.

1. దండాలు దండాలు భారతమాతా అన్న పదము.

ఇది స్వరాజ్య కవి వడ్డాది సీతారామాంజనేయులుగారి రచన[14]—

"దండాలు దండాలు భారత మాతా
తల్లి మమ్ము దీవించు భారత మాతా
రెండు వంద లేండ్లక్రింద భారత మాతా
అల్లకుంపినోడు దిగినాడే భారత మాతా
దిగి యూరకున్నాడా భారత మాతా ఆడు
దేశమంత దోచినాడే భారత మాతా
ఈత చెట్లు అన్నిన్ని భారత మాత ఆడి
తాతగారి సొమ్మంట భారతమాతా!'''

అను నిందలి చరణములు మచ్చునకు చూపినాను.

భారతమాత, మాతృ దేవతాకారముతో నొక పెద్ద ప్రభ కట్టి దానిని బండిపై ప్రతిష్ఠించి, వందలాదిగా జనులు కొందరు బండ లాగుచు, ఖద్దరు చొక్కాలు, గాంధీ టోపీలతో నీ పదము పాడుచు, వీధులందు ప్రచారము చేసినపుడు, గృహములలో మూల మూలలనుండెడి వారు కూడ, ఉద్బోధితులై రన్నచో, నీ పద ప్రభావము నూహింపవచ్చును.

ఇది స్వరాజ్య గీతామృతము — అన్న గ్రంథమున — ఉద్యమ ప్రారంభ దినములలో—అనగా 1921 లోనే ముద్రితమై విశేష ప్రచారము గాంచినది. ఆనాటి ఉద్యమ ప్రచార విధానము నిది చక్కగా తెలుపుచున్నది.

## 2. మా కొద్దీ తెల్ల దొరతనమూ – అన్న పదము

ఇది గరిమెళ్ల సత్యనారాయణ రచితము. ఈ పదము కార్చిచ్చు వలె దేశమంతటా వ్యాపించినది. 1921—23 సంవత్సరములలో నీ పాట పాడనివారు లేరని చెప్పవచ్చును.

"మా కొద్దీ తెల్ల దొరతనము" క్రర విడిచినట్లు, ఢంకా మ్రోగించినట్లు ఈ పాట ఉండుటచేత ప్రభుత్వమువారు సత్యనారాయణకు రాజద్రోహముక్రింద కారాగార శిక్ష విధించిరి. అయిన నేమైనది—అక్కడ—రాష్ట్రేతరులగు తమిళులను, కన్నడమువారిని మహారాష్ట్రులను ఈ పాట మిక్కిలిగా ఆకర్షించినది. వారును కూడ దీనిని గానము చేసెడివారన్న యీ పాట ప్రచారము మనము గ్రహింపవచ్చును. తమిళ జాతీయ కవి సుబ్రహ్మణ్యభారతి దీని నత్యంతము మెచ్చుకొన్నాడు. మహాత్మాగాంధి ఈ పాట విశిష్టత, విని దీనిని విన వలయునని కుతూహల పడగా, రాజాజీ[15]—మరియొకప్పుడు వినవచ్చునని, ఆ సమయము తప్పించినాడు. అసలు మహాత్ముని సమయములో ప్రతిక్షణము మిక్కిలి విలువయైనది. అట్టి సందర్భమున—ఆ సమయము తప్పించినందువలన గరిమెళ్ల కెంతో నష్టము గలిగినది. రాజాజీ తెలుగువారికి చేసిన ఈ అపకారము మాత్రము నిలిచినది.

గరిమెళ్ల పట్టభద్రుడై బోధనాభ్యసన పట్టము (టీచర్సు ట్రెయినింగు) పొందుటకు చదువుచుండగా, గాంధీ ఆదేశమున దానిని విడిచి ఉద్యమములో దుమికినాడు. అతని పట్టము ప్రభుత్వమువారు రద్దు చేసినారు. పాప ముద్యోగము గొరకక దారిద్ర్యము ననుభవించినాడు. కీర్తిశేషులు నాళిః వేంకటేశ్వరశాస్త్రిగారీయనను పోషించెడివారు. ఈయన తమిళ భాషలోని 'తిరుక్కురళ్' అను గ్రంథమును వచన పద్య కవితగా రచియించినాడు.

సహాయ నిరాకరణోద్యమ కాలమున పై రెండు పదములేగాక మహాత్ముని ఆశయములను ప్రచారములోనికి తెచ్చు మరికొన్ని పదములు రచితములైనవి.

హరిజనోద్ధరణమును గూర్చి మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి—

"అంటరాని వా రెవరో కారు, మా
వెంట రానివారే"

అన్న పాట చాలా వ్యాప్తిలో నున్నది. బుచ్చి సుందరరామశాస్త్రి రచయితయే గాక శ్రావ్యమైన కంఠస్వరము గలవాడు. కావున నాతడు దీనిని పాడుచున్నప్పుడు ప్రజలూ ముగ్ధులగు చుండెడి వారు.

ఆకాలమున వందల కొలదిగా పదములు, పాటలు రచితములై, జాతీయోద్యమమును ప్రోత్సహించినవి. వానిలో చాలా పదములకు గాని పాటలకు గాని కర్తృత్వము తెలియరాదు. ఆ పాటలలో మేలుకొలుపు పాట చాలా వ్యాప్తిలో నుండెడిది.

"మేలుకొనుమీ భరత పుత్రుడ
మేలుకొను మీ సుజన మిత్రుడ
మేలుకొను మీ సచ్చరిత్రుడ
మేలుకొనవయ్యా! వత్సా! మేలుకో"

---

14. స్వరాజ్యకవి వడ్డాది సీతారామాంజనేయులుగా రాయుష్మంతులై యున్నారు. ఇప్పటికి 75 గ్రంథములు రచించిన మహాకవి.

15. తమిళనాటి రాజకీయ పితామహుడైన 'రాజాజీ'—ఈ నడుమనే కీర్తిశేషుడైనాడు.

ఈ మేలుకొలుపు పదమును భూపాల రాగముతో పాడుచు, తెల్లవారుజామున— వీథులలో ప్రచారము చేయుచున్నప్పుడు ఎంత మంది నిద్రా ముద్రితులకో ప్రబోధము గలిగించినది.

గాంధి మహాత్ముని గూర్చిన పాటలలో

"కొల్లాయి గట్టితే నేమి మా గాంధి
కోమటై పుట్టితే నేమి"

అన్న బసవరాజు అప్పారావు గేయము ఈనాటికి ప్రసిద్ధమైనదే.

(భారతి—మార్చి 1925)

## పద్యకావ్యములు

సహాయ నిరాకరణోద్యమమున పదములు ప్రజల నాకర్షించి నట్లుగా పద్య కృతు లాకర్షింపలేదు. అయిన నా కాలమున పద్య కృతులు జాతీయోద్యమమును పురస్కరించుకొని బయలుదేరినవి. వానిలో ముఖ్యమైనవి రెండు. అవి రెండును బలిజేపల్లి లక్ష్మీకాంతకవి రచితములే.

## స్వరాజ సమస్య

ఈ పద్యకృతిలో భారత వర్షమున రాజకీయోద్యమ చరిత్ర చక్కగా చిత్రింపబడినది. 'స్వరాజ్య' సింహనాదముతో తిలకు చేసిన సేవ—"ఉచిత నిర్బంధ విద్యోపలబ్ధి యటన్న

కోర్కెతో దివి కేగె గోకులుండు"

అని గోపాలకృష్ణ గోఖలే సేవ విశదముగా తెలుపబడినది. స్వరాజ్య సంపాదనమే భారతీయుల పరమాదర్శముగ ఉద్ఘాటింపబడినది.

## స్వరాజ్య రథము

స్వరాజ్య రథము గాంధి ఉద్యమమును ప్రోత్సహించుటకు రచిత మైనది. కవి యీ యుగమును "గాంధి యుగము" గా భావించినాడు.

మ. తరి గాంధియుగ మేగుదెంచె నిక నేతద్భారతీయ స్వరా
జ్య రథం బాతని సారథిత్వమున నేసాగింపుడంచున్ జగ
ద్గురు డేగెన్ దివి లోకమాన్యుడదె యుద్ఘోషించె తద్వార్త్య
ధ్వనుల్
ఉరు తద్దివ్య రణంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్

## బాపూజీ

తులలేని తెలుగు కవితకు పేరు గాంచిన తుమ్మల సీతారామ మూర్తి చౌదరిగారి కృతి—గాంధి మహాత్ముని జీవితము నతి రసవత్తర ముగా నావిష్కరించినది.

## విదేశీ వస్త్ర బహిష్కారము
## సాత్త్విక నిరోధము

విదేశ వస్త్ర బహిష్కార ప్రచారమున స్త్రీలు, సాత్త్విక నిరోధము మూలముగా సాధించిన విజయము చూచిన మన మాశ్చర్య చకితులము కాక తప్పదు. ఎన్నడును ఇల్లు విడిచి యెరుగని యిల్లాండ్రు భుజములపై ఖాదీ వస్త్రములతో కొందరు, త్రివర్ణ పతాకము ధరించి కొందరు, చిన్నపిల్లలతో కొందరు, విదేశ వస్త్రము లమ్మ అంగళ్లవద్ద, ఎండలోన, ఆ వస్త్రములను బహిష్కరింపుడని ప్రజలను తమ మృదు మధురమైన మాటలతో ప్రచారము చేసిన దృశ్య మా నాటి కవుల మానసము కరిగించినది—ప్రసిద్ధ కవులగు కీ. శే. భోగ రాజు నారాయణమూర్తి గారు నాటి స్త్రీ సాత్త్విక నిరోధము నెట్లు మన కన్నులకు గట్టినట్లు వర్ణించినారో చూడుడు—

శా. స్వాంతంబుల్ కరగింప జాలు మృదు వాగ్జాలంబుతో, దీనతా
క్రాంతంబైన మొగంబుతో, భుజ నటత్ఖాదీ సమూహం
బుతో,
కాంతా! సాత్త్విక మార్గమూని, పురి యంగళ్లం ద్రిమ్మరి
గింపు నీ
శాంతిన్ పేర్చిన నిరోధ బోధనల నశ్రాంతంబు ధ్యానించెదన్.

శా. యాతాయాత జనంబు లెల్లరు సముద్గాశ్చర్యులై గాఢ వి
ఖ్యాతిం గాంచిన శ్వేత హార్యరుచి నర్హాంచ త్స్వలోకంబు నీ
చేతం దాలిచి, ఎండ కోర్చి విదేశీయాంబర స్థాన వి
క్రేత క్రేతల నుందలించెదవు నిస్త్రింశల సాధ్వీమణీ!

మ. సుగుణా! ఖద్దరు రక్షణార్థముగ యుష్మన్నిష్కరాలాప చా
ప గుణధ్వానము వర్తక ప్రతతిలో వ్యాపించి తచ్చిత్తముల్
పగులంజేసె, విదేశ పట్టణములన్ పర్వాపుంగ బేళ్లపై
గిగియంగ గట్టిన విస్ఫరేకులవ త్రెంచెం జనమ్మ విరాంగనా!

శా. కంటిం జూచి యొకింగ వంగడుల నేపాలంబుగం దట్టినిన్
గంటిన్ నీను మాటతో, బుడుతలం గైకొంచు బజారులో
నొంటిం జెమ్మట గ్రమ్మ సాత్త్విక నిరోధోద్యోగముం దుండ నే
గంటిం దేశ హితార్థ మూనదగు త్యాగంబుం బవిత్రాంగనా"

ఉ. ఆరయ చండ భానుని సహస్ర కర ప్రకర ప్రతాప మై
టేర్కొను కొందువో యెటుగనో సుమ కోమల గాత్రి
నిత్యమున్
భూరి కృపాపరత్వమున భూతము లైదును ప్రోచు
నాకొ యు
ద్ధూరత నొప్పు సాత్త్విక నిరోధ మహోద్యమ సుత్ర
తాత్మలన్

## చరఖా పంచకము

గాంధి స్వాతంత్ర్య సాధనలో ముఖ్యమైన చరఖాను గూర్చి గేయములు, పద్యములు వెలువడినవి. వానిలో నింతవరకు నపరిచిత మగు "చరఖా పంచకము" నిందు పొందుపరచుచున్నాను.

చరఖా ఎప్పుడును గాంధి చేతిలో నుండెడిది. ఆయన వెళ్లి నప్పుడును నూలు వడకు చుండెడివాడు—క్రీ. శ. 1929 లో మహా త్ముడు విజయనగరము వచ్చినప్పుడు చరఖాను గూర్చి కీర్తిశేషులు విడుదవోలు సుందరము పంతులు గారిట్లు పంచకము చెప్పిరి.

క. చరఖా త్రిప్పుచు నుండిన
దరఖాస్తులు లేని పనియు దరియింపగనౌ
గరఖా టోపి బట్టలు
ధర ఖాయము చౌక భారత ప్రజ కబ్బున్ (1)

క. రాటము చక్రంబే పో
రాటంబున శాంతి సమర రంగమునందున్

గాంధి చూచుచు మెండుగా గణన మీర
త్యాగ గుణ పూర మాగంటి అన్నపూర్ణ.

## సత్యాగ్రహ దీక్ష

సహాయ నిరాకరణోద్యమమునకు సత్యాగ్రహ దీక్ష— ప్రథమ సోపానము. ఈ దీక్షా మహిమచే గాంధి, ఏ విధముగ మహాత్ముడైనది కళాప్రపూర్ణ— త్రిపురాన సూర్యప్రసాద రాయ కవి వర్యులు ప్రాచీన కవితా ధోరణిలో చక్కగ చిత్రించి నారు.

ఉ. సత్యము శౌచమున్ దయయును, సర్వ సమత్వము, శాంతి స్వార్థ రా
హిత్యము ధర్మబుద్ధి భువనైక హితా చరణంబు సాధు సాం
గత్యము నిత్యతుష్టియు వికార విదూర విచార దృష్టి స
ర్వాత్మయ చిత్త వృత్తిగలవారు మహాత్ములు గారె యెయ్యెడన్

సీ. తన స్వార్థమును పరార్థము వీడుటది యెట్టి
స్వారాజ్య విభవమో చాటి చెప్పె
తన తెచ్చికోలు పేదరికం బరసి చూడ
యెంత యైశ్వర్యమో యెఱుక పఱచె
తన గోచిపాత రాయని తన మది యెట్టి
పీతాంబరత్వమో పేర్మి దెలిపె
తన మౌనముద్ర యెంతటి సమస్యాపూర్తి
వివరణలో చక్క వెల్లడించె

గీ. తనదు జీవితమే నిదర్శనము చేసి
లేమిలో కల్మి, కల్మిలో లేమి జూపె
వింత గొల్పెడు ననహహా! గోరంతయైన
తెలియగ వచ్చు మహాత్ము దివ్య మహిమ

సత్యాగ్రహ దీక్షను పూనుటకు, పురుషులేగాక, స్త్రీలును అందు కవయిత్రులు చాలగ ప్రబోధము చేసిరి. వారిలో శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారి సత్యాగ్రహ ప్రబోధము, ఆ కవయిత్రి పేరునకు తగినట్లున్నది సత్యవతమ్మ సత్యాగ్రహ ప్రబోధము చేయుట సత్యమే గాక స్తుత్యముగా నున్నది

మ. కనుడా మాటల దుఃఖ నిస్వనములన్ కారుణ్య మేపారగా
ననుతాపాశ్రుకణ ప్రవాహమున తానం బాడి జాతీయ జీ
వన దీక్షారతి బూని భారతమునగా పాడంగ త్యాగ వ్రతం
బున నాత్మాంజలి మాతృ దివ్య చరణాంభోజంబు
పై నంటుచున్
వెనుకం జూడక రండు రండు తెగువన్ వేవేగ నారీమణుల్.

సీ. దాస్యాంధకారంబు తరిగి వేయుటకు నై
ఖద్దరు దీక్షతో గట్టిరమ్మ!
గద్గద స్వరముతో కడు దుఃఖ మందెడు
పంచమ సుతుల పాలించరమ్మ!
ఆత్మ నాశ మొనర్చు రక్కసి త్రాగుడు మాన్పి
దేశ వస్తుల దీక్ష దెలుపరమ్మ!
మన జాతి మన భాష, మన దేశ మభివృద్ధి
నొనయు మార్గముల నూహింప రమ్మ

గీ. మనము పూర్ణ స్వతంత్రత నెగడు వఱకు
తీఱు సోదరమ్మ మన-పని చెలువలార!
మాతృ సేవా పరాయణ మహిత దివ్య
కంకణము దాల్చి రారమ్మ గరిత లార!

## ఆంధ్ర మహిళల త్యాగము

మహాత్ముని స్వాతంత్ర్య సమరమున పురుషులతో సమానముగా స్త్రీలును నాంధ్రదేశమున నత్యద్భుత త్యాగమును ప్రదర్శించి నారు. తిలకు స్వరాజ్య నిధి సేకరణమున మహాత్ము డాంధ్ర దేశమున పర్యటించి నప్పు డాత డాంధ్ర వనితల యత్యుదార గుణము నిట్లు శ్లాఘించి నాడు.

"ఆయా దినములలో, నాంధ్ర స్త్రీలు నాకు ఏబది యారు వేల రూపాయలు నాకు సమర్పించిరి. కోటి రూపాయలు నిధిని సమకూర్చుటకు, నాంధ్రదేశము దక్క వేరుచోటి కరుగ నక్కరలేదు."

ఈ ప్రశంస తెలుగు వెలదుల త్యాగశీలతకు దివ్య పతాకయే గాక, భారత వర్షమున ఆంధ్ర స్త్రీలలోకోత్తర విశిష్టత బాహాటముగా చాటుచున్నది.

ఆ. నగలు ధరియింపగా నాంధ్ర మగువలకును
నెంత ప్రేమయో త్యాగమందంత మోజు
ఒక్క మంగళసూత్రంబు దక్క తక్కు
నగల నర్పించినారు సంతసము తోడ
"ఆంధ్ర మహిళల త్యాగాని కవధి లేదు."

గీ. "ఆయా దినముల నేబది యాఱువేల
రౌప్యముల నేను తిలకు స్వరాజ్యనిధికి
సేకరించితి కోటియు సిద్ధమగును
ఆంధ్ర దేశంబు నందె వేఱరుగ కుండ"
అనుచు మెచ్చెను గాంధి మహాత్ము డపుడు.

## మాగంటి అన్నపూర్ణ

గీ. నగల నన్నింట నిచ్చితి నాడె మైన
చేతి గడియార మిచ్చితి చింత యొకటె
భర్త నర్పించు భాగ్యంబు పడయ లేద
టని పల్కె గాంధితోడ మా అన్నపూర్ణ.

## బులుసు సాంబమూర్తి భార్య

గీ. కడియములు మాత్రము మిగిల్చి కడమ నగలె
నిధి కొసంగెను స్వయము గాంధీ మహాత్ము
డడుగు వెంటనె యిచ్చె నా కడియములను
బులుసు సాంబమూర్తి సతి ప్రఖ్యాత చరిత

## ఈపూరి అలుమేలు మంగమ్మ

శాంతి సమరమున తెనుగు చాన లసమాన ధైర్య సాహసములను ప్రదర్శించిరి. యావద్భారత వర్షమున నా సమయమున కారాగారమునకు వెళ్లిన ప్రథమ కాంత—ఆంధ్ర స్త్రీయే.

గీ. "ఆంధ్ర దేశంబునందె గాక యఖిల భారత
వర్షమున జైలు కేగిన ప్రథమ వనిత"
యనుచు చీరాలలో యశమును గడించె
మాన్య ఈపూరి అలిమేలు మంగమాంబ.

## యామినీ పూర్ణతిలక

వృత్తులు విడనాడమని గాంధిమహాత్ము డాదేశించెను. కొందరు న్యాయవాదులు—తమ న్యాయవాద వృత్తిని విడనాడిరి ఆ సందర్భమున యామిని పూర్ణ తిలక అను వేశ్య గుంటూరి నివాసి తన కుల వృత్తియైన వేశ్య వృత్తిని తక్షణమే విసర్జించి, దేశ సేవకురాం(డలో నగ్ర గణ్యయైనది

సీ. వేశ్య యయ్యును తన కుల వృత్తి మాని
దేశసేవను రక్తి గాంధిమహాత్మ
యుద్యమంబు ప్రచారంబు నొనర జేసె
యామినీ పూర్ణ తిలక ప్రఖ్యాత లతిక.

ఈమె తెలుగు కవయిత్రి. శ్రీ వేంకటేశ్వర శతకమును రచించినది 16 ఈమె చరిత్ర ప్రకటితము కావలెను.

## దువ్వూరి సుబ్బమ్మ

ఆకాలమున ప్రచారమునకు ఉపన్యాసములే గాక మనోహర గాత్రముతో మహా కవుల పద్యములను గీతములను పాడుచు నలనను ప్రజ లుత్తేజితు లగుచుండెడివారు దువ్వూరి సుబ్బమ్మ అట్టివారిలో నొకతె

గీ. శ్రావ్యమైనట్టి కంఠస్వరంబు తోడ
పద్యములు గీతికలు పాడి ప్రజలలోన
నుద్యమా వ్యాప్తి గావించె నొప్ప గాంధి
స్తుతులు జేయుచు దువ్వూరి సుబ్బమాంబ.

భాగవత పద్యములు చదువుచూ భారతమాత గీతికలు పాడుచూ, ఆమె ఉపన్యాసము చెప్పు నప్పు డొక పర్యాయము కీర్తిశేషులు విక్రమ దేవ వర్మ గారు తరువాత జయపురం మహారాజాలంగారు) విని, సభలో "అమ్మా—ఏబదైదేండ్ల వృద్ధుడనైన నేనే మీ ఉపన్యాసమును విని ఉత్తేజితుడ నగుచుండగా, ఉడుకు రక్తము గల యువకు లుద్రిక్తు లగుటలో సందేహ మేమున్నది" అని ప్రశంసించినారు

## అపర భద్రకాళి ఉన్నవ లక్ష్మీబాయమ్మ

ఈమె సుప్రసిద్ధ దేశభక్తులగు ఉన్నవ లక్ష్మీనారాయణగారి భార్య భార్యా భర్త లిద్దరును సనామధేయులు17—ఈమెది ఆజాను బాహు విగ్రహము—నల్లని దేహచ్ఛాయ. ఆమె ఖద్దరు చీరె ధరించి ఖద్దరు పతాకతో వేదిక యెక్కిన భద్రకాళివలె కన్పించెడిది ఈమె యుపన్యాస ధోరణి వేరు "మీకేం మతులు లేవా అలా దేశముల్లా అట్టుడికి పోతుంటే, ఏమ్మీక మిరెత్తినట్లు పూరుకుంటారేం—పురుషుడైనప్పుడు పడుములు బిగించడం కాదు, ఇప్పుడు నడుములు బిగించి, ముందు నడవండి" అనే రీతిగా ఉండేది. ఆమె నామెను చూడగానే కొంతమందికి భయము వేసేది కాని మా మ్నాడి నప్పుడు మాతవలె ఉండేది ఆడవాళ్లు వేసే ప్రశ్నలకు ఆమె జవాబులు ఎంత మృదువుగా ఉండేవో ఒక్క ఉదాహరణ చూపు చున్నాను.

ఆమె ఉపన్యసించు చుండగా, ఒక యువతి పాపము అమా యకము గానే—"ఏమండి ఖద్దరు చీరె చాలా బరువుగా ఉంటుం దండి. అది కట్టుకొని భరించ గలమా" అని ప్రశ్న వేసింది. వెంటనే లక్ష్మీబాయమ్మ—"వందల కొద్దీ బరువుగల మొగుణ్ణి భరించగా లేంది బరువుగల ఖద్దరు చీరే భరించ లేవా" అని జవాబు చెప్పింది ఆ యువతియే కాక, మరికొందరు మర్నాడు ఖద్దరు చీరెలు ధరించి సమావేశానికి హాజరైనారు.

క. అన్నిట నారాయణు డను
నెన్నిక గను భర్త తోడ నేకాత్మిక యై
ఉన్నవ లక్ష్మీబాయమ
సన్నుతిగనె దాస్య మోక్ష సంగ్రామమునన్

## పొణకా కనకమ్మ

నెల్లూరిలో కస్తూరిబా విద్యాలయమును స్థాపించి—గాంధీ మహాత్ముని యుద్యమమును సిద్ధిజెందించిన పుణ్య స్త్రీ పొణకా కనకమ్మ తను స్థాపించిన విద్యాలయమును గూర్చి ఆమె యిట్లు చెప్పినది.

చ. తెలుగు చరిత్రలో పసిడి దీప్తులు వెల్గెను స్వరాజ్య బాపుజీ
పిలుపున శిర్స వొగ్గినది విశ్వ ధరిత్రి స్వతంత్ర బారతో
జ్జ్వల ధర్మ దీక్ష గానినది సాక్షిగ కస్తూరిదో శిరావన్
వెలసిన విద్య మొక్క యుటు విస్తరిలెన్ నవ కల్పశాఖయై.

క. వినయంబున గాంధి మహా
త్ముని సేవకు జీవనంబు తోరపు భక్తిన్
వినియోగించిన పొణకా
కనకమ్మను నెంచ వలదె గౌరవ మొప్పన్

పొణకా కనకమ్మకు పూర్తిగా తోడ్పడిన మహిళ ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

క. ఆయమ ద్రోణము లక్ష్మీ
బాయమ్మయు నుద్యమంబు వ్యాపింపంగా
చేయూత నిచ్చి వెలసిగ
శ్రేయము పడతులకు వెల్గ సిద్ధిలపంగన్

పొణకా కనకమ్మ లక్షలకొలది ఆస్తిని ప్రజోద్యమములో కర్పూరమువలె హరింప జేసినది. రెండు మారులు కారాగృహవాసశిక్ష ననుభవించినది లక్ష్మీబాయమ్మయు సత్యాగ్రహోద్యమమున— పంచవర్ష నియమముగ సేవ గావించినది

వీరిరువురును జంటకవయిత్రులు— వీరి రచనలన్నియు, నాధ్యాత్మికములు— వీరి భగవద్గీతానువాదము సులభ సుందర శైలి నుండి గేవార్థమును గ్రహించుట కనుకూలముగ నున్నది. ఒక్క యుదాహరణ—

---

16 ఈమె కుమార్తె శ్రీమతి కనకదుర్గా రామచంద్రను ఉన్నత పరీక్షల దేరి విదుషీమణియై మదరాసున సాహిత్య సేవ సేయుచున్నది

17 సనామధేయులగు దంపతులగు నప్పు డొక విశేషమున్నది. పూర్వము పాము కఱచినపుడు ఈ దంపతులు కఱచిన వానిని ముట్టుకొనిన నా విషము హరించిపోయెడిది. అది ఆ దాంపత్య ధర్మ ప్రభావము.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

ఆ. వె. సకల భూత వితతి సమదర్శనుండగుచు
యోగ బుద్ధితోడ నుండువాడు
తన్ను నఖిల భూత తతియందు తన యందు
నఖిల భూత చయమునలరు చుండు.

## దుర్గాబాయి దేశముఖ్

ఆంధ్ర మహిళామండలికి మకుటాయమానమైన స్త్రీ రత్నము దుర్గాబాయి. సత్యాగ్రహ దీక్షా దినములలో, ఖద్దరు చీరె ధరించి త్రివర్ణ భారత పతాకను చేతధాల్చి— వేదికపై నిలువబడినప్పుడామె మూర్తీభవించిన దుర్గాదేవి వలె భాసించెడిది.

మ. అతులోత్సాహము దేశభక్తియును పెంపారంగ సత్యాగ్రహో
గ్ర తపోదీక్షను నాటి దుర్గవలె దుర్గాబాయి స్వాతంత్ర్య సం
గతమౌ ఖద్దరుచీరె భారత పతాకం దాల్చి గాంధీ మహా
మతమున్ వ్యాప్తము చేసె నాంధ్ర మహిళా మాహాత్మ్య దీ
ప్త జ్యోతియై.

దుర్గాబాయికి తొలినుండి స్వాతంత్ర్య సమరమునందు పాల్గొనుట యందెంత యభినివేశమో, నిర్మాణ కార్యక్రమమునందంత దృష్టి —"నిర్మాణ కార్యక్రమము, కార్యసిద్ధి" అను ద్వాదశాక్షరమంత్ర సిద్ధియే ఆమె ధ్యేయము— స్వాతంత్ర్యమబ్బిన వెనుక— ఆంధ్ర మహిళాభ్యుదయమునకై దుర్గాబాయి ఏకైకముగా బహు సంస్థలు స్థాపించి, ఆంధ్ర దేశాభ్యున్నతికి దోడ్పడిన మహనీయురాలు— ఈ విషయమున నామె కామెయే సాటి.

తే. మహిళాభ్యుదయంబునకై
బహు సంస్థల నేర్పరించు భవ్య సుశీలన్
మహనీయ ఆంధ్రమాతకు
దుహితలో నగ్రగణ్య దుర్గాబాయిన్—

శా. విశ్వవ్యంబగు నాంధ్రలోక మహిళా నిర్మాణ కార్యక్రియా
వర్గం బెంతయు సిద్ధి "దేశముఖ"సంభావ్యంబునం జెందగా
మార్గంబియ్యది భారతావనిని సంభావించగా జేయుమా
దుర్గాబాయికి సీడులేరు నిఖిలాంధ్రోర్వీ మహా మండలిన్.

## గాంధీ సేవా వ్రతి — మీరాబెన్ (మిస్ స్లేడు)

ఇప్పటికి అరువదియేండ్ల క్రిందట అమెరికాదేశమున ప్రపంచ సర్వమత మహాసభలో నుపన్యసించు నపుడు— శ్రీ వివేకానందస్వామిని దర్శించి, ఆ వెనుక, ఆయన శిష్యురాలైన ఒక ఆంగ్ల యువతి "సోదరి నివేదిత" అను పేరిలో భారతీయ యువతియై ప్రసిద్ధిగాంచినది— గాంధి మహాత్ముడు స్వాతంత్ర్య శంఖారావము పూరించి భారతీయులను మేల్కొలిపి నపుడెన్నడును గాంధి మహాత్ము నెఱుగకయే, ఇంగ్లండు దేశమున పత్రికలమూలమున, ఆ మహనీయుని ఖ్యాతి విని, ఇరువేల మైళ్ళ దూరమునుండి, యిచ్చటికి వచ్చి— మహాత్మునికి కూరిమి తనయవలె సరి చర్య లొనర్చిన— ఆంగ్లయువతి— మిస్ స్లేడు— అంతకన్న హెచ్చు యశము గడించినది.

మహాత్ముని కామె కంటికి రెప్పవలె చేసిన నిరుపమాన సేవయే గాక భారతదేశమునందామెకుగల యత్యంతాభినివేశమున ఆస్వాయితను— తెలుగు కవులు కవయిత్రులు— ముక్త కంఠముతో కీర్తించిరి.

## కీ. శే. మున్నంగి శర్మ

చ. పడమటి సీమ యెడ? ఎల్ల్రబాయ మదేడ? హిమాని నుండి పొ
ల్పాడికెడు వానమేడ? ఎటులోర్చితి వమ్మ— మహాత్మసేవకే
కడ కరుదెంచి జీవితము— గాంధికి నర్పణ చేసినట్టి
కడిమిదె. భారతావనిని గణ్యుల గాంచెను స్లేడు కన్యకా—

## శ్రీమతి వోలేటి నిత్య కల్యాణమ్మ

ఉ. సిమ్మక యాంగ్లదేశ రమణీ మణివైన యుదార బుద్ధి హిం
దూ వర మాతృకా ప్రజ కుమాన సుధం భేద యుప్పతిల్ల సే
వ్యా విభవంబు గూర్చ నిజశక్తిని సర్వము ధారబోయుం జా
మిమ్మెవు మహాత్ము గొద్ద కరుదెంచితివో అనవీ శుభాంక్షణీ!

## శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మ

ఉ. ఎక్కడి యాంగ్లాదేశ మది, యెక్కడి భారతదేశ మద్దిరా
ఇక్కడి కేగుదెంచి యిటులెంతయు దీక్షను మహాదుముక్తికై
తక్కక రాత్రియుం బవలు తల్లిరా? స్లేడురా? పాటు
పొందు నా
యొక్కువ యెట్టిదో నీ ఋణము నీగలి యీగెద మమ్ము
యిమ్మహిన్

క. మృగతృష్ణను బోలెడు నా
ధ గను విలాసమును విడిచి తల్లి స్లేడూ
నిగమాంత వేది గాంధికి
తగ కూతురవైతి వెంతధన్యవొ ధాత్రిన్.

## గాంధీ మహాత్ముని లండను ప్రయాణము

గాంధిమహాత్ముడు[18] గుండ్రబల్ల సమావేశమునకు (రౌండు టేబిలు కాన్ఫరెన్సు) లండను పట్టణమువెళ్లినప్పు డత్యంత శీతలముగా నుండు నా ప్రదేశమున ప్రత్యేకమైన నూలుబట్టలుగాని, ఉన్ని బట్టలు గాని ధరింపనేలేదు— శరీరమున నేయాచ్ఛాదన లేకుండ, నీ దేశమందు వలెనే మోకాలుదిగని కొల్లాయి గుడ్డతో— గండముతో నా సభలకు హాజరైనాడు— ఆ దృశ్యమును శతావధాని వెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారిట్లు వర్ణించి నారు.

మ. మెడకుం గుంపటి లింగకాయ వలె నెమ్మిందాల్పు పైఁగూడ గ
ద్దడ లాడించు హిమాని పాల్పు పల లండన్ ప్రోలిలోఁగూడ నె
క్కుడు "డ్రెస్సున్" ధరియింపకుండ నృపు గస్పొవేగె గాంధీ మహా
త్ముడు తాద్భక్షక్షులు గేస్సులందు మన హిందూదేశమందుండిరే—

గాంధీ మహాత్ముడిట్లు కొల్లాయిగుడ్డతో మొలగుడ్డ కట్టిన ప్రదేశములో పర్యటించుట— ఆంగ్ల పరిపాలకులకు విదేశీవస్త్రధారణ

---

18. గుండ్రబల్ల సమావేశములు— ఈ పేరు సార్థకము ఈ సమావేశమువల్ల ఫలితము శూన్యము. అనగా 'గుండ్రసున్నది'.

నుగాలమున భారతదేశమున కెట్టి చేటుప్పు కలిగినదో స్పష్టపరచుటకే యని తెలియవలెను. భాషతోగూడ వేషమున, విదేశ వ్యామోహము గలిగించి, భారతీయుల నెట్టి భావదాస్యమున ముంచినారో— అది తన కట్టు గుడ్డచే నిరూపరచినాడు— అసలు భారతీయులకు— నెట్టి శీతకాలము నందైన—! విశేష వస్త్రధారణ— అనావశ్యకమని— ఒక్క కంబళి మాత్రమున్నచాలునని, భారతీయుల వస్త్రధారణ పాశ్చాత్యఖండమునవే గాక, ప్రపంచమున— నతి స్వల్పవ్యయముతో కూడినదని నిరూపించుటకే— అతడు కొల్లాయి గట్టినాడు. విదేశ వస్త్ర వ్యామోహము కల్పించి— భారత దేశ ద్రవ్యము నెంతగా ఆంగ్లేయులు హరించిరో— తేట తెల్లము చేసినాడు—

మహాత్ముడు ఎండన, ఎఘులలో కొల్లాయిగుడ్డలో పర్యటించుట చూచి అక్కడ వారందరు విగ్గ్రాంతులైనారు— దొరసానమ్మలు బొమ్మలైనారు— వారు గాంధిమహాత్ముని లోగల దివ్యజ్యోతి నెట్లు తెలుగ గలరు? ఈ సందర్భమున శ్రీ. శే. మున్నంగి శర్మ చెప్పిన పద్యము పై విషయములను వ్యక్తము చేయును.

సీ. "స్మాట్సు" మున్నుగ నాంగ్ల సైనికులను శాంతి
  నుక్కడంచె నహొ యీ "బక్కశెట్టి"
భారతీయులకు మున్నదిమూడు కోట్లకు
  ప్రభువాయె యీ "సబర్మతి ఫకీరు"
సంకెళ్లతోడనె స్వారాజ్య సంపద
  నిప్పించు నట్టె యీ "ఉప్పుదొంగ"
కొల్లాయిగుడ్డలో కోటి మనస్సుల
  కదిలించి నట్టె యీ ఖాదిజోగి!"

గీ. అనుచు నినుజూచి తమలోన నాంగ్లవనిత
  లాడు కొని యుండ నోపుదు రంతె కాని
  నిమెరుంగుదు రయ్య లోకైక మైన
  నీ మహాత్తర శక్తి గాంధిమహాత్మ!

## సాహిత్య ప్రక్రియలు సమస్యా పూరణము

గాంధి సాహిత్యమున— సమస్యాపూరణము గూడ గలదు. క్రీ. శ. 1923 లో—

"ఇంకం గుంకుమ బొట్టు పెట్టుకుము తన్వీ! పాల బాగంబునన్" అను సమస్యను, 'సరస్వతి'[19] అను మాసపత్రిక ప్రకటించి దానిని కవులను పూర్తి చేయగోరెను—ఆ కాలమున ప్రసిద్ధులందరు దానిని పూర్తి చేసిరి. కాని, దేశకాలపాత్రానుగుణముగా, దానిని పూరించిన వారొక్కరే— ఆయన శ్రీ. శే. మాదేపల్లి రామచంద్రశాస్త్రి —(కవిగారు) ఆయన పూరణ మిది—

శా. "బింకంబుల్ పలుమార్లు పల్కి సభలన్ పేరొందు బల్కోర్కి నే
  శ్శంకం దానటు చేయ జాలకటు దేశద్రోహియై ఖైదునం
  బంకై న్నిపతిపేరు మాపుకొనియెన్ చావన్న వేరున్నదే—
  ఇంకం గుంకుమబొట్టు పెట్టుకుము తన్వీ! పాల బాగంబునన్"

శ్రీ. శే. ప్రభాకరశాస్త్రిగారి సమస్యాపూరణములను సమీక్షించుచు సమస్యపూరించిన, మున్నదిమంది కవులలో కవిగారిదే గణింప దగినదని యభిప్రాయము ప్రకటించినారు.

ఆ కాలమున సభలలో, "నేను, ఉద్యమములో పాల్గొందును, వృత్తి విడిచిపెట్టెదను; సత్యాగ్రహము చేయుదును" అని ఉపన్యాస వేదికపై కొందరు పెద్దలు ప్రగల్భములు పల్కెడివారు— కాని, అట్లు చేసిన వారిని కొందరిని పాలకులు కారాగృహమునకు పంపగానే— వెనుకకు తగ్గెడివారు.

"నీ భర్త యిట్లు మొదట తాను ఉద్యమములో పని చేసెదనని పలికి, ఖైదు అనగానే జంకి, దేశద్రోహియైనాడు— అతడు, బ్రతికి యున్న ఫలమేమి? నీవింక కుంకుమ బొట్టు పెట్టుకొనకుము" అన్న భావము— గాంధీ మహోద్యమ ప్రచారకముగ నున్నది.

## శ త క ము లు

గాంధిమహాత్ముడు స్వాతంత్ర్యోద్యమము ప్రారంభించిన మూనాండ్లకే ఆతడు అవతార పురుషుడుగా పరిగణితుడయ్యెను. దేవతాశతస్తుతుల వలె, మహాపురుషుల శత స్తోత్రములవలె, గాంధీమహాత్ముని గూర్చి శతకములు వెలసినవి. వానిలో ప్రథమము—

## గాంధీ శతకము (1924)

మంగిపూడి వెంకటశర్మ రచితము. ఈశతకము, కైలాసవాసి కాశీనాధుని నాగేశ్వరరావుగారు 'భారతి' ప్రారంభించునపుడు—ప్రథమ సంచిక—(భారతి సం.1. సం.1. జనవరి 1924) లో ప్రారంభించి తరువాతి సంచికలో పూర్తి చేసిరి —

1924లో దేశీయ మహాజనసభ ఆంధ్రదేశమున కాకినాడలో జరిగినపుడు శ్రీ నాగేశ్వరరావు పంతులు గారు 'భారతి' ప్రథమ సంచిక గాంధీమహాత్ముని చిత్రముతో కూడ మూడువేల ప్రతు లచ్చు వేయించి—ఆ దేశీయ మహాసభలో పంచిపెట్టించిరి— 'భారతి'మనోహరాకారము— గాంధీమహాత్ముని ప్రశంసతో ప్రారంభము— ఈరెండును దేశ సాహిత్యమునకు గాంధి సాహిత్యమున ప్రథమ సోపానములై భారతి విశిష్టత యావద్భారత వర్షమునకు వెల్లడించినవి. ఇందుండి నాల్గు పద్యము లుదాహరించు చున్నాను—

క. నిరుపమ కల్యాణ గుణా
  భరణా! జనకా ద్య యోగి వందిత చరణా!
  పురుషార్థ భరిత చరితా!
  కరుణామృత పూరితాత్మ! గాంధి మహాత్మా!

క. నీవవతరించుటను నా
  ర్యావర్తము పూతమయ్యె నవని తరించెన్
  శ్రీ వైశ్య కులము మెరసెను
  కావంబడె భరతమాత గాంధి మహాత్మా!

---

19. ఈ సరస్వతి పత్రికను ముక్త్యాల రాజావారైన శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దరువారు ప్రచురించెడు వారు— ఈ పత్రికయందే శ్రీ. శే. ప్రభాకర శాస్త్రిగారు దుగ్గన నాసికేతూపాఖ్యానము, తెనాలి రామలింగకవి ఉద్భటారాధ్యచరిత్ర మున్నగు ప్రాచీన కావ్యములను ప్రకటించిరి. ఈ పత్రిక మూడేండ్లు మాత్రము ప్రకటితమైనది.

క. క్రూరులయి హింస జేసెడు
వారలఁ బ్రేమించునట్టి వ్రతమూనితి వా
కారణమునఁ గ్రీస్తందురు
గౌరవమున జనులు నిన్ను గాంధి మహాత్మా!

క. తెల్లనివారె ఘనులును
నల్లని వారెల్ల నీచ నరులను భావం
బెల్లసిరివిగా దిభ్రమయీ
కల్లరి పనులకు మొదళ్ళ గాంధిమహాత్మా!

## గాంధీ శతకము (1948)

ఈ శతకము స్వాతంత్ర్యానంతరము శ్రీ బయిరెడ్డి సుబ్రహ్మణ్యము గారిచే రచితమైనది. గాంధీ జీవితమును స్వభావోక్తులచే చిత్రించు శతకము—దీనిని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి—పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారలు ప్రశంసించిరి. మచ్చునకు నాల్గు పద్యములు.

క. కడు తీపగు నీనామము
దడవకఁ దమజీవితమున దప్పిన వారున్
పుడమి పయి వానలోనం
దడియని వారుండఁబోరు తథ్యము గాంధీ— (79)

క. గాంధీ భవనములాపై
గాంధీ వీధులును బడులు గాంధినగరముల్
గాంధీయుద్యానంబులు
గాంధీ మయమయ్యె నిజంగంబే గాంధి. (81)

క. నీవే లోకము లోకము
నీవేయను రీతి దెసలు నిండారంగా
నీ వాణి మాటు మ్రోఁగెను
భావన సందేశమై శివంకర గాంధీ! (83)

క. విను వేయు వర్షములపై
బొనర పునర్జన్మ మెత్తి పూర్వ జ్ఞానం
బును గలిగి నీయశస్సులఁ
గను భాగ్యము కొరకుఁ గలలు గందును గాంధీ (107)

## గాంధీ శతకము (1969)

ఇది మహాత్మాగాంధి శతజయంత్యుత్సవ సందర్భమున రచయింపబడినది రచయిత రసవత్కవితా విశారదుడూ, శ్రీ కూరెళ్ల రామనరసింగరావు—బాల్యమునుండి ప్రశస్త కవిత వెలయించి, 'రాధామోహను' "ఇందూ" "రాఘవశతకము" మున్నగు కావ్యముల మూలమున నాంధ్ర సాహిత్యలోకమున కిపరకే సుపరిచితుడు గాంధి వాదమిందు, సరళముగా సూత్ర ప్రాయముగా చక్కగా కందములలో నందింపబడినది ఉదాహరణకు కొన్ని పద్యములు—

క. బహుభేద భరిత భారత
మహినే కోన్ముఖముఁ జేసి మహిత స్వేచ్ఛా
వహమున జయంబు గూర్చిత
వహిత జనస్తుత్య వైష్ణవాగ్రణి గాంధీ— (9)

క. కత్తిన్, తుపాకిని, బాంబునో
చిత్తస్థైర్యంబు మించు క్షితి ననుచును లో
కోత్తరగతిఁ జూపితివో
యుత్తమగుణ! శాంతి సమరయోధా! గాంధీ. (12)

క దారమె యాధారముగా
దారుణ పాశ్చాత్య బలముఁ దరిమితివి గదే
భారత భువి నుండి భవత్
భూరి మహిమ మరయగా నపూర్వము గాంధీ. (19)

క. ఉప్పును చేతిని బట్టుక
చప్పున మంత్రించినటుల శాత్రవ బలమున్
తెప్పల నెక్కించితివే
ఎప్పగిదిని నీదు ప్రజ్ఞ నెన్నెద గాంధీ. (20)

క. ఇండ్లను భూములను విడచి
పెండ్లికిఁ బోయెడి విధానఁ బోయిరి పౌరుల్
ఏండ్లు చెరసాలలోఁ గడ
గండ్లు పడగ నీదు వెన్క గ్రక్కున గాంధీ! (33)

క. మత, వర్ణ, రాష్ట్ర భాషా
స్థితి, కుల, భేదముల మఱచి సేవింపుఁడు సం
తతమున్ భారత భువి నని
స్తుతమతి, పల్కితివి నీవు తొల్తనె గాంధీ! (39)

ఈ శతకమంతయు నిట్టి సులభ సుందర రచనతో నున్నది.

"కందము వ్రాసిన వాడే కవి" అన్నమాట సార్థక పరచినట్లుగా, గాంధిమహాత్ముని గూర్చిన శతకములు మూడును కందములలో రచియింప బడుట యెంతయు సముచితముగా నున్నది— పై శతకములలోని పద్యములు, బడులలో పాఠశాలలలో, పాఠ్యగ్రంథములలో ప్రచారముగాంచ దగియున్నవి— నేటి పఠనీయ గ్రంథరచయితలు దీనిని గుర్తింతురు గాక!

## నాటకములు

క్రీ శ. 1920 లో గాంధీ మహాత్ముడు సహాయనిరాకరణోద్యమమును ప్రారంభించిన నాటినుండి, మాతృదేశమునకు సర్వము త్యాగము చేయవలెనను దీక్ష కొరకు, స్వరాజ్య సంపాదన కొరకు తెలుగు దేశమున ప్రచారమునకై రచితములైన వానిలో నాటకములు ప్రధానములు.

పూర్తిగా రాజకీయ సంబంధము గలవియై, సమకాలికములైన ఆంగ్ల పాలకుల దురంతములనే కాక, ప్రజలు నాయకులు ప్రదర్శించిన ప్రశంసనీయ స్వార్థత్యాగము లను సామాన్య ప్రజానీకమునకు ప్రత్యక్షముగా చూపి, వారిని స్వాతంత్ర్య సమరమునందు పాల్గొనజేయుటకు నా దినములలో నాటకముల కన్న మంచి సాధన వేరే లేదని చెప్పవచ్చును.

దేశమునగాని సంఘమునగాని ప్రజలకు హానికరములగు పనులు జరిగినపుడు పూర్వపు రాజుల కాలములలో నైనను, నాటకముల మూలముగా బాధితులకు న్యాయము జరిగెడిదనియు, సంఘములో సంస్కా

లమము గలిగించుట కని తోడ్పడినవనియు మనకు కొన్ని యుదాహరణలు గలవు

క్రీ. శ. 16వ శతాబ్దిలో రాజకీయములైన పన్నులను చెల్లించ వలసిన వారు చెల్లింపనప్పుడు రాజుగారి అధికారులు అట్టి వారి స్త్రీల స్తనములకు చిరతలు పట్టించి బాధపెట్టి పన్నులు వసూలు చేసెడి వారు.

ఇట్టి ఘోర కార్యము నాపుటకు కూచిపూడి భాగవతులు నాట్య ప్రదర్శనము గావించి స్త్రీల స్తనములకు చిరతలు పట్టించిరి. ఆ ప్రదర్శనమునకు విచ్చేసిన విజయనగర సామ్రాజ్యాధీశ్వరుడు వీర వెంకట పతి రాయలు తత్క్షణమే— స్త్రీలను హింసించి పన్నులు వసూలు చేయు పద్ధతిని రద్దుపరచి, శాసనము చేసెను.[20]

తంజావూరి మహారాష్ట్ర రాజులు పాలనమున దేవాలయము లలో పూజారులు, పూజాదికములు సక్రమముగా నిర్వర్తించక పోవుట దేవాలయ ద్రవ్యమును దొంగిలించుట చేసెడి వారు. వారిని శిక్షించిన లాభములేదని తెలిసి, 'శహాజీ మహారాజ మూడు నాటకములు వ్రాసి, వానిని ప్రదర్శింపజేసి ప్రజలందరకు పూజారులు చేయు అక్రమ చేష్టలను బయటపెట్టగానే, పూజారులు సిగ్గుపడి— ఆనాటి నుండి దేవాలయ సంబంధమైన పనులన్నియు సక్రమముగా నెరవేర్చు చుండిరి—

స్వాతంత్ర్య సమర ప్రారంభమున నాటకముల మూలమున నమోఘమైన ప్రచారము గావించి, గాంధీ మహోద్యమము ప్రజల హృదయములలో గాఢముగా నాటుకొన జేసిన కవులలో "రాజకీయ నాటక, వాల్మీకి"—

## శ్రీ దామరాజు పుండరీకాక్షుడు

గా రగ్రగణ్యులు— (జ. 1898) 1921—1922 ప్రాంతము లలో వీరి గాంధీ విజయము, గాంధీ మహోదయము, పాంచాల పరాభ వము అను నాటకము లానాడు— దేశ మంతటను మహత్తర సంచ లనము చైతన్యము గలిగించినవి—

రాజకీయ నాటకములను రచించుటకు కేవలము ఉత్సాహము దేశభక్తియేగాక, ప్రజల గుండెలను కదిలించుటకు తగిన— పాండి త్యము కవితాశక్తియును కని కుండవలెను. శ్రీ పుండరీకాక్షుడు గారి యందీ లక్షణములు పూర్తిగా మూర్తీభవించినవి — గ్రంథకర్తలే యా నాటకము లాడించుటచేత నవి విశేష ప్రచారము నందినవి.

గాంధి విజయము లేక నవయుగము అను నాటకము తొలి కూర్పు ప్రతియలు 1921 లో వెలువడినది— రెండు మూడు నెలలలో ఆ తొలి కూర్పు ప్రతులన్నియు నమ్ముడు పోయినవి— తిరిగ అక్టోబరు 1921 లోనే మరియొక ముద్రణ నేయించ వలసి వచ్చినదనినచో దీని వ్యాప్తి యూహింపవచ్చును.

ఈ నాటకము నాందిలోనే మహాత్ముని నమస్కరించు నీ క్రింది పద్యము తెలుగు రాజకీయ సాహిత్యమున శాశ్వత స్థానము సంపాదించుకొన్నది.

ఉ. కత్తులులేవు, శూలమును, గాండివమున్ మొదలే హుళక్కి, నో
రెత్తి ప్రచండ వాక్పటిమ నేనియు జాటడు, వైరిమీద దం
డెత్తగ సేనలేదు, బలహీనము కాయము, కోప తాపముల్
బొత్తుగసున్న, అట్టి ఘనమూర్తి మనోబలశాలి గాంధీ జే
యెత్తి నమస్కరించి, స్మరియించెద నెప్పు స్వరాజ్యసిద్ధికిన్.

ఆనాడు ప్రభుత్వము వారిట్టి రాజకీయ నాటకముల నరి కట్టుటకు నీ క్రింది యధికార విధానము నవలంబించిరి.

1. నిషేధాజ్ఞలు.
2. ముద్రణప్రతులు వశపరచుకొని తగుల బెట్టుట
3. నాటకమున వేషధారులను నిర్బంధించుట.
4. నాటక ప్రదర్శనమునకు ప్రత్యక్షముగా తోడ్పడిన వారిని నిర్బం ధించుట.
5. పరోక్షముగా తోడ్పడిన వారిని తెలుసుకొని—అధికారపూర్వకముగా ఉత్తరువులు జారీ చేయుట.

ఇట్లెన్నడు పథకము లాంగ్ల ప్రభుత్వము వారు త్రొక్కినను— దామరాజు వారి నాటకములు మాత్రమా పథకముల కతీతములై నిలిచినవి.

దామరాజు వారి నాటకములను, ప్రభుత్వమువారు తక్కిన నాట కముల వలెనే నిషేధపుటుత్తరు లిచ్చుటకు పరీక్షింప జేసిరి— కాని— అట్టి నిషేధాజ్ఞ లిచ్చుటకు బాహాటముగా నందు, రాజద్రోహ విషయక ములు లేనేలేవు— పైకి రాజద్రోహము అను భావము కనుపరుప కుండా, భారత స్వాతంత్ర్య సమరమునకు పురికొల్పు వ్యంగ్య ధోరణిలో నున్నవా నాటకములు. అందుచేత రాష్ట్ర ప్రభుత్వమువారు, రాజప్రతి నిధికి విషయము తెలియజేసిరి— ఆంగ్ల పరిపాలకులు రాజ్యతంత్ర జ్ఞులు— వారు గ్రంథకర్తకు ధనాశ చూపిన యిట్టి రచనల నిక చేయుట మానుకొనునని తలంచి—

"గాంధి ప్రాతను నాటకమునుండి
తొలగించిన పది వేల రూపాయల
పారితోషిక మిచ్చెదము"

అని ఆశపెట్టిరి— కాని స్వార్థత్యాగ ధనులగు పుండరీకాక్షుడుగారు— పదివేల రూపాయల పారితోషికమును తిరస్కరించి వారికిట్లు బదులు చెప్పిరి—

"గాంధి లేకుండ సాగదు కలము నాకు"

ఇట్టి యున్నతాదర్శముతో నాటక రచన సాగించిన ధన్యులు— దామరాజు వారు—

### పాంచాల పరాభవము—

స్వరాజ్యోద్యమము—పంజాబు దురంతములతో ప్రారంభ మైనది. మహాభారత కాలమున పాంచాలియైన ద్రౌపదికి నిండు సభలో వస్త్రాపహరణము జరుగుట. కౌరవులు దాని మూలముగా ధ్వంసమగుట—అను విషయము లీ కాలమున పాంచాదేశము (పంజాబు) న జరిగిన దురంతములలో సరిపోవుటచే, నాటకీకరణమున కీ యితి వృత్తము చక్కగా కుదురుకొనినది— ఈ దురంతములకు కాంకుడు

---

20. చూడుడు నా ఆంగ వ్యాసము. Telugu Country— A Land of Dance Romance. నాట్యకళ— 1 సం. 4 సంచిక. (1960)

'మైసూరు ఒడయారు' పుండరీకాక్షుడుగారి యుద్ధాంతమునే—పాంచాల పరాభవము అను నాటకముగా రచించిరి. ఇందు, 'ఒడ్యాయరు' 'డయా దాసురుడై'నాడు. నాటకము ప్రదర్శించుచున్నంతసేపు ప్రజలు పంజాబు దురంతములు ప్రత్యక్షముగ చూచినట్లు భావించి, ఉద్రిక్తులయ్యెడివారు— ఇది నా యనుభవము.

ప్రభుత్వమువారు నిషేధించినను తే 20.10.1921దిని విశాఖపట్టణమున హిందూపరు మందిరమున కెదురుగానున్న నాటక శాలలో నాడితిమి— అప్పుడు నన్నొక్కని మాత్రమే విడిచిపెట్టి, తక్కిన వారందరిని నిర్బంధించిరి.

> "పాలకు లాంక్ష వెట్టినను పైపంబు వాలోగరింపు కార్యముల్
> చాల నెఱింగియున్ తుదకు లక్ష్యము సేయక నాడి నాము పాం
> చాల పరాభవం బనెడునాటకమందఱి ఖైదు చేసియున్
> పాలకు లేమొకో విడిచి పైచిరి నన్ను సకారణంబుగన్"

ఈ నాటకమున—నాటి రాజకీయ విషయములు—డయర్ పరిపాలన శ్రీకృష్ణ జన్మస్థాన వర్ణన— అమృతసర్ కాంగ్రెసు వివరములు—అచ్చు గుద్దినట్లు వర్ణితములగుటచేత. ఆంగ్లదేశపు పార్లమెంటులో కూడ అలజడి కలుగజేసినది.[21]

వీరి యితర నాటకములు—రెండును కూడ మేమాడితిమి.

రాజకీయ నాటక సాహిత్యమున పుండరీకాక్షుడుగారి ప్రథమ తీర్థము—వారి నాటకముల మూలముననే ప్రారంభ సంవత్సరములలో మహాత్ముని యుద్యమము తెలుగు దేశమున స్థిరముగా నాటుకొనిన దనుట[?] నతిశయోక్తి యే మాత్రములేదు.

> అక్షయ్యంబగు దేశభక్తియు మహోదాత్తత్యాగ శీలంబులున్
> సాక్షాత్కారముగాగ నాటకములన్ సంధించి యాడించి దా
> పక్షీణంబగు కీర్తిగన్న కవితా వ్యాహారు శ్రీ పుండరీ
> కాక్షున్ సన్నుతిఁ జేతు నెంతయు ఘనుండౌ దాసురా జాన్వ
> యున్.

## మొసలికంటి హనుమంతరావు

(1888—1948)

హనుమంతరావుగారి శివాజీ విజయము కాలమున ననగా క్రీ. శ. 1921 మాతృదేశ భక్తిని—దేవదాస్యము నున్మూలింప జేయు నుత్సాహము ధైర్యము వ్యాప్తి చేసిన నాటకము— ఇందలి గద్య పద్యవం క్తులన్నియు నుదాత్తములు గంభీరములు.

శ్రీనాథ మహాకవి, నాడు—

'తల్లి, కన్నడరాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్'

అన్న పాదము ననుకరించుచు—హనుమంతరావుగారు—

"తల్లి భారత రాజ్యలక్ష్మి" అనుమకుటముతో 7 పద్యములు రచించిరి.

> "పుల్లాంభోరుహ జాలసంభృత మహాంభోజా కరంబై, రమా
> వాల్లభ్యంబయి, సర్వలోక వినుత ప్రఖ్యాతవై యుండినే
> డెల్లంబోవఁగ దాసివై, పతితవై, హీనాత్మవై యుంటి వో
> తల్లీ భారత రాజ్యలక్ష్మి యెప్పుడీ దాస్యంబు చేకూరెనో?"

> "మొల్లంకొన్నవను వాహినీధవగుణ ప్రోద్యాత సంరంభముల్
> సొల్లే పోవగలేదు, నియోధ లసంబున్ ప్రేమ పోలేదు, మా
> మల్లత్వంబును, మాతృభక్తియు జయోన్మాదంబునుస్ జూడు నో
> తల్లీ! భారత రాజ్యలక్ష్మి తగు సత్కాలంబు రాదయ్యెడిన్."

ఈనాటకమును మేము —21 12 1921 లో ప్రదర్శించినాము.

నాటకము ముద్రితము కాకుండగనే—మేము ఆడితిమి. అప్పుడు నాటక కర్తను నిట్లభినందించితిని

> కేవల దేశభక్తి పులకింపఁగ చేసెడు నట్టి "శ్రీ శివా
> జీ విజయంబు సత్కృతిని సిద్ధుడవై, హనుమంతరావు ము
> ఖ్యావసరంబుగా మొసలికంటి కులుం డది వ్రాసె, దానితో
> నేవయు, ద్రవ్యలాభమును చేకురెనంత మహోదాత్యమంబుకున్ [22]

ఆనాటకము నాడుటకు ముందుగా నట్టి మకుటముతోనే ఒక పద్యము కావలసి వచ్చినది. కాని కవిగారు విజయనగరమున నుండుట చేతను, నాటకమాడు స్థలము విశాఖ పట్టణముగావున— వారిచే వ్రాసి పద్యము తెప్పించుట యాలస్యమగును గాన నేను వెంటనే యామకుటముతో పద్యము నిట్లు వ్రాసి చదివించితిని.

> శా. ఉల్లంబుల్ తవ దాస్యమోక్షణకునై యుద్రూఢ లాగంబ నే
> డెల్లన్ శాంతినిరోధ రూపమగు లోకైకోద్యమ వ్యాప్తి సం
> ధిలం జేసి నఖండ భారతము గాంధీ నేత మున్ముందు నో
> తల్లీ! భారత రాజ్యలక్ష్మి యిక స్వాతంత్ర్యంబు సిద్ధింపదే.[23]—

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

(1866—1961)

ఆంధ్ర వ్యాసులని యశముగాంచి, ద్విశతాధిక గ్రంథకర్తలైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు రాజకీయ నాటకరచయితలుగా కూడ పేరెక్కిన నారు—వీరు.

1. తిలకు మహారాజనాటకము— (1921)
2. గాంధీ విజయధ్వజనాటకము (1924).
3. స్వరాజ్యోదయము. (1947)

అను మూడు నాటకములు రచించినారు—

మొదటిది తిలకు నిర్యాణమున దేశమర్పించిన నివాళాంజలి— ఇందు నటి "సుజలాం సుఫలాం" అన్న వందేమాతర గీతముతో ప్రవే

---

21. తెలుగు నాటక వికాసము డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు. నూతన ప్రయోగములు నాటకములు. పుట 345—348.

22. 1921 లోనే పాఠశాలా బహిష్కారము గావించిన విద్యార్థులలో ప్రథములు, విశాఖపట్టణము వైద్య పాఠశాల (అప్పటికి వైద్య కళాశాలలేదు) విద్యార్థులు. ఆ విద్యార్థులే యిదిమందికి పోషణ జరుగవలసి వచ్చెను. విశాఖ పట్టణమున "బుచ్చి గాంధీ" వసంతరావు బుచ్చి సుందరరావు, కవిగారు వారి కొరకు నాటకము లాడించి, ధనము ప్రోగు చేసి. ఉద్యమము సజీవముగా నిల్పిరి.

23 నా నాటకానుభవముల చరిత్ర. సమయము వచ్చినపుడు వివరింతును—1918 నుండి 1922 వరకు విశాఖపట్టణమున నేను పాత్ర ధరింపని నాటకమే ఆడబడలేదు.

కించుట గమనింపదగినది. తిలకు మరణముతో నంతమొందు విషాదాంత నాటకమిది—రెండవ దానిలో గాంధి మహాత్ముని ఉద్యమ ప్రారంభమునుండి 1924 లో— దళయు మహాసభవరకు పొందిన విజయములు వర్ణితములు—స్వాతంత్ర్యము సమకూరినపుడు రచితమైనది—ఈనాటకము లెన్నడు ప్రదర్శింప బడలేదు—కాని వీనిని దృశ్యములైనను, శ్రవ్యములుగనే పరిగణింప వలెను.

సాహిత్య దృష్టితో చూచిన—ఇంగ్లీషు నాటకములు తాత్కాలిక ప్రయోజనము గలవిగా మనము నిర్ణయింప వచ్చును అయినను ఆంధ్ర నాటక వాఙ్మయమున వీనికొక ప్రత్యేక స్థానము గలదు—

క్రీ. శ. 1960. తరువాత—నాటకరచన లుప్తమైనది— క్రీ శ 1921 నుండి— 1960 వరకు వెలువడిన నాటకముల నాటికల పట్టిక రెండవ అనుబంధమున చూడ నగును

## వచన రచనలు—ఆత్మకథ

గాంధీ సాహిత్యమున వచన రచనలలో ప్రథమముగా పేర్కొన దగినది—కీర్తిశేషులు, వేలూరి శివరామ శాస్త్రి గారి ఆత్మకథ. ఆంగ్ల భాషలో వ్రాయబడిన—మహాత్ముని సత్యానుభవములలో, ఆయన ఆత్మ ప్రతిఫలించుచుండును. దానిని తెలుగు భాషలో ఆమహాత్ముని దివ్య జ్యోతి మన కన్నులకు గట్టినట్లుగను, ఆయన చర్యలు మన హృదయమున కత్తుకొని పోవు రీతిగాను, ఆయన, సత్యాహింసా శాంతి మార్గమున మనము ప్రవర్తించుట కుత్సహించునంత, విశద ఫణితితోడను ఆత్మకథ రచితమైనది—ఈనాడు 'గాంధిమార్గము' అను పేరున—ఆకాశవాణిలో నిందుండియే, మహాత్ముని ప్రవచనములు మనకు ప్రసారము చేయ బడుచుండుటచే నీగ్రంథము యొక్క లోకోత్తర విశిష్టత మనము గ్రహింప వచ్చును

## ఆత్మకథ - ఆంధ్ర గ్రంథమాల

ఈ ఆత్మకథను— ఆంధ్రగ్రంథమాల మూలమున యావదాంధ్రదేశమున ప్రచారముగుటకు కారణ భూతులు, కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు. ఆంగ్ల మూలమున నీ కథ అయిదు భాగములుగ నున్నది— ఆంధ్ర భాషలో పాఠకలోకమున కనుకూలముగ నుండునట్లు, శ్రీ పంతులు గారు—దీనిని రెండు సంపుటములుగా ప్రకటించిరి ప్రథమ సంపుటమున మొదటి మూడు భాగములును ద్వితీయ సంపుటమున—నాలుగైదు భాగములును గలవు—ద్వితీయ సంపుటమున—రెండు భాగములలో 90 విషయములు గలవు.

నన్నయ భట్టారకుడు మహాభారత మాహాత్మ్యస్వరూపము నట్లు విశదీకరించి నాడు—

> సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని
> యధ్యాత్మ విదులు వేదాంత మనియు.
> నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
> కవివృషభులు మహా కావ్యమనియు
> లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
> యైతిహాసికు లితిహాసమనియు
> పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
> యంబని మహిగొనియాడు చుండ" (ఆది 1 32)

వేదవ్యాసుడు—భారతమును రచించెను. ఈ సద్యమునందలి భారత లక్షణము లన్నియు ఆత్మకథకు సరిపోవును.24 ఆ భారతము ద్వాపర యుగాంతమందలిది. ఇది కలియుగమున నవ భారతము—

ఇందలి రచనా రీతి కొక యుదాహరణ—

పూర్ణాహుతి—(387 పుట).

సత్యముకంటె వేరుగ పరమేశ్వరుడొకడున్నాడని నాకనుభవము లేదు సత్యమున కహింసయే రాజమార్గమని యీ గ్రంథము నందలి ప్రతి పుటయు జెప్ప జాలినయెడల నాయీ ప్రయత్నమంతయు వ్యర్థమని తలంతును. నా ప్రయత్నమంతయు వ్యర్థమైనను నా సిద్ధాంతము వ్యర్థము కాదు ఇంతకును నా యహింస సత్యమైనను అపక్వముగనే, అపూర్ణముగనే యున్నది. కావున నాకనుగొన గలిగిన దా సత్యసూర్యునిలో నొక కిరణమే".

ఇది మహా భారతములోని "ఉపవాస వ్రతము కంటె వేరు తపము లేదు. వ్రతమనగా మేని ప్రసన్నదనము నివుర చేతగాదు. సత్యము నహింసయు గాని" అన్న మాటలను తలపించు చున్నది. ఈ సంపుటమునకు అకారాది పదసూచిక గలదు."

## రాజకీయ పత్రికలు

ఆంగ్లపాలకుల చర్యలను తీవ్రముగా ఖండించుచు పత్రికల మూలమున ప్రజా సామాన్యమునకు ప్రభుత్వాధి కార విధానమును దెలిపి వారిలో రాజకీయ చైతన్యము కలిగించిన కీర్తి లోకమాన్య నిది—తిలకు మహాశయుడు, మహారాష్ట్ర దేశమున—కేసరి మరాటాపత్రికలు స్థాపించి, తన్మూలమున—మహారాష్ట్ర ప్రజానీకములో రాజకీయముగా నద్భుత సంచలనము గలిగించినాడు. ఆకాలమున—(1907—1912) ఆ రెండు పత్రికలకు నొక్కొక్క దానికిరువది వేల మంది చందా దారులుండిరన్నచో వీనివ్యాప్తి గమనింప వచ్చును. తిలకు ఆదర్శమును గొని తెలుగుదేశమున రాజకీయ పత్రికను ప్రథమముగా స్థాపించిన యశస్సు గాడిచెర్ల హరి సర్వోత్తమ రావు గారిది.

## "స్వ రా జ్య"

వందేమాతరోద్యమములో పాల్గొని గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు ఆయన సహోధ్యాయి—బోడి నారాయణరావు— విజయవాడలో "స్వరాజ్య" అను రాజకీయ వారపత్రిక స్థాపించిరి. అందలి వ్యాసములు యువకుల రక్తము నుడుకెత్తించెడివి—నిర్భయముగా ప్రభుత్వ చర్యలందు విమర్శింప బడుచుండెడివి— ఆంగ్లపాలకులకు బహిరంగముగా వ్రాసిన, ఒక వ్యాసలేఖ మూలమున—రాజద్రోహము క్రింద హరి సర్వోత్తమ రావు—మూడేండ్లు కారాగారశిక్ష ననుభవించెను. ఈ కాలమున ఆయన సహోధ్యాయి నారాయణరావు దానిని నడుపుచుండెడి వాడు—హరి సర్వోత్తమ రావు మరికొంతకాలము దీనిని నడిపెను.

## హరి సర్వోత్తమరావు—ఆంధ్రపత్రిక

హరిసర్వోత్తమ రావు గొప్ప దేశభక్తుడే గాక మంచి విద్వత్తు గలవాడు—అకారణము చేతనే— కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు చెన్నపట్టణమున—1914 లో ఆంధ్ర పత్రిక దినపత్రిక ప్రారంభించినప్పుడు, దానికి సంపాదకునిగా నియమించిరి—ఆయన కొన్ని సంవత్సరములు సంపాదకుడుగా నుండి ఆంధ్ర పత్రిక కొక ప్రత్యేక విశిష్టత ప్రతిపాదించినాడు వారి తరువాతి సంపాదకులగు శివరామకృష్ణా రావు—చల్లా శేషగిరిరావు గారలకు హరి సర్వోత్తమ రావే వరవడి.

## కాంగ్రెసు

గాంధీమహాత్ముని అసహాయోద్యమము ప్రారంభముకాగానే, కాంగ్రెసు పత్రిక రాజమహేంద్రవరమున మద్దూరి అన్నపూర్ణయ్య సంపాదకత్వమున—1921 ఏప్రియలు నెలనుండి ప్రతి వారము వెలువడు చుండెడిది ఈ పత్రికలో వ్యాసము లన్నియు నప్పటి సహాయ నిరాకరణోద్యమమున, పాఠశాలా బహిష్కారము గావించిన యువకులచే రచితములగు చుండి ప్రజానీకమునకు ప్రభుత్వపు దుశ్చర్యలను —అద్దములో చూపినట్లు చూపుచుండెడివి— దీని ప్రారంభ దినముల లోనే— సంపాదకులగు అన్నపూర్ణయ్యగారి వ్యాసమునకు రాజద్రోహము క్రింద ఒకటిన్నర సంవత్సరములు కారాగార శిక్ష విధింప బడినది— అయినను పత్రిక నడచు చుండెడిది.

1924—25 లో నీ పత్రిక అన్నపూర్ణయ్య గారిచేతను క్రొవ్విడి లింగరాజు గారి చేతను నడుపబడు చుండెడిది 1925లో సీతానగరమున గౌతమీ సత్యాగ్రహాశ్రమమువారు దీనిని ప్రచురణ చేసిరి—

---

24. ఈ యభిప్రాయము "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక—ప్రజోత్పత్తి శ్రావణ భాద్రమాస పత్రిక— (జూలై—ఆగస్టు— 1931)లో సత్రికా సంపాదకులు కీ. శే. జయంతి రామయ్య పంతులుగారు ప్రకటించినారు—

1925—29 సంవత్సరములలో—నీ పత్రికయందు—1857 వ సంవత్సరమున సిపాయిల విప్లవ చరిత్ర యేగాక—బంగాళాదేశమున, పంజాబుదేశమున—భయంకర విప్లవ కారుల చరిత్రలు లన్నియు ప్రకటితము లగు చుండెడివి—అందువలన—యువకులందరును నీ పత్రికను నత్యంతాసక్తితో చదివెడి వారు—

1929 లో—అన్నపూర్ణయ్య గారి పత్రికలో "చిచ్చరపిడుగు" అను వ్యాసము ప్రకటించిరి— అది ప్రభుత్వము వారికి పిడుగు గానే యుండెను—దీనికై అన్నపూర్ణయ్యగారు రెండున్నర సంవత్సరములు కఠిన కారాగాగార శిక్ష ననుభవించిరి—

అసహాయోద్యమ కాలమున అఖండమైన సేవచేసిన యీ పత్రిక—1932 వరకు పదు నొకండేండ్లు నడచినది—

1931 వ సంవత్సరమున—అప్పటి సంపాదకులగు క్రొవ్విడి లింగరాజుగారు "వీరబలి" అను వ్యాసము ప్రకటించిరి— ఇది, లాహోరు కుట్ర సందర్భమున నురి తీయబడిన భగత్‌సింగు, అతని యిద్దరి అనుచరులు వృత్తాంతమును వివరించునది. ప్రభుత్వమువారు లింగరాజు గారికి వ్యాసముప్రకటించినందులకు—రెండున్నర సంవత్సరములు కఠిన శిక్ష విధించిరి 1932లో ప్రభుత్వమువారు ఆశ్రమముపై దాడి చేసి సర్వస్వము చేకొనిరి. భారత వర్షమున సంపాదకులలో నెవరో ఒకరు కారాగారమున నున్నను, నక్రమముగా నడచిన పత్రికయని గౌరవము గడించినది కాంగ్రెసు పత్రిక——

## సత్యాగ్రహి

అసమాన స్వాతంత్ర్య సమర వీరులైన ఆత్మకూరి గోవిందాచార్యులవారు పత్రికను నడుపు చుండెడివారు. ప్రభుత్వ చర్యలను ఖండించుటలో, నిది పైపత్రిక కేవిధమునను తీసిపోవునదికాదు. ఆపైని గోవిందాచార్యులు గారు గొప్ప రచయితలగుటచే, నిందలి వ్యాసములు ప్రజానీకము నుద్రేకితులగా జేసెడివి. ఈ పత్రికనడుపు చున్నంత కాలము ఎప్పుడు ప్రభుత్వమువారు కారాగారమునకు పంపుదురో యని గోవిందాచార్యులవారు ప్రతిదినము నిరీక్షించు చుండెడి వారు— 1931న సంవత్సరమున— వారి స్వంతముద్రాక్షరశాల, సత్యాగ్రహి పత్రికా పరికరములు—అన్ని ప్రభుత్వము వారుస్వాధీనపరచుకొనిరి—

1922 లో ఆరక్షకశాఖ (పోలీసు) వారి లాఠీలకు గురియై శల్యావశిష్టులైన గోవిందాచార్యుల వారి చిత్రము క్రీ. శ. 1922 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో గలదు.

స్వాతంత్ర సమర మహావీరులైన గోవిందాచార్యులవారు నేడు కవితా సాహితీవీరులై, శ్రీమద్రామాయణ మహా కావ్యమును రచించి యున్నారు—గోవింద రామాయణమని—ఆకృతిపేరు ఆధునిక కావ్య సాహిత్యమున—గాంధీ గారిని గురువుగా పేర్కొని భక్తి ప్రపత్తిని దెలిపిన వారు గోవిందా చార్యులుగా రొక్కరే—

గీ. రామ భక్తుండు సత్య పరాక్రముండు
ధార్మికుడు గాని సంతత ధార్మికుండు
భారతీయ స్వరాజ్య సంపాదకుడు
గాంధి గురునెంచి మోక్షైద కరుణునగుచు

ఆనాటి కాంగ్రెసు పత్రిక ప్రతులు మనకు లభ్యము గాకున్నను గోవిందాచార్యులవారు ప్రకటించిన "సత్యాగ్రహి" పత్రికా సంపుటములు భద్రముగా నున్నవి— ఆనాటి సహాయ నిరాకరణోద్యమ చరిత్ర తెలిసికొనుటకీ పత్రిక లత్యంతసహాయమొనర్చును— గ్రంథ విస్తర భీతిచే వాని నుండి భాగము నుదాహరింప లేదు.

## మహాత్ముని ఆంధ్రదేశ పర్యటన— స్మరణీయ సంఘటనలు

మహాత్ముడు విజయవాడకు కస్తూరిబా దేవితో వచ్చినాడు. వారితో నేను, "మహాత్మునకు స్వదేశ వస్త్రములు ధరించ వారిపై గౌరవముగదా, అందువలన—మన పురములోనున్న విజాపురపు అనంత రావుగారివద్దకు తీసికొని వెళదాము" అని సూచించినాను. వారు అంగీకరించినారు.

విజాపురపు అనంతరావు సంపన్న గృహస్థుడు. మాధ్వ మతస్థుడు. ఆయన నూలు బట్ట కట్టిన విదేశ వస్త్రము ధరింపవలసె వచ్చునేమో, అని పూర్తిగ వానిని విడిచిపెట్టి, ఎల్లప్పుడు పట్టు బట్టలనే కట్టుకొనెడు వాడు. ఛ్ నందిన కృత్యమని కవియే వాడెడి వాడు. అందువలన కొంద రాయనను ఆంగ్లభాషలో సిల్కువర్మ్ (Silk Worm) పట్టు పురుగు అనెడివారు. గాంధీ మహాత్ముడు విదేశ వస్త్ర బహిష్కరోద్యమము ప్రవేశపెట్టుటకు నాలుగు దశాబ్దులముందుగానే ఆయన విదేశ వస్త్ర బహిష్కరణము గావించినాడు. ఇది విజయ నగరములో నిప్పటికి రెండు తరముల క్రిందటి వారందరకు సుపరిచితమైన విషయము.

మా కోరికపై మహాత్ముడు, కస్తూరిబాతో గూడ అనంతరావు పంతులుగారి టింకి వచ్చినాడు. అనంతరావుగారు స్ఫురద్రూపి. ఆ పట్టు బట్టలలో, ఆయన ఆకారము ఆకర్షణీయముగా నుండెను. అనంతరావు పంతులుగారి భార్య కూడ ఆయన ప్రక్కనుండెను. ఆయనను చూడగానే గాంధి మహాత్ముడా దంపతులకు పాదాభి వందనము చేసినాడు.

మహాత్ముడట్లు నమస్కరించుట మా కత్యాశ్చర్యము గలిగినది. ఏలయనగా ఆయన ఎవ్వరికి నమస్కరించినట్లుగా నంతకుముందాయను గూర్చి వ్రాసిన వారెవ్వరును వ్రాయలేదు.[25]

అనంతరావుగారు గాంధీ మహాత్ముని ఆశీర్వదించి (అప్పటికాయన గాంధీకన్న చాలా పెద్దవాడు) మహాత్ముడు అనంతరావు గారిని తన కన్న ముందుగా విదేశ వస్త్ర బహిష్కార మొనరించినందుల కెంతో సంతోషించి, ఈనాడు విదేశ వస్త్ర బహిష్కార మొనర్చినవా రున్నారని నాకు దృష్టాంతము చూపుటకు వీలైనది—అని అభినందించినాడు.

---

25. గాంధీ మహాత్ముడెన్నడును తన పాదములు నితరులను తాకనిచ్చెడివాడు కాడు. ఆయన పాదములు పట్టుకొనుటకు మేమెంతయో ప్రయత్నించితిమి. కాని ఫలించలేదు "ప్రతివారును నీ పాదములు పట్టుకొనిన నేను దేశము పర్యటించు టెట్లు" అని బోసినోటి చిరునవ్వుతో జవాబిచ్చినాడు.

అనంతరావుగారు "నేను ధనవంతుడను కాబట్టి సాధ్యమైనది. కాని సామాన్య ప్రజలకు సాధ్యము కాదు. అయినను ధనవంతులందరును విదేశ వస్త్ర బహిష్కార మొనరించిన మీ ఉద్యమము సఫలమగునని తెలిపినాడు. తన భార్యను చూపి ఆమె కూడ ఎన్నడు విదేశ వస్త్రముల నెరుగదని తనవలెనే పట్టు బట్టలనే కట్టునని చెప్పినాడు. గాంధీ దంపతులు లా దంపతులకు పునః ప్రణామము లాచరించిరి.

ఆ. వె. గాంధి యుద్యమంబుకన్న నల్పది యెండ్ల
ముందుగా స్వదేశమునను నేయు
వస్త్రములు ధరించు వాడుక చూపుచు
ఆ మహాత్ము జోత లంది కొనియె.

గీ. శ్రీవిజాపుర వంశ వారిధి సుధాంశు
డైన యా యనంతాఖ్య రాయా గ్రణియును
నతని భార్య స్వదేశీయ వ్రతము బూన
వచ్చి యాదర్శ కంబయ్యె నందరకును.

అని కవులా సందర్భమున పొగడినారు.

## వేషముతో భాష—మార్పు—హిందీ భాష

పాశ్చాత్య వేషము బహిష్కరించినట్లే పాశ్చాత్య భాషను సాధ్యమైనంతవరకు బహిష్కరింపవలసినదని గాంధీ ఆదేశము. ఆత డందులకే భారతీయులందరు నేకమగుటకు హిందీ భాష నేర్వవలయునని తన సిద్ధాంతములలో నొకటిగా ప్రకటించినాడు. ఒక శతాబ్దికి పైగా భారత దేశమున సమస్త వ్యవస్థలలోను పాతుకొనిపోయిన ఆంగ్లభాషను నొక్కసారిగ విసర్జించుటకు వీలు కాదని ఆతనికి తెలియును. కాని మనకు స్వాతంత్ర్యము వచ్చిన వెనుక మనము మన భాషలో వ్యవహరించుకొనుటకు సమర్థులము కావలెనన్న యుద్దేశముతో నాతడు భారత వర్షమున హెచ్చు ప్రజానీకము మాడుచున్న హిందీ భాష అన్ని ప్రాంతములవారును క్రమముగ నేర్చుకొనవలయునని ప్రబోధించినాడు. గాంధీ మహాత్ముడు తాను పర్యటనము చేసిన ప్రాంతములం దన్నిచోట్ల హిందీ భాషా ప్రాధాన్యమును గురించి చెప్పుచుండెడి వాడు. అట్లే విజయనగరమున విజాపురపువారి యింటివద్దకు వచ్చినప్పుడు "ఇక్కడ ఎవ్వరైన నేను హిందీ మాట్లాడిన—తిరిగి నాతో హిందీ మాట్లాడగల్గిన వారెవ్వరైన నున్నారా" అని గాంధి అడిగెను. అప్పు డచ్చటివారు, మా తండ్రిగారైన విడుదవోలు సుందరం పంతుల వారికి హిందీ వచ్చునని చెప్పగా వారిని తీసుకొనిరమ్మని మహాత్ము డాదేశించినాడు. ఆయన వచ్చి గాంధిగారితో ననర్గళముగా హిందీతో ప్రసంగించుటయేగాక హిందీ భాషా ప్రాశస్త్యమును గూర్చి నిట్లాశువుగా పద్యములను చెప్పినారు.

## హిందీ ప్రశస్తి

శా. హిందూ రాజ్యరమా సుభాషితమునై హేరాళమై యొప్పు నా
హిందీ భాషయె భారత ప్రజల నేకైకంబుగ గూర్చు నా
హిందీచేత స్వరాజ్య సిద్ధియును నెంతే పూర్ణమౌ నంచు నిం
పొందం జెప్పిన గాంధి యుద్యమము మీ రుద్యుక్తులై నిల్పుడీ

శా. మందార ప్రతిమానమైన భరత క్ష్మామండలం బందునన్
హిందూ లందరు నేక మానసముతో నేకైక కార్య క్రియా
సందోహంబుల జేయగా నెనరు భాషా సాధనం బొక్కటే
"హిందీ" యంచును గాంధి నాయకు మనోభీష్టంబు చెల్లింపుడీ!

శా. ఎందుం దేశము నందు సర్వజన మొక్కే భాష మాటాడగా
నందు గల్గెడు శాంతి భద్రతలు రాజ్యంబు సుభిక్షంబు నొ
ప్పెందుల ప్రొక్కగ సర్వ సంపదలు నాపెం గాంచగా జేయు నీ
"హిందీ" యంచును గాంధి వాక్యమును నేకైకంబు పాలింపుడీ.

## మహాత్ముని మధుర గానము

మహాత్మ గాంధీ ఆంధ్ర పర్యటనలో స్మరణీయమైన ఘట్టము లెన్నో యున్నవి. వానిలో నింతవరకు గాంధీ మహాత్ముని చరిత్ర కెక్కని యొక అపూర్వ సంఘటనము నిందు వివరించు చున్నాను.

మహాత్ముడు తూర్పు గోదావరీ మండలమున పర్యటన చేయు కాలమున— తునియందు శ్రీ రాజా మీర్జా వత్సవరాజా అచ్యుత రామరాజా బహద్దరువారు పురపాలక సంఘాధ్యక్షులుగా నుండెడి వారు. వారు మహాత్ముని సగౌరవముగా తమ భవనమున కాహ్వానించిరి. భక్తితో పాద పూజచేసి, గాంధీకి ఆ కాలమున అనగా అక్టోబరు నెలలో అతి మధురమైన మామిడిపండ్లను రెండింటి నర్పించిరి.

అచ్యుత రామరాజుగారు పూర్వ క్షత్రియ తేజము మూర్తీభవించినట్లుండెడి వారు. మెలిబెట్టి విడిచిన మీసకట్టుతో, మేదుర స్నిగ్ధ ముఖ మండలముతో, ఆజాను బాహువులతో, రాజాగారు ఫలము లర్పించునపుడు పదహారు వన్నె బంగారువలె, మెరసిపోవుచున్నవారి శరీర చ్ఛాయ—మహాత్ముని అయస్కాంతమువలె నాకర్షించెను. కమనీయమగు దేహకాంతియేగాక కట్టిన పీతాంబరము, బరంపురము చేనేత పట్టు వస్త్రమగుటచేత మహా విస్మృతవలెనున్న ఆతని యాకార సౌష్ఠవము స్ఫురద్రూపము. మహాత్ముని దృష్టి, యితరములైన వానిమీద మరల్పలేక పోయినది. రాజాగారియందే లగ్నమైనది.

వీణా వాదన నిపుణులగు రాజాగారు వీణ వాయించుచుండిరి. మహాత్ముడు తానంతకు ముందెన్నడు ననుభవించని, ఒక దివ్యానందానుభూతి ననుభవించెను—ఆ తన్మయత్వమున మహాత్ము డిట్లు గానము చేసెను.

> Your sweet and lovely gift bespeaks
> Your jairness of body and soul
> How long will you keep me from
> My work with your sweet music.

గాంధి మహాత్మునికి ప్రతి క్షణము విలువయైనది. అచ్యుత రామరాజుగారి సమాగమమున నాతడు, తన కాల వ్యవధిని కొంతసేపు మరచినను, తత్ క్షణమే స్మృతికి దెచ్చుకొని పై రీతిగా తన హృదయ భావమును వెలువరించెను. ఇట్టి సన్నివేశము భారత వర్షమున మరి యెచ్చటను జరుగక, తెలుగు దేశమున జరుగుట ఆంధ్రదేశము చేసికొన్న యదృష్టము.[26]

గాంధీ—అచ్యుత రామరాజ సమాగమము కవి పండితుల సమక్షమునవే జరిగినది. వారును రాజాగారు మహాత్ముని కొసగిన మధుర

---

26. ఈ యాంధ్ర దేశ సంఘటలన్నియు గాంధీమహాత్ముని జీవితములోని కెక్కలేదు.

మాతాజీపటేలవారి మాహాత్మ్యమునుగల కవితలోని సన్నివేశములు వర్ణించిరి. వాని నుదాహరించుచున్నాను.

## 1

తుని సంస్థానాస్థాన కవులును, కవిరాజులునైన శ్రీ వత్సవాయి వేంకట నీలాద్రిరాజుగారు

క. మీ యిచ్చు మధుర రుచిరో
పాయన మిదె చెప్పుచున్న యది రమణీయ
ప్రాయావరణంబగు భవ
దీయ శరీరాత్మ దీధితి స్ఫురణంబున్

ఆ. వె ఎంత దాక మమ్ము నిటు లయ్యనయ్యె నా
ముద్దు పలుకు లోప ముంచివైచి
మాదు పనుల నెల్ల మరపించి వైవెద
రసియొ గాంధి యచ్యుతాప నింద్రు

## 2

విద్వత్కవులు, శతావధానులు ఆవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

క. మీ రొసగిన ఫలములు క
న్నారంగా జూచి వాని యందంబున విం
పారెడు మదితో గాంధి కృ
పా రసము వెలార్చ ఎల్కు పాలు మొలయున్.

క. చూపిన దెల్లన్ ప్రియముగ
దోచుట విజ్ఞాని ప్రేమతో జగమెల్లన్
జూచును గాంధి మహాత్ముడు
చూచెన్ మీ ఫలము లట్టి చూపు వెలయగన్

క. తరువాత మీ శరీర
స్ఫురణంబు మహాత్మునకు ప్రమోదం బొసగెన్
సరసులకు సరసమౌ వి
స్ఫురణము గుర్తించు నెరుపు సహజ మగుటన్

క. ఆకృతి కవ్విధి చారిగ
నే కల్యాణమగు ప్రకృతి దృశ్యంబగు నీ
మీ కాంతిమయంబైన శు
భాకారము గాంచి గాంధి యలరె మనమునన్

గీ. అంత మీ యాత్మ పరిశుద్ధ్యంబు నందు
దగిలె గాంధి మహాత్ముని దర్శనంబు
చొక్కగాదె శుద్ధాత్మను జూచి శుద్ధ
హృదయులౌ వారి యాత్మ విన్నేతుకముగ

క వాద బ్రహ్మానంది
ప్రాదుర్భావంబు నిచ్చు బ్రాహ్మణికి గూ
పాది విషయములఁ బోలక
నాదంబు సమాధి సాధనం బగు కతనన్

సీ. అద్భుతంబగు మీ గానామృతంబు
హర్ష మొసగెడు గాంధి మహాత్మునకిక
బరవశుండయి వానిచే బల్కె నతడు
ఎంత సేపున్నవిన్నట్టిద వినక మనుచు

మ. పరిశుద్ధాత్మ విలాస భాసురములై బ్రహ్మైక బోధ ప్రమో
ద రసంబుల్ ప్రవహించు జ్ఞాన నది నిత్యం గొట్టు విజ్ఞాని నీ
వరి శుద్ధాత్ముల వేష భాషల మదిం భావించుచున్ జొక్కు టి
బ్బురమే? చంద్రుడు చంద్రకాంతమణులన్ బొంగింపడే
కాంతులన్

శా. తౌల్యము మాని ప్రాశ్నత బలంబున సర్వ సమత్వదృష్టి ప్రా
బల్యము గాంచ సంతత తపశ్చరణాదర బుద్ధి జన్మ సా
ఫల్యముగన్న సాత్వికుడు, పావనుడొక భవమ్ము భాత్మ వై
ర్మల్య కళల్ మహాత్మునకు మానస తృప్తి ఘటించె నెంతయున్

## 3

తుని ఆస్థాన వైద్యులు, డాక్టరు రాఘవాచారిగారు.

ఉ మించిన ప్రీతి నీ గతి నమేయ వచోనిధి గాంధి నేత యా
ఖ్యాంచిత రూప శీల నిధివాఢ్యుని అచ్యుత రామరాజునున్
గాంచి, విచిత్రమౌ నపుడు డకాల రసాల ఫలార్పణంబు గా
వించిన కేలనందుకొను వేళ గనెన్ సమయోచితంబుగన్

గీ. మంజు రమ్య భవద్భావమతియు నీదు
మహిత బహిరంత రంగ రూపమును జాల
నెంత దనుకను బనికిఁ బోనీకఁ నన్ను
దావ కాలాన సుధచేతఁ దడియఁ జేతు

వింజమూరి శివ రామారాయకవి—రాజుగారి నిట్లు కీర్తించెను.

క. సుల్లలిత రామాన్వయ వ
త్సల్లీ సుమరాజ సకల భాషాయోషా
సల్లలిత కేశ భాసుర
మల్లీసుమ రాజకీర్తి మత్ పృథు తేజా.

## గాంధ్యష్టోత్తర శతనామస్తోత్రము

సహాయ నిరాకరణోద్యమమున వ్యాప్తిలోనున్న కాలములోనే—భారత వర్షమున—గాంధీ మహాత్ము డవతార పురుషుడుగా భావింపబడి నాడు. యోగ విద్యా విదు లాతడు మహా యోగియనియు, ఆధ్యాత్మిక యోగ శక్తివలననె ఆతడీ భారత స్వాతంత్ర్యమును సాధించె ననియు ప్రకటించిరి. ఆతడు శ్రీకృష్ణుని యవతారముగా ప్రజలు భావించిరి ఈ గాంధ్యష్టోత్తర శత నామ స్తోత్ర మాత డవతార పురుషుడన్నది ధ్రువపరచును.

నిజలింగప్ప ఉవాచ —
దేవి సాధ్వి మహాభాగె ప్రసీదమయి భారతి
కింకర్తవ్య విమూఢం మాం దేశ మాత ప్రబోధయం
కాంగ్రెసేఽపి విభేదశ్చ కమ్యూనిష్ట గణాద్భయం
స్వతంత్ర జన సంఘాది సంత్రాస కే నవార్యతే
ఏక చ్ఛత్రాధి పత్యంచ కాంగ్రెస్ సస్య కథం భవేత్?"

భారత మాతో వాచ.—
సాధు సాధు సుపుత్రస్త్వం యతో మాం పరి పృచ్ఛసి
గాంధే రష్టోత్తర శతే నామ దృశీ శక్తి రస్తిహి
శృణుతం నిశ్చలమనా యేన సిద్ధిమవాప్స్యసి

అస్య శ్రీ గాంధ్యష్టోత్తర శత నామ స్తోత్రమహా

మంత్రస్య. భారద్వాజో ఋషిః. అనుష్టుప్ ఛందః. మోహన దాసో దేవతా విమోహశ్చేతి పరమో మంత్ర. సామోపాయ ఇతి కీలకం సత్యాగ్రహీ త్యస్త్రం సర్వ త్యాగీతి నేత్రం కవి ఇతి కవచం. దండీతి యోని.. ఉప వాసీతి దిగ్బంధః

శ్లో. వందే గాంధిమనంత ధైర్య సహితం సుస్థూల శాటీవృతం
హస్తే దండధరం ముఖే తిలకినం తం చోప నేత్రాంచితం
కట్యాం శృంఖ లితం ఘటీ ప్రకటకం యంత్రం ధరంతం స్థితం
వారీ డాంగ్ర మమోఘ వీర్య మమలం శ్రీ భారతోద్ధారకం

ఆజాను లంబి బాహుం
ఆజాన పవిత్ర హృదయ మతి శుద్ధ
ఆజాను శాటికం తం
వందే గాంధిం దయా పరీవాహం

## అష్టోత్తర శతనామావళి

గాంధిః కస్తూరి బా ధీశ మహాత్మ పుత్లి సుతః
మోహనదాస కరంచంద్ర సుత పోర్బంద రోద్భవః
సత్యాగ్రహీ సత్యనిష్ఠో హింసావ్రత పరాయణః
శాంతశ్చ ధర్మ నిరతో బ్రహ్మచారీచ నిర్మమః
గీతా ధ్యగ స్సర్వమత స్సబర్మత్యాశ్రమార్చితః
విదేశ వస్తు విద్వేషీ స్వదేశీ యార్థ సమ్మత
లవణోత్పాదకో జాత శత్రుశ్చ విరహం క్రియః
సర్వ త్యాగీ రామనామ పరః వైష్ణవ సేవక
ఆత్మ దర్శ్యాత్మ విశ్వాసి లోకపూజ్యశ్చ భిక్షుకః
కారవాసీ కుటీవాసీ చైకవాసా అకోపన
విమోహశ్చ విశోకశ్చ విద్వేష· వచనే స్థితః
మిత భాషీ గభీరాత్మా భారతీయ పితామహః
సత్సంగశ్చ సదాచారః విరక్తో దీన రక్షకః
అస్పృశ్యతా కుఠారశ్చ—స్వతంత్రః హిత వర్ధనః
యోగీ హరిజనోద్ధర్తా ఆజాను బాహు జితేంద్రియః
దండీచ దండి విజయీ యోద్ధా యోద్ధ్యస్సమో బలి
సామోపాయ స్సామ్యవాదీ జిత శత్రు ర్దయామయః
దాంత స్త్యాగీ సర్వ శక్తి· వానప్రస్థో దృఢాత్మకః
మేష క్షీర మూల చరణ భక్తి గోపూజనే రతః
జ్ఞానీ ఘూర్జర రజో భక్తః గీతార్థ పరిశీలకః
కృశో గీతాను సారీచ నిగర్వ· కార్యసాధక
ఉపవాసీ సదాహాసీ కీర్తి శాలీ జితశ్రమః
ఆర్త రక్షో మూర్త ధర్మ జైత్ర భారత రక్షకః
భారత స్వసు పుత్రశ్చ మాయీ సత్యాగ్రహో యుధః
కలిజ శాంతి కవచ సూత్ర యజ్ఞ ప్రియః. సఖా
చక్ర వ్రత సూత్ర పూజ్యః చక్రవర్తి హరే స్సమః
నిర్ధంత శ్చాపి దుర్దాంత ముసల్మానాను రంజనః
న్యాయ వాద్య న్యాయ హర్తా నిత్య తుష్టో నరోత్తమః
దేశార్థ దేహ త్యాగీచ రామ రామేతి భాషణః
అమరశ్చాతి బుద్ధశ్చ సత్యానంద చిదాత్మకః

ఇతి గాంధేర్మహాసత్వ శాలి నోష్టోత్తరం శతం
నామ్నాం గుహ్యం వినిర్దిష్టం విభేద వినివారణం
దేశభక్తి ప్రదం ఐక్యకరం సర్వ ప్రజాహితం
భావైక్య సాధకం భేద భావ నిర్మూల నాయుధం
ఓం నమః పదయోర్మధ్యే చతుర్థ్యంతం పదం న్యసేత్
ప్రతి నామార్చయే త్సూత్ర పుంజం భక్త్య మహాత్మనః
నివేదయేత్ క్షీర మూల చణ బీజాని భక్తిత
పఠే వైష్ణవ ఇత్యాది గీతం శ్రావ్య తయా పురః
అంతే కర్పూర నీరాజనా వర్తన మథార్పయేత్
అథవ పూజనా శక్తో స్తోత్ర పారాయణం హితం
ప్రజా వశ్యకరం దివ్యం రాజకీయ జయప్రదం

ఇతి నవ భారతే—అహమ్మదా పర్యాంతర్గత సభా పర్వణి ప్రథా
మాధ్యాయః

## గాంధి అష్టోత్తర శతము

గాంధిః
కస్తూరిబాధీశః
మహాత్మ·
పుత్లీసుతః
మోహన్దాసః
కరంచంద్ర సుతః
పోర్బందరోద్భవః
సత్యాగ్రహీ
సత్యనిష్ఠః
అహింసావ్రత పరాయణః
శాంత
ధర్మ నిరతః
బ్రహ్మచారీ
నిర్మమః
గీతాధ్యగః
సర్వమతః
సబర్మత్యాశ్రమార్చితః
విదేశ వస్తు విద్వేషీ
స్వదేశీ యార్థ సమ్మతః
లవణోత్పాదకః
అజాత శత్రుః
విరహం క్రియః
సర్వత్యాగీ
రామ నామపరః
వైష్ణవ సేవకః
ఆత్మదర్శీ
ఆత్మ విశ్వాసీ
లోకపూజ్యః
భిక్షుకః
కారవాసీ
కుటీవాసీ
చైకవాసః
అకోపనః
విమోహః
విశోకః
విద్వేషః
వచనే స్థితః
మితభాషీ
గభీరాత్మః
భారతీయ పితామహః
సత్సంగః
సదాచారః
విరక్తోక్షః
దీనరక్షకః
అస్పృశ్యతాకుఠారః
స్వతంత్రః
హితవర్ధనః
యోగీ.
హరిజనోద్ధర్తా
ఆజానుబాహుః
జితేంద్రియః
దండి
దండి విజయీ
యోధః
అయోధః
సమబలిః
సామోపాయః
సామ్యవాదీ
జితశత్రుః
దయామయః

దాంతః భారత సుపుత్రః
త్యాగీ మాంయీ
సర్వశక్తః సత్యాగ్రహాయుధః
వానప్రస్థః కవిజ
దృఢాత్మకః శాంతి కవచః
మేషక గి సూత్రయజ్ఞ ప్రియః
మాతృచరణ భక్తి సఖ
గోపూజనేరతః చక్రవర్తి
జ్ఞాని సూత్రపూజ్యః
పూర్వరజః చక్రవర్తి
భిక్షు హరేస్మః
గీతార పరిశీలకః నిర్గంతః
కృశ దుర్గాంతః
గీతానుసారీ ముసల్మానాను రంజనః
నిగర్వ న్యాయవాది
కార్యసాధకః అన్యాయ హర్తా
ఉపవాసి నిత్యతుష్టః
సదాహాసి సర్వోత్తమః
కీర్తిశాలి దేశార దేహత్యాగి
జితశ్రమః రామ రామేతి భాషణః
ఆర్తరక్షః అమర
మూరధర్మః బుద్ధః
జైత్ర సత్యానందః
భారత రక్షకః చిదాత్మక

ఇది మైసూరునుండి వెలువడు "గైర్వాణి" అను సంస్కృత మాస పత్రిక 15—1—1970 తేదీని ప్రకటిత మైనది కవి పేర తెలియదు. ఇందు నిజలింగప్ప ప్రశంస యుండుటవలన ఆయన దేశీయ మహాజన సభాధ్యక్ష పదవి సందర్భమున రచితమైనట్లు కన్పట్టుచున్నది.

## ఫ ల శ్రు తి

సీ. నాగేశ్వరుని కాశి నాథాన్వయాఖ్యు దే
శోద్ధారకుని కర్మయోగి నెంచి
బ్రాహ్మణ వ్యాఖ్యాత బనియను సూత్రధా
రుని కన్న సటాభి ఘనత మెచ్చి
గుండె చూసి "తుపాకి గుండు" పేల్చు డటన్న
ఆంధ్ర కేసరి ప్రకాశాఖ్యు దలచి
ఆంధ్ర రాష్ట్రావతరాప్తికి ప్రాణంబు
లర్పించు పొట్టి శ్రీరాము దెలిసి

గీ. ఆంధ్ర దేశ చరిత్ర స్వర్ణాక్షరముల
నక్షరులు గాగవెల్గెడు నట్టివారి
నీ మహానాయకులను నీ రేకమతిని
ననవరతమును వర్ణింపు డాంధ్రులార!

## స్వ రా జ్యో ప ని ష త్తు

ఉ. దీపిత భారతీయ జగతీ తల దాస్యవిమోచనైక దీ
క్షాపరతంత్రుడైన మన గాంధి మహాత్ముడు దెల్పిన "స్వరా
జ్యోపనిషత్తు" నం గలుగుమున్నత ధర్మపథంబె నిత్యమున్
ప్రాపగు నంచు లోకముకు పాఠము నేర్పెడు భారతప్రజల్.

గాంధీ మార్గము.

శా. అంధప్రక్రియనున్నవారలకు ప్రజ్ఞోదయుండు విజ్ఞాన సౌ
గంధంబున్ ప్రసరింపజేయు గతి నీ కాలంబునన్ దేశ దా
స్యాంధం బింక స్వరాజ్య భాను కిరణావాప్తి న్వెలిగించు నా
"గాంధిమార్గమె" విశ్వశాంతి జనతా కల్యాణదం బయ్యెడిన్.

గాంధీ సాహిత్యము

శా. బంధంబుల్ విడగా స్వరాజ్యమును సంపాదింప, ప్రాక్పశ్చిమా
బాంధవ్యంబును బెంప విశ్వహిత సౌభ్రాత్రంబు నిండారగా
సంధానింప జగత్త్రయంబున కహింసా శాంతి సిద్ధాంతముల్
"గాంధీసాహితి" సర్వలోక జనతా కామార్థి యై మించుతన్.

— జైహింద్ —

అనుబంధము—1.

తిలకు నిర్యాణము 1—8—1920.

గీ. చటుల తర సత్ప్రభాకర పటలి చేత
భారతీయాబ్జ వికసన పటిమ బెంచి
అస్తమించెను లోకమాన్యతను నించి
బాలగంగాధరాహ్వయ భానుమూర్తి.

[తిలకు—అనునది యింటిపేరు— బాలగంగాధరుడని— అతని పేరు "బాలో గంగాధరశ్చాహం తిలకాన్వయజో ద్విజ" అని గీతారహస్యమున ఆయన తెలిపినాడు—మహారాష్ట్రులకింటి పేరు చివరనుండును— తెలుగువారికి మొదటనుండును.

ఉ. తీరని దుఃఖవారినిధి దేశము దేల్నెడమున్నియుండ, నే
దారిని మాకు జూపితని ధైర్యము దక్కగ నాయకాళి యే
తీరున నాకు నీకొరత దీరెడునంచును గుందుచుండ నా
భారతమాత శ్రీ తిలకు బాయగజేసితి వేల దైవమా.

సీ. దేశాభిమానంబు దీపింపజేయుట
కెపుడు చింతించు వా రెవ్వరమ్మ!
మాతనోజ్జీవంబ మానంబుగా జేయ
నీరీతి నుండు వా రెవ్వరమ్మ!
భవదీయ సేవకై ప్రాణంబు నైనను
నియంగనుండు వా రెవ్వరమ్మ!
కార్యసాధనయందు కష్ట సుఖంబుల
నెవరింక సమముగా నెంతురమ్మ!

గీ. భారతీయ స్వరాజ్య సంపాదనమున
కెల్లపుడు పాటుపడెడి వా రెవ్వరమ్మ!
దేశభక్తుండు భాసుర ధీయుతుండు—
బాలగంగాధరుడు గాక భారతాంబ.

సీ. కారాగృహప్రాప్తి కడు దుర్భరంబని
  యెంచెనే తనకు విధించినపుడు
పతి వియోగంబ దుస్సహ బాధ యని మది
  కలగెనె తనకది కలిగినపుడు
దీనంబు తన ప్రభుత్వోద్యోగులెం దున
  దలఁచెనే దండన దలఁచు నపుడు
అతి కష్టతతి తాను నావహించిన నెను
  దీసెనే తన విధి దీర్చునపుడు

గీ. దేశ సేవా ధురంధర దివ్య పటిమ
వెలుగు దెచ్చితి జాతీయ విధులకును
మాతృదేశాభిమాన సమగ్రమూర్తి!
దేశ నాయక వరకుల తిలక! తిలక!

సీ. గీతా రహస్యంబు గిర్తించి హైందవ
  ప్రభల వెల్లడలను బరపినాఁడు
భారత జాతీయ భావ్యత్వభావంబు
  దేశదేశంబులఁ దెల్పినాఁడు
ధృతిచేత సత్కృతారతి చేత లోక మా
  న్యత చేత నెల్లెడ నలరినాఁడు
స్వారాజ్య స్వాతంత్ర్య సంపాదన మె జన్మ
  సార్థకత్వంబని చాటినాఁడు

గీ. బాలగంగాధరుఁడు నేఁడు బాసె భువిని
విదిత యశమును మాత్రము విడిచిపెట్టి
భారతీయుల మానస ఫలకములను
తిలకు నామాక్షరంబులు నిలుచు గాత.

(కృష్ణా పత్రిక 6—8—1920)

## రాజకీయ నాటకములు—నాటికలు

(1921 నుండి)

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆగస్టు 15 | సుంకర సత్యనారాయణ | నాటిక | 1953 |
| 2 | ఆలీ ప్రభృతుల నిర్బంధము | జంధ్యాల శివయ్యశాస్త్రి | నాటకము | 1921 |
| 3 | ఇదా స్వరాజ్యం | ఎస్.టి.సుదర్శనాచార్య | ,, | 1951 |
| 4 | ఇదా స్వాతంత్ర్యం | పడాల రామారావు | ,, | 1953 |
| 5 | ఓట్ల ప్రహసనము | దామరాజు పుండరీకాక్షుడు | ప్రహసనము | 1930 |
| 6 | కమల్ పాషా | ,, | నాటకము | 1923 |
| 7 | కాంగ్రెసువాలా | దువ్వూరి రామిరెడ్డి | నాటిక | 1935 |
| 8 | కాంగ్రెసు విజయము | జాస్తి వెంకటనరసయ్య, డి.వి.సుబ్రహ్మణ్యము | నాటకము | 1946 |
| 9 | క్విట్ ఇండియా | దామరాజు పుండరీకాక్షుడు | నాటకము | 1942 |
| 10. | క్విట్ ఇండియా విప్లవము. | ప్రత్తిపాడుపు రాఘవ రాజు | ,, | 1943 |
| 11 | గాంధీవిజయ ధ్వజ నాటకము | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | ,, | 1924 |
| 12 | గాంధీ విజయము | దామరాజు పుండరీకాక్షుడు | ,, | 1922 |
| 13 | గాంధేయ విజయము. | ఎడ్లపల్లి కోటయ్య | ,, | 1946 |
| 14. | చిచ్చుర పిడుగు | మరుద్వారి అన్నపూర్ణయ్య | ,, | 1922 |
| 15 | జన్మభూమి. | ముద్దా విశ్వనాథము | నాటిక | 1932 |
| 16 | ,, | కాజ రాధాకృష్ణశాస్త్రి | నాటకము | 1946 |
| 17 | జన్మహక్కు | టెంపో | ,, | 1959 |
| 18 | ,, | తాతా జగన్నాథరావు | నాటిక | 1953 |
| 19 | ఝాన్సీరాణి | ప్రత్తికొడువు రాఘవ రాజు | నాటకము | 1948 |
| 20 | ,, | కాజ రాధాకృష్ణశాస్త్రి | ,, | 1949 |
| 21 | తిలకు మహారాజ నాటకము | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | ,, | 1924 |
| 22 | తిలకు రాయబారము | సోమరాజు రామానుజ రావు | ,, | 1921 |
| 23 | దేశం కోసం | ఎమ్.ఆర్.లక్ష్మి | నాటిక | 1922 |
| 24 | దేశదాసు | పాతూరి రామకోటయ్య | నాటకము | 1939 |
| 25 | దేశదాసు | రాయసం వెంకట రమణయ్య | ,, | —— |
| 26 | దేశద్రోహం | చిల్కర భావనారాయణ | ,, | అను |
| 27 | దేశద్రోహి | అట్లూరి వేంకట కృష్ణయ్య | ,, | 1953 |
| 28 | దేశభక్తి | వనం శంకర శర్మ | ,, | 1940 |
| 29 | నవభారత్ | రాయసం వెంకట రమణయ్య. | ,, | 1944 |
| 30. | నవయుగం | పన్నెకూటి బాల సుందరం | ,, | 1950 |
| 31. | నాదేశం | పులిపాక రామచంద్ర కాశ్యప | ,, | 1947 |
| 32 | నా భూమి | కవిశ్రీ | ,, | 1955 |
| 33. | నిలువీత | దామరాజు పుండరీకాక్షుడు | ,, | 1923 |
| 34 | పాంచాలపరాభవము | ,, | ,, | 1921 |
| 35 | ప్రజలకోసం | ఓం. పో. | నాటిక | 1956 |
| 36. | ప్రజా రాజ్యము | జాస్తి వెంకటనర్సయ్య | నాటకము | 1947 |
| 37. | ప్రజా విజయము | నవకుమార్ | ,, | 1947 |
| 38. | ప్రజా విరోధి | విద్వాన్ విశ్వం | ,, | 1948 |
| 39 | భారత సందేశము | కవికొండల వెంకటరావు | ,, | 1938 |
| 40. | మాతృదాస్య విమోచనము | బుద్ధవరపు పట్టాభి రామయ్య. | ,, | 1924 |
| 41 | ముందడుగు | వాసిరెడ్డి, సుంకర | ,, | 1945 |
| 42 | శాంతి సందేశము | సత్యదుర్గేశ్వరకవులు | ,, | 1940 |
| 43. | సంస్కారిణి | దామరాజు పుండరీకాక్షుడు | ,, | 1929 |

| | | | | |
|---|---|---|---|---|
| 44 | సత్యాగ్రహి | గాలి బాలసుందరరావు | ,, | అము |
| 45 | స్వరాజ్యం | భమిడిపాటి రాధాకృష్ణ | నాటిక | 1956 |
| 46 | స్వరాజ్య ధ్వజము | డి. సీతారామయ్య | నాటకము | 1921 |
| 47 | స్వరాజ్య భారతము | టి. సూర్యనారాయణ | ,, | 1948 |
| 48 | స్వరాజ్య మహోదయ | దామరాజు పుండరీకాక్షుడు | ,, | 1947 |
| 49. | స్వరాజ్య సాధనము | పులిజాల వెంకటప్పారావు | ,, | 1949 |
| 50. | స్వరాజ్యోదయము | శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి | ,, | 1949 |

## గాంధీ మహాత్ముడు

సీ. అభ్రచుంబిత శిరోదగ్రంబు లగుపూర్వ
పశ్చిమోత్తర గిరి ప్రతతిచేత
మధుర నిర్మల పయఃప్రథితంబు లౌచు సం
తతముగా బ్రవహించు నదులచేతఁ
దరు లతాగుల్మకందన వౌషధీని ధా
నములచేఁ దగు కాననముల చేత
సంపూర్ణ సర్వ సస్య ప్రశస్యములైన
కమనీయ భూమి భాగముల చేత

తే. మప్పుతోఁ దొమ్మిదింటి కింకొకప్రదేశ
మునకుఁ బోకుండ సంసారమును భరించి
శూరులును పండితులు నగు సుతులఁ గన్న
తల్లులకు దల్లి భరత మాతకు జయంబు

వందేమాతర మార్యచుంబిత పదా మాసేతు శీతాచల
ప్రఖ్యాతాం కమనీయ శైల విపిన స్వాదూదక ప్రోదిమీం
నైక స్వాదిమ పూర పూరిత ఫలక్ష్మీరుట్పమేతో ర్వరాం
వాహాభూషిత భూషితాంచ విదుషీం వీరప్రసూ మీశ్వరాం.

తే. అతఁ డవధూత మార్గమ్ము ననుకరించు
నదియె బోధించు నితరుల కలవి యగునె
నేస్తులకు దాని తత్త్వము కేవల మొక
గాంధికే చెల్లె నాతఁడే కాలపు ఋషి.

ఉ. పోతుకపోయి దేశమును పట్టి పలార్చు విదేశ పాలకుల్
నేతల నీతులం గరపి నెమ్మదిగా దొలగించి పట్టి యా
చాతురి కెంత మెచ్చిన రసజ్ఞకు ద్రుప్తిజనింప దిట్టి వి
ఖ్యాతులు మున్నుపుట్టరు యుగంబులవెన్నిట నెన్నిచూచినన్.

గీ. అతని భుక్తియు మరియు పల్లతని శక్తి
అతని భక్తియు మరియుఁ నల్లతని శక్తి
అతని ముక్తియు నేమ లోకాతిశాయి
అతని చరితం బితరులకు నందబోదు.

ఉ. ఆస్తికుఁడయ్యు గాంధి ఋషి నాస్తికుభంగిని ద్రోచుచుండు చే
దస్తము లేని యాతని యుదారత దుర్గ్రహ మమ్మనీషి వి
ధ్వస్త సమస్త భిన్నమత వర్తనుఁ డాయన తత్త్వమున్ యథా
వస్తుక మౌనటుల్ దెలియు వారలు మృగ్యులెరుంగఁ జెప్పితిన్.

క. చండాలుం డేనియు బా
పండేనియు గురుఁడటంచుఁ బల్కిన ధీమం
తుం డల శంకరు నట్టిఁ డ
ఖండుఁడు గాంధియన నొరులు గారతని సముల్.

ఉ. గాంధిమహాత్ముకుండనఁగ గారణజన్ముఁడు, తన్మనంబు దు
ర్గంధుల పట్లఁ బూర్తి విముఖంబని లోకమెరుంగునా కృపా
సింధుడు వంగదేశము వశించుట కెంత కృశించి సాక్కెనో
అంధ మనస్కులౌ మొరకులారయ నేర్తురె గోపలాశనుల్.

గీ. ఎందరో వచ్చి రెందరో కృష్ణదేవుఁ
డవతరించిన పురుటింటన గడు గుడిచి
రక్కటమున స్వరాజ్యము లాంగిలేయు
లిడక తప్పనివిధి యరుయ యిచ్చినారు.

శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

## విజ్ఞప్తి

ఇంకను నెన్నో విషయము లిందు చేర్పదగి యున్నను గ్రంథ విస్తర భీతిని విరమించితిని— స్థలాంతరమున కాలాంతరమున విపులముగా దెలుపుదును.

## జ్ఞాపిక

[ఆధునిక యుగము గాంధీ సాహిత్యము అను వ్యాసములలో మొదటి దానిని భారతి ఫిబ్రవరి— మార్చి (1973) లో ప్రచురించి యున్నాము. ఇప్పుడీ రెండవ వ్యాసమును నీ సంవత్సరాది సంచికలో ప్రకటించి దీనిని పూర్తి చేసితిమని పాఠక లోకమునకు విన్నవించు చున్నాము

సంపాదకుడు.

# వలయం నుండి వలయంలోకి

శ్రీ మాదిరాజు రంగారావు

కాలాంశానికీ
కాలాంశానికీ మధ్య
స్థల బిందువుకూ
స్థల బిందువుకూ మధ్య
శక్తి! శక్తి! మహాశక్తి!
శక్తి గతులూ, రూపాలూ.

ఘర్షణ విరామం, సంఘర్షణతో
సృష్టి, విలయమూ—పునస్సృష్టి.

పై కెగసి దూసుకపోతూంది
స్పుట్నిక్ వలె మనస్సు.
మరో వలయంలోకి
మరో లోకంలోకి.

ప్రయాణిస్తున్నా మోసలగా
వహిస్తూనే జీవన భారం,
నైశ్చల్యం రూపుకట్టిన సీమలు దాటి
నీరవం నిండిన గాలి పొరలు చీల్చి.

కంటికి కన్పించే ఆవర్తం
వినిపిస్తోంది వూహలో సంగీతం.
మనసులో సాగే ఆలోచన
పొందుతూంది సంవర్త రూపం,

ముఖమెత్తి చూస్తే అప్పైన
తెరచిన మెలకువ తలుపులు.
ఓంకార నాద సుందరమై
దూర దూరంనుండి పిలుపులు!

లుప్తమయ్యే శక్తి స్థానంలో
నిండుతూంది శక్తి వెంటనే.
నా గతితమైన అనుభవం
పొందుతూంది ఆకారం.

అవధి లేని శాంతిని వహించినా
అనంతమైన కదలికకు
లేదు క్షణమైనా విరామం
ఉంది చైతన్యం, నిరంతరం.

కళ్ళు విప్పిన తలపులతో
ఉదయాకాశం వలె ఉంది మనస్సు,
అంతరాంతర భూమికల్లోని
తలుపులు తెరచుకున్నాయి
విచిత్ర తేజః ప్రసారంతో
సువర్ణ సుందరమైన ఆశ.

చీకటిని హ్లాదపరచే
చంద్రుని వంట ఎదతో
రాత్రిని కరగించే
సూర్యుని వంట మతితో,
పైరు ఎదలోని ఆశతో
ఎదిగి మతిలోని కలతో
జలధిలోని ఉద్రేకంతో
సరస్సులోని సహనంతో
పయనిస్తున్నా పగలూ రాత్రీ.

వస్తువునూ మనసునూ కలిపే
తేజస్సూత్ర పంక్తిలో
బిందువునై కళనై
వెలుగ నడవనై.

అవనీఫాలభాగాన
తరంగాల ముడతల్లో
దాగిన అదృష్ట సీమలు
దృష్టమవు తున్నాయి.

ఇదొక దీర్ఘమైన ప్రయాణం
తెలీ దెప్పు డెక్కడ తేలేదీ
తీరాల పరిచయ మౌతున్నాయి
తరంగాలు వచ్చి పోతున్నాయి.
ఏదో మహా సందేశంతో
రానున్న మరో ఉదయం
దిద్దుకుంటూంది మౌనంగా
నవ కృతికి రేఖలు.

## 2

అనుక్షణమూ శరీరంలో
అణు వణువునా లక్షలాది
న్యూట్రాన్ల పరిక్రమణం వలె
పగలూ రాత్రీ మనస్సులో
జీవన రహస్సూత్ర చలనం
నీరూ నిప్పూ గాలి ధూళి
మనిషీ పశువూ పక్షీ పామూ
అంతటా ఏకోన్ముఖమైన
ఆత్మశక్తి నిండిన తేజం.

కాలం సాగిన మొదటి రేఖ
ఊహ మొదలైన తొలి రూపం
నా వెనుకనే నిలిచి ఉంది
నాలోనే దాగి ఉంది.

నేను నిలిచిన చోటునుండి
దూసుక పోతున్నాయి రేఖలు

అణు వణువునా ఉత్తరిస్తూ
అంతలో పొందుతూ రూపాలు.

ఇక్కడ వస్తు రూపం
ఆత్మకు సన్నిహితం
ఇక్కడి సౌందర్యశక్తి
శిల్పం ఒదిగిన అనుభవం.

ప్రవేశిస్తూంటే ఈ వలయంలోకి,
నదిస్తూ ఆనందం నరాల్లో
ఆవహిస్తూ శక్తి బ్రతుకును
ప్రభవిస్తూంది అమృతలోకం మనసులో.

ఈ క్షేత్రంలోకి ప్రవేశిస్తూంటే
పొందుతూంది క్షణ క్షణం పూర్ణ
అణు వణువునా అన్వేషణ
అన్వేషణలో అనుభవ తేజం!

కాలపు అంచుల్లో నిలచిన
నిదురలో సవ్వడి లేని క్రియ కూ
జడంలో ప్రాణంలేని స్థితికీ
ఉన్న భేదం విగతమౌతూంది.

గ్రహాలన్నిటినీ నియమించే
సూత్ర గ్రంథి, శూన్యంలో
ప్రకృతినీ మనిషినీ బంధించే
సూత్ర శక్తి, మనసులో.

అహంకార సంవృతమై
రాగ భోగ దూషితమై
బరి తెగిన నీడల వలె
ఇక్కడ ప్రభవించవు ఊహలు.

ఈదారి నాకు కాదు అగమ్యమైంది
ఈ తెన్ను నాకు కాదు అనిశ్చితమైంది.
సూచి రేఖ వలె అంతరాత్మ
ఇటే పట్టిస్తూంది ప్రతిమలవ్వూ.

తరంగం కదలుతూ ఎగసి
అందుకో జూస్తూంది ఆకాశాన్ని
స్వరంతో నా మనస్సు ఎగసి
అందుకో జూస్తూంది అమృతాన్ని.

## 3

శ్రవణ సుభగంగా విన వచ్చే
సంగీత ధునీ గతికి
సంతోషపు సురుగులతో
కలకలలాడుతూన్నవి ఆశలు.

రహస్యపు గుస గుసలు
వినిపిస్తున్నాయి దిశలు
ఒక నాటికీ అవనికథ
స్పష్టంగా వినిపించే వ్యథ.

ఇక్కడ కన్పించదు ఇంటికి
దేవుని పూజారుల లోకం

అనుభవం జ్వాలగా మారి
వెలుగుతోంది పరలోకం.

రాగ రసం ఒలికి వాక్కులో
ఆనందం చిలికి మనస్సులో
నిలచింది బ్రతుకు నావహించి
మొదటి కిరణంలో ఒదిగిన శక్తి.

వింతో స్రోతునుండి త్రవ్వుకొని
ఎగసిన వెలుగు క్రమ్మింది
వెలుగు ప్రవాహానికి ఎప్పుడో
కొట్టుక పోయింది చీకటి బురద.

మనస్సు పరుగిడు తూంది
సూర్యుని చుట్టూ భూమివలె
తపస్సు వెనుక బడుతూంది
దీపం వెనుక నీడవలె.

మబ్బు మూక క్రమ్ముతూంది
ఎక్కడెక్కడి నుండో అంతలో
పిడుగుల శబ్దం వినిపిస్తూ
ఆశకు ధ్వని రూపంగా.

నీలి రెక్కలలో ఆకాశం
పరచుకొంది దిక్కులునిండి
నిలచింది గొడుగు వలె భూమిపై
వీచింది చల్లని గాలి ఎదలో.

వినిపిస్తూంది సంగీతం వినండి
కనిపిస్తూంది దృశ్యం కనండి.
ఆగని ప్రయాణంలో కలిగిస్తూ
ఎప్పటి కపుడు క్రొత్త అనుభవం.

ఇక్కడ శబ్దముంది జడంలోనూ
ఇక్కడ శక్తి ఉంది శూన్యంలోనూ.
ఉన్నవి కదలే రూపాలూ
మృత్యువు నుండి చైతన్యం లోకి.

వెలుగు ఉంది కంటి నిండా
పరిమళ ముంది దాగనిదీ,
హృదయముంది ఊదుతూ
మౌన శంఖం అవిరళంగా.

విల్వడానికి, పెరగడానికి
పోటీ పడే స్వర్గ నరకాలూ
రూపు మాసి, ఉంది ఇచట
ఒకే ఆత్మ తేజోవలయం.

అనుభవ పరమార్థంతో
వెలుగుతోంది బ్రతుకు
వెలుగు మొగలి పట్టులలో
చుట్టుకుంది మనస్సు.

ఆవలి గట్టున నిలచిన రాత్రి
కరగి పోతూంది తరగలుగా
రూపు పూసింది చంద్రబింబం
మిగిలింది సవిత్రు రూపం.

# మొదటి శక్తివర్మ - తూర్పుచాళుక్యుడు

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం,
శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావు

తూర్పు చాళుక్య వంశీయుడు మొదటి శక్తివర్మ మహారాజును గూర్చియు, ఆతని కాలపు చారిత్రక సన్నివేశములను గూర్చియు కొంత వివరణము ఆవశ్యక మనిపించుచున్నది. ఇతడు పరాక్రమశాలియు సమర్థుడైన పరిపాలకుడును అని కొందరు వ్రాయుచుండ ఇతడు తంజావూరు చోళులు నిలబెట్టిన పుత్తడిబొమ్మ మాత్రమే అని మరికొందరు వ్రాసిరి. భావరాజు వెంకటకృష్ణారావు గారు రాజరాజ నరేంద్రుడను తమ గ్రంథమందు శక్తివర్మ మహారాజును ఇట్లు ప్రశంసించిరి. "ఇరువదియేడేండ్లుగా కడగండ్లపాలయి, ఎడతెగక ప్రయత్నించి, పరాజయము వెంట పరాజయము వెన్నంటి వచ్చినను ధైర్యమును గాంభీర్యమును, స్థైర్యమును విడనాడక దీక్షతో పైతృక రాజ్యమును జయించికొన్న మేటి ప్రతాపుడు శక్తివర్మ" పుట 62 డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు Eastern Chalukyas అను తమ ఆంగ్ల గ్రంథమందు శక్తివర్మ ప్రతాప పరిణామము నిట్లు చెప్పియున్నారు. "Though he succeded at last in regaining his lost kingdom, he was able to attain his object only by sacrificing the independence of his Country. The Vengi he came to rule over was no longer an autonomous Kingdom, it was a subject State dependent on Chola monarchy" పుట 212. ఇట్లు స్తుతి విమర్శలకు పాలయిన ఈ నృపాలుని చరిత్ర పునర్వీక్షణార్హమై యున్నది. గతకాలపు పురుషులను గూర్చి మనము వ్రాయునప్పుడు ఒక చూపువాసి ప్రశంస యొనర్చినను అనుచితము కాబోదు. ఏలన, సాక్ష్యము అనిశ్చితముగా నున్నప్పుడు సందేహ లాభమును నిజాకూరు వ్యక్తికి పొందించుట న్యాయ విచారణలో ముఖ్య సూత్రమని చెప్పుదురు. పూర్వ పురుషుల గూర్చి సంపూర్ణ సాక్ష్యమెన్నడును మనకు లభింపదు. ఆ నాటి పరిణామములోనికి నిండుగా మనము ప్రవేశింపగలమను విశ్వాసమును లేదు.

శక్తివర్మ తూర్పు చాళుక్య వంశపు భూపాలుడు. ఇతడు క్రీ॥ శ॥ 999—1011 సంవత్సరముల నడుమ వేగి దేశమును పాలించెను. ఇతడు దానార్ణవుని యగ్ర నందనుడు. విమలాదిత్యుని కితని తమ్ముడు. వీరి తల్లి పేరు ఆర్యామహాదేవియని శాసనములందు కలదు. ఈమె ఎవరియింటి ఆడపడుచో తెలియదు. దానార్ణవుని తల్లి అంకిదేవి కళింగ రాజపుత్రిక. ఈమెకు ఊర్జస యనునని నామాంతరము. శక్తివర్మ జన్మాదికమును గురించి వివరములు తెలియవు. దానార్ణవుడు క్రీ. శ. 970—73 నడుమ మూడు సంవత్సరములు మాత్రమే పరిపాలించి దివంగతుడయ్యెను. జటా చోడ భీముడను తెలుగు చోడ వీరునితో జరిగిన యుద్ధమందు దాన నరేంద్రుడు వీరస్వర్గ మలంకరించెనని చారిత్రకులు భావించు చున్నారు. తండ్రి మరణకాలమునకు శక్తివర్మ, విమలాదిత్యులు మిక్కిలి పసివారు. అనగా 8, 6 సంవత్సరముల ప్రాయము వారని భావరాజువారు ఊహించిరి. శక్తివర్మ చరిత్రలోని తొలి సందేహ ఘట్టమిది. ఈ రాజన్యుని చరిత్ర కాధారములు ఆతనివి మూడు శాసనములు ఉపలభ్యములగు చున్నవి. అవి పదు బర్రు శాసనము, పెన్నేరు లేక పెనికేరు శాసనము, మూడవది ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన శాసన భాగము. ఇది అసమగ్రముగా ఉన్నది. మూడును సంస్కృత భాషయందే ప్రకటింప బడినవి. ఈ శాసనములోని ముఖ్యాంశముల నిట్లు క్రోడీకరింప వచ్చును.

## అ. పదుబర్రు

చాళుక్య నారాయణునియందు (శక్తివర్మ బిరుదు) గాంభీర్యము స్థైర్యము, శౌర్యము, పౌరుషము, లావణ్యము సంతోషముతో వచ్చి నివాసము చేసికొన్నవి.

1. ఎవని యొక్క శైశవము సింహ కిశోరమునకువలె ఆభీల శుండాల నిర్భేదకమైన ద్రమిళాహవమునందు ప్రకాశించెనో
2. ఎవడు చోడభీమునిచేత పంపబడిన వాడును, చిత్రీకృత సాహసము కలవాడును అగు ఏకవీరుని స్వబాహావుచే పంచత్వమును పొందించెనో (ఏక వీరుడు) ఆ వ్యక్తి పేరో, బిరుదమో తెలియదు.
3. ఎవడు బద్దెముని మహారాజును ఇతర బలవంతులను పరాభవించెనో
4. ఎవడు ఉన్నతమైన స్కంధము కలదియు, మిక్కిలి దాఢమైనదియు, భూపాలుర శిరస్సులను పర్వతములపై చాచిన పాదము కలదియు, అంతస్సారము కలదియు అగు జటాచోడ వృక్షమును కూకటి వ్రేళ్లతో పెల్లగించి వైచెనో

అట్టి సర్వ లోకాశ్రయ శ్రీ విష్ణు వర్ధన మహారాజాధి రాజు.

## ఆ. పెన్నేరు శాసనము

ఎవనిచేత బద్దెనృపుడును మహారాజు అను నాతడును యుద్ధమునందు విజితులయిరో, ఎవనిచేత కరికాలచోళుడు సమరమునందు యమ ముఖమునకు గొంపోవ బడెనో (కరికాల చోళు డనునది జటా చోడ భీముని బిరుదు.)

## ఇ. ఆంధ్ర సాహిత్య పరిషత్తు శాసనము

1. ఎవని ఖడ్గలతకు శత్రురాజుల ఏనుగుల కుంభస్థలముల నుండి చిట్లిన ముత్యములు పుష్పావళియగుచున్నదో

2. ఎవనిచేత (ప్రణీతుడయ్యును చౌళికరణమందు బాల్యమున కీర్తిసంపాదింప బడెనో

3. ఎవనిచేత అత్యుద్ధతులైన బద్యమాధిపుడు, మహారాజు మున్నగువారు పలాయితులైరో

4. ఎవడు శత్రు ప్రేషితులును, తీక్ష్ణులును అయిన నరులను సంహరించి ఆత్మసారము ప్రకటించెనో

5 దావణ ప్రతినిధి యని చెప్పదగిన చోడభీమరాజును ఏ చాళుక్య నారాయణుడు నిధనము నందించెనో

6. ఎవడు మదించిన ఏనుగులను, మొసళ్లను, రక్త జలమును, అశ్వసైన్యమను తరంగములును గల మహాయుద్ధ మను సముద్రమును మదించి ఉత్కలికాధి నాదుని సంపదనెల్ల గూరగొనెనో

అట్టి సర్వలోకాశ్రయ విష్ణు వర్ధన మహారాజు.

శక్తివర్మ బాల్యమునందే గొప్ప పరాక్రమము ప్రదర్శించినట్లు పై ఆంధ్ర సాహిత్య పరిషత్తు శాసనములు చెప్పుచున్నవి. ఒకదానియందు దీది ద్రమిళాహవమనియు, మరియొక దానియందు చౌళికరణము అనియు నిర్దేశింపబడినది. ఈ రెండును ఒక్కటే సన్నివేశమని తెలియు చున్నది. ద్రమిళులు—తమిళులకు వ్యతిరేకముగా జరిగినది కాని ద్రమిళులతో అనగా ద్రమిళ పక్షముతో కలిసి చేసినది కాని ద్రమిళాహవము కావచ్చును. చోళులను వ్యతిరేకమయినది కాని చోళులతో కలిసి చేసినది కాని చౌళికరణము అగుచున్నది. ఈ ద్రమిళ—చౌళిక సంగ్రామ మెప్పుడు జరిగెను ఎందుకు జరిగెను అనునది వివాదాస్పదముగా నున్నది. ఇది ద్రమిళులతో జరిగిన యుద్ధమని డాక్టరు వెంకట రమణయ్యగారు భావించిరి. వారి కథనము ప్రకారము దీనికి ప్రసక్తి యిట్లు కలిగెను. దానార్ణవుడు మూడు సంవత్సరముల కాలమే రాజ్యము చేసినను ఆ స్వల్పవ్యవధిలోనే ఆతడు తూర్పు చాళుక్యరాజ్యపు సరిహద్దులను పొత్తపినాటిలోనికి వ్యాపింప జేసెను. పొత్తపి నగరము ముఖ్య పట్టణముగాగల ప్రదేశము పొత్తపి నాడు ఇది కడపజిల్లాలోని రాజంపేట మొదలు చిత్తూరుజిలా కాళహస్తివరకుగల దేశ భాగముగా గుర్తింపబడినది. దానార్ణవుడు పొత్తపినాటిని జయించి, తనకు ఇష్టులైన ముదుగొండ చాళుక్యులకు పరిపాలన కొరకై ఇచ్చినట్లా తని కందయం శాసనమునుబట్టి తెలియు చున్నది. దీని నాతడు వైదుంబ మహారాజు భువన త్రినేత్రుని నుండి జయించి యుండవచ్చును. వైదుంబుని ప్రాంతమున ఏలుచుండిరి. దక్షిణాది చోళు లీ భూభాగము తమ అధికార పరిధిలోనికి రావలసిన ప్రదేశమని భావించు చుండిరనియు, దానికి విఘాతముగా తూర్పు చాళుక్యులు పొత్తపినాటిని ఆక్రమించు కొనుటను వారు సహింపక దానార్ణవునిపై దండెత్తివచ్చిరనియు, వారితో జరిగిన సంగ్రామమే ద్రమిళాహవ మనియు, డాక్టరుగారి మతము. అప్పటి కింకను బాలుడుగా ఉండిన శక్తివర్మ తనజనకు బానటమ్మే ఈ రణమునందు పాల్గొని పరాక్రమము చూపియుండును. ఇదియే ఆతని శాసనములందు ప్రస్తావింపబడిన యీ మానమ్మే వదిగా

ఈ వాదము యుక్తి యుక్తముగనే కన్పించుచున్నది కాని దీనికి కొన్ని విప్రతిపత్తులు కలవు. తంజావూరి చోళులు దానార్ణవునిపై ఎత్తి వచ్చుటకును తత్ఫలితముగ జరిగిన సంగ్రామమే ద్రమిళాహవ మగుటకును బలీయమైన కారణము గోచరింపదు. తెలుగు దేశములో ఉన్న పొత్తపి సీమ దాక్షిణాత్య చోళులకు అసి వారు బయలు అనుట విశ్వాస నీయముగా లేదు. ఇంతేకాక దానార్ణవుడు పొత్తపి నాటిని జయించు కాలమునకు అనగా క్రీ. శ. 970—72 సంవత్సరము కాలమునకు చోళరాజ్యమునందు పరిస్థితులు స్తిమితముగా లేవు. విజయ కాంక్షగల సమర్థులైన రాజులు సింహాసనముపై లేరు. అప్పుడు చోళ సామ్రాజ్య పరిస్థితు లిట్లుండెను. మొదటి పరాంతకుడు క్రీ. శ. 955 వరకును భూపాలన చేసి మరణింపగా ఆతని మనుమడు సుందర చోళుడు రాజ్యారూఢుడయి క్రీ. శ. 969—70 వరకును పాలించెను. సుందర చోళుని యనంతరము ఆతని కుమారుడు ఆదిత్యచోళునకును, ఆతని పినతండ్రి కుమారుడు ఉత్తమ చోళునకును చోళ సింహాసనము విషయమై విగ్రహము కలిగి చోళ రాజ్యము అంత:కలహములలో మునిగియుండెను. మొదట ఆదిత్యచోళుడు సింహాసనము నధిష్ఠించి రెండు సంవత్సరములు గడువక ముందే ఉత్తమ చోళునిచే సంహరింప బడెను. ఆదిత్యుని తమ్ముడు అరుణ్మొళివర్మ (భవిష్యత్తున రాజరాజ చోళుడు) చోళ రాజ్యమునకు రాబూనెను. ఈ సమయమునకే కన్నడ దేశమునందు రాష్ట్రకూటులను తొలగించి పశ్చిమ చాళుక్యులు నూతన సామ్రాజ్యమును స్థాపించు చుండిరి వీరివలనను, పాండ్య కేరళుల వలనను చోళరాజ్యమునకు రానున్న విపత్తు నూహించి దూరదృష్టి గల అరుణ్మొళి వర్మ స్వరాజ్యమునందు అంత:కలహములను వారించుటకై గొప్ప త్యాగమును చూపి రాజ్యమును దాయాదియైన ఉత్తమ చోళునకు ఇచ్చి, తాను యువరాజుగా నుండుటకు అంగీకరించెను. ఇది యంతయు క్రీ. శ. 972—73 ప్రాంతముల జరిగిన వృత్తాంతము. సింహాసనమును గూర్చి తీవ్ర వివాదములలో చిక్కుకొనియున్న చోళ రాజ్యాధినేతలు తమకు సుదూరమునందున్న పొత్తపి నాటి విషయమై చేయి చేసుకొను పరిస్థితులు లేవు. కావున శక్తివర్మ శాసనములందు ప్రసక్తమైన ద్రమిళాహవము చోళ రాజులతో జరిగిన దని సంభావించుట విశ్వసనీయముగ లేదు.

మొదటి శక్తివర్మ శైశవమునందే పాల్గొనిన ద్రమిళాహవమును గూర్చి శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు మరియొక వాదమును ప్రతిపాదించిరి. ఇది ద్రమిళులకు వ్యతిరేకముగా జరిగిన యుద్ధము కాదు. ద్రమిళుల కొరకు వారి పక్షమున నిర్వహింపబడిన సంగ్రామమని వారు నిరూపించుటకు యత్నించిరి. ఎట్లన—తండ్రియైన దానార్ణవుడు జటాచోడ భీమునితో అయిన రణమునందు నిహతుడు కాగా, కడు పసివారైన శక్తివర్మ విమలాదిత్యులు భీమచోడుని ఎదుర్కొనలేక చోళదేశమునకు పారిపోయి అక్కడ తలదాచు కొనవలసిన వారైరి. వీరు రాజ్య బహిష్కృతులై ఇరువది యేడు సంవత్సరములు పర రాజ్యమునందు వేగింపవలసి వచ్చెను. జటాచోడ భీముడు 27 సంవత్సరము లాంధ్రభూమిని చండ శాసనుడై పరిపా

లించెను. చోళదేశమునందున్న కాలమున శక్తి వర్మాదులు సంప్రాప్త యవ్వనులై తమ కాశ్రయ మిచ్చిన చోళరాజన్యుల పక్షమున వారి సంగ్రామములందు పాల్గొనుచు శూరత్వము నెరపియుండుట సంభావ్యము. అట్టివానిలో నొకటి ద్రమిళాహవము లేక ళికరణము. ఇది యీ రీతిగా ప్రవర్తిల్లినది. జటాచోడ భీముడు వేంగి కళింగము లను జయించి వాటియందు సుప్రతిష్ఠితుడై రాజ్య విస్తరణకాంక్ష తోనో లేక చోళదేశమునందు ఆశ్రయము పొందిన శక్తి వర్మాదులను శిక్షించుటకో పూనుకొని కాంచీ నగరముపై దండయాత్ర సలిపి దాని నాక్రమించుకొనెను. ఇక్కడ ఆతడు కొలది కాలము పరిపాలన చేసి యుండును. తన పరాక్రమములను, విజయములను ప్రకటించుచు కైలాస నాథ దేవాలయమునందు ఒక విజయ ప్రశస్తిని నెలకొల్పెను జటాచోడ భీముని శాసన కాలమున శ.క. 904(క్రీ.శ. 982—83) అని కృష్ణారావుగారి కథనము. కాంచీ నగరము చోళ సామ్రాజ్యాం తర్గతమైనది. అప్పటి చోళరాజు ఉత్తమ చోళ మధురాంతకదేవుడు. ఆతడు అరుణ్మొళివర్మతోనయిన ఒడంబడిక ప్రకారము క్రీ. శ. 972 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను. చోళ రాజ్యములో సింహాసనము విషయమై కలహములు రేగుచున్న దుర్బల సమయమున అవకాశముగా తీసుకొని చోడ భీముడు కాంచీ నగరముపై దురాక్రమణ జరిపి యుండును. ఉత్తమ చోళుడు రాజ్యమునందు స్థిమితపడగానే జటా చోడభీముని కాంచీపురమునుండి వెడలగొట్టుటకు పెద్ద యత్నము చేసి యుండును. ఈ సంగ్రామమునందు అప్పుడప్పుడే యువకుడగుచున్న శక్తివర్మ తన కాతిథ్య మిచ్చిన చోళుల పక్షమున యుద్ధము చేసి పరాక్రమశాలి యని నిరూపించుకొనెను. జటాచోడభీముని కాంచినుండి వెడల నడచుట జరిగెను. ఈ వివరణము కార్య కారణ క్రమమును నిరూపించుచు చక్కగా కుదిరినది.

కాని ఈ వాదముయొక్క పునాదులనే ఎత్తివేయు చారిత్ర కాంశ మొకటి ప్రబలమైనది మనల నెదుర్కొను చున్నది. శ్రీ నేల టూరి వెంకట రమణయ్యగారి ప్రకారము జటాచోడభీముని కాంచీపుర శాసన కాలము క్రీ. శ. 1001 సంవత్సర ప్రాంతము. అప్పటికి చాళుక్య శక్తివర్మ బాలుడు కాడు. ఇంచుమించు నలుబది సంవత్సరముల వయసు వాడగును. చోడభీముని కాంచీపురము నుండి వెడలగొట్టుటకు శక్తివర్మ తన మిత్రులైన చోళుల పక్షమున పోరాడి, అది ద్రమిళాహవ మని చెప్పదగియున్నను అది యాతని శైశవమునందు జరిగిన సన్ని వేశము కాజాలదు. కావున శక్తివర్మ శాసనోక్తమయిన ద్రమిళాహవ మిది యగుట పొసగదు. భీముని కైలాసనాథ దేవాలయ శాసనము క్రీ. శ. 1001 అగుట కృష్ణారావుగారి వాదమునకు కొరిగింపరాని ప్రతిబింబమే యగుచున్నది. శాసనకాలము క్రీ. శ. 1001 అని శ్రీ హెచ్. కె. నరసింహస్వామిగారును ధ్రువపరచుచున్నారు. (చూడు. ఆంగ్ల వ్యాసము. జయంతి రామయ్యపంతులు స్మారక సంచిక. ఆంధ్ర సాహిత్య పరిషత్తు) ప్రామాణికులైన ఇద్దరు చారిత్రకులు గైకొన్న శాసన సంవత్సరమును కాదనలేము. అయినను జటాచోడ భీముని కంజీవర శాసన కాలము మాకు సందేహాస్పదముగా కన్పించుచున్నది. క్రీ శ. 1001 ప్రాంతమున చోడ భీముడు కాంచీపురమున ఎందు, కుండెను. విజయ ప్రశస్తిని వ్రాయించుకొని ప్రకటించు సావకాశ మాతనికి ఎట్లు లభించెను అను విషయమును డాక్టరు వెంకట రమణయ్యగారిట్లు వివరించుచున్నారు. జటాచోడ భీముని ఆంధ్రదేశము నుండి తరిమివేసి వేంగి రాజ్యమును దానికి నిక్కపు వారసుడైన దానార్ణవ పుత్రుడు శక్తివర్మ కిప్పించుటకై చోళ చక్రవర్తియగు మొదటి రాజరాజచోళుడు బద్ధకంకణు డయ్యెను. ఉత్తమచోళుని కాలమున అరుణ్మొళివర్మ యను పేరుతో యువరాజుగా నుండినవా డితడే. ఇతడు క్రీ. శ. 985 ప్రాంతమున చోళ సింహాసన మధిష్ఠించెను. చోళ చక్రవర్తులలో నితడగ్రేసరుడు. గొప్ప విజేత. గొప్ప పరిపాలకుడు. క్రీ. శ. 999 సమీపమున చోళులు ఒక పెద్ద సేనను ఇచ్చి శక్తివర్మను ఆంధ్ర దేశాక్రమణమునకై పంపిరి. చోళసేనకు రాజరాజే నాయ కత్వము వహించెనని కొందరు చెప్పుదురు. చక్రవర్తి కాదనియు ఆతని సేనాపతి, అరియం రాజరాజం అను వీరుడు శక్తివర్మవెంట వేంగిపై నెడలెనని మరికొందరు భావించుచున్నారు. (రాజేంద్ర చోళుని తిరువాలంగాడు తామ్ర శాసనము) ఏది యెట్లైనను శక్తి వర్మాదులు జటాచోడభీమునిపై పడిరి చోడ భీముడు మొదట తాకి డికి ఓసరిల్లి కళింగమునకు ఉపసంహరించు కొనెను. శక్తివర్మ నామ మాత్రముగా 999 లో వేంగి సింహాసన మాక్రమించెను. చోళ సైన్యములు స్వదేశమునకు పోయెను. ఇంతలో జటాచోడ భీముడు పెద్ద పెట్టున సైన్యములను సమీకరించుకొని శక్తివర్మపై నడగా ఆతడు నిస్సహాయుడై తిరిగి చోళ దేశమునకు పారిపోయెను. ఆతనిని తరుముచుపోయి చోడభీముడు కాంచీపురము నాక్రమించుకొని అక్కడ కొంతకాలముండి కైలాసనాథ దేవాలయమునందు క్రీ. శ. 1001 తేదీగల విజయ ప్రశస్తిని నెలకొల్పెను. ఇంతలో రాజరాజ చక్రవర్తి మరియొక పెద్ద సైన్యమును సహాయముగా నిచ్చి శక్తివర్మమున్నగు వారిని చోడభీమునిపై పంపగా తత్ఫలితమైన దారుణ రణమందు జటాచోడ భీముడు నిహతు డయ్యెననియు శక్తివర్మ వేంగి సింహా సనముపై సుప్రతిష్ఠితుడయ్యె ననియు వెంకట రమణయ్యగారును, ఇతరులును అన్వయించిరి.

ఈ యన్వయము నందీ లోపములు లోచుచున్నవి. క్రీ. శ. 1001 సంవత్సర ప్రాంతమున చోళ సామ్రాజ్యపు అంతరంగిక పరిస్థితులు యిప్పది సంవత్సరముల క్రింద ఉన్నట్లు లేవు ఇప్పుడు మొదటి రాజరాజచోళుడు సింహాసన మధిష్ఠించియున్నాడు. ఆతడు రాజ్యమునకు వచ్చి 16 సంవత్సరము లైనది. చోళ రాజ్యమునందు సువ్యవస్థ ఏర్పడియున్న దనుటకు సందేహము లేదు. ఇట్టియదను జటాచోడ భీమునివంటి పరిమిత శక్తిగల రాజు చోళ సామ్రాజ్యమును చెనకి, కళింగమునుండి కాంచీపురము వరకును ఏకధాటిగ విజృం భించి చోళుల రెండవ ముఖ్య పట్టణమగు కంచిని పట్టుకొని, అక్కడ కొంత కాలాది జయ శాసనము ప్రకటింపగలిగెననుట సంభావ్యముగా లేదు. ఇంతవరకు వచ్చుదాక రాజరాజచోళుడు నిష్క్రియుడై దిగ్భ్రాంతి చెంది యుండె నందుమా. దీనియందింకను అసందర్భము లున్నవి. శక్తివర్మ తనపైతృక సింహాసనమును వశము చేసుకొని యింతలోనే సహాయుతుడై చోళులకు మొర పెట్టుకొనుటకు పోయె ననగలమా. అత డంత పరాక్రమ హీనుడా. శక్తివర్మ తన రాజ్యమునందు స్థిరపడకుండ గనే అతనిని రావణ పరాక్రముడైన చోడ భీముని కష్టము చేసి చోళ

సైన్యము నుపసంహరించు కొనునంతటి దూరదృష్టి లేనివాడా రాజరాజ చోళుడు చోడ భీముని పరిస్థితి మాత్రము అతనిని చోళ సామ్రాజ్యముపై దాడి చేయుటకు ప్రోత్సహించు నిస్సహాయ స్థితిలో నున్నదా. తక్కిన వెట్లున్నను అతడు ఇప్పటికి వృద్ధుడైనాడు. ఎటుచూచినను జటాచోడ భీముడు క్రీ. శ. 1001 లో విజయ యాత్రా సంరంభముతో కాంచీపురమునందు విడిసియున్నాడనుట తత్కాలీన పరిస్థితుల కనుగుణముగా లేదు.

క్రీ. శ. 982 ప్రాంతమున అతడిట్టి దండయాత్ర చేయుటకు అనుకూలమైన ప్రాభవముతో నున్నాడని మనము చూచియుంటిమి. చోళ సామ్రాజ్యమప్పుడు దుర్బలముగ నుండెను. దానార్ణవుని సంహరించి వేంగిదేశము నాక్రమించుకొనిన తరువాత ఏడెనిమిది ఏండ్లపాటు అతడు కళింగాధిపతులతో యుద్ధము లందు తగుల్కొనియుండెను. ఉత్కలాధిపు లగు కామార్ణవుడును అతని తమ్ముడు వినయాదిత్యుడును దానార్ణవుని సంతతికి రాజ్య మిప్పించుటకై చోడ భీమునితో పోరుచు ఉభయులును చోడుని దురంత ప్రతాపమునకు బలియైపోయిరి. దానార్ణవుని తల్లి అంకిదేవి కళింగ రాజ కుటుంబమునకు చెందిన మహిళ యనుట ఇక్కడ స్మరింప దగియున్నది. బాంధవ్యముచే కామార్ణవ వినయాదిత్యులు శక్తివర్మ పక్షము వహించి చోడ భీమునితో పోరిరి. విధి వైపరీత్యముచే కృతకృత్యులు కాలేక పోయిరి. ఇట్లు తన రాజ్యమునకు తూర్పు ఉత్తరములనుండి వాదగిన ప్రమాదములను నిశ్శేషముగా రూపడచి జటాచోడభీముడు క్రీ. శ. 982 నాటికి శాంత స్వాతంత్ర్య పరాగుడై యున్నాడు. చాళుక్య వంశాంకురము లగు శక్తివర్మ విమలాదిత్యులు దక్షిణదేశమందు ఆశ్రయము పొందియుండుటచే వారిని వెలువరించుటకో లేక ఆశ్రయమిచ్చిన కాంచిపుర చోడులను శిక్షించుటకో చోడ భీముడు చోళరాజ్యముపై దండెత్తెను. తాత్కాలిక విజయమును కూడ సాధించెను. కాని చోళ సామ్రాజ్యమునందు అంతఃకలహములు సమసి ధృఢ వ్యవస్థ ఏర్పడిన తరువాత కాంచీపురమునుండి ఉపసంహరించుకొనవలసిన వాడయ్యెను. ఈ దృష్టితో చూచినప్పుడు శక్తివర్మ విక్రమించిన ద్రవిళాహవము క్రీ. శ. 982 నాటి దగుచున్నది. ఇది నిశ్చితాంశమని యింకను చెప్పలేము. చోడ భీముని శాసన కాలము క్రీ. శ. 1001 అయినచో దానిని నిరాకరింపలేము. శాసనస్థ కాలమును తావన్మాత్రముగా త్రోసిపుచ్చుట ఉత్తమ చారిత్రక పద్ధతి కాదు. కాని ఒక్క అంశము పెక్కు సంఘటనలకు భిన్నముగా నున్నప్పుడు దానిని నిలబెట్టుటకై పెక్కు సంఘటనలను అనన్వితముగ చేయుటయు సత్యాన్వేషణ విధానముకాదు.

ఈ సందర్భమున మేమును ఒక సమన్వయ వాదమును ప్రతిపాదించు చున్నాము. దానికి మన చారిత్రక మహారథులే ప్రమాణము. ఈ వాదమునకు జటాచోడ భీముని కాంచీపుర శాసనములోగాని దండయాత్రతోగాని ఎట్టి సంబంధమును లేదు. ఆ శాసన కాలమును మనకు అప్రసక్తమే యగును. ఎట్లన శైశవమునందే శక్తివర్మ పరాక్రమ స్ఫురణమును తిలకించిన ద్రమిళాహవము తమిళుల పక్షమున నడచిన యుద్ధము కాదు. దీనికి ఉత్తమ చోళునితోగాని, రాజరాజ చోళునితోగాని సంబంధము లేదు. ఇది తెలుగు చోడులలో వేంగి చాళుక్యులకు తటస్థించిన సంగ్రామము. ఇక్కడి ప్రత్యర్థి తెలుగు చోడ వీరుడైన జటాచోడ భీముడే. ఈ యుద్ధములకు చౌళికరణము అను వ్యపదేశము కలదు. ఇది తెలుగు చోడుల విషయమునను గ్రహింపవలెను. వీరు ద్రావిడులు కారు కదా. ద్రమిళాహవ మెట్లగును అను ప్రశ్నకు సమాధాన మిట్లు చెప్పవలెను. చోడభీముడు స్వచ్ఛమైన తెలుగువాడయినను తమిళ చోళునివలె కరికాలచోడ బిరుదముకూడ దాల్చెను. కరికాల చోడుడు తమిళదేశము వాడను ప్రతీతి యుండుటచే చోడ భీముడు కూడ ఔపచారికముగ తమిళుడే యని శాసనకవి భావించెను. దానితో అయిన మహారణము ద్రమిళాహవమగు చున్నది. ఈవిధముగా ద్రమిళాహవ—చౌళికరణములు జటాచోడ భీమునితో జరిగిన సంగ్రామమని చెప్పవచ్చును. ఇది యెప్పుడు జరిగినది అనగా క్రీ. శ. 973 ప్రాంతము. అప్పుడు తూర్పు చాళుక్యరాజగు దానార్ణవునకును చోడభీమునకును ఆంధ్ర దేశాధిపత్యము విషయమై నడచిన యుద్ధమది. దానార్ణవుని పెద్ద కుమారుడగు శక్తివర్మ అప్పటికి బాల్యప్రాయుడు. పదిహేను సంవత్సరముల వయసువాడైన కావచ్చును. ఉత్సాహ శీలియైన యాతడు తండ్రివెంట రణమునకు నడచెను. దైవదుర్విపాకమువలన వృద్ధుడైన దానార్ణవుడు రణావనికి బలియయ్యెను. శక్తివర్మ గాయపడెను. "బాల్యే కీర్తి రలాభి చౌళికరణే యేన వ్రణోద్భాసినా" అని కవి శక్తివర్మను వర్ణించి నాడు. ఆ విపత్కరమైన రణాంగణమునుండి బాలుడగు శక్తివర్మ ఎట్లో తప్పించుకొని ప్రాణములు కాపాడుకొనెను. తూర్పు చాళుక్య రాజవంశము దేశమును విడిచిపోయి చోళదేశమునందు తల దాచుకొనెను.

ద్రమిళాహవమువలన ఏర్పడిన ఘోర ప్రమాదమునుండి పిన్నవారైన రాజసూనులను, రాజ కుటుంబమును ఆదుకొని సురక్షిత ప్రదేశమునకు చేర్చిన స్వామి భక్తి పరాయణు డెవ్వడు అని తెలిసికొనుటకు ఔత్సుక్యము కలుగక మానదు. దీనిని నిష్కర్షించి చెప్పుటకు వీలు లేదు కాని భావరాజు వెంకట కృష్ణారావుగారు చేసిన ఒక సూచన పరిగణింప దగియున్నది. ఈ యుద్ధమైన 27 సంవత్సరముల తరువాత శక్తివర్మ వేంగి సింహాసన మధిష్ఠించి తనకు తోడ్పడిన వీరులకు అగ్రహారాదులు దానము చేయుచుండెను. అట్లు బహూకృతులైనవారిలో పిణ్ణోయ భట్టారకు డొకడు. ఈ యంశము శక్తివర్మ మహారాజు పెన్నేరు (పెనికేరు) శాసనమునందు ప్రస్తుతమైనది. పిణ్ణోయ అను పేరు పిన్నయ్య పూర్వ రూపము కావచ్చును. ఇది కుమారస్వామి పర్యాయ పదముగా తోచును. పెద్దయ్య విఘ్నేశ్వరుడు. పిణ్ణోయ భట్టారకుని గూర్చి శాసనమునందు ఇట్లు చెప్పబడినది. "అణి మాది సిద్ధులు కల సిద్ధుల యనుగ్రహము చేత పొందబడిన ఐశ్వర్యము కలవారును, పరిపూతేంద్రియములును, కూట (కోట) గ్రామమునకు గ్రామణులును అగువారు కలరు. వీరు ప్రసిద్ధమైన హారీత వంశ్యులు. అయ్యన భట్టారకుడు ఈ వంశమునం దభ్యర్చితుడు. ఆ యన్వయము నందు పదక్రమ పారీణుడైన వివేల్ల భట్టారకుడు జన్మించెను. ఈయన కుమారుడు పృథువినయుడు సాంబ భట్టారకుడు. ఈయన కుమారుడు ధైర్యమునందు సూర్యుడు, సూనృత వదాన్యతాది గుణశోభితుడు, ఆసేతుహిమాచల ప్రశస్తిగలవాడు, హరిహరభక్తుడు అయిన పిణ్ణోయ భట్టారకుడు. ఈయన నిజ పరిశ్రమ పరితోషిక భీమరాదిత్యేశ లబ్ధ వృష చిహ్నుడు. అనగా తన పరిశ్రమచే సంతోష పెట్టబడిన భీమరాదిత్యునివలన పొంద

బడిన నృపచిహ్నములు కలవాడు. మరియు ఈతడు 'చాళుక్య వంశవర్ధన రక్షణహేతు ప్రభూత ధ్వజ దండుడు' అనగా చాళుక్య వంశము యొక్క వృద్ధికిని రక్షణమునకును హేతుభూతమైన గొప్ప ధ్వజదండము కలవాడు. అనగా గొప్ప పరాక్రమశాలి. ఈయనకు రాజలాంఛనములు బహూకరించిన భీమదాదిత్యుని చారిత్రకులు గుర్తింప లేదు. ఈ శబ్దము 'భీమదాదిత్యేశ' అనియో 'భీమరాడితీశ' అనియో నిర్ణయింప రాకున్నది. భీమరాట్టు అయినచో ఆతడెవ్వరో కాదు. శక్తివర్మ మహారాజు తండ్రియైన దానార్ణవుడే కావచ్చును. దానార్ణవునకు భీమరాజు అను నామధేయమును కలదు. (చూడు. Eastern Chalukyas పుట 308) పిణ్ణాయ భట్టారకుడు దానార్ణవనృపతి కాలముననే ప్రసిద్ధికి వచ్చియుండును. ఏలికకు జటాచోడ భీమునితో జరిగిన అంతిమ యుద్ధమునం దీస్వామి భక్తిపరాయణుడు తన ప్రభువుతో ఉండి, ఆ దారుణ సమయమునందు రాజకుమారులను, కుటుంబమును మిక్కిలి కష్టముతో తప్పించి చోళదేశము చేర్చి యుండును. ఈ సాహసచర్యయే 'చళుక్య వంశ వర్ధన రక్షణహేతు ప్రభూత ధ్వజదండః' అను స్తుతి వాక్యమునందు సూచితమగుచున్నది. తరువాతి 27 సంవత్సరములను పిణ్ణాయ భట్టారకుడెచ్చట గడపెనో తెలియదు. రాజకుమారుల ననుగమించి తమిళదేశమున ప్రవాసమే చేసెనో లేక స్వదేశమునకు వచ్చి అజ్ఞాతుడుగ ఉండిపోయెనో ఎరుగ రాదు. పెన్నేరు శాసన కాలమున కీయన కడు వృద్ధుడై యుండును.

శక్తివర్మ ఈయనకు పెన్నేరు గ్రామముతో కలిపి మరి మూడు గ్రామములను సమర్పించెను. అవి వేగులకుఱ్ఱు, ధవలకుఱ్ఱు, అడ్డపల్లి అనునవి. పిణ్ణాయ భట్టారకుడు జైన బ్రాహ్మణుడుగా కన్పించును. ఈయన పరిబంధి (?) యందు మహోన్నతమైన పతాకమైన జిన గృహ నిర్మాణమునకు కారకు డయ్యెను. అట్లయ్యును ఈ భట్టారకుడు హరిహర భక్తుడని చెప్పుట విశేషము. ఈయన కీయబడిన గ్రామములు ఇప్పటి తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాకు చెందినవిగా కన్పట్టును. దీనికి పూర్వపు పేరు గృధ్రవాటి సీమ. గుద్దవాడి సీమ అనుటయు కలదు. కోరుమిల్లి గ్రామము సరిహద్దులతో పేర్కొనబడి యున్నది.

శక్తివర్మ బాల్యమునందు పరాక్రమించిన ద్రమిళాహవము ఎప్పుడు జరిగి యుండును? ఇది పొత్తపినాటిలోనే సాగియుండునని తోచుచున్నది. పొత్తపి నాటిని జయించుటయందు తనకు తోడ్పడిన ముదుగొండ చాళుక్యులను— మల్లియరాజు, గొండియ రాజు అను వారిని దానార్ణవుడు పొత్తపి నాటికి పాలకులుగా నియమించినట్లాతని కంది యం శాసనము నుడువు చున్నది. పొత్తపి నాటిని జయించి దాని సరిహద్దులు వ్యవస్థ చేయుచుండగా జటాచోడ భీముడు దానార్ణవునిపై పడియుండును. హఠాత్సంభవముగా జరిగిన ఈ దాటిని ఎదుర్కొనుటకు సంసిద్ధుడుగా లేక దానార్ణవనృపతి దుర్మరణము పాలయ్యెను. ద్రమిళాహవము పొత్తపినాటిలో జరిగియుండుటచేతనే శక్తి వర్మాదులు సమీపమందున్న కాంచీపురమండలమునకు క్షేమముగా చేరియుందురు. పోలికరణము తమిళ చోళులతో జరిగిన రణము కాదనుటకు ఇదియును ఒక తార్కాణము. వారు తమిళ చోళులతో పోరాడియున్నచో విరిగి ప్రాణరక్షణమునకై తమిళదేశమున కేగి యుండరు. దానార్ణవుని మరణానంతరము శక్తివర్మాదులు కొంతకాలము తమ తండ్రివంకబంధువులయిన కళింగనృపతుల కడ ఉండి యుందురని కొందరూహించిరి. కామార్ణవుడు, వినయాదిత్యుడు వీరికి బంధువులైనను వారు సంగ్రామక్షేత్రమైన పొత్తపినాటికి సుదూరమం దుండిరి. చోడ భీముడు వెంటనే వేంగి నాక్రమించి యుండును. శత్రు హస్తగతమైన వేంగినాటి మీదుగా దానార్ణవుని కుటుంబము దూరమందున్న కళింగ దేశమునకు ప్రయాణించుట సంభావ్యము కాదు. అట్టి ప్రమాదావస్థయందు సన్నిహిత మిత్రదేశమున ఆశ్రయమును కోరుటయే స్వాభావికము. తమిళచోళులు తూర్పు చాళుక్యరాజకుటుంబమునకు ప్రతికూలురు కారు. వారికిని వీరికిని ఇంతకుముందే కొంత యనుబంధ మేర్పడి యున్నది. చళుక్య రెండవ భీమరాజు తన కుమార్తె కుందవదేవిని చోళచక్రవర్తి మొదటి పరాంతకుని కుమారుడు అరింజయ వర్మకు ఇచ్చినట్లు తెలియు చున్నది. ఈమె దానార్ణవుని సోదరి కావచ్చును. తద్రూపముగా తమిళ చోళులకును దానార్ణవ కుటుంబమునకును సన్నిహితత్వ మేర్పడియే ఉన్నది.

శక్తివర్మ మున్నగు వారి ప్రవాస జీవితమును కొంత యూహింపవలసి యున్నది. దీనికి కంఠోక్తియైన ఆధారములు లేవనుట వాస్తవము. శక్తివర్మ శాసనములందలి కొన్ని సూచనలను ఆధారము చేసుకొని చెప్పదగి యున్నది. శక్తివర్మకు చాళుక్య నారాయణుడను బిరుదు కలదు. నారాయణుడు అనగా శ్రీ కృష్ణుని బాల్య చరిత్రను మనసునందుంచుకొని ఈతని శాసన కవులు కొన్ని చమత్కారములు చేసినట్లు తోచును. శ్రీ కృష్ణుడు కంసుని ప్రమాదము నెదుర్కొనెను. చాళుక్య నారాయణుడు రావణ ప్రతినిధి యని ప్రసిద్ధి చెందిన జటాచోడ భీముని వైరమునకు గురి యయ్యెను. శ్రీ కృష్ణుని బాల్యము గోకులమున ప్రవాసములో గడిచెను. చాళుక్య నారాయణుని బాల్యమును ప్రవాసమందే గడచెను. శ్రీ కృష్ణుని వెదకి చంపించుటకై కంసరాజు ఎంతయో ప్రయత్నించెను. జటాచోడ భీముడు కూడ దానార్ణవుని కుమారులను అన్వేషించి మట్టుపెట్టుటకు యత్నించినట్లే తోచును. శక్తివర్మ ఆంధ్ర సాహిత్య పరిషత్తు శాసనములోని ఒక శ్లోక మిట్లున్నది.

> బాల్యేకీర్తి రలాభి చౌరి కరణే యేన వ్రణోద్భాసినా
> యేనాత్యుద్ధత బద్యేమాధిప మహారాజా దయాన్వి ద్రుతాః
> యస్మిన్ క్ష్మాను రసా పరిక్షత చరాన్ హత్వారిపు ప్రేషితాన్
> లోకే దర్శయ దాత్మసార మనమః శ్రీ శక్తి వర్మాధిపః.

శ్లోకము ఉత్తరార్ధము పరిశీలింప దగినది.

శ్రీ కృష్ణుడు రిపుప్రేషితులైన చరులను (చారులను) వక్షస్థలముచే పరీక్షించి చంపెను. పూతన వన్నుబాలు త్రావి యామెను సంహరించెను. చాళుక్యనారాయణుడైన శక్తివర్మ రిపుప్రేషితులైన చారులను వక్షస్థలమున మోది సంహరించి ఆత్మ సారమును లోకమునకు ప్రదర్శించెను అను నిగూఢార్థము ద్యోతకమగు చున్నది. వ్యంగ్యమైన ఈ సూచనలనుబట్టి చోడభీముడు శక్తివర్మాదులను తన త్రోవనుండి తొలగించుకొనుటకై సఱుపోకలు పోయి ఉండును. ద్రమిళాహవము నుండి గాయపడి తప్పించుకొన్న శక్తి వర్మయు, దానార్ణవ కుటుంబమును మొదట కాంచీపురమున విడిసి యుందురు. చారులనుపంపి వారి ఆనూకీలు తీయుటకు జటా భీముడు ప్రయత్నించి యుండును.

కంసుడు శ్రీకృష్ణుని మీద పెక్కురు రాక్షసులను ప్రయోగించెను. అట్లు శక్తివర్మ మీద ప్రయోగింపబడిన నేగులవారిలో ఏకవీరు డను వాడొకడు కావచ్చును.

> "ప్రేషితం చోడభీమేన యశ్చిత్రీ కృతసాహసం
> పంచత్వ మన యత్తీక్ష్ణ మేకవీరం స్వబాహునా."
> పభుబల్లి శాసనము.

తన గూఢచారుల యత్నములు విఫలము కాగా జటాచోడ భీముడు కాంచీపురము మీద స్వయముగా సేనలతో దాడి చేసెను. ఇది క్రీ. శ. 982 ప్రాంతమున జరిగియుండునని మేము సూచించి యుంటిమి. కాంచీపురమును జయించుటయు అక్కడ శరణార్థులుగా ఉన్న చాళుక్య వంశపు వారసులను నిర్మూలించుటయు చోడుని ఈ దండయాత్రకు కారణములై యుండును. ఈ రెండవ లక్ష్యము భీమచోడునకు సాధింప బడలేదు. ఇక్కడ తిరిగి మనము శ్రీకృష్ణుని చిన్ననాటి చరిత్రమును స్మరింప వలెను. అతడు కంసుని సంహరించినను ఆపదల నుండి విడుమర కాలేదు. జరాసంధుడు మధురా నగరముపై పెక్కుసారులు దండయాత్రలుచేసి యాదవులను పీడించు చుండెను. దుష్టునకు దూరముగా ఉండవలెనను నీతి ననుసరించి పరాక్రమశాలులయ్యును రామకృష్ణులు తమ నివాసమును ద్వారకకు మార్చుకొనిరి. చాళుక్యనారాయణుడు ఈ సమయమునే యవలంబించినట్లు తోచును. కాంచీపురము జటాచోడ భీమునకు సన్నిహిత ప్రాంతమగుటచే ఆత్మ క్షేమమునుకోరి చాళుక్య రాజకుటుంబము వానికి దూరముగా నుండ గోరెను. చివరకు వారు తంజావూరు సమీపమున నున్న తిరువైయారు గ్రామమున స్థిర నివాస మేర్పరచు కొన్నట్లు తోచును. రాజరాజచోళుని 22 వ రాజ్య సంవత్సరమున, అనగా క్రీ. శ. 1007 సంవత్సరమున సలుక్కి వీమయన్ రాణియగు వీమయన్ వంబవై అనునామె తిరువైయారు గ్రామము నందలి శివాలయమున కొక దానము చేసినట్లు నమోదు చేయబడినది. సలుక్కి అనగా చాళుక్య అనుట ప్రస్ఫుటము గనే ఉన్నది. వంబవై అనునామె వీమయన్ భార్య. వీమయన్ భీమరాజు నామాంతరము గల దానార్ణవుడని డాక్టరు వెంకట రమణయ్యగారు వూహించినారు. శక్తివర్మ విమలాదిత్యుల తల్లి ఆర్యా మహాదేవి యని చదివి యున్నాము. తిరువైయారు లేఖనము నందలి వంబవై ఈమెయో, భిన్న వ్యక్తియో తెలియదు. ఎట్లైనను చాళుక్య రాజకుటుంబ స్త్రీలు కొందరు క్రీ. శ. 1007 నాటికి కూడ తమిళదేశము నందు స్థిర నివాసము చేయుట గమనింప దగినది. ఈ కాలమునకు శక్తి వర్మ తమిళ దేశములో లేడు. అతడు జటాచోడభీముని రణాంగణమున సంహరించి వేంగి సింహాసనాధిష్ఠితుడై యున్నాడు. ఆతని వంశ స్త్రీలు— వృద్ధురాండ్రు కావచ్చును. తమిళదేశములోనే ఉండిపోవ గోరుట తమిళులు ఆంధ్ర రాజ కుటుంబమునకు ఇచ్చిన హార్దికమైన యాతిథ్య గౌరవమునకు మంచి తార్కాణము.

సంప్రాప్త యౌవనుడై నప్పటి నుండియు శక్తివర్మ తన పైతృక రాజ్యమును సంపాదించుకొనుటకు కుతూహలము కలవాడై యుండును. కాని యాతడెట్టి ప్రయత్నములు చేసెనో తెలిసికొనుట కాధారము లేదు. తండ్రివంక బంధువులైన కళింగాధిపులు కామార్ణవ వినయాదిత్యులు చాళుక్య రాజవంశీయులను పునః ప్రతిష్ఠితుల చేయుటకును రాజ్య విస్తరణ కాంక్షగల జటా చోడభీముని తమపై రాకుండ వారించుటకును వానితో క్రీ. శ. 970—80 నడుమ తీవ్రముగ పోరాడిరి. ఈ కాలమున శక్తివర్మ మున్నగువారు కళింగమున నుండిరని కొందరు చారిత్రకులు భావించిరి. కళింగాధిపుల ప్రయత్నములు వమ్మైన పిదపనే వారు చోళదేశమునకు తరలిరని వీరి మతము. చోళ దేశము నందు హార్దికమైన ఆతిథ్యము లభించినను చోళ భూపతులు తూర్పుచాళుక్య రాజకుమారులను వారి రాజ్యమునందు ప్రతిష్ఠించుటకై తోడ్పడుటకు వెంటనే సంసిద్ధులుగా లేరు. వారి సమస్యలు వారి కుండెను. క్రీ. శ. 973 సంవత్సర ప్రాంతమున చాళుక్యులు రాష్ట్రకూటుల సామ్రాజ్యము నంత మొందించి తాము నూతన సామ్రాజ్యమును స్థాపించిరి. ఆ హవమల్ల రెండవ తైలపదేవుడు గొప్ప పరాక్రమశాలి రాజ్య విస్తరణ కాంక్ష కలవాడు. ఇప్పుడు వేంగీశ్వరుడైనచో చోడ భీముడు స్వయముగ రణదుర్గముడు. ఆతడు పశ్చిమ చాళుక్యులతో చేయి కలిపి వర్తించు చుండెను. అరివీర భయంకరుడైన వానితో శక్తివర్మ పక్షమున యుద్ధమునకు దిగుటకు మధురాంతక ఉత్తమ చోళునకు శక్తి చాలకుండెను. భీమచోడుని కాంచీపుర ప్రాంతము నుండి వెడల నడచుటయే ఆతడు చేయగల్గినది. ఆతని తరువాత వచ్చిన రాజరాజచోడుడు మహావీరుడే అయ్యును రాజ్యమునకు వచ్చిన పెక్కు సంవత్సరములు చోళ సామ్రాజ్యమును గట్టి చేసుకొనుట యందు నిమగ్నుడై యుండి శక్తివర్మ కార్యమును చేపట్ట కుండెను. ఇమ్మడి తైలపదేవుడు మరణించి ఆతని సహాయము జటా చోడభీమునకు అందని యంతవరకు రాజరాజ చోళుడు కాలయాపన చేసినట్లు తోచును. తైలపుడు క్రీ. శ. 997 ప్రాంతమున మరణించెను. సత్యాశ్రయుడు కల్యాణి చాళుక్య చక్రవర్తి అయ్యెను. ఇతడు తండ్రి యంత యోధ కాడందురు. ఆతడు రాజ్యము నందు కుదురుకొనుటకు పూర్వమే రాజరాజచోళుడు తన కార్యమును శక్తివర్మ కార్యమును సాధించుటకు సంకల్పించి ద్విముఖమైన వ్యూహమును సంతరించెను. తన కుమారుడు రాజేంద్రచోళుడు పశ్చిమ చాళుక్యుల మీద పడి రట్టపాడిని విధ్వంసము చేయుటకును మరియొక ప్రబల సైన్యముతో శక్తివర్మ జటాచోడ భీమునిపై విజృంభించుటకును పథకము వైచెను. ఇంతకు ముందు కూడ ఇట్టి ప్రయత్నమునే రాజరాజచోళు డొక పర్యాయము చేసినట్లు కాన్పించును. ఇమ్మడి తైలపుడు రాజ్యము చేయుచున్న కాలముననే అనగా క్రీ. శ. 992 ప్రాంతమున చోళులు కన్నడ సామ్రాజ్యముపై దండయాత్ర చేసిరి. కాని రొద్దం యుద్ధమునందు పరాజితుడై రాజరాజచోళుడు ఉపసంహరించు కొనవలసిన వాడాయెను. ఇదే కాలమున కావచ్చును ఆతడు స్వ నామము ధరించిన రాజరాజు అను సేనాపతి వెంట కొంత సైన్యమిచ్చి శక్తివర్మను జటాచోడ భీమునిపై పంపెను. చోడ భీముడీ సైన్యము నోడించి దండనాయక రాజరాజును ఉగ్ర రణమున వధించెను. దీనికి ప్రతిక్రియగనో లేక వేరుగనో చోడభీముడు కూడ ఒక దండయాత్రను చోళదేశముపై పంపెను. దీనికి నాయకులు బద్యముడు మహారాజు అనువారు. శక్తివర్మ నాయకత్వమున వెళ్ళిన ఒక వాహిని వీరిని నోడించి పారద్రోలెను. "యేనా త్యుద్ధత బద్యమాధిప మహారాజా దయో విద్రుతాః" అని శక్తివర్మ శాసన మీ దండయాత్రను సూచించు చున్నది. ఇట్లు శక్తివర్మ చోడ భీముల నడుమ యాతా యాత యుద్ధములు కొన్ని

సాగిన మొదటి అంతిమ సంగ్రామము క్రీ. శ. 998—999 లో ఆరంభించెను.

ఈ కడపటి యుద్ధమునందు శక్తివర్మ వెంట వెళ్ళిన సైన్యమునకు విక్రమ చోళ బిరుదాంచితుడగు అరియం రాజరాజం అను చోళ మాండలికుడు సేనాపతిగ నుండెను. ఈ యుద్ధక్రమము విషయమై కొంత యభిప్రాయ భేదము కలదు. అట్లు భయంకర గతితో వచ్చుచున్న శక్తివర్మ సైన్యమును కోపాటించియో లేక తన చముపుల కూర్చుకొనుటకో జటాచోడ భీముడు కళింగమునకు పోయెననియు, శక్తివర్మ వేంగిలో క్రీ. శ. 999 లో పట్టాభిషిక్తుడయ్యెననియు, చోళ సైన్యములు మరలిపోయెననియు, శక్తివర్మ దౌర్బల్యమును గమనించి చోడభీముడు కళింగమునుండి వెలువడి వచ్చి వేంగిపైబడి శక్తివర్మను తరిమివైచె ననియు, అదే ధాటిలో అతడు కాంచీపురము వరకునుపోయి ఆ నగరమున విజయస్తంభము ప్రతిష్ఠించె ననియు కొందరు భావించిరి. ఈ వాదమును మేమిదివరలో విమర్శించి యున్నాము. జటాచోడ భీముని కాంచీ విజయ యాత్ర రాజరాజచోళుడు రాజ్యమునకు రాకముందే జరిగియుండునని మేము సూచించితిమి. శక్తి వర్మాదులు పటు వేగముతో జటాచోడభీమునిపై గవిసిరి. ఆతడు రావణ జరా సంధులవలె అచంచలమైన ఆత్మ విశ్వాసము కలవాడు. ఇప్పుడు వృద్ధుడును అయినాడు. రెండవ అమ్మరాజ విజయాదిత్యు డితని బావమరిది యనియు, రాష్ట్ర కూట మూడవ కృష్ణరాజుతో తన బాల్యమునందే ఈతడు పోరాడెననియు చెప్పబడుచున్నది. పశ్చిమ చాళుక్యుడు సత్యాశ్రయు డితనికి మిత్రుడైనను జటాచోడభీమునకు బాసటయై వచ్చినట్లు కన్పించదు. చోళులు కర్ణాటక రాజ్యముపై దాడి చేయుచుండిరి. చోడభీము డేకాకియయ్యు దారుణముగా పోరి రణాంగణమున నిహతుడయ్యెను. ఈ యంశమును తిరువాలంగాడు శాసన మిట్లు వర్ణించుచున్నది.

> దండేన భీమేన యుధి ప్రవీణో
> యద్రాజ రాజో నిహతో మదాఖ్యః
> తద్భీమ నామాన మరంధ్ర మంధ్రం
> హస్మీతి దండేన జఘానతమ్

"నా పేరింటివాడును యుద్ధమునందు ప్రవీణుడును అగు రాజరాజ (దండ నాయకుడు) భీమునిచేత దండముచే సంహరింపబడినాడ కనుక రంధ్ర రహితుడైన ఆ యంధ్రుని, భీమనామునిని, దండముతోనే ఆతడు సంహరించెను."

చోడభీముని రంధ్ర రహితుడని వర్ణించుట మిక్కిలి యొప్పియున్నది. ఆతడు అరంధ్ర పరాక్రముడని శత్రువులు కూడ స్తుతించుట గమనింపదగినది.

శక్తివర్మ పభుబ్రోలు శాసనమునందు జటాచోడ భీముని విజయ మిట్లు చెప్పనైనది.

> ఉచ్చైర్జ్వల స్కంధ మతి ప్రరూఢం
> భూభృచ్ఛిరస్సు క్షోణి విసారితాంఘ్రిం
> మా మూల మున్మూలయ తిస్మయోఽపి
> వ్యస్తారం విశాలం జటాచోడ వృక్షమ్.

బలిష్ఠమైన స్కంధములదియు, చిరకాల ప్రరూఢమైనదియు, అరిన్నపాలురను పర్వత శిరస్సులమీ మీద వ్యాపించిన పాదములు గలదియు, అంతస్సారము కలదియు, విశాలమైనదియు నగు జటాచోడ వృక్షము నెవడు కూకటి వ్రేళ్ళతో పెల్లగించి వైచెనో.

ఇరువదియేడు సంవత్సరములు ప్రవాసము చేసిచేసి నిరుత్సాహము నొందక శక్తివర్మ దుర్దాంతుడైన శత్రువును సంహరింపగల్గుట ఆతనికి అత్యంతోత్సాహము కలిగించి యుండును. రాత్రింబవళ్ళు కలలోనికి వచ్చు కర్ణుని చావు చూచిన యుధిష్ఠిరునివలె ఆతడు సంతృప్తితో విశ్వసించి యుండును. శత్రు శేషమును మిగుల్పకూడదను రాజనీతి ప్రకారము శక్తివర్మ కళింగముమీద నడచి అక్కడ జటాచోడుడు ప్రతిష్ఠించిన ఉత్కల ప్రతినిధులను కూడ రూపుమాపెను. ఈ యంశము శక్తివర్మ ఆంధ్ర సాహిత్య పరిషత్తు శాసనములో సూచితమైనది.

> "నిర్మథ్యోత్కలికాధి నాథ రథినీ వార్ధిం స్వబాహూ బలాత్తత్ర త్యాంశ్రియ మాదధాతి యుధియ శ్చాలుక్య నారాయణః"

ఉత్కలికాధి నాథుడు అనగా కళింగాధిపతి యనియే చెప్పవలెను. జటాచోడ భీముని వేంగి సింహాసన దురాక్రమణ కాలమున కళింగ నృపతులు మొదటి కామార్ణవుడు (క్రీ. శ. 943—78 వినయాదిత్యుడు (క్రీ. శ. 978—81) శక్తివర్మ పక్షము వహించి చోడ భీమునితో పోరాడి విఫలులైరని చారిత్రకులు తలచుచున్నారు. వినయాదిత్యుని తరువాత కళింగాధిపతియైనవాడు కామార్ణవుని కొడుకు రెండవ వజ్రహస్తుడు (క్రీ. శ. 981—1016) శక్తివర్మ ఈతనితో యుద్ధ మొనరింపవలసిన ఆవశ్యకత ఏల యేర్పడెనో తెలియదు. ఈ రెండవ వజ్రహస్తుడు పూర్వ బాంధవ్యమును పరిత్యజించి జటాచోడ భీమునితో సఖ్యత పాటించి తూర్పు చాళుక్యవంశము పునః ప్రతిష్ఠితమై తరువాత కూడ వారిపై వైర చర్యలను సాగించి యుండెను. లేదా జటాచోడభీముడు తొలి సంఘర్షణము నందే సంహరింపబడక, పర్వతారణ్యమయమైన కళింగ ప్రాంతమునకు తరలిపోయి మరికొంతకాలము చోళులను, శక్తివర్మ నుసిలుగుల పెట్టియుండును. చోడభీముని బలమును నిర్మూలము చేయుటకై శక్తివర్మ చోళ సైన్య సహాయముతో కళింగముపై నడచి చోడభీముని, వాని మిత్రవర్గము వారిని నిశ్శేషముగా రూపు మాపెనని యూహింపవలెను.

పట్టాభిషేకానంతరము శక్తివర్మ మహారాజు వేంగిదేశమును సుభిక్షము చేయుటకు పూనుకొనెను. మిత్రులను బహూకరించెను. శత్రువులను తన కపాయము చేయుగల స్థానములనుండి తొలగించి విశ్వాసపాత్రులను నియమించెను. శక్తివర్మ తన వంశమునకు గొప్ప అండగా నుండిన సిద్ధోయ భట్టారకుని సంభావించుట చెప్పనైనది. చాళుక్య వంశ పునః ప్రతిష్ఠకు కొందరు స్థానికులు అడ్డు తగిలినట్లు

తొలుత. శక్తివర్మ వారిని తొలగించి తన నమ్మిన వారిని, యుద్ధమునందు తనకు తోడ్పడిన వారిని ఆస్థానమునందు నియోగించుటకు ఆతని పభు బ్రతు శాసనము ఉదాహరణము. కాగలదు. ఈ శాసనము కూడ సంస్కృతమునందే యున్నది దాని విషయకమ్ము దీని సారాంశ మిట్లున్నది. అత్తిలి నాండు విషయములోని రాష్ట్రకూట ప్రముఖులను రావించి విష్ణువర్ధన మహారాజు (శక్తివర్మ అభిషిక్త నామము) ఇట్లు వచించెను. "పూర్వము నలికేశ్వర నామ మహేశ్వరాలయము ఉండెను. దాని బలి నివేదనలకొరకును, ఖండ స్ఫుటిత కర్మలకును (పాలిసా మరమ్మత్తులు) అమ్మరాజు పభు బ్రతు గ్రామము నిచ్చెను. దాని సరిహద్దులు తూర్పున యత్తికసీమ (ఇప్పటి జత్తిగపాడు కావచ్చును). పశ్చిమమున ఉల్లికోడ మండ్రుని సీమ. ఉత్తరమున ప్రోలిసీమ. దీని స్థానాధిపతి గర్గాన్వయుడైన బాలసోమ పండితుడు. ఈయన శిష్యు క్రమముగ వచ్చినవాడు. చింతల గ్రామణిగా ప్రతిష్ఠితుడైన అధికారి స్వామి ద్రోహిగా పరిణమించుటచే స్థానాధిపతుల యనుమతితో గ్రామణి పదము దాని భీమ నామునకు మాచే ప్రసాదింపబడినది. దాని భీముడు స్వామి భక్తుడు. మాకై యుద్ధమునందు క్లేశములు గాంచి ఈతని తండ్రి పొంగు అనునాతడు. తల్లి దొరకాంబ." చింతన గ్రామణిత్వముతోపాటు మహారా జీతనికి కొంత ఆవ క్షేత్రమున్ను (నీరు, నేల శక వాగాణిభూమి) ఇరువది పుట్ల తోపిండి క్షేత్రమున్ను ఇచ్చెను. తోపిండి క్షేత్రమనగా నేమో విశదము కాలేదు. మెట్టభూమి కావచ్చు నేమో. ఈ శాసనమునందే అలంప క్షేత్రము మరియొక రకము భూమి చెప్పనైనది. ఈ దానము "సిద్ధాయమున్ను, గా శ్చెలుం బుచ్చి పుట్ల బడ్డది" దీనిమీద రాజునకు చెల్లు పన్ను విడువ బడ్డది. గాశ్చెలు అననేమో విశదము కాలేదు. కాడు + ఏలు అనగా అడవి మున్నగు వాటిమీద చెల్లింపబడు పన్ను కావచ్చును. శక్తివర్మ కాలమునందు స్థానిక స్వపరిపాలన వంటిది అమలులోకి నున్నట్లు కాన్పించును. చింతన గ్రామణిత్వమును నొసగునపుడు బాల సోమ పండితుని అనుమతిని పొందినట్లు చెప్పుట దీనికి తార్కాణము. "తస్యాను మతే తత్ స్థానాధిపతి ప్రతిష్ఠితమ్" ఇత్యాది వాక్యము గమనింప దగినది.

శక్తివర్మ ప్రజా రంజకుడైన పరిపాలకుడుగా ఉండెను. ఇంతకు ముందు పరిపాలించిన జటా చోడభీముడు యుద్ధలంపటు డగుటచే ప్రజలపై భారము కలిగించు పన్నులు విధించియుండును. శక్తివర్మ వీటి నన్నిటిని తొలగించెను. పెనికేరు శాసనము నందు దిట్లు చెప్పబడినది

"శశాంక ఇవ మృదుకర పరితోషితా శేష లోకః" అని ఈయన వర్ణింపబడి యున్నాడు. అనగా చంద్రునివలె చల్లనైన కిరణములచే సంతోష పెట్టబడిన సమస్త లోకము గల వాడనియు, తేలికైన పన్నులచే సంతోష పెట్టబడిన ప్రజలు గలవాడనియు రెండర్థములు స్ఫురించు చున్నవి. విష్ణువర్ధన మహారాజు అన్నది ఇతని అభిషిక్త నామము. పరమ బ్రహ్మణ్య, పరమ భట్టారక, పరమ మాహేశ్వర, మాతా పితృ పాదానుధ్యాత, అనునవి ఈయనకు విశేషణములు. చాళుక్య వంశీయులందరకును ఈ విశేషణములు కలవియే. పరమ మాహేశ్వర విశేషణముచే వీరు కేవల శైవులనుటకు వీలు లేదు. ఈయన చాళుక్య నారాయణ బిరుదమును కూడ ధరించిన వాడు. తన పూర్వ జీవితమంతయు ప్రవాస క్లేశమునందును, సంగ్రామము లందును గడిపి యుండుటచే ఈ మహారాజు శాంతి పరిపాలనమును వాంఛించి యుండును చోళుల రాజ్యాంగ పద్ధతులను చూచినవాడగుటచే అట్టి యభివృద్ధి కరమైన పద్ధతులను తన రాజ్యమునందును ప్రవేశ పెట్టుటకు కీతడు కృషి చేసినట్లు కాన్పించును. ముఖ్యముగా నీతడు సముద్ర వ్యాపారమును ప్రోత్సహించి నట్లు సూచనలు కలవు. శక్తివర్మకు చాళుక్య చంద్రుడు అను బిరుదు కూడ కలదు. ఈ బిరుదుగల సువర్ణ గద్యాణములు, వరాహ లాంఛనము కలవి. అరకాన్, పెయూవ్ దేశములందు లభించుటచే ఆ దేశములతో వేంగి రాజ్యమునకు సముద్ర వ్యాపారము సాగుచుండె ననుటకు తార్కాణము. ఇది శక్తివర్మ కాలమున జరిగెను.

శక్తివర్మకు రాజ్యప్రాప్తియందు అంజావూరు చోళులు తోడ్పడి రనుట వాస్తవము. కాని ఈతని శాసనము లందు అట్టి ప్రసక్తి ఏదియు కాన్పించదు. కృతజ్ఞతా సూచకముగా చోళ సేనానులకు ఏట్టి అగ్రహారమును ఈయన ఇచ్చినట్లు కాన్పించదు. ఇతని శాసనము లందు చోళ చక్రవర్తి రాజ్య సంవత్సరములను పేర్కొనుటయు లేదు. చోళులు తాము చేసిన గొప్ప సహాయమునకు తూర్పు చాళుక్య రాజ్య కుటుంబము నుండి ఏట్టి ప్రత్యేకాధికారములును కోరియుండక పోవచ్చును. రాజకీయముగా వారి మైత్రిని మాత్రమే కాంక్షించిరి. ప్రవాసములోనున్న వారైనను వారిని చిన్న చూపు చూడక శక్తివర్మ తమ్ముడు విమలాదిత్యునకు చోళ చక్రవర్తి తన కుమార్తె కుందవాంబ నిచ్చి వివాహము చేయుట ప్రశంసనీయమైన పారమేష్ఠి సంబంధమును సూచించును. దీనికి భిన్నముగ పశ్చిమ చాళుక్యులు వేంగీశ్వరులపై కక్ష వహించి యుండిరి. వారి దాయాదులకు తిరుగుబాటు చేయుటయందు సహాయము చేయుచుండిరి. రాష్ట్రకూటుల యొక్కయు, పశ్చిమ చాళుక్యుల యొక్కయు సహాయము పొందిన తూర్పు చాళుక్య వంశీయులు బాదపుడు, విజయాదిత్యుడు వంటివారు తమ శాసనములలో కన్నడ భూపతులను పేర్కొను సంప్రదాయము కాన్పించును

చాళుక్య చోళ సంబంధమును గూర్చి ఆచార్య నీలకంఠ శాస్త్రి గారు చోళులు అను తమ గ్రంథమునందు వ్రాసినది సముచితము గనే ఉన్నది.

"This is not to say that Vengi became atonce an integral part of the chola empire like the other areas where, as in the Ganga or even the Pandya country, the seperate existence of the conquered country was deliberately put an end to, and the administrative system of the cholas was imposed. If the anology suggested by the term is not pressed too far, the political relation in which Vengi stood to the chola empire under Rajaraja is best described as that of a protectorate."

**(The Cholas—Page 182)**

శక్తివర్మ రాజ్య వ్యవస్థను చక్కబరచుకొనుటలో నిమగ్నుడై యుండెను. యుద్ధ శక్తి విస్తారముగా పెంపొందించుకొనుటకు అతనికి సమయమును లేకుండెను. తూర్పు చాళుక్య వంశమునకు చోళులతో కలిగిన సన్నిహిత సంబంధము కల్యాణి చాళుక్యులకు అసమ్మతిని కలుగజేసెను. చోళులనుండి వారిని వేరు చేయుటకును, శక్తివర్మను శిక్షించుటకును సత్యాశ్రయుడు క్రీ. శ. 1006 ప్రాంతమున బయలనంబి అను దండనాథుని ఆధిపత్యమున పశ్చిమ చాళుక్య సైన్య మొకదానిని శక్తివర్మపై పంపెను. అది వేగి దేశముపై బడి విధ్వంసము కావింప జొచ్చెను. బయలనంబి కృష్ణకు దక్షిణమున నుండి వచ్చి ధరణికోట, ఎనమదల దుర్గములను దహించి చేబ్రోలునందు స్కంధావారమేర్పరచు కొనెను. చేబ్రోలు గుంటూరు మండలమునందున్నది. శక్తివర్మ ఈ దాడి నెదుర్కొనుటకై చోళుల సహాయమును అభ్యర్థించి యుండును. వేగి ప్రాంతమునుండి సత్యాశ్రయుని ఉపసంహరింపజేయుటకై చోళుల ఒక పెద్ద సేనా వాహినిని రాజరాజు కుమారుడగు రాజేంద్రచోడుని నాయకత్వమున రట్టపాడిపై విరుచుకొని పడుటకు పంపిరి. ఈ ప్రమాదమునుండి సామ్రాజ్యమును రక్షించుకొనుటకై సత్యాశ్రయుడు బయలునంబి సైన్యమును వేగి దేశము నుండి ఉపసంహరించు కొనెను. వేగి దేశమునకు చాళుక్యుల నుండి విడుదల లభించెను. శక్తివర్మయొక్క శేషించిన రాజ్యకాలము శాంతముగనే గడచినట్లు కన్పించును. ఈ మహారాజు క్రీ. శ. 1011 లో దివంగతుడయ్యెను. ఇతని తరువాత ఇతని తమ్ముడు విమలాదిత్యుడు సింహాసనస్థుడయ్యెను. చాళుక్యవంశీయుడైన మొదటి శక్తివర్మ కుమారాంత శక్తిశాలి అనుట అతిశయోక్తి కాజాలదు. ఇతడు బాల్యమునుండియు భీషణ సంగ్రామములందు పాల్గొని తన ప్రతాపమును, తేజమును స్థాపించు కొనెను. శాసన కవులు ఈతని పరాక్రమమును విస్తారముగా ప్రశంసించిరి. అందు కొంత అతిశయోక్తి అనుకొన్నను వాస్తవ విషయము కూడ స్వల్పము కాదు. ఈతనికి గజ యుద్ధము లందు ఎక్కువ నేర్పరితనము ఉండినట్లు ఆ వర్ణనల వల్ల తోచును.

"నిశిత సిలతా ప్రహార దలిత రిపు రాజ గజ కుంభస్థల ముక్తా ఫల జాల దంతురిత భుజ దండః" అని ఈయన స్తుతింపబడెను. రెండవ అమ్మరాజ విష్ణు వర్ధనుడు కూడ గజ సంగ్రామము నందు ప్రీతి గలవాడుగా చెప్పబడి యున్నాడు. ఇరువది యేడు సంవత్సరములు ప్రవాసము నందు గడిపినను, ఈతని శక్తి సామర్థ్యములు పొసుగు వడకుండుట ప్రశంసార్హము. ఈతడు మృదు స్వభావము కలవాడైనను అంతస్సారము కలవాడనుట తథ్యము.

# రక్తం సూర్యుడు!

## శ్రీ కె. శివారెడ్డి

రక్తం
చుక్క
విరిగి పోయి
చెమట
చుక్కగా రూపొందింది
చెమట చుక్క తలెత్తదు

ప్రశ్నించదు
నమ్మకంగా పనేస్తుంది.
నడుము విరిగిన మోడెస్టీ
కింద చెరచ బడ్డ చుక్క
ప్రాలెన్స్ కని నమ్మిన బంటు.

చెమట చుక్క
పాడి ఆవు— పొదుగు కోసినా
పాలిస్తుందని—దాని అస్తికల్నుండి కూడా
సిరులు పండించుకో వచ్చని
దోపిడీకి బాగా తెల్సు.
తన కాళ్ళ దగ్గరె కట్టేసుకుని
ఎంగిలి ముద్దొకటి పారేసి
తోక ఊపటమే దాని విద్యుక్త ధర్మమని బోధ.

రక్తం అయితే
ప్రశ్నం సూర్యుళ్ళ వేస్తారు
రక్తం అయితే అగ్నిరాజుతుంది.
రక్తం హేతువు జన్మభూమి.

రక్తం చుక్క విరిగిపోయి
చెమట చుక్కగా మారిన గాడిద.

కాని
సిరా చుక్క ఉంది చూశావ్
విద్యు దాగారం
విప్లవా వాసం.

సిరా చుక్క స్పర్శ
చెమట చుక్కని రక్తం చేస్తుంది.
కల్తీ లేని కణ కణ లాడే
నిప్పులాంటి రక్తాన్ని చేస్తుంది.

రక్తం మండుతుంది
సింహాల్ని సృష్టిస్తుంది
స్వేచ్ఛా రక్తం పంజా విప్పితే
గహనాలకి, గిరులకి కళ్ళొచ్చాయి.

కళ్ళల్లో కోటాను కోట్ల
సూర్యుళ్ళు నిద్ర లేచారు
రక్తం సూర్యుడు
రక్తం ప్రతిచర్యం

# సాహిత్యము - విమర్శ

శ్రీ బిలముకూరి రామబ్రహ్మం — శ్రీ సూరపరాజు రాధాకృష్ణమూర్తి

సాహిత్యపు విలువలను నిరూపించగల విమర్శ ఈనాడు తెలుగులో కనిపించడం లేదు. ఇతర భాషలలోని సాహిత్యాలతో పోల్చి చూచినపుడు తెలుగులో సాహిత్య విమర్శ లేదేమో ననిపిస్తుంది. సాహిత్యం సారహీనం కాకుండా చూడగలిగేది సద్విమర్శ. విమర్శ సాహిత్యానికి ఎప్పటికప్పుడు ఒక క్రొత్త త్రోవ చూపిస్తుంది. విమర్శకుడు కేవలం సమకాలీన సాహిత్యంతో తృప్తిపడడు. భాష పుట్టుక నుండి నేటివరకూ వస్తున్న సాహిత్యాన్ని ఒక అవిచ్ఛిన్న సాహితీ వాహినిగా భావించి సార్వకాలికమైన సాహిత్యపు విలువలను నిరూపించి సమకాలీనుల అభిరుచులను సవరించి సాహిత్యం ఏ త్రోవలో పోవలెనో అన్నది నిర్దేశిస్తాడు. సమకాలీన సాహిత్యాన్ని ఒక ప్రత్యేకతగా కాక ఆ భాషలోని సాహిత్యంలో ఒక సహజమైన భాగంగా విమర్శకుడు చూస్తాడు. ఆనాడు సంస్కృత భాషలో ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, ఈనాడు ఆంగ్లంలో ఎలియట్ ఎజ్రాపౌండు చేసిన సేవ ఇటువంటిదే

ఈ విధమైన విమర్శ తెలుగు సాహిత్యంలో ఈనాడు జరగటం లేదు. జరగవలసిన అవసరం ఉన్నదా అన్న ప్రశ్న కూడా వినిపించక పోదు ఈ ప్రశ్నకు సమాధానమిచ్చేముందు విమర్శయొక్క తత్వాన్ని కొంత చర్చించవలసి ఉంటుంది. విమర్శ కవితా వ్యాపారంలో నిహితమైన ధర్మం. కవిలో అతి తీక్ష్ణమైన విమర్శన లేనిదే చదువ దగ్గ కవిత్వం రాదు కవితలో ఈ విమర్శనా వ్యాపారం కొన్ని చోట్ల ప్రకటంగా, మరికొన్నిచోట్ల ఫలానుమేయంగా కనుపిస్తుంది. కాని కవి స్వయంగా స్రష్టకావడంచేత సాధారణంగా నిష్పాక్షికమైన వస్తుదృష్టితో కవిత్వాన్ని విమర్శించ లేని స్థితిలో ఉంటాడు. ఇటువంటి స్థితిలో కవిత్వపు విలువల సూచించి సక్రమమైన మార్గాన్ని నిర్దేశించ వలసిన బాధ్యత విమర్శకునిది. దీనివలన సృజనా వ్యాపారం కంటె విమర్శ తక్కువ రకం అనిగాని, విమర్శ శాసిస్తుంది గనుక అది సాహిత్యం కంటె గొప్పది అని గాని అనుకో నవసరం లేదు. విమర్శకుడు సాహిత్యంలోని వివిధ ప్రక్రియలను వివరించి, పోల్చి, ఆ ప్రక్రియలోని పరమార్థాన్ని చూపి, కవి తన ప్రయోజనానికి అనురూపంగా ఆ ప్రక్రియలలో నిహితమైన శక్తిని మలచి వాడుకునే అవకాశం కలిగిస్తాడు. అంత మాత్రం చేత విమర్శ సాహిత్యం కంటె గొప్పస్థానం ఆక్రమిస్తుందనుకో నవసరం లేదు. విమర్శ శాసించదు. దారి చూపిస్తుంది. ఉత్తమ సాహిత్యాన్ని గుర్తెరుగ గలిగిన వివేచనాదృక్పథం కలిగిస్తుంది. ఇటువంటి విమర్శ లేనపుడు, పాఠకులలో ఇటువంటి వివేచనా శక్తిని పెంపొందించ లేనపుడు ప్రతి ఆముదపు చెట్టు మహావృక్షంగా కనిపిస్తుంది కవులు కరువై మహాకవులు తరుచు అవుతారు కవితారంగంలోని ప్రతిక్రొత్త ప్రయోగము, అది సాధించిన ఫలితంతో ప్రమేయం లేకుండా ఒక మహాశిల్పంగా పొగడ బడడమో, ఒక పనికిరాని ప్రక్రియగా తెగడబడడమో జరుగుతుంది. ఇదే ప్రస్తుతం ఆంధ్ర సాహిత్య పరిస్థితి. లేక దుస్థితి.

తెలుగు సాహిత్యంలో ఈనాడు సంప్రదాయజ్ఞత లేదు. సంప్రదాయ భీరుత్వం ఉన్నది. సంప్రదాయ విధ్వంసమే స్వయంప్రతిభ అన్న భ్రమ ఉన్నది. సంప్రదాయ మనగానే మనకు బూజుపట్టిన పుస్తకాలే గుర్తొస్తాయి. ఆ పుస్తకాల కాలం తీరిపోయినట్లు, అవి మనకీనాడు ఏవిధంగాను ఉపకరించనట్లు, ఆ బూజును మనపై నుండి పూర్తిగా దులుపుకుంటేనే గాని మన స్వయంప్రతిభ ప్రకాశించ నట్లు మనం భావిస్తాము. సంప్రదాయం అభ్యుదయానికి అడ్డు అని అనుకుంటాం. నిజానికి సాహిత్యాన్ని సజీవంగా ఉంచ గలిగేది సంప్రదాయమే సంప్రదాయ సహాయం లేకుండా ఏ కవి అభ్యుదయం సాధించ లేడు. తన కిష్టమైనా కష్టమైనా సంప్రదాయప్రభావం అతని కవితలో ఉండి తీరుతుంది తన కావ్యాన్ని సంప్రదాయ దూరంగా, కేవల స్వయంప్రతిభా స్ఫోరకంగా చెయ్యాలని ఎవరైనా సంకల్పిస్తే విలువ గలిగిన సాహిత్యాన్ని, అతడు సృష్టించ లేడు.

తెలుగులో ఈనాడు నవకవులనబడేవారు మన భాషలోవచ్చిన భారతాదిగ్రంథాలను చదవడం వారి కవితా వ్యవసాయానికి ఆటంకమని, కాకున్నా అనవసరమని, అనుకుంటున్నారు. ఆ కావ్యాలచేత ప్రభావితం కావడం అంటే అంతకంటె అవమానకరమైన విషయం ఉండబోదని వారిమతం నిజానికి సత్తా ఉన్న ఏ కవి ఇతరకవుల ప్రభావానికి సంకోచించడు. ఆ ప్రభావంవలన తన స్వయంప్రతిభ మరింత ప్రకాశిస్తుందని గ్రహిస్తాడు. ఇతరుల ప్రభావం వలన తన ప్రతిభ మరుగున పడుతుందని ఎవరైనా అనుకుంటే అటువంటి కవికి మరుగున పడడానికి పడక పోవడానికి ఏ ప్రతిభ లేదన్నమాటే ఒక కవి తన ప్రాచీనుల కంటె ఎక్కడ భిన్నంగా కనిపిస్తున్నాడో అక్కడే అతని స్వయంప్రతిభ ఉందని మనం సామాన్యంగా అనుకుంటూంటాము. కాని ఒక కవిలో ప్రాచీనులు ఎక్కడ తమ అమరత్వాన్ని సుప్రతిష్ఠించు కుంటారో అక్కడే ఆ కవి స్వయంప్రతిభ ఉంటుందంటాడు ఎలియట్ వ్యాసుని అమరత్వం తెలుగు భారతంలో సుప్రతిష్ఠితమైనట్టు. స్వయంప్రతిభ సంపూర్ణంగా వినియోగం కావాలంటే అది సంప్రదాయంలో ఒక స్థానాన్ని సంపాదించుకోవాలి. అంతేకాని దానికి భిన్నంగా ఉండాలని ప్రయత్నం చేయరాదు ఈ నాడు తెలుగులో సంప్రదాయ నిరాదరమే కనిపిస్తున్నది. అయితే రెండు విధాలుగా సంప్రదాయం అభ్యుదయానికి శత్రువుగా భావించి కొందరు

సంప్రదాయాన్ని స్మరిస్తూనే వైలక్షణ్యము కొరకు చెప్పదలచుకున్న దానిని డొంక తిరుగుడుగా చెప్పి మరికొందరు.

సంప్రదాయం అభ్యుదయానికి అడ్డు అని అనుకునే వారు పర భాషలలోని ప్రక్రియలను ప్రయోగాలను అనుకరించి పేలవమైన కవిత సృష్టించారు. ఈ కవులు ఒక సంగతి మరచి పోతున్నారు. కవి తను చెప్పదలచుకున్న విషయాన్ని శక్తివంతంగా సమర్థంగా చెప్ప గలిగిన శిల్పాన్ని ఎంతో సాధనచేత సంయమం చేత రూపిస్తాడు. ఆ శిల్పాన్ని మరొక కవి తన ప్రయోజనానికి వాడుకో లేడు. అలా వాడు కోవాలి అంటే ఆ శిల్పం ఏ సాధనా పరిణామంగా ఫలించిందో అట్టి సాధన అతడు చెయ్యాలి. ప్రగాఢమైన చింతన, పరిపక్వమైన అను భవం లేనిదే శిల్పం సిద్ధించదు. ఇది విషయము ఇది విధానము అని విడదీయలేని అద్వైతమే శిల్పము. అయితే ప్రతి కవి వివిధ భాషలలోని వివిధ శిల్పాలను, అవి రూపింపబడవలసిన అవశ్యకతను అవగాహన చేస కోడం అవసరం కవి ఎంతమందికైనా ఋణపడి ఉండవచ్చు అయినా ఆ ఋణాన్ని స్వార్జితంగా మార్చుకో వచ్చు.

మన కవులు ఈనాడు నవ్యత కోసం పడుతున్న తాపత్రయం మరి దేనికోసమూ పడటం లేదేమో అనిపిస్తున్నది. ఈ నవ్యత ఏం చేస్తే కలుగుతుంది? శ్రీశ్రీ అన్నట్లు రామాయణాన్ని డెబ్బయిపదకొండోసారి తెనిగించడంలో నవ్యత లేదు అయితే కుక్కపిల్లల మీద సబ్బుబిళ్ళల మీద వ్రాసినంతమాత్రాన నవ్యకవిత అవుతుందా? నవ్యత వస్తు వులో ఉండదు కవి దృష్టిలో ఉంటుంది ఈనాటి మన తెలుగు కవు లలో సంప్రదాయజ్ఞత లోపించినట్లే సమకాలజ్ఞత కూడ లోపించి నట్లు కనిపిస్తున్నది. 'మంచి గతమున కొంచెమే నోయ్' అని చెప్ప గలగడమే ఆధునిక మనస్తత్వం యొక్క ఆధునిక నిర్వచనం. ఈ నిర్వ చనం జీవితాన్ని సమంగా సమగ్రంగా దర్శించ నీయదు. సమకాలీన సమాజంలో మానవుని స్థితిని అర్థం చేసుకుని ఈ స్థితిని సార్వకాలిక మైన జీవిత సత్యంతో, సమన్వయించడమే సమకాలజ్ఞత. భూత భవి ష్యత్తులను వర్తమానంతో కలుప గలిగిన ఒకవిధమైన సంయోగ దృష్టి అది కావ్యవస్తువు స్థూలంగా ఎప్పుడూ ఒకటే అదే జీవిత సత్యం. అది అన్ని కాలాలలోనూ ఒకటిగానే ఉంటుంది అయితే యుగయుగా నికి దాని బాహ్యరూపం మారుతుంటుంది. మనం జీవితాన్ని పరిశీ లించేటప్పుడు ఈ బాహ్యరూపాన్ని మాత్రమే సామాన్యంగా చూస్తు న్నాము. అలా చూసి ఈనాటి మానవుని నైతిక పతనాన్ని ఆధ్యాత్మిక అధోగతిని నిరసించడమో, అతని విజ్ఞాన ప్రగతిని భౌతిక ఉన్నతిని ప్రశంసించడమో చేస్తాం అంతేకాని లోతుకువెళ్ళి మానవుని నిజ స్థితిని తెలుసుకోము. ఈ దృష్టితో చూచినపుడు ఈ శతాబ్దంలో తెలుగులో నవ్యకావ్యం ఇక రావలసి ఉంది

ఈ శతాబ్దంలో కొన్ని కవితోద్యమాలు వచ్చినవి భావకవిత, అభ్యుదయ కవిత, వచన కవిత, దిగంబరకవిత మొదలైనవి. నిజానికి ఇన్ని పేర్లు అనవసరం. వీటన్నిటినీ ఒక పేరుతో పిలవవచ్చు. అది భావకవిత భావకవులు భావాన్ని భావంగా చెపుతారు. దాన్ని కవిత్వపు కరెన్సీలోకి మార్చే ప్రయత్నం చెయ్యరు వారి మనోగతభావాలు, వ్యక్తి గత వికారాలు, విశ్వాసాలు విసుగు విరామం లేకుండా వెళ్ళగ్రక్కడమే వీరి కవితా ధ్యేయం. వ్యక్తిగా కవితో పాఠకుడు సానుభూతి చూపిం చడు. చూపించినా దానికి కవిత్వంతో, కవితా రసాస్వాదనతో ప్రమేయం లేదు. కనుకనే ఈ శతాబ్దపు తెలుగు కవితలో కదిలించే శక్తి లేదు. కృష్ణశాస్త్రి శోకమో, శ్రీశ్రీ కోపమో మనల్ని కదిలించిందంటే దానికి బాధ్యులం మనమే గాని వారి కవిత కానేకాదు. భావకవి తన ఆవేశాన్ని ఉద్వేగాన్ని పాఠకుడితో చెప్పుకుంటాడు కవియైనవాడు ఆ ఆవేశం ఆ ఉద్వేగం పాఠకుని అనుభూతి రూపంగా కవిత ద్వారా అందిస్తాడు. 'పడదులే ఆర్పగా నొక బాష్పమేని' అన్న కృష్ణశాస్త్రికి, 'నాకోసం కన్నీళ్ళు కార్చొద్దు, ప్లీజ్' అన్న దిగంబర కవికి భేదం లేదు ఫ్లాబేర్ అన్నట్లు ఇటువంటి కవితలో కండబలం ఉండదు. కేవల నరాల దౌర్బ ల్యమే కనిపిస్తుంది.

ఒక ఉత్తమ కావ్యం ఎలా పుడుతుంది? శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసము అన్నవి మూడు కావ్యహేతువు (హేతువులు కాదు) అన్నాడు మమ్మటుడు. అంటే ఇందులో ఏ ఒకటి లోపించినా కావ్యంలో ఆ లోపం కనిపిస్తుంది. అట్టి కావ్యం మనకు ఆనందాన్ని ఇవ్వలేదు అని అతని మతం. శక్తి ఒకడు ప్రయత్నించి సాధించగలిగింది కాదు. వ్యుత్పత్తి లోకశాస్త్ర కావ్యాదుల పరిశీలనం చేత కలిగేది కావ్యం వ్రాయను, విమర్శించను తెలిసిన వారి యొద్ద శిక్షపొంది అభ్యాసం చేయాలి. ఈ మూడు కలిసినపుడు కావ్యం పుడుతుంది ఈనాటి మన తెలుగు కవులలో శక్తి ఉన్నది. నిపుణత, అభ్యాసము లోపించి నట్లు కనిపిస్తున్నది మన కవులు శక్తి ఒక్కటే చాలు కావ్యం వ్రాయ డానికి అని సగర్వంగా చెప్పుకుంటారు. కాని పాశ్చాత్యులు ఈ రొమాం టిక్ వ్యూహాలను వదలించుకొని బయట పడుతున్నారు లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాన్ని, అభ్యాసం యొక్క అవసరాన్ని ఎలియట్, ఎజ్రా పౌండ్ మొదలైనవారు గ్రహించి నొక్కి చెప్పారు. కన్ఫ్యూషియస్ మొదలుకొని రేంబో వరకు ప్రపంచంలో ప్రముఖ సాహిత్యవేత్తల రచనలను అధ్యయనం చేయాలి. కవి కాదలచుకున్నవాడు, అంటాడు పౌండు ఎలియట్ ఎజ్రాపౌండులు అభ్యాసంకొరకు హీబ్రూ, ఇటాలి యన్, ప్రావెన్సల్ చైనీస్ కవితలను ఆంగ్లంలోకి అనువదించి ఆయా కవితలలోని బయును పరిశీలించి స్వప్రయోజనాలకు మలచుకున్నారు. ఇటువంటి పరిశ్రమ తెలుగు కవులు ఒక్క చేతగానితనం కింద జమ కట్టగలరు తెలుగులో కావ్యరచన ఏ స్థితికి దిగజారిందంటే ఏ పని చేయను చేతగానివాడు కనీసం పద్యాలల్లు దామనుకుంటున్నాడు అదీ చేతగాకుంటే వచన కవిత ఉండనే ఉంది కవిత్వం వ్రాయడానికి ఏవిధ మైన శిక్ష, అభ్యాసము అవసరం లేదు. భగవద్దత్తమైన అజన్మ మైన ఒక శక్తిమాత్రం చాలు. (ఈ శక్తి తనకు లేదని అనుకునే వాడెవడూ ఉండడు.) కనుక కవిత్వం వ్రాయడం అనుకోడమే అల వ్యంగా జరుగు తున్నది

కవితా వ్యవసాయాన్ని గురించి ఇంత చెప్పిన తరువాత ఈనాడు తెలుగులో ఉత్తమ సాహిత్య సృష్టి ఉండవలసినంతగా లేకపోవడానికి కారణాలలో ముఖ్యమైనది మంచి విమర్శ లేకపోవడమేనని వేరే చెప్ప నక్కర్లేదు. కవితలోని మంచిని చెడును వెలుగులోకి తెచ్చి చూపవలసిన బాధ్యత విమర్శకు నిది. ఇటువంటి నైతిక బాధ్యత ఒకటి ఉన్నదన్న విషయం తెలుగులో విమర్శకులనబడేవారు పూర్తిగా మరచిపోదలచు

కొని పరిచిపోయినట్లున్నారు. ఈనాడు తెలుగులో విమర్శ ముఖ్యంగా మూడు విధాలు. కావ్యసూత్రాలను కావ్యాలకు అనువర్తించి కావ్యం యొక్క సత్తాను పరీక్షించడం ఒక విధమైన విమర్శ. అలంకారశాస్త్ర పరిజ్ఞానంతో కావ్య విమర్శ చేయడం అనే ఉత్తమ విషయాన్ని అలంకార శాస్త్ర ఉపరిజ్ఞానంతో చేసే గుమాస్తా పనిగా మార్చిన ఖ్యాతి ఆర్ద్రులకే దక్కుతుందేమో. మన ఆలంకారికులు— హేమచంద్రుడు కూడా— అలంకార శాస్త్రాన్ని ఒక అనుశాసనంగా భావించ లేదు. అలంకారశాస్త్ర సూత్రాలు కావ్యంలోని లోతులను, మర్మాలను పరిశీలించటానికి పనికి వచ్చే పనిముట్లుగా మాత్రమే వారు భావించారు. పాఠకుని హృదయ వైశాల్యాన్ని, అనుభవపు లోతులను, సహృదయతను, పెంచే ఉత్తమ ఉద్దేశంతో వారు అలంకార శాస్త్ర రచన చేశారు కాని పాఠకుని రసానుభవాన్ని చింపి చిటిలెంటించడంగాని, కవి వస్తు విధానాలపై విధి నిషేధాలుంచడం గాని వీరి ఉద్దేశం గాదు ఆనందవర్ధనుడి ప్రధాన ప్రశ్న కావ్యాత్మ ఏది అని. అంటే ఆనాటివరకు ప్రాచుర్యంలో ఉండి పాఠకులను కదిలించిన కావ్యాలలో ఆ కదిలించిన శక్తి ఏది అనే జిజ్ఞాసే అతని ధ్వని వాదానికి హేతువు ఈ జిజ్ఞాసతో మొదలుపెట్టి కావ్యాలను పోల్చి, విమర్శించి రసానుభవ సాధారణ్యాన్ని ఆనందవర్ధనుడు ధ్వనిగా చెప్పాడు. తెలుగులోని అలంకారశాస్త్రాలు ఈ శాస్త్రాన్ని తర్కశాస్త్రపు Exercises గా ఒక వైపు, ప్రభుత్వపు వారి Codes and manuals గా మరొకవైపు తీర్చారు. ఒక పద్యంలో ఫలాని రీతి ఉన్నదని, దశ గుణాలలోని ఫలాని గుణమున్నదని, లేక పేరు చిల్లరలో రెండువేల చిల్లరలో ధ్వనిప్రభేదాల్లో ఫలాని ధ్వని ఉన్నదని చెప్పడం తప్ప ఆ ధ్వని ప్రభేదాన్నిగాని, రీతిని గాని, గుణాన్ని గాని ఆ కవి ఏ ప్రయోజనం కొరకు వాడాడు అనిగాని, అవి రసానుభూతికి ఎంతవరకు దోహదం చేశాయి అనిగాని వీరి విమర్శలలో చాలా తక్కువ ఉంటుంది ఇచ్చట రౌద్ర రసము వర్ణింపబడినది, ఇచట ఆరభటీ వృత్తి యున్నది ఇచట తిలకాష్ఠ మహిషబంధనాలంకార మున్నది, వంటి విమర్శ రావడం ఇంకా మానలేదు. వ్యాకరణ ఛందశ్శాస్త్రాల విషయంలో గూడా ఇంతే ఏ ఛందస్సులో కవి తన భావాన్ని బిగించాడో చూస్తున్నారు గాని, ఆ భావ ప్రకటనకు ఆ ఛందస్సు, లేక ఛందోభంగము, ఎంతవరకు అనుకూలమైనదో చర్చించరు.

మరొకరకం, పిడివాద ప్రధానమైన విమర్శ. ఈ విమర్శ చేసే వారు ఒక కావ్యంలో తాము అనుభవించిన దాన్ని, కనుగొన్న శిల్పాన్ని వివరించడంగాక తామనుకున్న దాన్ని తామూహించిన శిల్పాన్ని కావ్యంలో కనుగొనే ప్రయత్నం చేస్తారు. వీరు మహాశిల్పాలు, మహాధ్వనులక్షు ప్రత్యక్షాలు చేస్తుంటారు ఏ నన్నయ్య వంటి మహాకవి పద్యాన్నో దబాయించి అందులో తమకు కావలసిన ధ్వని పుట్టించడం ఈ విమర్శ పద్ధతి నానా పరిశ్రమ చేసి, పాఠకుల చేత చేయించి, ఏ 'సత్యంవద' లాంటి ప్రవచనమో కవి నిగూఢంగా నిక్షేపించాడని నిరూపిస్తారు. ఉపనిషదాదుల్లో అమాయకంగా ఉన్న ఒక ప్రవచనాన్ని ఇంత లోతుగా ఎందుకు పాతవలసి వచ్చిందో మనకు బోధపడదు. ఇటువంటి ప్రవచనాలను, సూత్రాలను, భాష్యాలను కవి ఎంత లోతుగా పాతేడు అన్నది ప్రశ్నగాదు. వాటిలోని నిజాన్ని పాఠకుడి చేత ఎంతవరకు అనుభవింపజేశాడు, సూత్రంగా కాక అనుభూతిగా ఎంతవరకు ఇవ్వగలిగాడు అన్నది ప్రధానం.

మూడవది సిద్ధాంత ప్రాధాన్యం గల విమర్శ. ఈ తెగ విమర్శకుల మెడలో ఏదో ఒక సిద్ధాంతం తెంపుకోలేని తాళి కట్టి పడేసి ఉంటుంది ఇందులో మనం ఆక్షేపించ గలిగిందేమీ లేదు. అయితే వచ్చిన చిక్కు వీరికీ కవిత్వానికి చాలా దూరపు చుట్టరికం మాత్రమే. కవిత్వానికి కాక అందులో వ్యక్తం చేయబడిన సిద్ధాంతానికే వీరు ప్రాధాన్య మిస్తారు. శ్రీశ్రీలో నిజంగా ఉన్న కవితాగుణాన్ని వీరు పట్టించుకోరు. అతడు వల్లెవేసిన మార్క్సు సిద్ధాంతాలకు మహాకవి పట్టం కట్టేరు. ఈ సిద్ధాంతాలను ఇంతకంటే బాగా చెప్పిన మార్క్సుకు ఈ గౌరవం ఎందుకు దక్కలేదో?

ఈనాడు కవిత మన భాషలోనే కాక ప్రపంచం లోని అన్ని భాషల లోనూ ఒక అనిశ్చయ స్థితిలో ఉన్నది. అసలు ఈ రోజులు కవిత్వానికి అనుకూలంగా లేవని అనుమానించ వలసి వస్తున్నది. కవితకు కాలం తీరిందేమో నన్న సందేహం కూడా మనకు అప్పుడప్పుడు కలుగుతున్నది. అయినా కవి తన ప్రయత్నం మానడు. తన విశ్వాసాన్ని కోల్పోడు.

# కొవ్వువత్తి - ద్రాక్షగుత్తి

## శ్రీ దాశరథి

ఉపజ్ఞకు, కల్పనా పటిమకు, ఉక్తి వైచిత్రికి పదకొండవ శతాబ్దపు పారసీ కవి "మనౌచెహ్రీ"ది అగ్రతాంబూలం. ఈయన పూర్తి పేరు అబుల్ నజ్మ్ అహ్మద్ మనౌచెహ్రీ దామ్‌గాన్ వాస్తవ్యుడు. గాజా రాజు సుల్తాన్ మసూద్‌కు ఇతడు ఆస్థానకవి. ఈయన రెండు కవితలకు ఈ రచన అనుసరణ.]

### 1. కొవ్వువత్తి

ప్రాణ జ్యోతిక ఫాలభాగమున విభ్రాజిల్లుచుండంగ ని
ద్రాణంబైన ధరాతలంబునకు చైతన్య ప్రభా పుంజముల్
దానం బీయగ జాలు తైజస పదార్థంబీవు; నీకన్న నా
కెనా డెవ్వరు లేరు మిత్రులు, శుభాంగీ! కాంతి కాంతామణీ!

పైన దుస్తులు ధరియించు మానవుండు
లోన [1]దుస్తులు ధరియించు దాన నీవు;
లోన జ్వాలను భరియించు మానవుండు,
పైన జ్వాలను భరియించు దాన నీవు.

నీవు తారవే కాకున్న ఈ విభావ
రీ పథమ్ముల నేల వరించినావు?
నీవు ప్రేమైక జీవివై నెగడకున్న
నీ యెద నదేల సతము కన్నీటి నీట?

నీవు వాతూల హతి మరణించి నపుడు
అగ్ని సంస్కారమే నీకు అసువు లొసగు;
జబ్బుతో నీవు కుమిలెడి సమయమందు
నీదు తల నుత్తరించుటే నీకు మందు.

పూల కారే రాక పుష్పింతు వీవు
శిశిర ఋతువే లేక క్షీణింతు వీవు
అక్షులే లేకుండ అశ్రు లోడ్చెదవు
ఆస్యమే లేకుండ హసియించ గలవు.

నిసిని నిద్దుర పోవుటెంతొ సహజంబు;
కాని, విరహిని నేను, నీ కరణి నెపుడు
జాగరణ చేయుచుందును శర్వరులను,
పగలు పవళింతు నీవలె సెగలు మాని.

నిన్ను విడనాడి ఒంటిగా నున్న యపుడు
[illegible]

నీవు నే నేకమై యున్న తావులందు
కాళ రాత్రికి కడు నేస్తగాడ నగుదు.

నవ్వెదవు నీవు, నేనును నవ్వుకొందు,
కరగి పోయెద వీవు, నే కరగి పోదు,
పొలి పోదువు నీవు, నే పొలి పోదు,
కాలి పోదువు నీవు, నే కాలి పోదు.

నా హృదయమందు భగ్గుమన్న దొక జ్వాల,
దాని నీ తలపై గాంచినాను నేను,
నీవు తలదాల్చినట్టి అగ్నిక మదీయ
హృదయమే పుట్టినిల్లని యెఱుగుమోయి!

నీ రమణీయమౌ ముఖము, నిర్మలమై కనువిచ్చు పచ్చగ
న్నేర విధాన మున్నది వనీ సుమ వాటికలో;—మదీయ ని
స్సార ముఖమ్ము గ్రీష్మ దివసమ్ముల నెండకు వాడిపోవు గ
న్నేర విధాన మున్నయది—నీకును నాకును సామ్యమున్నదే

యెందరు మిత్రులన్ గలిగి యేమి ప్రయోజనమోయి నాకు? వా
రందరిలోన నిక్కమగునట్టి సఖుండొకడైన లేడు; నా
డెందము నందు నెప్పుడు వటించెడ నిక్కపు నేస్తమీవ, నా
బందుగు నీవె, నిన్ను విడువన్, నను వీడవు నీవు, నెచ్చెలీ!

### 2. ద్రాక్షగుత్తి

కస్తూరి వన్నె గల కాంతవలె నుండు
యెంతో వినీలమ్ము ఈ ద్రాక్షపండు,
సుదతి లోపల మూడు [2]హృదయాలు గలవు
పడతిలో నున్నది ప్రాణమ్ము ఒకటె!

అసువులకు రంగుండు ననుట నే నెఱుంగ,
ద్రాక్ష ప్రాణము గంగరావి పూ రంగు;
ప్రాణమ్మునకు లేదు పరిమళమ్మెపుడు
కస్తూరి వాసన కలదు గోస్తనికి

ఇపుడె ఈడేరిన ఈ కన్నెపిల్ల
గర్భమ్ము దాల్చెను కాంతుడే లేక;

---

1 వత్తి.

2. గింజలు.

శ్వాస వలననె గర్భవతి యయ్యె 'మేరి'
అది గూడ లేక ఈ యమ చూలు దాల్చె!

రమణి మేరీమాత ప్రసవించె శిశువును
చెలియ ద్రాక్షా లత చిందించె మధువును,
ఆ శిశువు క్రీస్తుగా అవతరించాడు
సృష్టికర్తకు ఆత్మ రీతి నున్నాడు

ఈ మధువు మేధావు లెల్లరి సృష్టికి
కర్తయ్యె లోకాల వర్తించె నేడు

యేసును బంధించి యెంతో హింసించి
తుదకు వధియించిరి హృదయాలు బెదుర;
ద్రాక్షను ఛేదించి, గాని మర్దించి
ఆసవము చేసిరి అసువులు తీసి

జీస నొక రిద్దరిని జీవింప జేసె,
మధువు విశ్వమ్మునే మరల బ్రతికించె!

యూదు లాతని నంత మొందింప దలచగా
జగమెల్ల ద్రాక్షను తెగటార్ప దలచును
అయిన నేమాయె! క్రీస్తమరుడైనాడు
అయిన నేమాయె! ద్రాక్షాసవము మిగిలె

శిక్ష పొందిన క్రీస్తు రక్షకుం డైనాడు
శిక్షనందిన ద్రాక్ష సేవింప బడె నేడు,
యేసు ప్రభు వుండేది ఆ సురాలయములో,
ద్రాక్ష రసముండేది రారాజు కరములో



"లేపాక్షి శిల్పము"

(ద్రోణాచార్యుడు పంచపాండవులకు ఒక సంవత్సరము అజ్ఞాతవాసము గడుపుమని సూచించుట.)

చిత్రకారుడు: వై. బాలయ్య.

# వెంకటమఖి: 72 మేళములు, 120 మేళములు

శ్రీ సరస్వతి రామకృష్ణయ్య

## సంగీత సంప్రదాయ ప్రదర్శిని

శ్రీ సుబ్బరామ దీక్షితులు :—(1839—1906) "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను సాటిలేని గొప్ప గ్రంథమును వ్రాసినవారు. ఈ మహనీయులు ఎట్టయాపుర సంస్థానములో మొదటి స్థానము వహించిన వారు. ఆధునిక కర్ణాటక సంగీత లక్ష్య లక్షణ సంప్రదాయమున వెంకటమఖి కల్పించిన ప్రకారముగాను సంపూర్ణముగా ఈతను సంగీత సంప్రదాయప్రదర్శిని అను గ్రంథము మూలముగా బయలు పెట్టినారు. సంగీత విషయములు సంప్రదాయ రీతిగా నేను గ్రహించిన వన్నియు ఈ గొప్ప గ్రంథమునుండియే. కనుక శ్రీ సుబ్బరామ దీక్షితులను నేను నా పరమ గురువుగా భావించి అతనికి నా వందనములు సమర్పించెద.

శ్రీ సుబ్బరామ దీక్షితులవారి పెత్తండ్రి అయిన ముద్దుస్వామి దీక్షితులు చాలా ఖ్యాతి జెంది సంగీత త్రిమూర్తులలో ఒకరుగా వెలసినది ప్రసిద్ధము. అతని తండ్రి రామస్వామి దీక్షితులు మధ్యార్జునములో వసించిన వెంకటమఖి పరంపర వారైన వెంకటవైద్యనాథ దీక్షితుల వద్ద శిష్యుడుగానుండి ఎంతో కాలమునకు తర్వాత వెంకటమఖి వల్ల స్థాపింపబడిన ఆధునిక కర్ణాటక సంగీత సంప్రదాయమును నేర్చి చాలా కీర్తి జెందెను. ఈ దీక్షితుల వంశపు వారివల్లనే చాల కాలముగా వెంకటమఖికి తరువాత వారి వంశస్థులవద్ద రహస్యముగా దాచబడి ఎవరికిని సులభముగా అబ్బని నిజమైన సంగీత సంప్రదాయము వెలువడి పోషించబడి ప్రబలమైనది.

ఈ సందర్భములో శ్రీ ఎస్. ఏ. చిన్నస్వామి మొదలియారు అను వారిని మనము మరువగూడదు. ఇతని ప్రయాస, ప్రేరేపణవల్లనే "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" గ్రంథము వ్రాయబడుట మన అదృష్టము. ఈ మొదలియారు 1890 సం. లో 'ప్రాచీన గానము "Oriental Music" అను మాస పత్రిక ప్రారంభించి దానిలో త్యాగయ్యగారి కృతులను, ఇతర వాగ్గేయకారుల కృతులను వానికి కల్పింపబడిన పూర్వమున్న ధాతువుల మార్పక ప్రకటించిరి ఇతనికి మన మందరము కృతజ్ఞులము.

వెంకటమఖి:—ప్రాచీన కాలమున వాడుకలోనుండిన పద్ధతి బొత్తిగా చరిత్రకాలపు కలవరములవల్లను, రాజుల ఆదరణ, పోషణము లేక సంగీత లక్షణ, లక్ష్య మార్గములు ఎట్లుండినది అని తెలియని స్థితిని పొందియుండిన కాలములో వెంకటమఖి కర్ణాటక సంప్రదాయ సంగీతమును ఆధునిక మార్గముగా స్థాపించిన మహనీయుడు ఈ వెంకటమఖి. ఈ సంగీత చరిత్రలో ముఖ్యమైన మహాపురుషుడు తంజాపురి ఏలిన సాళువ (కడపటి) నాయకరాజైన విజయ రాఘవ నాయకుని (1633—1673) కాలమున నిలసిరి అతని సంస్థానమున ముఖ్యమైన స్థానము వహించి ప్రకాశించు చుండెను.

ఈ విజయ రాఘవ నాయకుని తండ్రి రఘునాథ నాయకుని (1600—1631) కాలమున తంజాపురి రాజ్యము ఒక model హిందూ రాజ్యముగా ప్రకాశించినది ఇతనికి ప్రక్కతోడుగా మహామేధ అయిన తంజాపురి నాయక రాజ్యమును ఆదిగా 1550 లో స్థాపించి మొదటి ముగ్గురి నాయకులవద్ద మంత్రిగా నుండిన స్మార్త కర్ణాటక బ్రాహ్మణుడైన గోవింద దీక్షితులను మహా ప్రసిద్ధ పురుషుడు. ఈయన "సంగీత సుధ" అను సంగీత గ్రంథమును రఘునాథ నాయకునికి అంకితముగా ఇచ్చెను. రఘునాథ నాయకుడు కూడా మంచి పదువరి, యుద్ధములలో అతిశూరుడు, సంగీత విద్య బాగుగా నేర్చినవాడు. అనేక గ్రంథములను వ్రాసిన కీర్తివంతుడు. ఇతనిని చరిత్రకారులు రెండవ భోజుడనియు, రెండవ కృష్ణదేవరాయులనియు పొగడుచున్నారు.

(2) I వెంకటమఖి తండ్రి గోవింద దీక్షితులు. తల్లి నాగాంబిక: అన్న యజ్ఞనారాయణ దీక్షితులు వెంకటమఖి తన తండ్రిగారిని తాను రచించిన ఒక ప్రబంధమున "శంకరముని మత ప్రతిష్ఠాపన కోవిదు"డని వర్ణించియున్నాడు. యజ్ఞనారాయణ దీక్షితులు సంగీత లక్ష్య, లక్షణ మార్గములను చక్కగా నేర్చిన మేటి.

వెంకటమఖి ప్రారంభములో తన అన్నగారైన యజ్ఞనారాయణ దీక్షితుల వద్దనే శిష్యుడుగానుండి సంగీతము అభ్యసించెను. దురదృష్టమువల్ల యజ్ఞనారాయణ దీక్షితులు చిన్న వయసులో రఘునాథ నాయకుని కాలముననే మరణించెను. అటు తర్వాత ఉత్తరమునుండి (అనగా విజయ నగరమునుండి) ఆ కాలములో మిక్కిలి ప్రఖ్యాతి గొని గొప్ప సంగీతలక్షణలక్ష్యస విద్వాంసుడుగా వెలసిన తానప్పార్యుడు నాయనను తంజాపురికి రప్పించి గోవిందదీక్షితులు వెంకటమఖికి గురువుగా ఏర్పాటు చేసెను. ఈ తానప్పార్యుని తండ్రి పొన్నప్ప alias వెంకటామాత్యుడు (మంత్రి)గా ప్రసిద్ధుడు.

ఈ తానప్పార్యులవద్ద వెంకటమఖి సంగీత లక్షణ లక్ష్యమార్గములను ఆ కాలములో వాడబడిన మార్గము ననుసరించి సంగీత విద్య సంబంధమైన అన్ని విషయములను సవిస్తారముగా నేర్చి సంస్థానమున గల ఇతర సంగీత సాహిత్య విద్వాంసులలో అందరికన్న మేటిగా ప్రకాశించెను.

(2) II తన గురువు మూలముగా నేర్చిన విషయములు గాక, వెంకటమఖి సంగీత సంబంధముగా ఆకాలములో తనకు దొరికిన ప్రాచీన గ్రంథములు, సమీపమున వ్రాయబడిన గ్రంథములు అన్నిటిని చదివి తన విద్వత్తును ఎక్కువగా వృద్ధిపరచుకొనెను. అతడు చూచి పఠించిన గ్రంథములలో కొన్ని—శార్ఙ్గదేవుని "సంగీత రత్నాకరము" (1230) రామామాత్యుని 'స్వరమేళ కళానిధి" (1550) కల్లినాథుల "కళానిధి" (1553) అను సంగీత రత్నాకరమునకు ముఖ్యమైన వ్యాఖ్యాన గ్రంథము. పై గ్రంథములు ఇంకను ఇతర గ్రంథములను బాగుగ పరిశోధించి వాటిలోని విషయములను చక్కగా గ్రహించి, ఒక్కొక్క గ్రంథములలో ఇవ్వబడిన విషయములలోని భేదములను పరీక్షించెను.

రామామాత్యుల "స్వరమేళ కళానిధి" లో చాలా పొరబాటులను కనిపెట్టి, వాటిని గురించి చాలా శాస్త్రీయ విమర్శనను తన "చతుర్దండి ప్రకాశిక" అను గ్రంథమున వెంకటమఖి వ్రాసియున్నారు. ఈ "చతుర్దండి ప్రకాశిక" అను గ్రంథమును విజయ రాఘవరాజు గారి కోరికమీద వెంకటమఖి వ్రాయ పూనుకొనెను.

## చతుర్దండి ప్రకాశిక

(3) ఈ "చతుర్దండి ప్రకాశిక" అను సంగీత గ్రంథమును గాని దానికర్త వెంకటమఖినిగాని శ్రీ సుబ్బరామ దీక్షితులవారి "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను గ్రంథమునకు ముందుగా వ్రాయబడి దొరికిన అనేక సంగీత గ్రంథములలోని గ్రంథకర్తల పట్టికలలో కానరావు. వెంకటమఖి సంగీత శాస్త్ర విద్యకు మహత్తరమైన సేవ చతుర్దండి ప్రకాశికలో చూడ నగును.

వెంకటమఖి ఈ చతుర్దండి ప్రకాశికలో సంగీతము, దాని గురించిన విషయములను పది ప్రకరణములలో వివరించిరి—ఆ పది ప్రకరణములు:—(1) వీణా ప్రకరణము, (2) శ్రుతి ప్రకరణము, (3) స్వర ప్రకరణము, (4) మేళ ప్రకరణము, (5) రాగ ప్రకరణము (6) ఆలాప ప్రకరణము, (7) ఠాయ ప్రకరణము, (8) గీత ప్రకరణము, (9) ప్రబంధ ప్రకరణము, (10) తాళ ప్రకరణము.

వీటిలో లక్ష్య సంగీతమునకు ముఖ్యమైన అంశములుగా ఎంచబడిన గీత, ఆలాప, ఠాయ, ప్రబంధములను నాలుగు విషయములను సంగీతమునకు నాలుగు దండిలుగా భావించి తన గ్రంథమునకు ఆ ప్రకారమే చతుర్దండి ప్రకాశిక అని పేరును పెట్టెను.

వెంకటమఖి కాలమున లక్ష్యమార్గమున గీతము కూడా ఒక విధమైన ప్రబంధమైనను గీతమునకు చాలా ముఖ్యత ఇచ్చి దానికి లక్ష్యములలో మొదటిస్థానము ఇవ్వబడినందున దానిని ప్రబంధములలో చేర్చక మొదటి దండిగా వెంకటమఖి భావించెను.

(4) తాను వ్రాయబూనిన చతుర్దండి ప్రకాశికకు కావలసిన పైన వివరించిన గ్రంథములలోని విషయములకు గాక పరిశీలనకు తెలిసిన విషయములు:—

I. తన గురువు తానప్పాచార్యులవద్ద నేర్చిన 18 పూర్వ ప్రసిద్ధ మేళములతో చేరి 54 రాగములను, వాటికి పూర్వము కల్పింపబడిన మూర్ఛనలు, ఆ రాగములకు లక్షణములను తెలియజేయు గీత ప్రబంధములు. ఈ 54 రాగములు మాత్రమే పురాతన కాలమునుండి సంప్రదాయముగా చాలా ముఖ్యములైనవిగా పాడబడిన రాగములలో చరిత్ర కలవరపు సందర్భములు కారణములవల్లను, రాజాదరణలేని చేతను, నశించిపోయినవి పోగా వెంకటమఖి కాలములో మిగిలినవి కొన్ని దొరికినవి. ఈ 54 రాగములలోని మేళములని అనగా వానిలో చాలా ముఖ్యమైనవి యని భావింపబడినవి 18 ప్రసిద్ధ పూర్వ మేళములు. ఈ మేళములు గాని, ఇతర రాగములు గాని, పురాతన కాలమునుండి ఉత్క్రమ స్వర సప్తక ఆరోహణ అవరోహణములుగా (Scales) భావింపబడక ఒక్కొక్క మేళముగాని, రాగముగాని, దాని విశేష ప్రత్యేక రాగ భావ స్వరూపమును చక్కగా, శేదముగా జూపు మూర్ఛనాలను గలవిగా మొదటి నుండి వెలసినవి. ఇట్లు విధింపబడిన మూర్ఛనలను బట్టియే రాగములను పాడుకొనను విషయము వెంకటమఖి చాలా ముఖ్యమైనదిగా భావించిరి.

ఈ 54 రాగములలో ముఖ్యముగా 18 ప్రసిద్ధ పూర్వ మేళములలో కొన్ని (6) వివాది దోషములు గలవి గాను, కొన్ని వాటి మేళములలో లేని అన్య స్వరములు ఒకటి రెండు గలవిగా పాడబడి భాషాంగత్వమును గలిగి వెంకటమఖి కాలమునకు చాలా పూర్వమునుండియు వాడుకలో నుండెను. అటువంటి రాగములకు మూర్ఛనలు వాటి రాగ భావమును వివాది దోషమును పరిహరించి ప్రకాశించునట్లు పూర్వీకులు కల్పించి యుండిరి.

ఈ 54 రాగములు (18 పూర్వ మేళములు సహా) గాక వెంకటమఖి కాలములో మన దక్షిణ దేశములోనే అనాదిగా పాడబడిన అనేక రక్తి రాగములను కూడా వెంకటమఖి పరిశీలించి వాటికి తగిన మూర్ఛనలను కల్పించి వాటికి దేశి రాగములని పేరిడి తన గ్రంథములో చేర్చిరి.

(5) ఇట్లు తనకు లభించిన అన్ని రాగములను పరిశీలించి వాటిలో ప్రకృతి వికృతి భేద స్వరములను గమనించి ప్రాచీన పద్ధతిలో లేని 12 స్వరస్థానములు గల ఒక స్థాయిలో 16 స్వరములు గలవని వెంకటమఖి నిర్ధారణ చేసి, ఆ 16 స్వరములలో 7 శుద్ధ ప్రకృతి స్వరములనియు, తక్కిన 9 స్వరములు వికృతి స్వరములనియు వేరుపరచి నిరూపించిరి.

సప్త స్వరములలో షడ్జ పంచమములు తప్ప తక్కిన 5 ఋషభ గాంధార మధ్యమ ధైవత నిషాద స్వరములలో వాటిలో ఒక్కొక్కటి లోను తగు శ్రుతి (Pitch) గల వానిని సంప్రదాయ ప్రకారము శుద్ధ స్వరములనియు అదే స్వరములలో పై శ్రుతులు గల స్వరము లను వికృతి స్వరములనియు నిరూపింప బడినవి. వెంకటమఖి శుద్ధ స్వరాక్షరములను అకారములో వ్రాసి 22 శ్రుతులను సంప్రదాయమును అనుసరించి వాటిని విభజించిన విధము ఈ క్రింది పట్టికలోన గానవచ్చును:—

| 7 శుద్ధ స్వరాక్షరములు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| | స | ర | గ | మ | ప | ధ | న |
| వానికి ఇవ్వబడిన శ్రుతులు | 4 | 3 | 2 | 4 | 4 | 3 | 2 |

9 వికృతి స్వరాక్షరములను వాని సంఖ్యలనుబట్టి ఇకార ఉకారములు గలవిగా వ్రాసిరి.

| | | | | |
|---|---|---|---|---|
| శుద్ధ ఋషభము | ర కు | రెండు | వికృతులు—రి, రు. | |
| శుద్ధ గాంధారము | గ, కు | రెండు | వికృతులు—గి, గు. | |
| శుద్ధ మధ్యమము | మ, కు | ఒక | వికృతి—మి. | |
| శుద్ధ ధైవతము | ధ, కు | రెండు | వికృతులు—ధి, | ధు. |
| శుద్ధ నిషాదము | న, కు | రెండు | వికృతులు—ని, | ను. |

వెంకటమఖి శుద్ధ వికృతి భేదములు తెలియుటకుగాను స్వరాక్షరములను ఇట్లు వేరు వేరు అకార ఇకార ఉకారములు కలవిగా వ్రాసెను, ఆ స్వరములను పాడునప్పుడు వాటిని వాడుక వలె స రి గ మ ప ద ని గానే పాడవలెను. వెంకటమఖి చేసిన ఈ 16 ప్రకృతి వికృతి స్వరములు ఒకస్థాయిలోని 12 స్వర స్థానములతో కల్పన ఇప్పుడు వాడుకలోనుండు కర్ణాటక సంగీతమునకును అస్తిభారముగా స్థిరపడినది.

ప్రాచీన పద్ధతిలో ప్రకృతి వికృతి స్వరములను వేరు విధములుగా చెప్పబడియుండును. ఆ పద్ధతి వాడుకలో నుండి తొలగి పోయినది.

పైన సూచించిన పథకమును గమనించితే ఋషభమునకు మొదటి వికృతియైన రి అను దానికిని, ధైవతమునకు మొదటి వికృతి యైన 'ధి' అను దానికిని 5 శ్రుతులు గలవని తెలియును. పంచ శ్రుతి ఋషభమనియు, పంచశ్రుతి ధైవతమనియు వెంకటమఖి వానికి పేరిడిరి.

ఇట్లు పంచశ్రుతి ఋషభమనియు, పంచశ్రుతి ధైవతమనియు చెప్పబడు ఈ రెండు స్వరములను ఈ కాలమున చతుశ్రుతి ఋషభ మనియు, చతుశ్రుతి ధైవతమనియు చెప్పుచున్నారు. పూర్వ కాలములో శార్ఙ్గ దేవుల మతమందు షడ్జము తన నియత శ్రుతిని వదలి తన మూడవ శ్రుతి స్థానమున చ్యుత షడ్జమయినప్పుడు శుద్ధ ఋషభము తన నియత శ్రుతియందే యుండుకొని తన మూడు శ్రుతులతో షడ్జము యొక్క నాల్గవ శ్రుతియైన ఒక శ్రుతిని జెంది చతుశ్రుతి అను వికారమును, ఇటులనే పంచమము తన నియత శ్రుతిని విడిచి తన మూడవ శ్రుతి స్థానమందు చ్యుత పంచమమైనప్పుడు శుద్ధ ధైవతము తన నియత శ్రుతియందే యుండుకొని తన మూడు శ్రుతులతో పంచమము యొక్క నాలుగవ శ్రుతియైన ఒక శ్రుతిని జెంది చతుశ్రుతి ధైవతమను వికారమును పొందినవి అవి బొత్తిగా తొలగిన వెనుక ఋషభము తన స్థానమును విడిచి తనకు పైని గల శుద్ధ గాంధారమును ఆశ్రయించి తన మూడు శ్రుతులతో ఆ శుద్ధ గాంధారము యొక్క రెండు శ్రుతులను జెంది "పంచశ్రుతి ఋషభము" అను నామమును, ధైవతము తన స్థానమును విడిచి తనకు పైని గల శుద్ధ నిషాద స్థానమును ఆశ్రయించి తన మూడు శ్రుతులతో ఆ శుద్ధ నిషాదము యొక్క రెండు శ్రుతులను జెంది "పంచ శ్రుతి ధైవతము" అను నామమును జెందినవి.

పై చెప్పిన ప్రకారము వెంకటమఖి పంచశ్రుతి ఋషభ ధైవతములను నిరూపించి చతుర్దండి ప్రకాశికలో చెప్పియున్నారు.

తనచే కల్పింపబడిన 72 మేళములు సిద్ధించుటకై క్రింద కనుపరచినట్లు శుద్ధ వికృతి స్వరముల పేర్లను, తనచే కల్పింపబడినవాని సంకేతాక్షరములతో జేర్చి అవి 16 స్వరములుగా నుండి నప్పటికిని అవి గలిగెడు స్థాయిలోని 12 స్వర స్థానములు ఈ క్రింద వివరముగా జూపబడియున్నవి. వీణలో

(1) మొదటి స్థానమున ర అను శుద్ధ ఋషభమును,
(2) రెండవ స్థానమున రి అను పంచశ్రుతి ఋషభమును,
గ అను శుద్ధగాంధారమును,
(3) మూడవ స్థానమున రు అను షట్ఛ్రుతి ఋషభమును,
గి అను సాధారణ గాంధారమును,
(4) నాల్గవ స్థానమున గు అను అంతర గాంధారము
(5) ఐదవ స్థానమున మ అను శుద్ధ మధ్యమమును,
(6) ఆరవ స్థానమున మి అను వరాళి (ప్రతి) మధ్యమమును,
(7) ఏడవ స్థానమున ప అను పంచమమును,
(8) ఎనిమిదవ స్థానమున ధ అను శుద్ధ ధైవతమును,
(9) తొమ్మిదవ స్థానమున ధి అను పంచశ్రుతి ధైవతమును,
న అను శుద్ధ నిషాదమును,
(10) పదియవ స్థానమున ధు అను షట్ఛ్రుతి ధైవతమును,
ని అను కైశిక నిషాదమును,
(11) పదునొకండవ స్థానమున ను అను కాకలి నిషాదమును,
(12) పదిరెండవ స్థానమున స అను షడ్జమును

అంతు 16 స్వరములు కలుగు చున్నవి.

వీనిలో రెండవ, మూడవ స్థానములు కొన్ని సమయములో రి రు అనెడి ఋషభములు గాని, కొన్ని సమయములలో గ గి అనెడి గాంధారములుగాను నగుచున్నవి. తొమ్మిదవ, పదియవ స్థానములు ధి ధు అనెడి ధైవతములుగాను, న ని అనెడు నిషాదములుగాను అగుచున్నవి. ఒక సమయమునందే రెండవ మూడవ స్థానములు ఋషభములుగాను, గాంధారములుగాను కానేరవు. ఇటులనే తొమ్మిదవ పదియవ స్థానములు ధైవతములుగాను, నిషాదములు గాను కానేరవు. ఇట్లు కానేరవని స రి గ మ ప ద ని యనుటలో ఋషభమునకు పైన గాంధారమును, ధైవతమునకు పైన నిషాదమును రావలెనని నియమము వలన స్పష్టమగును.

## వెంకటమఖి కల్పించిన 72 మేళములు

(6) పై వివరించిన ప్రకృతి వికృతి స్వరముల మార్పులను అనుసరించి వెంకటమఖి వాటిని గణిత ప్రస్తార క్రమముగా 72 మేళములను అనగా స్వర సప్తకములను (Scales) కల్పించిరి. ఈ ప్రస్తార క్రమము ఎట్లనగా:—

I. పూర్వాంగము ఉత్తరాంగములైన ర గ మ ధ న స అను శుద్ధ స్వర సప్తకము మొదటి మేళము.

II. ఒక పూర్వాంగమైన ర గ మ చేత ఉత్తరాంగమైన ప ధ న స ప్రస్తరించు ఆరు మేళములు మొదటి చక్రము, అనగా

1 చక్రము పూర్వాంగము ×

పధనస అనగా రగమ పధనస (1) అని రగమ చేత
పధనిస రగమ పధనిస (2) మొదటి 6 ప్రస్తారములవల్ల
పధనుస రగమ పధనుస (3) మొదటి చక్రపు 6 మేళములు
పధినిస రగమ పధినిస (4) గలిగెను.
పధినుస రగమ పధినుస (5)
పధునుస రగమ పధునుస (6)

ఇటులనే

2 వ చక్రము ర గి మ చేత 6 మేళములును,
3 వ చక్రము ర గు మ చేత 6 మేళములును,
4 వ చక్రము రి గి మ చేత 6 మేళములును,
5 వ చక్రము రి గు మ చేత 6 మేళములును,
6 వ చక్రము రు గు మ చేత 6 మేళములును,

అంతు 6 చక్రములు × 6 మేళములు మ అను శుద్ధ మధ్యమమును జేర్చి ప్రస్తరించినచో గలిగిన 36 మేళములు పూర్వ మేళములనియు, ఇదే రీతిగా శుద్ధ మధ్యమమునకు బదులుగా పై చక్రములు

గానే మి అను వరాళి మధ్యమమునం బెట్టి ప్రస్తరించి మరొక్క ఆరు చక్రములు ఒక్కొక్కదానిలోను 6 మేళములు అనగా 36 మేళములు ఉత్తర మేళములు లేక వరాళి (ప్రతి) మధ్యమ మేళములు లభించును.

అనగా మొత్తముగా 72 మేళములు వెంకటమఖిచే ప్రస్తరింపబడినవి.

ఈ 72 మేళములు ఉత్తమ స్వర సప్తకము లనుటను, అవి రాగములుగా భావించ దగనవిగా తెలిసి వెంకటమఖి 72 మేళములకు పేళ్లను వ్రాయక ఆ 12 చక్రములకు సంజ్ఞానామములు, అనగా వాటికి యివ్వబడిన పేళ్లనుబట్టి ఈ చక్రము ఉన్నవి చక్రమని సులభముగా తెలియునట్లును, ఒక్కొక్క చక్రములోని 6 మేళములకును వాని సంఖ్యాక్రమమును తేట పరచునట్లు సంజ్ఞ సంకేతాక్షరములు వ్రాసిరి. వాని వివరణము :

చక్ర సంజ్ఞ నామములు:—

| | | |
|---|---|---|
| 1. ఇందుచక్రము | 2 నేత్ర చక్రము | 3. అగ్ని చక్రము |
| 4 వేదచక్రము | 5 బాణచక్రము | 6. ఋతు చక్రము |
| 7. ఋషి చక్రము | 8. వసుచక్రము | 9. బ్రహ్మచక్రము |
| 10. దిశి చక్రము | 11. రుద్ర చక్రము | 12. ఆదిత్య చక్రము |

ఒక్కొక్క చక్రములోని 6 మేళములకు ఇవ్వబడిన 6 సంజ్ఞ సంకేతాక్షరములు : పా—1, శ్రీ—2, గో—3, భూ—4, మా—5, షా—6

## రాగాంగ రాగములు

7. రాగాంగ రాగములు (72)(అరి, అంబరి—మంజరిపద్ధతి) వెంకటమఖి తనచే గణిత ప్రస్తారములుగా లభించి కల్పింపబడిన ఈ 72 మేళములన్నియు ఉత్త క్రమ సంపూర్ణ స్వర సప్తకములనియు అని ప్రాచీన సంప్రదాయ ప్రకారము రాగముల కావని ఎంచి వాటిని ఒక్కొక్కటియును పరిశీలించి పాడి చూచి వానికి తగిన మూర్చనలను కల్పించి అట్లు లభించిన 72 మేళములకును, 72 మూర్చనలను గల వానికి రాగాంగ రాగములని పేరిడిరి. అతను ఇట్లు కల్పించిన మూర్ఛనలను అనుసరించి పెంచిన నూతన రాగాంగ రాగములు చిక్కలి శ్రావ్యముగాను ఉన్నత ప్రత్యేక రాగ రస భావ రూపములను గలవిగా ఏర్పడినది నిదర్శనము. ఈ 72 రాగాంగ రాగ పట్టికలో పూర్వ ప్రసిద్ధ 18 మేళములును, ఇతర ప్రసిద్ధ ముఖ్యమైన రక్తి రాగములును జేరియుండెను. వెంకటమఖి కాలమునకు అప్రసిద్ధ మేళములకును, ఇతర రాగములకును పూర్వులు అమర్చిన మూర్ఛనలను ఏ మార్పును వెంకటమఖి చేయలేదు. అతను కల్పించిన 72 మేళములలో 42 మేళములు వివాది దోష స్వరములు గలవిగా (వాటిలో 7 మేళములు పూర్వ ప్రసిద్ధ 18 మేళములోనివి) నుండినను వానికి కల్పించిన మూర్చనల వల్ల అవి కూడా ఇంపైన రాగ రూపములను బొందినవి. ఉదా:—36 వ రాగాంగ రాగము, చలనాట, 39 వ రాగాంగరాగము, ధాళి వరాళి పైన వివరించినట్లు 72 సప్తకములకు ఉత్త సంజ్ఞ చక్ర నామములును, 6 సంజ్ఞ సంకేతాక్షరములు ఇచ్చిన వెనుక ఈ 72 రాగాంగ రాగములను జనక రాగములుగ భావించి వానికి నామములను చాతుర్యముగా కల్పించెను. అనగా ఆ నామములను జూచిన మాత్రమే ఈ రాగాంగ రాగము ఇన్నవ రాగాంగ రాగమని సులభముగా తెలియును. ఇది ఎట్లనిన వాటి నామములలో మొదటి రెండు అక్షరములు కటపయాది సూత్రపు గణిత విధిని అనుసరించి అమర్చియుండుటవల్ల ఆ రెండు అక్షరములను రాగాంగ రాగము యొక్క క్రమ సంఖ్యను పూహింప వచ్చును. కొన్ని నామములకు ముందు రెండు కటపయాది అక్షరములను జేర్చవలసి యుండినది.

వెంకటమఖి మొదటి మేళమునకు మాత్రము రెండు రాగాంగ రాగములను ఏర్పరచిరి. అవి ముఖారి (పూర్వ ప్రసిద్ధ 18 మేళములలో మొదటిది)యు కనకాంబరియు నగును. ఈ రెండు రాగాంగ రాగములను ఒకే రాగ స్వరూపముల గలవిగా నున్నను, ఆ రెండింటికి రెండు రాగాంగ లక్షణ గీతములు రచియించి ఆ రెండింటిలోను ఆ మొదటి రాగాంగ రాగముయొక్క లక్షణమును వివరించిరి. 72 వ రాగాంగ రాగములకు వెంకటమఖి రసమంజరి అను పేరు పెట్టిరి. కనుక రాగాంగ రాగ పద్ధతిని మనము మొదటి మేళము అరి అంబరి— 72 వ మేళము మంజరి పద్ధతి యన వచ్చును.

(8) వెంకటమఖి పూర్వ ప్రసిద్ధ 18 మేళములను చక్కగా పరిశీలించి, వాటిని తన 72 రాగాంగ రాగముల పట్టికలో వాటికి అమర్చబడిన మూర్ఛనలను మార్చక వానికి ముందుండిన నామములు కూడా అట్లే ఉంచుకొని, లేక కొన్నిటికి మాత్రము క్రొత్త నామములను కల్పించిన వివరమును ఈ క్రింది ఇవ్వబడియున్నవి.

I. ముఖారి : 1 వ మేళము కనకాంబరి అను పేరు ఇవ్వబడినది. (ఈ మేళమును ఈ కాలములో కనకాంగి అందురు.) ఈ రాగాంగ రాగములో వచ్చు సప్త స్వరములును శుద్ధ స్వరములు. ఈరాగాంగ రాగములకు మాత్రము వెంకటమఖి రెండు లక్షణ గీతములను రచించిరి.

ఒకటి కనకాంబరి లక్షణ గీతము—సూత్ర ఖండము గలిగి, దాని ఉపాంగ ఖండమందు దానియొక్క రాగాంగ రాగ పేరు (కనకాంబరి) చక్ర సంజ్ఞ పేరును, కటపయాది సంకేతాక్షరముల రెంటిని చూపింపబడియున్నది. రెండవ ముఖారి లక్షణ గీతము— ఉపాంగ ఖండమందు రాగాంగ రాగము పేరును చెప్పుటయే గాక ఒక జన్యరాగము శుద్ధ సావేరి యని తెలిపియున్నది. ఇట్లు మొదటి మేళమునకు మాత్రము దాని లక్షణము దెలుపుటకు వెంకటమఖి రెండు లక్షణ గీతములు రచియించి రెండింటిని రాగాంగ రాగములని చెప్పిరి.

II. సామవరాళి : 3 వ మేళము పేరును మార్చక కటపయాదులకుముందు రెండు అక్షరములు గా న తో గా న సామవరాళి యని పేరు గలిగినది. ఈ సామవరాళి సామవేదమునుండియే వచ్చినదని నమ్మబడిన ప్రసిద్ధ రాగము. ఈ రాగాంగ రాగమునకు సాటిగా శుద్ధ మధ్యమమునకు బదులు వరాళిమధ్యము గల ఉత్తర మేళముల లోనిదియై 39 వ రాగాంగ రాగము ధా ళి వరాళి యను వరాళియను నామమే గలది యైన ప్రసిద్ధమైన ఘన రాగము.

III. భూపాల : 8 వ మేళము : ప్రసిద్ధమైన ఔడవ రాగము. సప్త స్వరములు లేనందున ఈ రాగమునకు బదులు వెంకటమఖి ఈ మేళపు రాగాంగ రాగమునకు జ న తోడి యని పేరిడిరి. ఈ తోడి హిందుస్థాని సంగీతములో భైరవి యనుపేరు గలిగి ఆ పద్ధతిలో ముఖ్యమైన ఒక ధాట (మేళము)గా భావింప బడు చున్నది, వెంకటమఖి కాలమున ఈ

రాగము క్రొత్తదిగా ఉత్తరమునుండి వచ్చి పాడబడినందు వల్ల ఈ తోడి వెంకటమఖి ఔత్తర రాగమని వర్ణించిరి. భూపాల పూర్వ మేళమును వెంకటమఖి తన 9 వ మేళ రాగాంగ రాగమైన ధునిభిన్న షడ్జములో ఉపాంగ జన్యముగా జేర్చిరి మరియు ప్రసిద్ధ 8 వ మేళ జన్య రాగములని చెప్పబడు ధన్యాశి, ఆహిరి, ఘంట అను రాగములను 20 వ మేళ రాగాంగరాగమైన నారి రీతిగౌళ భాషాంగ జన్య రాగములని చెప్పియున్నారు.

IV. హెజ్జుజ్జి : 13 వ మేళము : గే య అను రెండు కటప యాది అక్షరముల జేర్చి పేరును మార్చక గేయ హెజ్జుజ్జి యని పేరు వ్రాసిరి.

V. వసంత భైరవి: 14 వ మేళము . దీనికిని పేరు మార్చక వాటి అను రెండు కటపయాది అక్షరములను జేర్చి వాటి వసంత భైరవి అని పేరిచ్చిరి.

VI. గౌళ : 15 వ మేళము . ప్రసిద్ధ 18 పూర్వ మేళములలో ముఖ్యమైన ఘనరాగము. ఈ రాగాంగ రాగమునకు వెంకటమఖి మాయా మాళవ గౌళ అని పేరు పెట్టిరి.(మాయా = హరిద్వార్, గౌళ = బెంగాల్), ఈ రాగాంగ రాగము అనేక ఉపాంగ, భాషాంగ జన్యరాగము లకు జనక రాగము.

## మా యా మా ళ వ గౌ ళ ము

(1) వెంకటమఖి కాలమునకు ముందే మాళవ గౌళ అను నొక రాగము ఉండెను. అదియే ఈ గౌళ మేళముగాని, ఈ మాయా మాళవ గౌళయేనా అని సందేహముగా నున్నది. ఏలయనిన గౌళ యని వచ్చు నామములు గల అన్ని రాగములకును గ్రహస్వరము నిషాదమని వెంకటమఖి చెప్పి యీ మాయా మాళవ గౌళ రాగాంగ రాగమునకు మాత్రము షడ్జ గ్రహ స్వరమని చెప్పియున్నారు.

(2) నాదరామక్రి (పేరు నాద నామ క్రియకాదు) ఈ రక్తి రాగము పురాతన కాలమునుండి 1 వ మేళపు సప్త స్వరములను గలిగి ప్రసిద్ధమయినది అన్యస్వరము ఏమి లేని ఉపాంగరాగము. కనుక ఈ నాదరామక్రిని 15 వ మేళమునకు రాగాంగ రాగముగ చెప్పియుండిన చాలా యుక్తముగా నుండును. మరియు ఈ నాద రామక్రి రాగమునకు సాటి అయిన శుద్ధ మధ్యమమునకు బదులు వరాళి (ప్రతి) మధ్యమము గల 51 వ మేళము కూడా శుద్ధ రామక్రి (రెండును రామ క్రిలే) కూడా చాలా ప్రసిద్ధమైనది.

(3) ఈ మాయామాళవ గౌళ రాగాంగ రాగమున గల స్వర ములలోనే సంగీత పితామహుడని కొనియాడబడు ఖ్యాతి జెందిన పురం దర విఠల దాసులు విద్యార్థులకు గాను స్వరావళి, అ ప్తాలంకారములు, జంట వరుసలు కల్పించిరని నమ్మబడుచున్నది తెలిసినదే. అయినను అతను రచించిన వేలకొలది పదములలో (పదగళు) ఒక్కటైనను ఈ మాయా మాళవ గౌళలో రచించబడినట్లు కనబడలేదు విద్యార్థులకై అతను రచించిన "శ్రీరయా నీరను" "పదుమ నాభా", అతను రచించిన గీతములు రెండును మాయా మాళవ గౌళ రాగములో రచించక వానిలో ఉపాంగ జన్యరాగమైన మలహరి యను రాగములో రచించిరి.

(4) ఈమాయామాళవ గౌళ రాగాంగరాగములో వెంకటమఖి రచించిన లక్షణగీతమునకు పిదప రామస్వామి దీక్షితులు వారే 108 తాళరాగమాలికలోని ఒక చరణము ఈ మాయామాళవరాగములు(మొదటగా) రచింపబడినట్లు కనబడుచున్నది. దీనికి వెనుక ముత్తుస్వామిదీక్షి తులవారి "శ్రీనాథాది గురు గుహో జయతి" అను గురుగుహ విభక్తి కృతి అతని మొదటి సాహిత్యము మాయామాళవగౌళలో రచించిన రెండవ కృతియని తోచుచున్నది.

7. భైరవి : 20వ మేళము. పూర్వప్రసిద్ధ మేళములలో చాలా ముఖ్యమైనది. అయినను ఇది పంచశ్రుతిధైవతమును గలిగి భాషాంగ రాగము గనుక ఈ 20వ మేళమునకు భైరవిని ఎత్తుకొనక, దానికి బదులుగా అతనికాలమున మిక్కిలి ప్రసిద్ధమైనదియు, ఘనరాగమైన దియు, ఈ 20వ మేళపు స్వరములు గలిగియుండిన రీతిగౌళరాగమును ఈ 20 వ మేళమునకు రాగాంగ రాగముగా ఏర్పరచి దానికి నారి అను రెండు కటపయాది అక్షరములు చేర్చి ఈ 20వ మేళపు రాగాంగరాగమును నారి రీతిగౌళ అని పేరిడిరి. ఈరీతి గౌళకు కూడా నిషాదమే గ్రహ స్వరము.

## సంగ్రహ చూడామణి

(1) సంగ్రహచూడామణి యను గ్రంథములకి ఈ రీతిగౌళ రాగమును 20వ మేళముందే జన్యముగా జేర్చియుండియు, ఈ చూడా మణి గ్రంథమునే ఈ కాలములో ఆధారముగా అనుసరింపబడుచున్నను ఈ కాలపు విద్వాంసులు ఈ రీతిగౌళలోని శుద్ధ ధైవతమునకుబదులు పంచశ్రుతి ధైవతమును ఉత్తరాంగ ప్రయోగములన్నిటిలోను వాడి ఈ రీతిగౌళను భాషాంగముగా మార్చి ఆ ప్రయోగములలో శ్రీరంజనిరాగము వలె వినిపించుచున్నారు. ఇట్లు పాడుట సంప్రదాయమునకు చాలా విరుద్ధము. ఈ పాడుక ఎట్లు వచ్చినదోయని వింతగా నున్నది.

(2) భైరవి పూర్వమేళము యొక్క ముఖ్యత్వమును గమనించి వెంకటమఖి ఈ భాషాంగ భైరవికి కూడా సూత్ర ఖండముగల ఒకలక్షణ గీతమును రచించియున్నారు. దాని ఆ భోగఖండమున దానిని భాషాంగ రాగమని చెప్పియున్నారు.

8. ఆహిరి · 21వ మేళము భైరవివలె ఈ ఆహిరి కూడా భాషాంగరాగము కాబట్టి, దీనికిబదులుగా ఈ 21వ మేళ రాగాంగరాగము నకు కిరణావళియని, పేరులోనే కటపయాది రెండు అక్షరములు గలది, యాది రెండు అక్షరములు గలదిగా పేరుపెట్టిరి.

ఈ ఆహిరి రాగములో కూడా వెంకటమఖి ఒక సూత్ర ఖండము గల లక్షణ గీతమును రచించి దాని ఆభోగఖండమున ఈ రాగమును భాషాంగరాగమని చెప్పియున్నారు.

ఈ రాగమును వెంకటమఖి 20వ రాగాంగరాగమైన నారి రీతి గౌళ యొక్క భాషాంగ జన్యరాగముల పట్టికలో జేర్చియున్నారు.

9. శ్రీరాగము 22వ మేళము · పురాతనకాలము నుండి మేళ ములన్నిటిలోను మిక్కిలి శ్రేష్ఠమయినదిగాను మొదటిదిగాను ఎంచబడు బడు ఘనరాగము ఈ కారణముల వల్ల ఈ వెంకటమఖి ఈ శ్రీరాగమును 22వమేళ రాగాంగరాగముగా చేర్చిరి. ఈ పేరులోనే మొదటి రెండుఅక్షర ములు శ్రీ రా అనుదియున్నవి

(1) కాపి అను రక్తిరాగమును ఈ 22వ మేళమునకు రాగాంగ రాగముగా ఏర్పరచియుండిన చాలా యుక్తముగా యుండును. ఈ కాపి స్వల్పముగా భాషాంగత్వము గలదైనందున వెంకటమఖి దీనిని రాగాంగరాగముగా భావింపరైరి. ఈకాపి ఆకాలమున పాడబడినవిధమునకు, ఈ కాలపు ఖరహరప్రియకును కొంచెము కూడా వ్యత్యాసములు లేక రెండును, ఒక రాగమనియే ఎంచవలసినదిగా నున్నది.

(2) ఈ కాపి రాగము హిందూస్థాని సంగీతములో ముఖ్యమైన థాటుగా (మేళము) చేర్చబడియున్నది. కొంతకాలమునకు వెనుక దానిని మన దక్షిణ సంగీతములో రుద్రప్రియ యను నామముతో 22వ మేళపు జన్యముగా చేర్చబడినది. ఈ పేరులో గల రుద్ర ఖరహర ప్రియయను పేరులో హర అను రెండును ఒకే అర్థము గలవిగా రెండు రాగములును ఒకటే రాగమని తోచునట్లుయున్నవి. కొంతకాలమువెనుక ఈ కాపిరాగము అంతరగాంధార, శుద్ధధైవత, కాకలి నిషాదములను అన్యస్వరములు గలిగి చాలా భాషాంగత్వము జెంది చాలా ఇంపైన రాగ భావముతో ఈ కాలములో కూడా ప్రకాశించు చున్నది

(3) వెంకటమఖి ఈ కాపి రాగములో ఒక లక్ష్య గీతమును రచించి యున్నారు. ఆ గీతము పాడి చూచితే ఆ కాపి ఈకాలపు ఖరహరప్రియ రాగముగానే వినబడుచున్నది

**10.** కాంభోజి: 28వ మేళము . భైరవవలె ఈ కాంబోజి మిక్కిలి ప్రసిద్ధమైనది —; అయితే ఇది కాకలి నిషాదమను అన్యస్వర మును గలదిగా భాషాంగ రాగమైనందున దీనిని రాగాంగరాగముగా దలచక దానికిబదులు కేదారగౌళ అను రక్తిరాగమును హరి అను రెండు కట పయాది మొదటి అక్షరములను చేర్చి ఈ 28వ మేళమునకు హరి కేదార గౌళయని పేరు గల్పించిరి వీరి లక్షణ గీతములో కాంబోజిని భాషాంగఖండమున చేర్చియున్నది

(1) వెంకటమఖి ఈ కాంభోజిరాగములో ఒక లక్షణ గీతముతో సూత్ర ఖండముతో సహా రచించి దాని ఆ భోగఖండమున ఈ రాగ మును భాషాంగరాగమని చెప్పియున్నారు.

(2) ఈ కాంభోజి ఉత్తర హిందూస్థాని సంగీతములో కాపివలె చాలా ముఖ్యమైన ఒక థాట (మేళము)గా వాడబడి ఖమాచ్ అను పేరు గల్గి, కొంచెము రాగభావమున కొంచెము మార్పుగలిగి కమాసు అను పేరుతో ఈ కాలమున దక్షిణమున చాలా ప్రసిద్ధముగాను రక్తి రాగము గాను కొంతకాలము హరి కాంభోజి అను 28వ మేళకర్త రాగమునకు కొంచెమును ఏ వ్యత్యాసము రాగభావములకి లేనిదియై యుండి, పిదప చాలా భాషాంగత్వమును జెంది ఈ కాలములో పాడబడు చున్నది.

**11.** శంకరాభరణము : 29వ మేళము: ధీర అను రెండు కటప యాది అక్షరములను ఈ రాగాంగరాగమునకు ధీర శంకరాభరణమని పేరును మార్చకయుంచిరి. ఈ 29వ మేళములోని స్వరసప్తకములను హిందుస్థాని సంగీతములో శుద్ధ స్వరములని చెప్పబడుచున్నవి. **Occidental** (పశ్చిమ) సంగీతపద్ధతిలో ఈ 29వ మేళపు క్రియస్వర సప్తకములను **"Natural Scale"** అనియు, **"Scale of just intonation** అనియు, **"Major Scale"** అనియు వారు వాడు రెండు మూడు మేళములో ముఖ్యమైనదిగా వాడుచున్నారు.

**12.** సామంత . 30వ మేళము ! ఈ సామంతమేళము క్రమమైన స్వర సప్తకమును గలది అయినను, దీని రాగభావమునకును శంకరా భరణమునకును చాలావరకు ఒక విధముగానే యుండుట గమనించి శంకరాభరణములోని అర్థమే గల నాగా భరణమని ఈ 30వ మేళము నకు రాగాంగరాగనామమును వెంకటమఖి పేరును పెట్టిరి. ఈ పేరులోని మొదటి రెండ అక్షరములు కటపయాది సూత్రమునకు అనుసరించి యుండుట తేట తెల్లము

**13.** దేశాక్షి . 35వ మేళము : దీనికి శూలిని అను మరొక పేరు కలదు. ఈ మేళమునకు వెంకటమఖి దేశాక్షి అను పేరును మార్చక శైల అను కటపయాది రెండు అక్షరములు చేర్చి శైల దేశాక్షి అని పేరు వ్రాసిరి.

**14.** నాట : 36వ మేళము : పురాతన కాలము నుండి చాలా ప్రసిద్ధమయిన, గాన ప్రారంభములో ముఖ్యముగా పాడతగిన ఘన రాగము లలో మొదటి ఘనరాగము. పూర్వాంగము ఉత్తరాంగము రెండింటిలోను వివాదిదోష స్వరములు గలిగియు దీనికి ఆదికాలముననే అమర్చబడిన మూర్ఛన ప్రకారము పాడిన వివాదిదోషము బొత్తిగా తొలగబడి ఉన్నతమైన రాగభావపూరితమై వెలుగును. ఈ మేళపు పేరును మార్చక చల అను కటపయాది రెండు అక్షరములను చేర్చి చల నాట అని రాగాంగ రాగమునకు పేరును వెంకటమఖి వ్రాసిరి. త్యాగయ్యగారు తాను రచిం చిన పంచరత్న కృతులలో మొదటిదియైన "జగదానంద కారకా" అను కృతిని ఈనాట రాగములో పూర్వకాలమున దానికి అమర్చబడిన మూర్ఛన ప్రకారమే ధాతువును అమర్చియుండుట గమనింప వలెను.

15. శుద్ధవరాళి . 39 వ మేళము · నాటవలె ఈ వరాళి కూడా పురాతనకాలము నుండి ప్రసిద్ధిగా పాడబడు ఘనరాగము. పూర్వాంగ ములో వివాది దోషమును గలది అయినను దానికి అమర్చబడిన మూర్ఛన పాడిన వివాదిదోషము తొలగింపబడి ఎక్కువరాగము భావ పూరితమై మన సంగీతము వెలుగు చున్నది. ఈ రాగమునకు ఏర్పడిన మూర్ఛన ప్రకా రమే ధాతువును అమర్చి త్యాగయ్య తన పంచరత్న కృతులలో ఒకటి యైన "కన కన రుచిరా" అను కృతి రచించియున్నారు.

ఈ వరాళి మేళమునకు జాలి వరాళియని పేరును మార్చక జాలి అను కటపయాది అక్షరములతో వెంకటమఖి పేరిడిరి.

ఈ వరాళికి సరియైన ప్రతిమధ్యమమునకు బదులు శుద్ధధైవ మునుగల రాగాంగరాగము 3 వ దైన గానసామవరాళి. ఇవి రెండు వరాళి అను పేరును గలవిగా యుండుట గమనింపవలెను.

**16.** పంతువరాళి . 45వ మేళము : ఇదియు ఇంకొక వరాళియే. దీనికిని పేరును మార్చక వెంకటమఖి శివ అను రెండు కటపయాది అక్షరములను జేర్చి శివ పంతువరాళి యని దీనికి రాగాంగరాగ పేరును వ్రాసిరి

**17.** శుద్ధరామక్రి : 51వ మేళము · 16వ మేళములో జన్య ముగా చెప్పబడు నాదరామక్రి దీనికి ప్రతి మధ్యమునకు బదులు శుద్ధ మధ్యమము గలదిగా ముందే చూపబడియున్నది ఈ రామక్రి మేళమునకు వెంకటమఖి పేరును మార్చక కాశీ అను కటపయాది రెండు అక్షరము అను జేర్చి కాశీ రామక్రి అని పేరిడిరి.

18. కల్యాణి · 65వ మేళము · వెంకటమఖి కాలమునకు కొంచెము ముందుగా ఉత్తరము నుండి వచ్చి ఇచ్చట ప్రసిద్ధమైన భక్తిరాగము. దీనికి పేరును మార్చక శాంత అను రెండు కటపయాది అక్షరములు చేర్చి శాంత కల్యాణి అని పేరును వ్రాసిరి.

హిందూస్తానీ సంగీత పద్ధతిలో ఈ రాగమునకు సమముగా ఇమన్ అను పేరుతో ఒక మేళముగా (థాట) అని వాడబడుచున్నది. ఈ పేర ఇమన్ అనుట గమనించిలే ఈ రాగము అరేబియా దేశము నుండి మన దేశమునకువచ్చి ఉత్తరదేశసంగీతములో ప్రసిద్ధమై దక్షిణము నకు వచ్చి ఇచ్చటను చాలా ముఖ్యమైన రక్తిరాగమైనది తెలియవచ్చు చున్నది. ఈ ఇమన్ అను (ఉత్తర) రాగమును ఇమ్న కల్యాణియను పేరుతో తన 65 వ మేళ రాగాంగరాగ శాంతకల్యాణి లక్షణ గీతమున భాషాంగ ఖండ మందు వెంకటమఖి చేర్చియున్నారు. ఈ ఇమ్న కల్యాణియే ఈ కాల ములో యమునా కల్యాణి అను పేరు గలిగిన దగుచున్నది.

19. సింహారవ . 58 వ మేళము ఇది పూర్వ ప్రసిద్ధ మేళ ములో చేరినది కాదు. ముందుగానే, అనగా 72 మేళములను కల్పించు టకు ముందుగానే, వెంకటమఖి సింహారవమను ఈ రాగమును కల్పించి యుండిరి దానినే ఇప్పుడు 58 వ రాగాంగరాగముగా జేర్చి దేశి అను కటపయాది అక్షరములతో దేశి సింహారవమని పేరును వ్రాసిరి.

(ఎ) పైన వివరించిన పూర్వ ప్రసిద్ధ మేళములలో వివాది దోష ములు గల 6 మేళములు:— (1) శుద్ధముఖారి, (2) సామవరాళి, (3) హెజ్జజ్జి, (4) దేశాక్షి, (5) నాట, (6) వరాళి. ఈ ఆరు మేళము లను పురాతన కాలమునుండి ప్రసిద్ధియైన నాటి వివాది దోషములను హరించునట్లు వాటికి ఏర్పరుపబడిన మూర్ఛనల ప్రకారము అవి వాడ బడుచుండుట ముఖ్యముగా గమనింపవలసిన విషయము. వెంకటమఖి ఈ రాగముల మూర్ఛనలను ఏ విధమైన మార్పును చేయక వానిని రాగాంగరాగములుగా తన 72 పట్టికలో చేర్చుకొనిరి

(బి) ఈ 19 పూర్వ మేళముల నగమనించిన పిదప 72 మేళ ములలో మిగిలిన ఇతర 53 మేళములకు వాటికి ఉచితమైన వాటిరాగ భావము చక్కగా ప్రకాశించు నట్లును వాటిలో వివాది దోష మేళము లోను వివాది దోషమును హరించునట్లును తగిన మూర్ఛనలను కల్పించి కటపయాది రెండు అక్షరములతో గూడిన పేళ్లను వాటికి వ్రాసెను.

ముఖ్యముగా అతను గమనించినది ఆ రాగాంగములు సప్తస్వరము లను గలవిగా యుంచవలెనను విధి. ఇట్లు అతను కల్పించిన మొత్తపు 72 రాగాంగముల మూర్ఛనలను 4 విధములు :— అవి (1) సంపూర్ణము, (2) షాడవ సంపూర్ణము, ఉదా —3వ మేళము, (3) వోడవ సంపూర్ణము, ఉదా:— 1వ మేళము, (4) వక్రి సంపూర్ణము, ఉదా —10వ మేళము.

(సి) జన్యరాగములు:— వెంకటమఖి కల్పించిన ఈ రాగాంగ రాగములు 72 గాక వేరు సంఖ్యలేనివి ఎన్నో వాడుకలో గల వానికి వానిలో వచ్చు స్వరములను, వాని ముఖ్యసంచార ప్రయోగ క్రమములకు చక్కగా గమనించి చూచి వానికి తగిన మూర్ఛనలను కల్పించి ఈ రాగాంగ జనక రాగములలో జన్యరాగములుగా అమర్చిరి ఈరెండు విధములు (1) ఉపాంగ రాగము అనగా తన జనకమేళమందు గల స్వరబేదములను మాత్రము గలిగి ప్రకాశించునవి, (2) భాషాంగములు : అనగా పూర్వము నుండి వాడబడిన ప్రకారము ఒకటి లేక రెండు తన జనకమేళమందు లేని అన్యస్వరములు వచ్చు సంచార ప్రయోగములచేత ప్రకాశించునవి.

జన్యరాగములు లక్షముల కొలది రాగాంగజనకరాగములకు జన్య ములుగా కల్పించ వచ్చుననియు, అయితే అట్లు కల్పింపబడినవి అన్నియు రాగరస భావము గలవి కానేరవనియు, ఆ రాగములు గీత రాయ ఆలాప ప్రబంధములలో ఉపయోగించుటకు అర్హతలేనివి యని వెంకటమఖి దృఢముగా చెప్పియున్నారు.

9. (ఎ) వెంకటమఖి తాను కల్పించిన 72 రాగాంగ రాగములను వానిలో జన్యరాగములుగా జెప్పబడిన యితర రాగములను వాని రాగరస భావ రూపములు చక్కగా వివరముగా నెరిగించుటకై ఒక్కొక్క రాగాంగరాగమునకు (1) లక్షణగీతమును, జన్యరాగమునకునుకాని ఉపాంగ లేక భాషాంగ రూపములు బాగుగాను తేటగాను తెలియునట్లు (2) లక్ష్య గీతములును, (3) రాగసంచార ప్రయోగములు విశదపరచు తానము లును, (4) కొన్ని ప్రబంధములును రచించిరి.

1. గీతములు : వెంకటమఖి కాలములో మొదటి ముఖ్యత్వము గల ప్రబంధముగా నుండి చతుర్దండి ప్రకాశికలో మొదటి ముఖ్యమైన దండిగా ఎంచబడినందున వెంకటమఖి ముఖ్యముగా రచించినవి గీతములు. ఈ గీతములలో —

(1) మాతు . (అనగా సాహిత్యము) సంస్కృతభావమైన ప్రాకృతాది భాషాపదములును, ఆభోగఖండ మాతువులలో అర్థములు లేని అ ఆ, ఇయ, తియ, అంకోఇయ, అరే అను శబ్దములు గలిగి, మన దేశములో గల ముఖ్యమైన అన్ని క్షేత్రదైవత స్తుతిగా వ్రాయ బడినవి.

(2) ధాతు ·(అనగా వర్ణమెట్టు) . గీతము మూడు ఖండములు (అంగములు) గలవి. అంతరి అను ఖండముగల గీతములలో దానియొక్క ఉద్గ్రాహ (మొదటి) ఖండమును పాడిన వెనుకను, ఆభోగఖండము లెక్క ఖండములను పాడిన పిదపయు అంతరిని పాడి గీతమును ముగించ వలెను. అంతరి లేని గీతములను వాని ఉద్గ్రాహ ఖండమును పాడిన వెనుకను, ఆ భోగఖండములను పాడిన వెనుకను, ఉద్గ్రాహ ఖండమునే పాడి దానిలో అమర్చబడిన ధ్రువ (నిలుపు) ము నందు గీతమును నిలుప వలెను. కొన్ని గీతములలో తన అంకితము చూపించుటకు గాను రెండవ ఆ భోగఖండము కల్పించి యున్నారు.

పూర్వము నుండి సంప్రదాయముగా వాడబడు ప్రసిద్ధమైన సప్తతాళములలోనే ఈ గీతములను వెంకటమఖి రచించిరి. వాటిలో ఏకతాళము యొక్క విస్తరింపే యుంపట తాళము అనగా ఇప్పు ఆదితాళముగా మార్చబడ గలదు. కొన్ని గీతములు రగణమధ్యమను మఠ్య తాళ విస్తరించిన రూపముగల తాళములో గనబడుచున్నవి.

(బి) వెంకటమఖిచే రచింపబడిన లక్ష్యములు .—

1. రాగాంగరాగ లక్షణగీతము .— ఈ గీతమునకు గల మాతువు (సాహిత్యము)లో తాను కల్పించిన 72 రాగాంగరాగముల పేళ్లను, అవి వచ్చు చక్రముల సంజ్ఞ పేళ్లను, వాటి కటపయాది సంకేతాక్షరములను బహు చమత్కారముగా ఈ గీతమును 15వ రాగాంగరాగము మాయా మాళవ గౌళములో జన్యమైన గుండక్రియ రాగములో రచింపబడినది.

2 లక్షణగీతములు :— 72 రాగాంగరాగములకును వాని ప్రత్యేక లక్షణ రూపములు వివరముగా తెలియుటకై వీనికి అమర్చిన మూర్ఛనలను దప్పక 72 లక్షణ గీతములు రచింప బడెను. ఈ గీతముల అంగములు :—

(మొదటిది) సూత్రఖండము: (ఇది ఉద్గ్రాహఖండమే), దీని మాతువుల ఒక్కొక్క ఆవర్తపు మొదటి అక్షరములను వరుసక్రమముగా తన జనకమేళ క్రమసప్తక స్వరాక్షరములుగా తేలునట్లు మిక్కిలి చాతుర్యముగా రచింప బడినది.

(రెండవది) ఉపాంగఖండము. (ఇది ఆభోగఖండమే) :— దీని మాతువుల రాగాంగరాగము పేరును, దాని చక్ర సంజ్ఞానామమును, ఆ రాగాంగరాగము యొక్క సంఖ్య తెలుపు కటపయాది సంజ్ఞ 2 అక్షరములును అమర్చబడినది. ఇదిగాక ఉపాంగ జన్యరాగములుండిన వాని పేళ్లను ఈ ఖండములోనే ఇమిడింప బడియున్నది.

(మూడవది) భాషాంగ ఖండము (ఇది మరొక ఆభోగఖండము) దీని మాతువులో భాషాంగజన్య రాగముల పేళ్లను చేర్చి ఇవ్వబడియున్నవి. భాషాంగ జన్యరాగములు గల రాగాంగరాగ లక్షణ గీతములకు మాత్రమే ఈ భాషాంగఖండమున గలదు.

(1) 53వ మేళమైన గమకక్రియ రాగాంగరాగమునకు అమర్చబడిన ధాతువునకు వెంకటమఖి రెండు మాతువులను కనుపించియున్నారు. మొదటి మాతువు లక్షణ గీతమునకు కావలసిన సూత్రఖండమును గలది రెండవ మాతువులో ఈ రాగమును రాగాంగరాగమని చెప్పక దానిని పేరున గమకక్రియ అని మాత్రము అనిపించియున్నారు. 72 మేళములను గల్పించుటకై ముందే ఈ గమకక్రియ రాగము ప్రసిద్ధముగా ఉండుటబట్టి బహుశా ఈ గీతమును ఈ రెండవ మాతువుతో వెంకటమఖి బహుశా రచించియుండవలెననుట విదితము.

(2) రాగాంగరాగములలో చేర్చబడని ప్రసిద్ధ పూర్వ మేళములలో కొన్నిటికి వెంకటమఖి లక్షణగీతములు, అనగా సూత్ర ఖండములు గలవిగా, రచించియున్నారు. ఇవి భైరవి, ఆహరి, కాంభోజి అను మూడు భాషాంగరాగములు. వానికి లక్షణగీతములోని ఆభోగ ఖండమందు భాషాంగ రాగములని రచించియున్నారు. ఈ మూడును క్రమముగా 20, 21 28వ మేళములోని భాషాంగ జన్య రాగములు.

(3) ఇవిగాక వెంకటమఖి సౌరాష్ట్ర అను 15వ మేళములోని భాషాంగజన్యరాగమును చాలాముఖ్యముగా దలచి దానికి గూడా ఒక లక్షణ గీతము సూత్ర ఖండముతోసహా రచించియున్నారు. దీనిసూత్ర ఖండపు మాతువులో 15 వ మేళపు క్రమస్వరసప్తక స్వరాక్షరములుగా తెలియునట్లు రచించియున్నారు.

శ్రీ సుబ్బరామదీక్షితులు ఈ భాషాంగరాగమైన సౌరాష్ట్రలోని అన్యస్వరములైన పంచశ్రుతి ధైవతమును, కైశికినిషాదమును ఈ గీతమందు అవి వచ్చుచోట్లను విశదముగా ఆంగ్లేయ గురుతులతో వానిని చూపించియున్నారు.

(4) సారంగ అనుగారాగమును అతి ముఖ్యముగా నెంచి దానిని ఒక ప్రత్యేక 72 మేళములలో జేర్పలేని మేళముగా భావించి ఒకలక్షణము రచించియున్నారు. దీని వివరము క్రింద వివరించెద.

3. జన్యరాగములన్నిటికిని వాటి రాగభావముల విశదపరచి చూపించుటకై వెంకటమఖి వాటికి లక్షగీతములు రచించియున్నారు. కొన్ని గీతములలో రెండవ ఆభోగ ఖండము రచించి తన అంకితములను దెలిపియున్నారు. ఈ అంకితములో తనపేరుగాక, తనతండ్రిపేరు, తల్లిపేరు కూడా ఇమిడించి రచించియున్నారు.

## 72 మేళములకుపై ఎక్కువ 120 సంఖ్యల మేళముల కల్పన సాధ్యము :

(ఎ) సారంగమేళము.

1 వెంకటమఖి సారంగరాగమును 65వ రాగాంగరాగమైన శాంత కల్యాణిలో భాషాంగరాగముగా చెప్పి శాంత కల్యాణియొక్క లక్షణ గీతములోని భాషాంగఖండమందు దానిని పేరును చేర్చక విడిచిపెట్టిరి. దీనికి కారణము ఈ సారంగరాగమును 72 మేళములలో జేర్చరాని ఒక ప్రత్యేకత మేళమని దలచినందువల్ల యుండవలెననుటకు సందేహమే లేదు.

2. ఈ సారంగ రాగమునకు (మేళమునకు) రచించిన లక్షణగీతములో నుండు సూత్ర ఖండనమున తెలుపబడిన క్రమస్వర సప్తక స్వరాక్షరములు శాంతకల్యాణికి గత స్వరసప్తకమునకు కొంచెము వ్యత్యాసముగా నున్నది. అనగా:— 65వ మేళరాగాంగరాగ శాంతకల్యాణి స్వర సప్తకము... స రి గు మి ప ధి ను, సారంగమేళపు స్వరసప్తకము... స రి గె మి ప ధు ను.

ఈ గె అను వికృతిగాంధారము వెంకటమఖి స్థాపించిన స్థాయిలోని 16 స్వరములలో లేనిది. అనగా గ గి గు అను మూడు గాంధారములపై గె అను గాంధారము శుద్ధమధ్యమస్వర స్థానములో శుద్ధమధ్యమ స్వర ధ్వనితో వినబడును. వెంకటమఖి ఈ సారంగరాగమునకు వ్రాసిన లక్షణ శ్లోకములో ఈ గె అను స్వరమును ప్రత్యేకముగా శుద్ధమధ్యమ గాంధార మనుపేరు గలదిగా చెప్పియున్నారు. ఈ వివరములను గమనించితే సారంగ అనురాగము వెంకటమఖి కాలములో ఏ రాగభావము గలదిగా ఎట్లు పాడబడి వచ్చినదని తెలబడును. తుళజమహారాజు కూడా తన "సంగీత సారామృత"మను గ్రంథములో ఈ రాగమును సారంగమేళమని జెప్పి దానికి గల స్వరసప్తకమును వెంకటమఖి చెప్పిన విధముగానే ఇచ్చియున్నారు. ఈ సారంగరాగమును హిందూస్థాని సంగీత పద్ధతిలో శుద్ సారంగ్ అని ఈ కాలములో కూడా వాడుచు దానిలో వచ్చు స్వరములలో రెండు మధ్యమములను (కోమల మను, తీవ్ర మిను) రెండు నిషాదములను (కోమల నిను తీవ్ర ను ను) కనుపించి యున్నారు.

3. (1) బృందావన సారంగ లేక బృందావని (షాడవరాగము— వరాళి మధ్యమవర్జము) రాగమును, మధ్యమాది సారంగ (సురాగము— మధ్యమావతి — ఔడవరాగము— మధ్యమును గ్రహ స్వరముగా గలది— వరాళి మధ్యమమును కాకలి నిషాదములును రెండు వర్జములు) ఈ రెండు రాగములను వెంకటమఖి సారంగమేళములో జన్యరాగములని ఎంచి తన పట్టికలో సారంగ మేళము లేనందున, ఈ రెండు రాగములను 22వ మేళ రాగాంగరాగమైన శ్రీరాగ జనకరాగములో భాషాంగ జన్యరాగములుగా జేర్చి శ్రీరాగ లక్షణ గీతములోని భాషాంగ ఖండమునందు చెప్పియున్నారు.

(2) ఈ కాలములో విద్వాంసులు కొందరు బృందావని రాగమును సరిమపను అను ఔడవ రూపముగల రాగముగ పాడుచున్నారు.

ఇట్లు పాడు జాడవ రాగము 23వ మేళమునకు గౌరీ మనో హరి జన్యమైన లవంతిక అను రాగమగును. అనగా ఈ లవంతిక రాగమును బృందావని అని పాడుచున్నారు.

(3) ఈ సారంగ మేళమునకు జన్యములుగా చెప్పగలిగిన కొన్ని గలవు. (ఇప్పటి సంగీత గ్రంథములలో వానిని వానిలో వచ్చు స్వరములను బట్టి వానికి తగినటు జనకమేళములను చెప్పబడియున్నది). వాటిలో హంసానంది అను రాగమొకటని చెప్పవచ్చును. ఈ హంసానందిని 60వ మేళకర్త రీతిమతి జన్యమని చెప్పుదురు. ఈ హంసానంది రాగమును కూడ దానిలో రావలసిన పంచశ్రుతి ధైవతమును గొత్తిగా వర్జించి షాడవత్వమును మార్చి ఔడవ రాగముగా మార్చి వరట అను రాగముగా పాడుతున్నారు. ఈ వరట రాగము 59వ మేళకర్తలో జన్యరాగముగా తెలుపబడియున్నది.

(బి) 1. గ, గి గు అను మూడు గాంధారములు గాక నాల్గవ గె అను గాంధారము మధ్యమ స్థానములో ఆమధ్య మధ్యమ స్వరధ్వనితో గలదని చూచితిమి.

2. దీని ప్రకారము మధ్యమ స్వరస్థానమునకు క్రింది స్వరస్థానమైన అంతరగాంధారమును అంతర గాంధార ఋషభమను పేరుతో నాల్గవ ఋషభ వికృతి స్వరముగా ఎంచవచ్చుననుట నిదర్శనము అనగా మనకు ర, రి, రు, రె, అను నాలుగు ఋషభములు లభించినవి

3. ఈ విధముగానే మధ్యమములు కూడా నాలుగు విధములు గల విగా, మ, మి, ము, మె అని చెప్పవచ్చును. వీటిలో శుద్ధమధ్యమమును మ అనియు వరాళిమధ్యమమును మె అనియు వ్రాసి అంతర గాంధార స్థానములో దోచు మధ్యమమును మి అనియు, సాధారణ గాంధార స్వర స్థానమునందు వచ్చు మధ్యమమును ము అనియు మార్చివ్రాయుట యుక్తము.

4. పూర్వాంగములో షడ్జ పంచముల నడుమగల 6 స్వరస్థానము లలో ఈ నాలుగు విధములైన ఋషభగాంధార మధ్యమములను అవి గలుగువిధమును, వానికివ్వబడిన క్రొత్తనామములును, వాని కిప్పుడు క్రొత్తగా ఇవ్వబడిన స్వరాక్షములను విశదముగా ఈ క్రింది వ్రాసియున్నాము:—

## షడ్జము (వాది)

పూర్వాంగము 1) మొదటి స్వరస్థానము. . .ర అనుశుద్ధ ఋషభము,

2) రెండవ స్వరస్థానము... .రి అనుపంచశ్రుతిఋషభము

గ అను శుద్ధగాంధారము,

3) మూడవ స్వరస్థానము....రు అను షట్చ్రుతిఋషభము

గి అను సాధారణగాంధారము

ము అను సాధారణగాంధార

మధ్యమము,

4) నాల్గవ స్వరస్థానము. . .రె అనుఅంతర గాంధార

ఋషభము,

గు అను అంతర గాంధారము

మి అను అంతర గాంధార

మధ్యమము

5) ఐదవ స్వరస్థానము. . .గె అను శుద్ధమధ్యమ

గాంధారము

మ అను శుద్ధమధ్యమము,

6) ఆరవ స్వరస్థానము. . . .మె అను వరాళి మధ్యమము

పంచమము (సంవాది)

(ఉత్తరాంగమున గల ధైవత నిషాదములలో ఏ మార్పునులేవు)

(సి) ఇట్లు మనకు లభించిన ఈ ఋషభ, గాంధార, మధ్యమములను వానిభేదముల మూలముగా గణితము మూలముగా ఋషభగాంధార మధ్యమ ప్రస్తారములు 20 దొరుకును. ఈ 20 ప్రస్తారములను క్రింద చూపించబడినవి.

1. ర,గ,మ, 2.ర,గ,మి, 3.ర,గ,ము, 4.ర,గ,మె. 5. ర,గి,మి, 6 ర,గి,ము, 7 ర,గి,మె, 8.ర,గు,ము, 9.ర,గు,మె, 10.ర,గె,మె, 11.రి,గి,మి, 12.రి,గి,ము, 13.రి,గి,మె, 14. రి,గు,ము, 15.రి,గు,మె, 16.రి.గె.మె, 17. రు. గు, ము, 18 రు, గు,మె. 19.రు,గె,మె, 20.రె,గె,మె

వెంకటమఖి తన పూర్వాంగములోని ప్రస్తారములను చక్రము లనియు వానిని ఉత్తరాంగములోని ధైవత నిషాదముల ప్రస్తారము లతో గుణించి 72 మేళములు కల్పించిన విధముగానే పైన మనకు లభ్యమైన 20 ప్రస్తారములను 20 చక్రములుగా భావించి ఒక్కొక్క చక్రమును ఉత్తరాంగ ధైవత నిషాదములను 6 ప్రస్తారములచే గుణించితే మనకు 20 × 6 అనగా 120 మేళములు సాధించవచ్చును. అనగా 72 మేళ ములకు అధికముగా 48 మేళములు కల్పింపబడినవి. ఈ 120 మేళము లలో వివాది దోషము గలవి 88 (72 మేళములో అవి 40). ఈ 120 మేళముల పద్ధతిలో సారంగమేళము 16 వ చక్రములో 6 వ మేళ ముగా కానవచ్చును దాని సప్తక్రమ స్వరములు సరిగెమె ప ధును అని వెంకటమఖి యొక్క సారంగ రాగ లక్షణ గీత సూత్ర ఖండమున ఇచ్చిన ప్రకారముండుట తెలియు చున్నది.

(డి) మధ్యమ గ్రామమందును ఈ 120 మేళము లుండుట చూడ వచ్చును ఈ మధ్యగ్రామమునందు, షడ్జగ్రామమువలె గాక, పూర్వాం గము షడ్జము మొదలు మధ్యమువరకు సరిగమ అను నాలుగు స్వర ములు గలవిగా (Tetrachord) ను ఉత్తరాంగము మధ్యమునుండి తార షడ్జము వరకును పధనిస అను 5 స్వరములు (Upper Pentachord) అనగా షడ్జగ్రామపు పూర్వాంగ ఉత్తరాంగములు తలక్రిందగా మారి వున్నవి. ఈ మార్పువల్ల ఈ మధ్యగ్రామమున (aconcties) విధుల ప్రకారము షడ్జ మధ్యమ రెండు స్వరములును వాట ప్రకృతి గుణ ముల వల్ల మధ్యమము వాదిత్వమును పొంది రెండు చివరలనుండు షడ్జములు మధ్యమమునకు సంవాదిగా వినబడును. అనగా షడ్జగ్రామ ములో షడ్జము వాది స్వరము, పంచమము సంవాది స్వరము, మధ్యమ గ్రామములో మధ్యమము వాదిస్వరము, షడ్జము సంవాది స్వరము. ఈ వాది మధ్యమము ఈ గ్రామములో పాడబడునప్పుడు గానము మొత్తమునకు 2 స్వర శ్రుతుల (2½ tons) ఎక్కువ గలది నట్లు మనకు తోచును.

ఈ మధ్యమ గ్రామ స్థాయిని ఈ క్రింది పథకముతో విశదపరచి యున్నది:—

| ——పూర్వాంగము—— | | | ——ఉత్తరాంగము—— | | | |
|---|---|---|---|---|---|---|
| | క్రింది tetrachord 4 స్వరములు | | | పై Pentachord 5 స్వరములు | | |
| V | | | V | | | V |
| స, | రి, | గ, | మ, | ప, ధ, | ని | స |
| సంవాది | | | వాది | | | సంవాది |
| స | | | (స) | | | (స) |

ఈ మధ్యమ గ్రామములో కూడా షడ్జగ్రామమున వలె 120 మేళములు లభింపగలవని సులభముగా గానవచ్చును. ఈ గ్రామము లోని 120 మేళముల షడ్జగ్రామపు 120 మేళములవలెనే యుండును అయితే ఈ గ్రామములో 6 చక్రములలో ఒక్కొక్క దానిలోను 20 మేళములుగా నవ్వును.

1932 లో 72 మేళములకు ఎక్కువగా 36 వ్యుత్పన్నము మేళములు గలుగునని చెప్పియుంటిని ఆ 36 మేళములును ఈ 120 మేళములలో చేరినవని గాన వచ్చును.

(ఇ) ఇట్లు మనకు లభించిన ఈ 120 మేళములన్నియును (ముఖ్యముగా వాటిలో వివాది దోషముగల మేళములు) వెంకటమఖి అభిప్రాయపడినట్లు, అవి ఉత్తమ క్రమ స్వర సప్తక ఆరోహణ అవరోహణ రూపము గలిగినందున రాగములు కానేరవు వెంకటమఖి చేసినట్లు ఈ 48 క్రొత్త మేళములను బాగుగా పరిశీలించి వానికి తగిన రాగ భావ రూపములు గలిగించునట్లు మూర్ఛనలను కల్పించి అట్లు దొరకు క్రొత్త రాగాంగ రాగములుగా ఆ మేళములను మార్చవలెను ఇటు చేసిన సంగీత లక్ష్యమార్గము ఇంకను ఎక్కువగా వృద్ధిపొంది ప్రకాశించును.

11 సంగ్రహచూడామణి కర్త, రాగములు, లేక మేళకర్త రాగములు:—

(ఏ) "సంగ్రహచూడామణి" అను సంగీత గ్రంథము— గ్రంథకర్త గోవిందాచార్యులు సుమారు 150 సంవత్సరములకు మునుపు రచింపబడినదిగ తెలియ వచ్చుచున్నది ఆంధ్ర వైష్ణవుడైన ఈ గోవిందాచార్యులు తంజపురిని ఏలిన కడపటి మహారాష్ట్ర రాజైన శివాజీ మహారాజ సంస్థానపు విద్వాంసులలో ముఖ్యుడుగా నుండెను. ఈ సంగ్రహ చూడామణిలో వర్ణింపబడిన సంగీత లక్షణము ప్రకారమే తత్కాలపు సంగీత లక్షజ్ఞులు అనుసరించు చున్నారు. ఈ గ్రంథములో వెంకటమఖి కల్పించిన 72 రాగాంగ రాగములను జన్యరాగములుగా భావింపబడి, వానికి సరియైన 72 మేళములను అనగ 72 క్రమ సంపూర్ణ స్వర సప్తక ఆరోహణ అవరోహణములను (Scales) 72 మేళకర్త రాగములుగా లేక కర్త రాగములుగా జనకరాగములుగా ఎంచబడి, ఇతర రాగములను ఈ మేళకర్తలలోని జన్యములుగా వర్ణింపబడినవి ఈ జన్య రాగములను, రాగాంగ రాగములు సహా, వానికి అమర్చబడిన మూర్ఛనలను రాగ భావమును గమనింపక వాని సంపూర్ణ, షాడవ, ఔడవ ప్రస్తార రూపములైన ఆరోహణ అవరోహణ క్రమముల ప్రకారము ఆ 72 మేళ కర్తలకు జన్యములుగా చెప్పబడి యున్నది

గోవిందాచార్యులు ఈ 72 మేళకర్తలకే క్రొత్త పేళ్లను కటపయాది సంజ్ఞ రెండు అక్షరములతో గూడిన దానిని కల్పించిరి. మొదటి మేళకర్తకు కనకాంగి అనియును, కడపటి 72 మేళకర్తకు రసికప్రియ అనియును పేరుగల ఈ మేళకర్తల రాగ పద్ధతిని కనకాంగి— రసికప్రియ పద్ధతి యని వర్ణింప వచ్చును. ఈ గ్రంథమున అనుబంధముగా సుమారు 300 లక్షణ గీతములు, 72 మేళ కర్తలున్ను ఇతర జన్య రాగములకును చేర్చి ఇవ్వబడి యున్నది. ఈ లక్షణ గీతములు ఎవరు రచించిరో చెప్పయుంచలేము. జన్య రాగములలో అనేక రాగములు వెంకటమఖి పట్టికలో లేనివిగా కనబడు చున్నవి. 300 లక్షణ గీతములును త్రిపుట తాళములో అమర్చబడి, వాని మాతువులలో వానిలో వచ్చు స్వరములను చెప్పి, కడపటి ఆవర్తములలో రాగముల ఆరోహణ అవరోహణ స్వరూపములు ఇవ్వబడి యున్నవి.

ఈ సంగ్రహ చూడామణి గ్రంథమునకు శరభోజి మహారాజా ఆదరణచే ఎక్కువ ప్రచారముచేసి ఆ గ్రంథమును తెలుగులోను, అరవములోను వచన రూపముగా వ్రాయబడిన ప్రతులను విద్వాంసులకు ఉచితముగా ఇవ్వబడినవి. ఈ కారణమువల్ల వెంకటమఖి సంప్రదాయమునకు బదులు గోవిందాచార్యులు స్థాపించిన సంప్రదాయము ప్రకారము కర్ణాటక ఆధునిక సంగీత పద్ధతి స్థిరమాయెనది— దీనికి మరొక కారణము— వెంకటమఖి వెనుకటి వంశమువారు చతుర్దండి ప్రకాశికను విద్వాంసులకు సులభముగా దొరకనీయక రహస్యముగా నుంచుకొనిరి. ఇదిగాక తంజపురి ఏలిన కడపటి నాయకరాజు విజయరాఘవ నాయకుడు మరణించినప్పుడు తంజపురిలో చాలా చరిత్రసంబంధమైన కలవరములు గలిగి క్రొత్తగా మహారాష్ట్రుల రాజ్యము స్థాపింపబడినది— ఈ కారణము వల్ల కూడా చతుర్దండి ప్రకాశిక అంతగా విద్వాంసులకు దొరకక పోయెను

(బి) మరికొన్ని సంగ్రహ చూడామణిలోని కనకాంగి— రసికప్రియ మేళకర్తలకు ఆదరవుగా చెప్పబడు విషయములును, వానికి సమాధానములును —

1 త్యాగయ్య— సంగ్రహ చూడామణి —

త్యాగయ్యగారి వద్ద ఒక ప్రతి సంగ్రహ చూడామణి యుండినది నిదర్శనము. ఆ ప్రతిని అతను చాలా ఉత్తమమైన గ్రంథముగా భావించి తన ప్రియ శిష్యులకు కూడా నగపడకుండ తక్కిన తన గ్రంథములలో చేర్చక దానిని ప్రత్యేకముగా దాచిపెట్టి తాను మాత్రము ఉపయోగించు చుండెను.

నారదుడు ప్రత్యక్షమై పరమశివుని ఆజ్ఞవొప్పున "స్వరార్ణవము" అను దైవికమైనవొక గ్రంథమును త్యాగయ్యగారికి ఇచ్చినటు నమ్మబడు చున్నది ఇట్లు నమ్మబడుటకు కారణము:—త్యాగయ్యగారు రచించిన "స్వరరాగసుధారస" అను శంకరాభరణ రాగ కృతి యొక్క ఒక చరణములో "రజతగిరీశుడు నగజకు దెల్పు స్వరార్ణవ మర్మములను" అను సాహిత్యమున స్వరార్ణవమను పదము ఉండుట బట్టి స్వరార్ణవమను గ్రంథము ఒకటి ఉండినట్లు నమ్మబడినది. త్యాగయ్యగారు ఈ కృతిలో ఇటు స్వరార్ణవమను పదమును సాహిత్య రచన ప్రాసమునకు గాను ఇమిడించి యుండవలె ననుట నిశ్చయము. త్యాగయ్యగారికి వెనుక ఈ గ్రంథము ఎవరికిని దొరక లేదు. వారి ఇతర గ్రంథములన్నియు సంగ్రహ చూడామణితో సహా దొరికినవి. ఈ కారణమువల్ల, సంగ్రహ చూడామణియే ఈ దైవిక స్వరార్ణవముగా నుండవలెనను వ్యూహ నిదర్శనము దీనికి సందేహమే లేదు. ఇదిగాక రజత, గిరీశుడు నగజకు సంగీత మర్మములను దెలిపినట్లు వచ్చు సాహిత్య ప్రకారమే సంగ్రహ చూడామణి గ్రంథములో కూడా మొదటి శ్లోకములోనె పరమశివుడు పార్వతికి సంగీత విషయములను ఉపదేశించినట్లు కనుబడుట గమనింపవలెను. మరియు గ్రంథమును స్వరార్ణవమని చెప్పక, మేళార్ణవము, రాగార్ణవము అని ఇట్లు వేరు పేళ్లను పెట్టి యుండవచ్చును కదా.

త్యాగయ్యగారి వద్ద ఈ గ్రంథము ఉండి, దానిలోని పద్ధతి ప్రకారము కొన్ని మేళకర్త రాగములలోను, కొన్ని జన్య రాగముల లోను అతను కృతులు రచియుండుట బట్టి అతని వెనుకటి సంగీతజ్ఞులందరును త్యాగయ్య సంగ్రహ చూడామణినె పూర్తిగా తన లక్ష్యగ్రంథ

ముగా భావించిరని నమ్మి ఈ కాలములో అందరును సంగ్రహ చూడామణి లక్ష్య గ్రంథముగా వాడు చున్నారు ఇట్లు అయినందుకు ముఖ్య కారణము, పైన చెప్పినట్లు, వెంకటమఖి చతుర్దండిలో కనుపించిన నిజమైన కర్ణాటక సంగీత సంప్రదాయము ఎవరికిని దొరకనీయక ఆ గ్రంథమును వెంకటమఖి వంశస్థులు దానిని చాలా రహస్యముగా ఎవరికిని దెలుపక దాచిపెట్టుటయే.

(1) త్యాగయ్యగారి పంచరత్నకృతులలో నాట రాగములోను, వరాళి రాగములోను గల రెండు కృతుల ధాతువును గమనించితే ఆ రెండు రాగములును ఉత్త మేళకర రాగములు లేక ప్రాచీనమై వాటికి ఏర్పడిన మూర్ఛనల ప్రకారమే వాడబడియుండుట కానవచ్చును. తక్కిన వివాది దోషము గల రాగములతో అతను రచించిన కృతులు కొద్దే మరియు అవి త్యాగయ్యగారు అమర్చిన **original** ధాతువులో ఏ మార్పులేక మనకు దొరకవు— అందుచే వాటిని గురించి వివాదించుటే అనవసరమని తోచుచున్నది.

(2) సంగ్రహ చూడామణి తనకు దొరుకుటకు మునుపే త్యాగయ్య నూరకుపైగా సంఖ్యగల గొప్ప **master pieces)** కృతులను ముఖ్యమైన రక్తి రాగముల నన్నిటిలోను వానికి పూర్వము నుండి అమర్చబడిన మూర్ఛనము అనుసరించి రచించి యుండిరి, సంగ్రహ చూడామణి తనకు దొరికిన పిదపనే దానిలోని కొన్ని నూతన విచిత్ర వింత జన్యరాగములలో (ముఖ్యముగా 20 వ, 22 వ, 28 వ మేళముల)ఒక్కొక్క దానిలోను ఒకటి లేక రెండు ఉదాహరణమునకు— చాలా సులభ ధాతువులు గల సామాన్య సులభశైలి కృతులను రచించిరి. ఆ గ్రంథములోని చాలా రాగములను అతను వాడలేదు.

(3) త్యాగయ్య 22 వ మేళకర్త ఖరహరప్రియ, 28 వ మేళకర్త హరికాంభోజి రాగములలో చాలా ముఖ్యమైన గొప్ప కృతులు రచించి యున్నారు. ఇవి చాలా ప్రబలమైనవిగా ఇప్పుడును వాడబడు చున్నవి.

ఈ ఖరహరప్రియ మేళరాగము పూర్వపు కాపి రాగమే. రెంటికిని రాగ భావ రూపము ఒక్కటియే యనుట స్పష్టము.

హరికాంభోజి మేళ రాగము కూడా పూర్వపు సంప్రదాయ రూపము గలిగిన కమాసు రాగమే అనుట పూర్వకాలపు కమాసు రాగముల కృతులను గమనించితే సులభముగా తెలియును.

(4) ఇదిగాక త్యాగయ్యగారు తన కృతులకు రాగములు ఇవియని తన ప్రియశిష్యులకు కూడా చెప్పక మరచిరని ఒక వదంతి. శిష్యులు వారుగా ఆ కృతులకు రాగములు కనిపెట్టవలసినదిగా నుండెనది పిదప వచ్చిరి తచ్చూరు శింగరాచార్య సోదరులు త్యాగయ్యగారి కృతుల రాగములను సంగ్రహ చూడామణి పద్ధతి ప్రకారము అన్ని కృతులకు వ్రాసిరని వినికిడి.

2. సంగ్రహ చూడామణి గ్రంథ గోవిందాచార్యులకు వెనుక అతని గ్రంథమును అక్కరగా ననుసరించి ఎక్కువ ప్రచారము చేసిన వారు ఎంద్రగిరి రంగాచార్యులు తచ్చూరు శింగరాచార్య సోదరులును. సంగ్రహ చూడామణిలోని 300 లక్షణ గీతములను బహుశా ఈ రంగాచార్యులు రచించి యుండవలెను. తచ్చూరు శింగరాచార్య సోదరులు ప్రచారమునకై మొదట మొదటగా సంగీత లక్షణ లక్ష్య గ్రంథములు వ్రాసిరి. వానిలో సంగ్రహ చూడామణి మార్గములనుచూపించిరి. కాని గోవిందాచార్యుల పేరును సూచింపరైరి.

3 శ్రీ మహావైద్యనాథశివన్ వారి 72 మేళరాగమాలిక:— ఈ రాగమాలిక చాలా ప్రసిద్ధమైనది. గొప్ప **master piece composition** అని దానిని పొగడుదురు. ఈ రాగమాలిక 72 మేళకర్త రాగముల సంగ్రహ చూడామణిలోని కంగి— ప్రియ పద్ధతి ప్రకారము రచింపబడియుండుట తేటతెల్లము. శ్రీ శివన్‌గారు నిజమైన సంగీత సంప్రదాయమును బాగుగా ఎరిగిన వారైనను చతుర్దండి ప్రకాశికను చూడక, సంగ్రహచూడామణిని చదివి దానిని తెలుగులో వ్రాసి ఉంచుకొనిరి

ఆ కాలమున తంజపురి ఏలిన శరభోజిరాజుయొక్క అల్లుడు ఆనరబుల్ వి. ఆర్. ట. సఖారాం సాహెబ్ అను ప్రభువు పేరేపణ వల్ల తన పై స్తుతిగా మహారాష్ట్ర సాహిత్యముగా సంస్థాపనకు వెంకటరావుచే రచింపబడిన సాహిత్యమునకు సంగ్రహ చూడామణిలోని 72 మేళకర్త రాగములను అనుసరించి కంగి— ప్రియ కర రాగముల పేళ్లను గలిగిన ఆ సాహిత్యమునకు తగిన రాగమాలికగ ధాతువును రచించమని నిర్బంధ పరచగా, మిక్కిలి అయిష్టముతో ఆ ప్రభువుకు భయపడి అతని ఆజ్ఞ ప్రకారము "బాహాట్టర—మేళ రాగమాలిక" అను పేరుతో 72 రాగమాలికను రచించెను ఈ రాగమాలికను 1883 లో సంగ్రహ చూడామణి గ్రంథమున అనుబంధముగ చేర్చబడినది. శ్రీ శివన్‌గారు నరస్తుతి సాహిత్యమును పాడుటకు కొంచెము కూడ ఇష్టపడక ఆ మహారాష్ట్ర సాహిత్యమునకు బదులు తన ఇష్ట దైవము ప్రణతార్తిహర నిమీద స్తుతిగ క్రొత్త సంస్కృత సాహిత్యమును ముందు తాను కల్పించిన ధాతువుతోనే చిట్ట స్వరములను చేర్చి ఇప్పుడు వాడుకలో నున్నట్లు రచించిరి

(బి) ఇప్పుడు కొన్ని సంవత్సరములుగా (50 సంవత్సరములు) ప్రబలముగానుండుఅనేకమంది **top** సంగీతవిద్వాంసులు(వారిలో కొందరిని సంగీత కచ్చేరి పంథాకు మార్గదర్శులనుట కూడా చెప్పవచ్చును.)సంగ్రహ చూడామణిలో చూపబడి వాడుకలోనుండు రాగరసభావము కొంచెము కూడాలేని 40 వివాది దోషములు గల మేళకర రాగములను వానికి పూర్వము అమర్చబడిన మూర్ఛనలను తెలియని కారణమును, వానిని భావపూరితముగా పాడలేనందును ఆ 40 మేళకర్తలను నిరాకరించి, మిగిలిన 32 మేళకర్త రాగములు మన సంగీతమునకు చాలునని అభిప్రాయ పడుచున్నారు. ఇది వాస్తవమే.

వాటికిగల సంప్రదాయ మార్గము తెలియక తత్కాలపు అనేక విద్వాంసులు తమ స్వర, లయ జ్ఞానమును వినువారికి, రసికులకు, తెలియపరచవలెనను అభిలాషతో తమ కచ్చేరీలలో ఆ రాగముల గల వివాది దోషములుగల స్వరములను స్పష్టముగ దోషముల గలవిగానే వినిపించియు, చాలాదురితకాలమున స్వరములను శ్రుతిని గమనింపక, లయ విన్యాసముతో ముఖ్యమని దలచి పెక్కు చోట సాహిత్యముల పదచ్ఛేదములుచేసి పాడుట గమనించితే నీ పక్కవాద్యముగా ఉండవలసిన, మృదంగ విద్వాంసునితో పాటకుడు అనుసరించి పక్కపాటగా వినబడి భ్రమ గలుగు చున్నది దీనివల్ల రసికులకు ఇంపైన రాగ భావములు కొంచెము కూడా వినబడక ఉత్త **thril, excitement** మట్టుకు గలుగుచున్నది ఇప్పటికాలపు రసికులు కూడా ఈ **thril, excitement** అంశములనే కచ్చేరీలలో ఎదురుచూచుచు వాడుకై యున్నది.

(సి) 1904 లో శ్రీ సుబ్బరామదీక్షితులు తన "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను గ్రంథమూలముగా వెంకటమఖి స్థాపించిన నిజమైన సంప్రదాయ ఆధునిక కర్ణాటక సంగీత పద్ధతిని బయలు పెట్టి యున్నారు. ఈ గ్రంథములో తెలిపియుండువిధముగా 40 వివాది దోషములను రాగపూరితము గలవిగా చక్కగా పాడగలిగి వానిని నిరాకరింపవలసిన నిర్బంధములేక పెద్దల పురాతన కాలమునుండి మనకు అబ్బిన సంగీతమును వృద్ధిచేసి కాపాడ నచ్చును.



బాలకృష్ణుడు

సేకరణ - శ్రీ కోదూరు శ్రీరామమూర్తి

# పిచ్చి వెంకట్రావు

## శ్రీ మధురాంతకం రాజారాం :: (కథానిక)

ఏ భాషలోనైనా పడికట్టు మాటలని కొన్ని వుంటాయి. 'ఆత్మబలం' అనేది అలాంటి వాటిల్లో ఒకటేమోనని నా అనుమానం! అడపాదడపా మనం వండుకుతినే ఒక కాయను నేతిబీరకాయగా వ్యవహరించడం లేదా? అలాంటి బలమే కావాలి. ఆత్మబలం గూడా! సిసలైన భౌతిక దృష్టిలో లెక్కగడితే, మనిషికున్న శక్తుల పరిమితి చాలా స్వల్పం! ఏదీ, ఒక పెద్ద రాతి గుండును తలకెత్తుకో మనండి చూద్దాం! చేతుల బలంతో ఒక చిన్న యినుపగుండును పిండి గొట్టమనండి ఒప్పుకుందాం! అంతెందుకు, పిడికెడు ఉక్కు శనగలు నమిలి, మ్రింగి జీర్ణం చేసుకోవడమైనా, సాధ్యం కాదే! వాస్తవం యిదై వుండగా లోకంలో ఎక్కడాలేని, ఓ బలం తన ఆధీనంలో వున్నట్టు వూహించి, దానికి అందంగా 'ఆత్మబల' మని పేరుగూడా పెట్టుకున్న మానవుణ్ణి చూస్తుంటే జాలి పుట్టుకొస్తుంది! నా మనోరాజ్యపు వంటింట్లో కూర్చుని రకరకాల అపోహల పాలిటికి తిరుగులేని ద్రవ్య రసాయనాలను తయారు చెయ్యడం నా వృత్తిగాదులెండి, హాబీ! ఆత్మబలమనే అపోహను సోకార్చడం కోసం, ఘాటైన ఓ పేటెంటు మందునా తయారు చెయ్యడానికని ఒక వంటింటి కుందేటితో నా కెంతో కాలంగా అవసరం వుంది. చిర కాలానికి నా కోరిక నెరవేరింది అయాచితంగా వో వ్యక్తి రంగంలో ప్రవేశించాడు.

అసలింతకూ పిచ్చి వెంకట్రావు గారికన్నా ముందుగా ఆయన కీర్తి మావూళ్ళో అడుగు పెట్టిందని చెప్పాలి. మడతలు చెరిగి, ముడతలు, పడిన దుస్తుల్నయినా ఆయన ఏ మాత్రం బిడియం లేకుండా తొడుక్కోగలడు తల దువ్వుకున్నాడన్న మాట ఆయన జీవిత చరిత్రలో ఎప్పుడో అరుదుగా గానీ కనుపించని విశేషం. శుభ్రంగా ఆయన చొక్కా గుండీలు వేసుకోగా చూచిన వాళ్ళు లేరు మిట్ట మిధ్యాహ్నపు మిడిమిడి ఎండలో చెప్పులులేని వట్టి పాదాలతో తారురోడ్డు పైన, నడవ గలగడం ఆయనకే చెల్లు! అలాగని యిలాంటి వాలకం వల్ల ఈయన లుబ్ధాగ్రేసరుడని ఒక నిర్ణయానికి రావడానికి సైతం వీల్లేక పోవడమే విచిత్రం! తుపాన్లు, కరువులు, అగ్ని ప్రమాదాల్లాంటి అవాంతరాలు వచ్చినప్పుడు (తన తరువాత వాళ్లని మొగ మాటంలో పెట్టాలన్న దురుద్దేశంతోనే కావాలి.!) చందాల జాబితాలో తన అంతస్తుకు మించిన పెద్ద సంఖ్య వేయడం ఈయన రివాజు. అన్నింటికీ మించి ఈయన వ్యక్తిత్వంలో కొట్టొచ్చినట్టుగా కనిపించే ప్రత్యేక లక్షణం ఒకటుంది. అదేమిటంటే—తనను తాను మరచిపోవడం! ఆఫీసు రూంలో కూచుంటే దీపాలువెలిగి జామురేతిరి గడచినా పని పూర్తయ్యేదాకా పైకి లేవడు. క్లాసులో పాఠం చెబుతుంటే, గంట మ్రోగినా, చెవిలో పడదు. రోడ్డుపైన ఏ మాత్రం పరిచితుడు ఎదురైనా వాడి బాగోగులన్నీ సాకల్యంగా విచారించి, తన మూలంగా అతడి కేదైనా తోడ్పాటు అవసరమనిపిస్తే, ఆపని చేపట్టిన తర్వాత గానీ, ఆయన తృప్తిగా నిట్టూర్చడు ఒకటా రెండా! ఇలా ఎన్నో లీలలు వెంకట్రావు గారివి! అన్నట్టు మరొక ముఖ్యమైన వర్తమానం. వెయ్యికి మించిన విద్యార్థులతో అదొక రాజ్యంలా వున్న పెద్ద హైస్కూలు నుంచీ ఈయన ఒక మారు మూల కొంపకు కొట్టుకొచ్చాడంటే యిందుకు కారణం గూడా పనిష్ మెంటు ట్రాన్స్ఫరేనట!

ఎంత శిక్షకు అంత నేరం వుండే వుండాలి. అదేమిటకితెలుసుకోవాలని పించడం సహజం. రాబోతున్న పై ఉద్యోగిని గురించిన వివరాలను ఆరా తీసి, తెలుసుకోడంలో నా సహోద్యోగులు చెప్పుకోదగ్గ శ్రద్ధ తీసుకున్నారని, నిస్సందేహంగా చెప్పగలను

గుడిలోపలి విగ్రహాన్ని మూల విరాట్టుగానూ, జిల్లా పరిషదధ్యక్షుణ్ణి నేలపైన నడియాడే ప్రత్యక్ష దైవతం గానూ భావించడం, తదను గుణంగా, నడుచుకోడం, టెంకాయలోకి వచ్చే నీళ్ళలా పరిషత్తు ఉద్యోగుల్లో నాటుచేసుకునే సుగుణం. ఎన్నికలు జరిగి కొత్త అధ్యక్షుడు ఆఫీసు భవనాలకు అవతారమెత్తి రెండేళ్ళు గడచినా, ఈ ప్రబుద్ధుడు, వెంకట్రావు గారు నచ్చుకొకసారైనా శ్రీవారి భేటీకి వెళ్ళ లేదంటే, యితడిదంతా ఉలిపి కట్టె వాటమని, చెప్పడానికి యింకొక దృష్టాంతం అనవసరం! 'ఎంద రెందరో కొమ్ములు తిరిగిన వాళ్ళే వెళ్ళొచ్చారు. మీరూ వెళ్ళి రావాలి ఆలస్యమైనందుకు కోప్పడలేరేమో! పరవా లేదు. దాసరి తప్పులు దండముతో సరి!' అంటూ శ్రేయోభిలాషులు మందలించక పోలేదు. అయితే ఆ హితవు నేమీ లెక్కపెట్టకుండా ఈ పిచ్చి వెంకట్రావు మహాశయుడు 'అయ్యా! చేర్మను గారయ్యేదీ, చెవుల పిల్లిగారయ్యేదీ, ఆయనతో నాకు పని వుంటేనే నేను వెళ్లేది. పనిలేకుండా వెళ్ళి గొప్పవాళ్ళ అమూల్యమైన, కాలాన్ని పాడుచేసే హక్కు నాకెక్కడుంది? అనేశాడట! మరైతే విధేయతను సహించడానికైనా, ఓ హద్దుంటుంది గదా! వేచి చూచే ఓపిక నశించి స్వయంగా చేర్మను గారే ఒకసారి స్కూలుపైకి, 'విజిటేత్తి' వచ్చేశారట! వచ్చింది కారులోనా! మరేమన్నానా? శబ్దం వినిపించగానే, గబగబా పరుగెత్తి రావద్దా? చేదోయి ఫాలతలానికి సోకగా నమస్కారం చెప్పవద్దా? దయచేయండి, దయచేయండి అంటూ సంభ్రమంగా లోపలికి తీసుకెళ్ళే కనీసపు మర్యాదకైనా, కరువు రావడమా! ఛేర్మను గారు కారుదిగి మెట్లెక్కి టక్కు టక్కు మంటూ నడచుకుంటూవెళ్ళి ఎట్ట యెదుట నిలబడేటంత వరకూ ఈయన గుండ్రాయిలా కుర్చీలో బైరాయించే వున్నాడట! అప్పుడిక తల పైకెత్తి చూశాడేమో నింపాదిగా లేచి నిల్చుంటూ, ఒక నమస్కారం చెల్లించి, దిక్కులేని హుందాతనమంతా వెళ్ళబోస్తూ, 'అయ్యా! కూచోండి. అన్నాడట! సరే, ఆయన తల పంకించి వుంటాడు ఇతగాడిలో మాట లెందుకు లెమ్మని చక్కా తన దారిని తాను వెళ్లిపోయి వుంటాడు. ఆయనలా వెళ్ళిపోగానే సహోపా

ధ్యాయులు, ఈయనగారిని చుట్టు ముట్టి ఒక వరుస జాడించి పారేశారట! అప్పుడీయన నిజంగానే బిక్క మొగం పెట్టి 'ఆగండి బాబూ! ఆగండి! శాంతి, శాంతి!' అంటూ అభయ వచనాలు ప్రారంభించేశాడట! 'అయ్యలారా! మీరందరూ బుద్ధి మంతులు, నా మూలంగా యిక్కడేదో పెద్ద అపచారం జరిగిపోయినట్లు మీరు భావించడం నామట్టుక నాకు ఒక భ్రమ ప్రమాదంగానే తోస్తూ వుంది. ఇప్పుడొచ్చి వెళ్ళిన ఛైర్మను గారిలాంటి వాళ్లని కొన్ని వేలమందిని నాయీ చేతులతో నేను మలిచాను. అందుకొకరు నన్ను గౌరవించాలని నేననుకోను. ఛైర్మను గారు మాత్రం, అవసరం లేని మర్యాదల కోసం అర్రులు చూస్తారని మీరెందుకనుకుంటారో నా కర్థం గాదు. ఆయన గౌరవం ఆయనకు చెల్లింపబడింది. మీ పాటుకు మీరు వెళ్ళండి' అంటూ ఈయన తనకు బుద్ధి చెప్పడం కోసం వచ్చిన వాళ్ళను మెత్త మెత్తగా దులిపి పంపించేశాడట!

అంతే సంగతులు! పదిరోజులు తిరగక మునుపే ట్రాన్స్ఫర్ ఆర్డర్ చేతి కందింది.

ఎంతటి గడుగ్గాయి ఉద్యోగస్థుడైనా తనతప్పు తాను తెలుసుకోవలసిన సందర్భం. ఇక్కడదేం లేకపోయింది. ఈ దుస్థితికి మూల కారణమైన తన బుద్ధిమాలిన తనాన్ని నిందించుకోవడం పోయి, ఈ దుర్గతి, తాకిడికి గుంగలు చుట్టుకుని కృంగిపోవలసింది పోయి, అప్పటికీ బదిలీ ఉత్తరువు నేషనల్ అవార్డుతో సమానమైనట్టు, విటారుగా తలపై కెత్తుకుని బాణావరానికి విజయం చేశారు వెంకట్రావు గారు!

'అయ్యో పాపం! ఎంత పని జరిగి పోయిందండి!' అంటూ ఓదార్చడం కోసం తనను పరివేష్టించిన ఉపాధ్యాయ బృందాన్ని ఉద్దేశించి, పరిసరాలన్నీ కలయ జూస్తూ ఆయన ప్రారంభించేశాడు. 'ఇదేనటండీ స్కూలు,! ఆహా, ఏం పూచాయండీ యిక్కడ మోదుగు చెట్లు! దూరంగా ఎవడో దేవతా పురుషుడు పడుకున్నట్లు పెద్ద కొండ! దాన్నిండుగా పచ్చని చెట్లు. అక్కడినుంచి మామిడి తోపులు. సమీర ముడిలాంటి మిట్టపైన బడి. హాయిగా, ప్రశాంతంగా మోడల్ స్కూలంటే యిలాగే వుండాలి..'

ఏడవాలో, నవ్వాలో, తోచిందిగాదు నాకు! బాణావరంలో వున్న ఏకైక అయ్యరు హోటల్లో వరుసగా వారం రోజుల పాటు భోజనం చేసిన వాడు, అన్నింకన్నా ఆకుల అలములు మేయడమే సుఖమన్న నిర్ణయానికి రాగలడు. ప్రొద్దుపోయి గాలి కాస్త చల్లబడితే చుట్టుప్రక్కల మిట్ట పొలాల్లో వున్న పాములన్నీ షికారు సల్పడానికని వూళ్ళోకి వచ్చేస్తాయి. ఎండా కాలాలో త్రాగడానికి నీళ్ళు దొరికితే బ్రహ్మాండం. చలి కాలాలో విషజ్వరాల కిది ఇష్టరాజ్యం. వెరశి అన్ని ఋతువులలోను పరిత్యజనీయం బాగా వరం! ప్రత్యేకించి హైస్కూలు హెడ్మాస్టరుకు యిక్కడ ఎదురయ్యే ఇదనపు బాధ ఒకటుంది. ఈ స్కూలుకు పోస్టు చేయబడ్డ టీచరుకైనా యిదొక మజిలీయేగానీ, గమ్యస్థానం కాదు. ఆరుబయలలో నెలకొల్పబడినప్పటికీ జైలు జైలే! జైలు వార్డెన్లలాంటి ఈ టీచర్లకన్నీ విధాలా తగిన వాళ్ళే విద్యార్థులు గూడా! వీళ్ళు చదువులపైన, పెద్దపెద్ద ఆశలు పెట్టుకోరు. పడుతూ, లేస్తూ, పదో తరగతి దాకా బండిలాగ్గి ఓ మోస్తరు చిన్న కొలువును అంది పుచ్చుకోవాలనుకుంటారు. కొట్టినట్టుగా కొడితే, ఏడ్చినట్టుగా ఏడుస్తానన్న భార్యా భర్తల ఒప్పందంలాంటిది యిక్కడ గురువులకు శిష్యులకు మధ్య అమల్లో వుందనుకోవచ్చు! పరిషత్తు వాళ్ళ యాజమాన్యం క్రింద ఎడారులు ధ్రువ ప్రాంతాలు, శిలా మయ ప్రదేశాలు మొదలైనవి లేక పోవడం వల్ల ప్రవాస శిక్ష విధించడాని కనువుగా యిదొక్కటే మిగిలింది! ఈ బడిని బాగుచేసే ప్రధానోపాధ్యాయుడు గతంలో పుట్ట లేదు. భవిష్యత్తులో పుట్టడు.

ఇలాంటి హైస్కూలు ఒకటి కేవలం తనకోసంగానే ఏర్పాటై వున్నట్టు వెంకట్రావుగారు ఆనందానందం వెళ్ళబోస్తూ రావడం మా కందరికీ చాల ఆశ్చర్యం కలిగించింది. రేయిం బవళ్ళు ఆయన ఆఫీసు రూములోనే తిష్ఠ వేసేవాడు. విద్యార్థులు గనుక లాంతరాలు వెలిగించుకుని బడి కొచ్చేస్తే, రాత్రిపూట గూడా పాఠాలు చెప్పడానికి సిద్ధపడ్డాడు. పారపలుగూ కడవలూ ఎకెటూ తెప్పించి సాయంకాలాల్లో పూలతోట పెంపకానికి చర్యలు తీసుకున్నాడు. మరుభూమిలో 'పచ్చ విప్లవం' ప్రారంభమైందంటే నమ్మడం కష్టమే! ఇందులో 'సిన్సియారిటీ' పాలెంత, నటన పాలెంతో తెలుసుకునే కుతూహలంతో ఓ రోజు ఉదయం యింకా భళ్ళుమని తెల్లవారక మునుపే స్కూల్లోకి వెళ్ళాను. శుభ్రంగా ముఖాలు కడుక్కుని, పద్మాసనాలు వేసుకుని నేసిపెట్టిన బొమ్మల్లా కుర్రవాళ్ళు పాఠాలు వల్లించు కుంటున్నారు.

హెడ్మాస్టరుగారు కోడికూడితో లేచి స్నానానికి వెళ్ళినట్లు తెలిసింది. బస్సుపైన బాణావరం కొస్తుండగా రోడ్డు కల్లంతదూరంలో ఆయన కొక చెరువు కనిపించిందట! చెరువు నీరు ఎంతో స్వచ్ఛంగా వున్నట్లు తోచడంతో యికపైన తన కదే స్నానఘట్టంగా ఆయన నిర్ధారణ చేసేశాడట! వూరికీ, చెరువుకూ మధ్య దూరం ఎంతలేదన్నా మూడు కిలో మీటర కు తక్కువుండదు.

దారిలో బడి బంట్రోతు సుబ్బన్న ఎదురయ్యాడు. రంగాపురం వెళ్ళి అయ్యగారికోసం అప్పటమైన పాలు తీసుకొస్తున్నాడట!

"అదేమిటోయ్ సుబ్బన్నా! అయ్యగారికి ఉండూరు పాలు సరిపడవా?" అన్నాను.

"ఇదొక్కటే గదండి ఆయనకున్న ఆదరువు! ఉదయం అరపడి పాలు పుచ్చుకుంటే, రాత్రులో మిగిలిన అరపడితోబాటు రెండో, మూడో అరటిపళ్ళు పుచ్చుకుంటాడు. మధ్యాన్నం ఒక పూట ఏం తింటాడో అదే తినడం! ఈ మారొచ్చినప్పటినుంచి మధ్యాన్నాల్లో నేనూ యింటి కెళ్ళడం లేదనుకోండి! కారియర్‌లో మిగిలివున్న దేదో నాకూ సరిపోతుంది. ఇక్కడ మాత్రమే కాదులెండి, ఆయ నెప్పుడూ యింతేనట! తిండి తినడంకోసం పుట్టిన నాడిలా కనిపించడు..." మాట్లాడుతూ కెరటంలా ముందుకు సాగిపోయాడు సుబ్బన్న.

మనిషి పిట్టలా వుంటాడు పిట్ట మేతలతో పొట్ట బోసుకోవడం సముచితమే!

హాస్య రసభరితమైన పుస్తకాన్ని చదువుతూ, చదువుతూ మధ్య మధ్యలో అందులోని సంఘటనల్ని నెమరుకు తెచ్చుకుని కాసేపు నవ్వుకోడం చదువరుల కందరికీ అనుభవంలోని విషయం. మా స్టాఫ్

ఇంతకి నిన్నటి తలాకేటి కాలక్షేపానికి కొదవ లేక పోయింది. 'ఈరోజేం జరిగిందో తెలుసా?' అంటూ ఒకరు. ఆ ఉదంతం పూర్తయ్యీ కాక ముందే 'మీకు తెలుసునో తెలియదో, మొన్న యింకొక తమాషా జరిగింది' అంటూ యింకొకరు! ఏకసి ప్రతిలోనుంచీ నూలు పోగును తీసినట్టుగా, వెంకట్రావుగారి దిన చర్యల్లోనుంచి, రకరకాల వినోదాంతాల్ని వెలికి తియ్యడం సహోపాధ్యాయుల కొక 'ఎక్స్‌ట్రా కరిక్యులర్ యాక్టివిటీ' అయిపోయింది.

పదకొండున్నరకు సరిగ్గా రెండో పీరియడ్ పూర్తవుతుంది. ఓ రోజు ఉదయం పెద్ద ముల్లు 'ఏడు'ను సమీపిస్తున్నా గంట మ్రోగక పోవడం గమనించి వెంకట్రావుగారు 'సుబ్బన్నా! గంట కొట్టు' అంటూ హెచ్చరిక చేశారు. 'సుబ్బన్న పోస్టాఫీసుకు వెళ్ళాడండీ! ఇంకా రాలేదు' అన్నాడు గుమాస్తా. 'ట్రెయిన్ లేటైంది గదూ! ఈటపా రావడమూ లేటే! సుబ్బన్న గూడా డిటో' అన్నాడు జూనియరు తెలుగు పండితుడు నాథముని. 'ఒకరోజు ట్రెయిన్ రాదనుకోండి! ఆరోజంతా యితడు పోస్టాఫీసు వదలిపెట్టి బడికి రాడన్న మాటేగదా!' అంటూ ఓ వక్రోక్తి విసిరాడు హిస్టరీ అసిస్టెంటు రామసుబ్బారెడ్డి. వాళ్ళల్లో వాళ్ళిలా తర్జన భర్జనలు పడుతుండగానే టంగు టంగున గంట రెండు సార్లు మ్రోగింది. 'ఏదీ సుబ్బన్న వచ్చేశాడా! లేదే' అనుకుంటూ వాళ్ళు వరండాలోకి తొంగిచూచేసరికి సుత్తిని యథాస్థానంలో వుంచి హెడ్మాస్టరుగారు తిరిగొస్తున్నారు.

ప్యూనుకే 'సబ్స్టిట్యూటు'గా వ్యవహరించగలిగిన తర్వాత హెడ్మాస్టరుగారు అసిస్టెంటు టీచర కాపాట ఉపకారం చెయ్యడానికి ముందుకు రావడంలో విడ్డూరమేముంది? టీచరు సెలవు పెట్టడం వల్ల ఏ క్లాసయితే ఖాళీగా వుంటుందో, అక్కడల్లా ఆయనొచ్చి వాలేవాడు. నారదుడికి శ్రీకృష్ణ పరమాత్ముడు తన అష్ట భార్యల మందిరాల్లో కనిపించినట్టుగా ఒక రూములో ఆరో తరగతి కుర్రాళ్ళకు విదుర నీతి పద్యాలు వివరిస్తూ వెంకట్రావుగారు, ఇంకొక గదిలో పదో తరగతికి ఆర్కిమెడీస్ సూత్రం బోధిస్తూ వెంకట్రావుగారు. వేరొకచోట ఎనిమిదో తరగతి గదిలో ద్వివర్గ సమీకరణలు విశదీకరిస్తూ వెంకట్రావుగారు.

వెంకట్రావుగారి విశ్వరూపాన్ని చూచిన కొద్దీ నాకు లోపల్లోపల ఆయనపట్ల అనుతాపం కలిగిన మాట వాస్తవం. తోడి మానవుణ్ణిగా ఆయనకు తగునైన సలహా ఒకటి యివ్వ దలచుకున్నాను వయసు భేదం, ఉద్యోగ స్థాయిలోనూ ఆయనకూ నాకూ వున్న తేడాను పురస్కరించుకుని నా సలహాను వీలయినంతలో ఒక విజ్ఞప్తిగానే తీర్చి దిద్దాను "చూడండి సార్! మీరూ బాగా పెద్దవాళ్ళయిపోయారు. మన శరీరాలు ఉక్కుతో చేసిన వేమీకావు. ఇవి తట్టుకోగల చాకిరీకి హద్దంటూ ఒకటుంటుంది. మీవంటివారు తమకు మాలిన ధర్మాల జోలికి వెళ్ళక పోవడం చాలామంచిది ..."

తన శరీరంవైపొకసారి చూచుకుని ఎంతో నిర్లక్ష్యంగా నాలుక చప్పరించేశారు వెంకట్రావుగారు "ఓయబ్బ! ఈ శరీరాని దేముంది లేవోయ్ రాఘవులూ! ఇదొక పనిముట్టు. దీనితో ఎంత 'మాగ్జిమమ్' పని చేయించుకోవచ్చో, అంతా చేయించుకోవాలయ్యా! బద్ధకంవహించి వంతమేరకు యిది త్రుప్పుపట్టిపోతుందనుకో ...."

ఈ మనిషి కిలా చెప్పినందువల్ల లాభం లేదు. ఇంతకంటే సూటిగానే చెప్పాలి. అయ్యా! శరీరం నీది. కావలిస్తే దాన్ని ఎలాంటి గానుగైనా గురిచెయ్యి. నీ యిష్టం. కానీ మానవజన్మ మెత్తిన తర్వాత, అందులోనూ ఒక హైస్కూలుకు హెడ్మాస్టరువైన తర్వాత మనిషికి ఆత్మ గౌరవమనేది చాలా ముఖ్యమనే విషయం నీకు తోచక పోవడం దురదృష్టం. .. ఇలా ఎన్నోమాటలు నాలుక చివరిదాకా వచ్చాయి కానీ యిన్ని మాటలూ చెప్పెయ్యడానికొక సందర్భం రావాలి.

వచ్చింది.

ఓ రోజు వుదయం పది గంటలప్పుడు నేను స్కూలుకు వెళ్ళే సరికి, అప్పటికప్పుడే చేసుకున్న నిర్ణయంపైన కోయగూడెంలో జరుగుతున్న జాతరలా స్టాఫ్‌రూంలో సందడిగా వుంది. "ఏం జరిగిందర్రా, ఏమిటి విశేషం?" అన్న నా ప్రశ్నకు నవ్వులే సమాధానం. ఒకటి రెండు నిమిషాలు బతిమాలుకున్న తర్వాత ఒక సహోపాధ్యాయుడు" అదేమిటయ్యా రాఘవులూ! రోకలి తీసుకరాకుండా వట్టి చేతులతో వచ్చేశావే! అయ్యగారికి పిచ్చికుదిరిందట. ఇక రోకలి తలకు చుట్టడమే తరువాయి" అన్నాడు.

ఏం జరిగిం దేం జరిగిందంటూ మళ్ళీ మొదటికే వచ్చాను.

ఫస్టు అసిస్టెంటు సదాశివయ్య సూర్యోదయాన్ని కళ్ళజూచి ఎరుగని వ్యక్తి. ఎనిమిదికో ఎనిమిదిన్నరకో అదీ ఆఫూటు బడి వుందని జ్ఞాపకం వస్తేగానీ అతడు మంచాన్ని వదలి పెట్టడు. అలాంటి సదాశివయ్య కీ రోజు వుదయం అయిదు గంటలకే నిద్రాభంగం కలిగింది. ఈ దురాగతానికి కారకుడు మరెవ్వరో గాదు. సాక్షాత్తుగా హెడ్మాస్టరు వెంకట్రావుగారు. తలుపు దబదబా బాది, ఇంటావిడ వచ్చి తలుపు తీయగానే సుడిగాలిలా లోపలికి వెళ్ళి ఈయన ఫస్టు అసిస్టెంటును నిద్రలేపేశాడట! "సదాశివం! ఇదిగోనయ్యా లీవులెటరు. రెండు రోజులపాటు నువ్వు ఇన్—చార్జిగా స్కూలు చూచుకోవాలి నేనర్జంటుగా వూరెళ్తున్నాను. టీచర్స్ రిజిష్టరులో నా పేరు కెదురుగా ఎర్రసిరాతో 'సి. యల్.' గుర్తించడం మరచిపోవద్దు. ఐనా తెల్లవారి పోతుండగా యింకా నిద్రేమిటి? ఈ పాటికి కలకత్తాలో నాలుగుబారల ప్రొద్దెక్కి వుంటుంది. ...." అంటూ అదే టూసుకపోవడం బస్ స్టాండు వైపు!

"కలకత్తాలోకన్నా రంగూనులో, కౌలాలంపూరులో, టోకియోలో యింకా ముందుగానే తెల్లవారి పోతుంది. అందుకని రాజశ్రీ హెడ్మాస్టరుగారు చెప్పేదేమిటి? ఈ భూప్రపంచకంపైన ఏ మానవుడైనా గానివ్వు, ఏవేళప్పుడైనా గానివ్వు నిద్రపోవడానికి వీల్లేదనే గదా!" — ఎవరికి తోచిన వ్యాఖ్యానాలు వాళ్ళు రువ్వుతున్నారు. ఒకరికంటే బిగ్గరగా ఒకరు నవ్వుతున్నారు.

వెంకట్రావుగారు బాణావరానికి వచ్చి మూడు నెలలయితే, చివరి మూడు నెలల్లో మా యిద్దరికీ మధ్య సాన్నిహిత్యం కాస్త చిక్కబడింది. మరేంలేదు వికారమైన ముఖాని కొక అందమైన 'మాస్క్' తగిలించినట్టుగా సకాలంలో తగు సలహాలివ్వడం ద్వారా, చేయిమించి పోయినప్పుడు కొన్ని కొన్ని సర్దుబాట్లు చేయడం ద్వారా నేను హెడ్మా

స్టరు గారి ప్రవర్తనకు మెరుగులు దిద్దడానికి ప్రయత్నించాను. చివరి పది పదిహేను రోజుల్లో అందులో కొంతవరకూ కృతకృత్యుడి నయ్యాను గూడా! కానీ అంతలోనే మళ్ళీ ఓ తప్పటడుగు! నిజంగానే నాకు తల కొట్టేసినట్లయింది.

వూరినుంచి తిరిగి రాగానే నాకు దొరికిన మొదటి అవకాశంలో నేను వెంకట్రావుగారిపైన విరుచుక పడ్డాను.

"మీరు నన్ను గురించి ఏమైనా అనుకోండిసార్! పరవాలేదు నేను చెప్పదలచుకున్నదేదో చెప్పేస్తాను. మీరు చేసే పనులు నాకేమీ బాగుండడం లేదు. సంఘంలోని ఒక్కొక్క మనిషికీ, అతడీ విధంగా మాత్రమే నడచుకోవాలని కొన్ని నియమా లుంటాయి. ఇంగ్లీషులో 'రూల్సు' అనుకోండి, నాకే మభ్యంతరం లేదు. ఒకవేళ మీరు మరిచి పోయినా, నేను మీకు జ్ఞాపకం చేస్తున్నాను. మీరొక విద్యాసంస్థకి పెద్దగా వున్నారు. సెలవు పెట్టదలచుకుంటే ప్యూనుద్వారా ఫస్ట్ అసిస్టెంటుకి కబురు పెడతారు. అతడు రాగానే తాళం చెవులు అప్పగించి మీ పని మీద వెళ్తారు. అంతేగానీ, స్వయంగా అసిస్టెంటు టీచరు యింటికి వెళ్ళి, తలుపు దబదబా బాదే హెడ్మాస్టరుంటాడా ఎక్కడైనా! ఒక టీచరు సెలవులో వున్నందువల్ల అతడి క్లాసు ఖాళీగా వున్నప్పుడు, పని లేకుండావున్న యింకొక టీచరుని యాక్టింగు వర్కు కల్పించి వెయ్యడం రివాజు! అలా కాకుండా తగుదునమ్మా అని ఆల్‌రౌండు మాస్టరులాగా అన్ని క్లాసులూ మీరే తీసుకుంటారా? అన్నింటికన్నా ఘోరమైన విషయం. హెడ్మాస్టరుగా మీ కుండవలసిన హుందా తనమంతా నట్టేట్లో కలిపి, సీట్లోనుంచి లేచి వెళ్ళి గంట కొట్టి వస్తారటండీ మీరు!"

ఎట్టి యెదుటి ఆకారంలో కదలిక లేదు. నిశ్చలమైన ముఖ భంగిమను బట్టి చూస్తే ఆయన నా మాటల్ని సాకల్యంగా విన్నట్లే తోచింది. కుర్చీలో సర్దుకుని కూచున్న తీరు, సులోచనాలను సవరించుకున్న తరహా, పై పెదవి క్రింది పెదవితో ముడిపడుతూ విడివడుతున్న పద్ధతి, ఆ చిన్నెల ద్వారా ఆయనలో ఏదో తిరుగుబాటు ప్రకోపిస్తూ వున్న జాడల్ని పసిగట్టాను. ఇన్ని దినాలుగా నాకు పరిచితుడైన ఈ వ్యక్తిలో యింతవరకూ నా వూహకందని విలక్షణాలేవో పొంగి పొరలివచ్చి, నన్ను ముంచివేయబోతున్నట్లుగా వుంది. 'మిస్టర్ రాఘవులూ!' అంటూ పిలుపు వినిపించేసరికి వులిక్కిపడకుండా వుండ లేక పోయాను.— "నీ కొకడు ప్యూనైతే, నువ్వింకొకడికి ప్యూనా! ఎంత మంచి ప్యూన్ల ప్రపంచమయ్యా, మీది! తనకు సెలవు కావలసి వస్తే సదాశివయ్య నా దగ్గిరి కొస్తుండగా లేనిది, దారిలో వున్నాడు గదా అని నేనతడితో ఒక మాట చెప్పి వెళ్ళేసరికి, నా కెక్కడలేని తల వంపు లొచ్చాయనేనా నువ్వనేది! గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న విద్యార్థుల్ని వెదికి పట్టి, వాళ్ళకు నాలుగు ముక్కలు చెప్పడానికి గూడా నా హెడ్మాస్టరుగిరీ అడ్డొస్తుందంటావా? పోతే, ప్యూనొచ్చేదాకా నువ్వు గంట మ్రోగనివ్వడ దంటావు. ఎందుకు బాబూ! మహాత్ముడు పాకీ పని చేయడం గొప్ప ఆదర్శంగా తల పోయడం లేదా నువ్వు! వ్యక్తిత్వం నుంచి ఉద్యోగాన్ని మైనస్‌చేసి సంతకు తీసుకెళ్తే, ఎవ్వరని ఏ గానీ చెయ్యని నేను ఒకసారి బడిగంట కొట్టడం వల్ల నువ్వు చెబుతున్న 'రూలు'కు ఎక్కడలేని నేగి వచ్చి పడిందా? నాన్సెన్స్! ఈ బోడి రూల్సు సంగతి నాతో చెప్పొద్దు! ఏమిటయ్యా నీ రూల్సు! ఎవడు చేసిందీ రూలు? మొదట మనిషి. తరువాత రూలు. మనిషి చేసిన 'రూల్సు'ను మనిషి కోసం అతిక్రమిస్తే తప్పని నే ననుకోను. అవసరమైతే నేనామాత్రం పని చెయ్యడానికి వెనుదియ్యను గూడా! ఏ లౌకికశక్తీ నన్ను అడ్డుకో లేదు. . . ."

కింగ్‌కాంగు, గామా, కోడి రామ్మూర్తుల్లాంటి వాళ్ళెవరైనా యిలా ఒక సవాలు విసిరితే ఆ దారి వేరు! తమ శారీరక బలమైనా వారికి ఆసరాగా వుండి వుండేది. ఒక మాదిరి దృఢకాయుడు భుజాలపైన చేయివేసి అదిమితే అమాంతంగా భూగర్భంలోకి క్రుంగిపోయేట్టున్న అబ్బ నాకారపు మనిషి ఏ బలాన్ని నమ్ముకుని యింతింతలేసి మాటలు మాట్లాడేటట్టు?

నా కప్పు డనిపించింది.

పేరుకు ముందుగ 'పిచ్చి' అన్న విశేషణం తగిలించడంతో లోకం ఈ తిక్కమనిషిని సముచితంగానే సన్మానించింది— అని!

ఐతే వెంకట్రావుగారు నిజంగా పిచ్చివారే కావడానికిన్నీ, కాక పోవడానికిన్నీ వున్న మధ్యదూరమే పాటిదో నా కా క్షణాన బోధపడ లేదు. ఆయన పిచ్చితనాన్ని గురించి నికరంగా ఒక నిర్ధారణకు రావలసిన అగత్యం రానున్న కొద్ది రోజుల్లో పొంచి వుందని గూడా నేనప్పట్లో వూహించ లేదు.

ఏం జరిగిందంటే—

* * *

ఓ రోజు వుదయం మామూలుగానే బడి ప్రారంభమైంది. ఇంటర్వెల్లో కుర్రవాళ్ళు బయటికి వెళ్ళిన తర్వాత మూడో పీరియడ్ జరుగుతోంది. మెయిన్ బిల్డింగుకు దూరంగా చెట్లక్రింద కూచో బెట్టి, విద్యార్థులచేత కాంపోజిషన్ వ్రాయిస్తూ ఆ పనిలో నేను నిమగ్నుడినై వుండగా పెద్ద పెట్టున గగ్గోలు చెలరేగడం వినిపించింది. కొందరయ్యవార్లు, విద్యార్థులూ గూడా క్లాసుల వదిలి పెట్టి లేచి కట్ట గట్టుకుని స్టాఫ్ రూమువైపు పరుగెత్తుతున్నారు. ఆ కలజడిలో అసల విషయ మేమిటో తెలుసుకోవడానికైనా నిలుకావడం లేదు. ఎదురీత గొట్టి, ఏటిపైకి ప్రవాలిన కొమ్మను పట్టుకొన్నట్లుగా జనాన్ని తోసుకుంటూ వెళ్ళి స్టాఫ్ రూం తలుపు దగ్గిరికి చేరుకో గలిగాను. ఎగశ్వాస, దిగశ్వాసల వురవడితో రొప్పుకుంటూ డ్రాయింగు మాస్టరు మురహరి లోపల బెంచీపైన పడి వున్నాడు.

చాలా దయనీయ గాథ మురహరిది. స్వయంగా తనదేమో మెతక మనసు. మృగాల లాంటి మనుషుల మధ్య జీవనం. బాణావరానికి మూడు మైళ్ళ దూరంలోవున్న స్వగ్రామంనుంచి ప్రతి రోజూ బడికి వచ్చి వెళ్తుంటాడు. నాలుగు మాసాల క్రిందట కోర్టులో వుండిన కేసొకటి అనుకు వ్యతిరేకంగా తీర్పు గావడంతో అతడు మానసికంగా బాగా దెబ్బ తిన్నాడు. చాలని దానికి పెద్ద జబ్బు చేసింది. 'రక్తహీనత' అన్న కారణంతో పసిరికలు వచ్చిందన్నారు. రెండు నెలల పాటు రాణీపేట ఆసుపత్రిలో వుండి వచ్చాడు. లేత వయసు పెళ్ళాంతోబాటుగా, పిడుసుల లాంటి యిద్దరు పిల్లలు గూడా వున్నారు. మురహరి ఉద్యోగ మొక్కటే ఆ కుటుంబానికున్న జీవనాధారం.

నాటు వైద్యుడు నాగాచారి గసబోసుకుంటూ వచ్చాడు. తన తాత ముత్తాతలు చేసి పెట్టిపోయిన కట్టు మాత్రలతో బాణావరం జబ్బుల పైన రకరకాల వింత ప్రయోగాలు చేయడం అతడి ప్రత్యేకత ప్రాణ భయం వుందనిపిస్తే అతడు రోగి దరిదాపుల్లోనే వుండడు. ఒళ్ళంతా చలవలు క్రమ్ముక పోతూ వుండడాన్ని బట్టి, నాడి మంద గించడాన్ని బట్టి నాగాచారి పెదవి విరిచేశాడు. 'రెండు గంటల వ్యవధిలో గవర్మెంటు ఆసుపత్రికి తీసుకెళ్ళాల్సి వుంది బలమైన యింజక్షన్లిచ్చి, గ్లూకోజు గూడా ఎక్కిస్తే ఆ పైన అంతా దైవాధీనం మొత్తంపైన యముడితో జటా జూటీగా పోట్లాడవలసిన పరిస్థితి'' అంటూ తేల్చి చెప్పేశాడు.

మధ్యాహ్నం దాటిన తర్వాత గానీ బాణావరం నుంచీ పట్నానికి బస్సులు లేవు ఇప్పటి కిప్పుడు రైలు మాత్రం వుంది. అది పన్నెండు ముప్పావు కల్లా స్టేషన వదిలి పెడుతుంది.

ఆలోగా పేషంటును స్టేషను దగ్గరికి చేరవెయ్యగలగడం సాధ్యమేనా?

కష్టం.

సాధ్యం కాదు.

బాణావరంలో జట్కాలు లేవు ఎద్దులబండే శరణ్యం.

తలచుకున్నపాటున బండి ఎక్కడ దొరుకు తుంది?

సందేహాల కతీతంగా ఈ ప్రాంతాల్లో ఎక్కడో బండి అనేది ఒకటి వుండితీరాలి—అన్న నమ్మకం ఒక్క హెడ్మాస్టరుగారి ముఖంలో మాత్రమే కనిపించింది జెండాకొయ్య కోసం కట్టి పెట్టిన ఎత్తయిన తిన్నెపై కెక్కి ఆయన నాలుగ వైపులకు పరకాయించి చూచారు. పొలాల్లోకి ఎరువు తోలుకుని వెళ్ళి ఖాళీగా తిరిగొస్తున్న బండి ఒకటి తుప్పల చాటున గోబూచులాడినట్లుగా కనిపిస్తూ వుంది

'రాఘవులూ! అదిగోనయ్యా బండి. పరుగెత్తు, అడ్డదారి పట్టుకుని పొలాలపైన్నే తోలుకొచ్చేయమని చెప్పు. ఇక్కడున్నట్టుగా రావాలి''

అదృష్టవశాత్తు బండి తోలుతున్న రైతు నాకు పరిచితుడే! మాదు సిక్కృతి వాళ్ళబ్బాయి ఒకడు హైస్కూల్లో చదువుతున్నాడు గూడానేమో, చెప్పగానే అతడు నా పిలు పందుకున్నాడు అఘమేఘాల పైన తోలుకుంటూ వచ్చి బండిని స్కూలుగేటు దగ్గర నిలిపేశాడు.

జబ్బు మనిషిని చేతుల పైన బండిలోకి తీసుకెళ్ళడం జరిగింది.

కదిలిన బండిలో కెక్కి కూర్చుంటూ హెడ్మాస్టరుగారు నన్నొక్కణి మాత్రం తన వెంట రమ్మన్నారు స్టేషనుదాకా వచ్చి రైలెక్కించి వచ్చేస్తామని చెబుతూ అయిదారుగురు విద్యార్థులు మాత్రం నాతోబాటుగా బండిని వెంబడించారు,

గిట్టలతో ఎండు దుమ్మును ఎగజిమ్ముకుంటూ కోడెలు పరుగెడు తున్నాయి.

అది గ్రామం నుంచీ స్టేషనుదాకా ప్రత్యేకంగా వేయబడ్డ మట్టిబాట. ఇంచు మించు రైలు దారికి సమాంతరంగా వుంటుంది. మధ్యలో వందగజాల మేరకు ఎర్రమట్టిచేలు వ్యాపించి వున్నాయి.

బండి నారిగాడి గుట్ట దాటింది. బైరాగుల సత్రం దాటింది. ఇంకెంత దూరం? వో అరమైలుంటుందేమో. . . . .

కాలచక్రంతో పోటీకి తలపడ్డట్టుగా బండిచక్రం గిర్రుగిర్రున తిరిగేస్తోంది.

రెండింటిలో ఏది గెలుస్తుంది?

కాలమా? వేగమా?

కన్నుమూసి కన్ను తెరిచేటంత సేపట్లో పందెం ఒక ముగింపుకు రావచ్చునని మాత్రం మాలో ఎవ్వరూ అనుకోలేదు.

పందెం ముగిసే టప్పటికి—

మోరలు పైకెత్తి రొజుకుంటున్న కోడెలు, పగ్గాలు బిగబట్టి రైలుదారి వైపు తెల్లబోయి చూస్తున్న రైతు, ఫుల్‌స్టాపు పెట్టినట్టుగా నిశ్చల స్థితిని అవలంభించిన బండి, లేచి బండిపైన నిల్చుని 'వచ్చేసూ వున్నది నిజంగా రైలుబండేనా' అన్నట్టు దిగ్భ్రాంతికి లోనై వున్న వెంకట్రావు గారు—

ఏది ఏమైనా తనకేమీ కాబట్టనట్టు ధీమాగా, ఎవరేమైనా తనకేమీ చింతలేనట్టు గంభీరంగా తనపాటును తాను పొగలు చిమ్ముకుంటూ రైలుబండి జారిపోతులా ముందుకు దూసుకుని వచ్చేస్తోంది.

ఒకటి . . . రెండు . . . మూడు . . . కాల పురుషుని కర్కశపాదాల చప్పుడలా క్షణాలు దొర్లిపోతున్నాయి.

గడచిపోయిన క్షణంలో ఏం జరిగిందో మనకు తెలుసు గడుస్తున్న క్షణంలో ఏం జరుగుతున్నదీ తెలుసు. కానీ రానున్న క్షణంలో ఏర్పడబోయే పరిణామానికి సంబంధించినంతవరకూ మనిషి వూహ విల్లును లాగి వదిలి పెట్టిన బాణం, గురికి తగిలినా తగలొచ్చు తప్పిపోయినా పోవచ్చు.

ఉన్నట్టుండి, చేతిని పైకెత్తి వెంకట్రావుగారు 'ఆపండి, ఆపండి' అంటూ ఎలుగెత్తి కేకవెయ్యడం వినిపించింది. మరుక్షణంలో బండి పైన్నుంచి అలాగా క్రిందికి దూకి ఆపండాపండి' అని చెయ్యి వూపుతూ ఆయన చే కడ్డంపడి రైలు కభిముఖంగా పరుగెత్తడం కనిపించింది.

నొగపైన కూర్చున్న రైతు పూర్తిగా అయోమయావస్థలో నైనా పడిపోయి వుండాలి లేదా కాడి క్రింది గిత్తలు బెదిరిపోవడమైనా జరిగి వుండాలి తనంతట తానే స్వాతంత్ర్యం ప్రకటించుకున్నట్టు బండి రోడ్డు కడ్డం తిరిగి పొలాల వెంటపరుగిడుతూ వెంకట్రావుగారిని వెంబడిస్తోంది.

తన స్పృహలో లేనున్న మానవు డెవడైనప్పటికీ, యిలాంటి అవకతవక పనికి పూనుకోడేమో! బుద్ధి అదుపు దప్పి, మనసు గూడా స్వాధీనంలో లేనప్పుడు మానవుణ్ణి ఆవహించుకునే విపరీ స్థితిని ఉన్మాద మంటారు. అలాంటి ఉన్మాదంలో తల మునకలై వున్న మానవుడు రైలు బండిని ఆపు చెయ్యడం మాత్రమే గాదు, గ్రహ గతుల్ని స్తంభింపజెయ్యడం గూడా తన కనుసన్నలతో జరిగిపోయే పనిగా భావించ గలడు!

వెంకట్రావుగారి ఆక్రోశాన్ని చెవిలో వేసుకోకుండా యింజను ఆయన్ను దాటి పోయింది. ఏడెనిమిది గూడ్సుపెట్టెలు గూడా ఇంజన్ను అనుసరించాయి.

మన్నించాలి. అంతవరకే నాకు తెలిసింది. అప్పటినుంచి మళ్ళీ రెండు మూడు నిమిషాల వరకూ నా కళ్ళ ఎదుట నెలకొన్న దృశ్యాలు గానివ్వండి, ఎదురైన అనుభవాలు గానివ్వండి సినిమా ప్రొజెక్టరులో బొమ్మల్లా ఒకదాన్ని తరుముకుంటూ ఒకటిగా పరుగుతీశాయి. క్రమంగా వేగం తగ్గి రైలుబండి నిలకడలోకి రావడం, వెంకట్రావు గారొక్క గంతుతో మెట్లపైకి దూకి తలుపు లోపలికి తొయ్యడం, బండివాడి తోడ్పాటుతో విద్యార్థులు మురహరిని కంపార్టుమెంటులోకి చేర వెయ్యడం, జీవచ్ఛైతన్యానికి అతీతంగా బిర్రబిగుసుకపోయిన వస్త్రంలో కదిపి, మెుందుకుతోసి పెట్టెలోకి విక్షించడం, ఇంత పనీ జరిగిన తర్వాత బుద్ధిగా చెప్పిన మాట వినే మంచి పిల్లవాడిలా బండి మెల్లగా ముందుకు సాగబారడం— ఈ సంఘటనల సముదాయమంతా నా పాలిటికొక స్వప్న వృత్తాంతంగానే తోచింది.

నా తెలివి నాకు వచ్చి జరిగింది కలగాదన్న నిర్ధారణకు వచ్చిన తర్వాత నా కింక మిగిలిన సందేహం ఒక్కటే! ఎలా నిలిచిపోయి వుంటుంది బండి? ఏ శక్తి దాన్ని ఆపు చేయగలిగి వుంటుంది?

వెంకట్రావు గారొక వేళ పిచ్చివాడుగాకపోతే, గొప్ప మంత్రగాడయినా కావాలి. నా చిన్నతనంలో మా తాతగారు చెబుతుండేవారు. మంత్ర తంత్రాలతో, బలితర్పణాలతో శక్తిని పూజించి ప్రసన్నం చేసుకున్న వాళ్ళకు అసాధ్యం అంటూ వుండదట. చీకటి విచ్చిపోకముందే నిద్రలేచి వూరికి దూరంగా వున్న చెరువు దగ్గరికి వెళ్లి ఈయన చేసొచ్చేది శక్తిపూజే అయి వుండొచ్చు. ....

నా బుద్ధి పోతున్న పోకడను గమనించే సరికి నేను సిగ్గుతో కుంచించుక పోయాను. ఆకాశావకాశంలో చంద్రగ్రహానికే రహదారి వెయ్యగలిగిన ఆధునిక విజ్ఞానం దేవుళ్ళ అస్తిత్వాన్నిగానీ, దయ్యాల ఉనికిని గాని లెక్కలోకి తీసుకోదు. ప్రపంచం పైన ఎక్కడ, ఎంతటి మహాత్కార్యాలు జరిగినా అందుకు సహజమైన కారణం ఒకటి వుండి తీరా లంటుంది. ఒక పట్టాన స్ఫురించక పోవచ్చు. ఆలోచించి, అన్వేషించి తెలుసుకో మంటుంది.

ఉలిక్కిపడినట్టుగా నేను తలపైకెత్తి వెంకట్రావుగారి వైపు చూచాను. ఆయన మురహరి తలను తొడపైన పెట్టుకుని అంగవస్త్రం అంచుల్ని విసనగ్రరలా విప్పి ముఖానికి చల్లగా గాలి సోకేటట్లు మెల్లగా విసురు తున్నారు.

రైలెలా ఆగిపోయిందన్న ప్రశ్నను గాలికి వదిలిపెట్టి, జబ్బు మనిషికి తగు సపర్యలు చేయడమే తక్షణ కర్తవ్యంగా ఆయన తలపోస్తున్నట్టుంది.

ముందు జాగ్రత్తలన్నీ తీసుకుని తిరుపతికొండకు 'యాత్ర' వెళుతున్న కుటుంబం ఒకటి మాకా పెట్టెలో తారసిల్లింది. ముఖ్యంగా ఆ కుటుంబంలోని వృద్ధదంపతులకు అనుకోకుండా ఒక వ్యాసంగం సమకూరినట్టయింది. తాము ఫ్లాస్కులో తెచ్చుకున్న కాఫీని వాళ్ళు ఒకొక్కక్క చొట్టుగా లోగిచేత త్రాగించారు. అమృతాంజనం డబ్బీ పైకితీసి గుండెలపైన వెచ్చగా రుద్దమన్నారు. "మీకేం భయం లేదండి! మరేం ఫరవా లేదు. మంచి నూది ఒకటి పడితే మనిషి కోలుకుంటాడు" అంటూ దారి పొడుగునా ధైర్య వచనాలు చెప్పసాగారు.

దిగవలసిన స్టేషన్లో బండి ఆగింది.

స్ట్రెచరు కుర్చీ తీసుక రావలసిందని పోర్టరు ద్వారా కబురు పెట్టారు వెంకట్రావుగారు. త్వరగా తొక్కొచ్చేటట్టు చూడమని నన్ను గూడా పోర్టరు వెంట పరుగెత్తమన్నారు. ప్లాట్ఫారంపైన జనాల రద్దీ విపరీతంగా వుంది. ఏ సందులోనుంచీ ఎలా మాయమయ్యాడో మరి, కొద్ది నిమిషాలవరకూ పోర్టరు పొడకువ నాకు తెలియకుండా వుండి పోయింది.

అప్పుడు నేను ఇంజనుకు పదిబారల దూరంలో నిలబడి వున్నాను.

"మాచావా అర్థం పర్థంలేని పొరబాట్లు ఎలా జరిగి పోతాయో! ఎందుకిలా జరిగిందని నాకూ అంతుపట్టలేదనుకో! దిగి వద్దామనుకుంటుండగా జరిగిన పొరబాటే మిటో తెలిసొచ్చింది ..." గార్డు మందలిస్తున్నాడు.

"వెరిసారి! మన్నించండి సార్! 'కార్నరు'లో పెట్టబోతుండగా 'పిక్కర్' చేతిలోనుంచి జారి క్రిందపడిపోయింది. దిగివెళ్ళి తెచ్చుకోక పోతే తప్పేది కాదు ...." డ్రయివరు చెబుతున్నాడు.

"పోనీలే, ఏం చేద్దాం! ఇక మీద ఎప్పుడూ యిలా జరగకుండా జాగ్రత్తపడాలి. నువ్వు డ్యూటీలో వుండగా యిలా జరగడం యిదే మొదటిసారి!"

దొరికింది. నా సహేతుకమైన కారణం నాకు దొరికింది. రైలాగిపోవడానికి కారణం డ్రయివరుచేతిలోనుంచి ఒకానొక సాధనం క్రిందికి జారిపోవడం!

వెనువెంటనే ఇంకొక ప్రశ్న!

ఎన్నడూ జరగని పొరబాటు సరిగ్గా ఆ నిమిషంలోనే ఎలా జరిగింది? మళ్ళీ యిందులో గూడా ఏ మానవాతీతమైన శక్తికైనా ప్రమేయం వుండవచ్చునా?

* * *

మరునాటి సాయంకాలం ఏడు గంటలప్పుడు గవర్నమెంటు ఆసుపత్రిలో చేరొక సిమెంటు బెంచిపైన కూర్చుని కాలహరణం చేస్తుండగా 'హెడ్మాస్టరు వెంకట్రావుగారు అడ్మిట్ చేసిన పేషంటు ఏ గదిలో వున్నాడండీ?' అని వాకబు చేస్తూ ఒక వ్యక్తి వరాగా వెంట నడిచి రావడం కనిపించింది.

లేచి ఎదురుగా వెళ్ళి 'ఆ పేషంటు వుండడం ఈ గదిలోనేనండీ! మీరు మురహరికి బంధువులా?' అని ప్రశ్నించాను.

నా ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పకుండా అతడు "ఇప్పుడెలా వుందండీ! ఇంతకూ జబ్బేమిటి?" అంటూ గదిలో ప్రవేశించాడు.

మంచంపైన ఒక వారగా కూర్చున్న మురహరి భార్య మమ్మల్ని చూడగానే లేచి నిల్చుంది.

ఆగంతకుడు రోగి పరిస్థితిని గమనిస్తుండగా నా కతడిన్నైపు పరిశీలనగా చూచే అవకాశం కలిగింది. ఈ ముఖాన్ని ఎక్కడో చూచి నట్టు గుర్తు. ఎక్కడ చూచానో మరి, చప్పున జ్ఞప్తికి రావడంలేదు.

బంధువైవుంటే యితణ్ణి మురహరి భార్య పలకరించి వుండేది. పోనీ స్నేహితుడైవుంటే తనను తానే ఆమెకు పరిచయం చేసుకుని వుండేవాడు. రెండింటిలో ఏ ఒక్కటీ జరగకపోవడం గూడా కాస్త విస్మయాన్నే కలిగించింది.

'గాఢంగా నిద్రపట్టినట్టుంది కదూ! పరవాలేదు. జబ్బు తగ్గుముఖం పట్టినట్టే!''— స్వగతంగా పలుకుతూంటూ వసారాదాకా వచ్చి అతడక్కడ ఆగిపోతూ అన్నడిగాడు. 'అన్నట్టు హెడ్మాస్టరు గారెక్కడండీ? ఎంతో కాలమయింది ఆయన్ని కలుసుకుని! ఒకసారి వారితో మాటాడి పోదామనే వచ్చాను.'

ఆయన ఉదయం ఫస్టు బస్సుకే వెళ్ళిపోయారని చెప్పాను.

'అలాగా! నేనొచ్చి వెళ్ళినట్టుగా చెబుతారు గదూ!''

'చెబుతాన్లెండి! మీ పేరు?'

అప్పటికి మేము మాట్లాడుకుంటూ సిమెంటు బెంచీ దగ్గరకి వచ్చేశాము.

'సత్యనారాయణ! నరసింగాపురం సత్యనారాయణ అనండి, తెలుస్తుంది. ఎందుకంటారేమో! నాకేమో ఆయనొకరే హెడ్మాస్టరు గారు. ఆయన కెందరో నాలాంటి శిష్యులు!''

అప్పటి కది వట్టి ఉపోద్ఘాతం మాత్రమే అయినట్టు, చెప్ప వలసిందంతా యికముందే వున్నట్టు అతడు చేతిగుడ్డను బెంచీపైన పరచి, నింపాదిగా దానిపైన కూచున్నాడు.

'ఈ పుణ్యభూమిలో ఆఖరు కొక్క కుక్క నస్తు పడుకున్నాసరే, తనకు స్వర్గ గతులు వద్దు పొమ్మన్నాడు వివేకానందుడు. దరిద్ర నారాయణుడి సేవకోసం అవసరమైతే మళ్ళీమళ్ళీ యిలాంటివే వెయ్యి జన్మ లెత్తడానికైనా తాను సిద్ధమే నన్నాడు. కర్తవ్య సాధన కోసం జీవితాన్ని మీదుకట్టే వాళ్ళ పద్ధతి అది! లోకం దృష్టికి అలాంటి వాళ్ళు పిచ్చివాళ్ళుగానే కనిపించవచ్చు ననుకోండి! ఆ మాటకొస్తే వాళ్ళు గూడా లోకాన్ని ఖాతరు చెయ్యరు. . . అడగడం మరిచాను, మీరేం చేస్తుంటారండీ?''

ప్రస్తుత నివాసం వాణావరమేననీ, మురహరికి సహోద్యోగిననీ చెప్పుకున్నాను.

'చూడండి మేష్టరు గారూ! లోకాన్ని ఖాతరు చేయకపోవడ మంటే ఏమిటంటారు? లోకం ఏర్పాటుచేసిన సాంప్రదాయాన్ని మన్నిం చక పోవడమన్నమాట! ప్రతి అల్పాటప్పావాడూ చేయగలడంటారా అంతటి పని! నేమన్నగారట, గుడి ముంగిట చింకిపాతలతో గజగజ వణికి పోతున్న బిచ్చగత్తెను చూచాడట. వెంటనే గుడిలోపలికి వెళ్ళి అమ్మవారికి చుట్టబెట్టిన పట్టుచీరను లాక్కొచ్చి ఆ దీనురాలికి కప్పే శాడట! 'అయ్యో, ఇంకేమైనా వుందా! తప్పుగదూ! అమ్మవారు కళ్ళు పొడిచెయ్యదూ!' అనుకోడం లోకుల, స్వభావం. రాళ్ళు దేవుళ్ళయితే రాసుల్ని మింగవా అనగలిగే చేవ కోటి కొక్కడికి మాత్రమే వుంటుంది.'

సత్యనారాయణ అనే ఆ అపరిచితుడు ఎదుటి మనిషి తన వాక్యాం శాలను ఏమాత్రం అవగాహన చేసుకుంటున్నాడో తెలుసుకునే నిమిత్తం కొద్ది క్షణాలు విరామం యిచ్చి 'ఎందుకు చెబుతున్నానంటే' అంటూ పునరారంభం చేయబోయాడు.

'చెప్పండి. మీరు విషయం చెప్పండి చాలు.. కారణాల్ని నే నూహించుకుంటాను'' అన్నాను.

'ఒకసారి హైస్కూల్లో పరీక్షలు జరుగు తున్నాయి. ఒక పరీక్షకు నేను అరగంట లేటుగా గానీ వెళ్ళలేక పోయాను. నూట రెండు డిగ్రీల జ్వర తీవ్రతలో వాడిపోయిన తోటకూర కాడలా డస్క్ పైన సోలి పోతున్నాను ప్రక్కన్నే కూచుని హెడ్మాస్టరుగారు కాఫీ త్రాగించారు. 'ఏం భయపడొద్దు బాబూ! నీ చేతనైనంతవరకే వ్రాయి. వీలుగాకపోతే మానెయ్యి' అంటూ బుజ్జగించారు. వింటున్నారా మేష్టరు గారూ! ఆ పరీక్షలో నాకు పాసయ్యేటందుకు రావలసిన మినిమమ్ మార్కులకన్నా అయిదు మార్కులు తక్కువగా వచ్చాయి. . . .''

,, . . . . . . . . . . . . .''

'మిగిలిన సబ్జక్ట్సులో ఎన్ని మార్కులొచ్చాయని అడగ లేదే మీరు! వాటిలో బాగానే వచ్చాయి. కానీ ఏం లాభం? ఆ రోజుల్లో రూల్సు చాలా స్ట్రిక్టుగా వుండేవి. ఆ విద్యార్థి తప్పనిసరిగా యింకొక సంవత్సరం అదే క్లాసులో వుండవలసిందేనని హెడ్మాస్టరు మినహాగా మిగిలిన హైస్కూలు పరీక్షల కమిటీ నిర్ణయించింది. ఐతే కమిటీ నిర్ణయానికి వ్యతిరేకంగా, పరీక్షల నిబంధనలను త్రోసి రాజంటూ నా పేరు ప్రమోషనులిస్టులో కనిపించింది. ఇక చూచుకోండి తమాషా! గిట్టని వాళ్ళు పై అధికారులకు ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాసి పడే శారు. డి. ఇ. ఒ. గారు ఎంక్వయిరీ కోసం రెక్కలు గట్టుకుని వచ్చి వాలిపోయారు. ఎన్ని విధాలుగా తర్కించి అడిగినా హెడ్మాస్టరుగారు చెక్కుచెదరకుండా ఒక్క మాటపైన కూచున్నారు. 'వాడు నా స్టూడెంటు. వాడెలాంటి స్టూడెంటయిందీ నాకు తెలుసు. విధివ శాత్తు దురదృష్టం అయిదు మార్కులకోసం వాణ్ణి ఫెయిల్ చెయ్యమంటా రటండీ! మిగిలిన వాటిలో అరవైలూ, డెబ్బయిలూ రాగా, ఒక సబ్జక్టులో అయిదు మార్కులు తక్కువ కాగానే యికవాడు పై తరగతికి పనికి రాడంటారా? ఆ మాత్రం యోగ్యతను గుర్తించి ఒక స్టూడెం టును పాసుచేసే అధికారమైనా లేకపోతే యిక నాకీ హెడ్మాస్టరు గిరీ ఏం చేసుకోడానికండీ! మీకొక నమస్కారం! దీన్ని నేను తప్పనుకో లేదు. కర్తవ్యమనుకున్నాను. తర్వాత మీ యిష్టం.' అనేశారు. పాపం, డి. ఇ. ఒ గారు మాత్రం ఏంచేస్తారు? ఈ మొండివాడితో గొడవెందు కనుకుని విషయ వివరణ చేస్తూ ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా ఈ ఒక్క కేసును మాత్రం మన్నించవలసిందిగా డైరెక్టరుగారికి సిఫార్సు చేసి తమ పాట్లేవో తాము పడ్డారు. . . . .''

సత్యనారాయణ కథనం వల్ల నా కొక విషయం తెలిసింది. వెంకట్రావుగారు వుండుండి ఒక అవకతవక పని చెయ్యడ మనేది అర్థాం

తరంగా వచ్చింది గాదు., ఇదాయనకు ఆదినుంచీ వున్న జబ్బేనన్న మాట!

మరికొంత సేపటివరకూ, అలాగే లోకాభిరామాయణంలో కాలం వేగించి 'ఇక వెళ్ళొస్తానండీ' అంటూ లేచి నిల్చున్నాడు సత్యనారాయణ.

'రేపాదివారం గదా! హెడ్మాస్టరు గారొస్తే రావచ్చు. రేపు సాయంకాలం వచ్చి వెళ్ళండి'' అన్నాను.

'అబ్బే, వీల్లేదండీ! రేపు నాకు నైట్‌డ్యూటీ వుంటుంది' అన్నాడు సత్యనారాయణ.

'నైట్ డ్యూటీయా! ఏ డిపార్టుమెంటులో వున్నారు?''

'రైల్వేలో పని చేస్తున్నానండీ, డ్రయివరుగా!'

చివరి మాట చెవిలో పడేసరికి నా సందేహం పొగమంచులా విచ్చిపోయింది రెండు పర్యాయాల్లోనూ మొదటిసారి యూనిఫారంలో చూచాను గనుక, రెండోసారి మామూలు దుస్తుల్లో యితణ్ణి గుర్తుపట్టలేక పోయివుంటాను.

కథకంతా కీలక ప్రాయమైన సంఘటనకు నా కిప్పుడొక పంజా యిషి దొరికినట్టయింది. ఇతడి చేతిలోనుంచీ 'పిక్చర్' జారి క్రింద పడిపోవడం కేవలం ఒక పొర్పులాంటి సంఘటనే కావచ్చు, బండిని కాసేపు నిలబెట్టడం కోసం ఒక సాకుగా ప్రయత్నపూర్వకంగానే యితడా పనిముట్టును జారవిడిచి వుండవచ్చుననుకోడానికి ఎంతైనా అవకాశం వుంది.

ఎలాగైతేనేం, కొండను త్రవ్వడమంత పెద్ద ప్రయత్నం చేయకుండానే నేను ఎలుకను పట్టేయ గలిగాను.

* * *

బాణావరం వచ్చేసరికి వెంకట్రావుగారి వ్యక్తిత్వం చుట్టూ అద్భుతమైన 'యిమేజీ' ఒకటి నెలకొని వుండటం గమనించాను. వూరి ప్రక్కన రైలుదారి ఏర్పడి నూరేళ్ళు నాటింది. నాటికీ నేటికీ రైలొకసారి స్టేషను నుంచీ కదిలిన తర్వాత మార్గ మధ్యంలో దాన్ని ఆపివేయ్యగలిగిన మానవ మాత్రు డెవడూ లేడు, ఒక వెంకట్రావుగారు తప్ప!

అది వట్టి అపోహ అని నాకు తెలుసు. అవసరమైతే నిరూపణ చెయ్యగలను గూడా! కానీ తీరా నా వాదం విన్న తర్వాత ఈ మూఢ జనులు నా పైన్నే తిరగబడి 'అలాగైతే ఆ రోజా బండిలో సత్యనారాయణ అనే ఆదే డ్రయివరు రావడం ఎలా సంభవించింది? అందుకైనా కారణం వెంకట్రావుగారి ఆత్మబలం కాదా?'' అంటూ ప్రశ్నించి, నన్ను నిరుత్తరుణ్ణి చేస్తారేమోనన్న భయం నా కుండనే వుంది.

ఐతే ఒకటి. తన చుట్టూ చోటుచేసుకున్న 'యిమేజి'ని వెంకట్రావుగారు తన చేజేతులా దులిపివెయ్య జూడడం గూడా పిచ్చితనంలో ఒక అంశమేనేమో 'అబ్బే, యిందులో నేను చేసిన యింద్రజాల మేముందయ్యా! ఒక మనిషి చావుబ్రతుకులో వున్నాడని తెలియగానే డ్రయివరు బండిని ఆపేసి వుంటాడు. 'రూలు' కన్నా మనిషి ముఖ్యంగదా!'' అంటుంటాడాయన.

# ఆయుర్వేదంలో ఆహారనియమములు

వైద్యవిశారద చదలవాడ రాజరాజేశ్వరశర్మ

నేడు వ్యాధు లెక్కువగా నుండుటకు విశేషించి జీర్ణకోశమునకు సంబంధించిన వ్యాధులే ఎక్కువగ నుండుటకు ప్రధానమైన కారణము మన భారతీయ చికిత్సా శాస్త్రమైన ఆయుర్వేదంలో చెప్పబడిన ఆహార నియమములను పాటింపకుండుటయే యనుట సాహసము గాదు.

ఆయుర్వేదాచార్యులైన చరక సుశ్రుత వాగ్భటాదులచేత వివరింపబడిన ఆహార నియమముల ననుసరించిన దీర్ఘారోగ్య జీవితమును పొందవచ్చును.

## ప్రతిదినము వాడవలసిన ఆహార పదార్థములు :

వరి, గోధుమలు, యవ ధాన్యము, అరువది దినములలో పండెడి వడ్లు, చెట్లు, కొండలు, నీరు—ఇవి తక్కువగ నుండు ప్రదేశములో జీవించు పశు పక్ష్యాదుల మాంసము, చెంచలికూర, పాలకూర, లేత ముల్లంగి, చక్రవర్తికూర, కరక్కాయ, ఉశిరికకాయ, ద్రాక్ష, దానిమ్మపండు, పొట్లకాయ, పెసలు, పంచదార, ఆవుపాలు, ఆవు నెయ్యి, వర్షము పడునప్పుడు ఆకాశమునుండియే విధి ననుసరించి పట్టబడిన నీరు, తేనె, ఇందుప్పు—వీనిని మరియు ఆరోగ్యమును అనువర్తింపజేయునట్టివియు, వ్యాధులను బోగొట్టునట్టివియు నగు ఆహార పదార్థములను (పొన్నగంటికూర, కాచికూర, గుండకలగర, కరివేపాకు, పులిచింతాకు, కందగడ్డ, నీరుల్లి, వెల్లుల్లి, పెద్దగుమ్మడి, (గుడు—మొదలగునవి) ప్రతిరోజు ఆహారమునందుపయోగించవలయును. (అష్టాంగ సంగ్రహము)

ఉశిరిక కాయలను వూరుగాయచేసియు, లేక ఎండబెట్టి వరుగు చేసి పచ్చడి చేసియు వాడవచ్చును. కరక్కాయను గూడ వూరుగాయ వేసి వాడవచ్చును.

ఉశిరికలోనుండు 'సి' విటమిను ఇరువది కమలా పండ్లలోనుండు 'సి' విటమినుకు సమానమైనదనియు దీనిలోనుండు విటమిను మాత్రము వీనిని ఎండబెట్టినను, ఉడికించినను నశించుట లేదని పాశ్చాత్య వైద్యశాస్త్రము తెలుపుచున్నది.

## ప్రతిదినము వాడకూడని ఆహార పదార్థములు :

మినుములు, అలసందలు, అనుములు, మొలక వచ్చిన ధాన్యము, పచ్చి ముల్లంగి, తామర మొదలగు వాని దుంప, తామరతీగె, ఎండిపోయిన కూరలు, బియ్యపు పిండి మొదలగు పిండ్లతో చేయబడిన వంటకములు, తేనె పాకమని చెప్పబడు తేనెవంటి బెల్లము, పులిసిన మద్యము, చిక్కని శరీరముగల జంతువుల మాంసము, పంది, గొర్రె, ఆవు ఎనుము—వీనియొక్క మాంసము, చేపలు, విరిగిపోయిన పాలు, పెరుగు, మజ్జిగ లేక పెరుగునో పాలతో చేర్చి పక్వము చేయబడిన పదార్థము, యవక్షారము మొదలగు క్షార ద్రవ్యములు—వీనిని ప్రతిదినము ఆహారమున వాడకూడదు. (అష్టాంగ హృదయము)

పై వస్తువులను ప్రతిదినము వాడరాదనుటచేత అప్పుడప్పుడు వాడుటవలన హాని కలుగదని తలచవలసియున్నది

రాత్రి సమయమునందు నువ్వులనుచేర్చి వండిన వస్తువులను వాడరాదు. (అష్టాంగ సంగ్రహము.)

## భోజన నియమము :

ఉదయము, రాత్రి—ఈ రెండు వేళలయందే భోజనము చేయవలయును. దీనికి మధ్య భుజించుట తగదు. (భావ ప్రకాశము)

ఏ పదార్థమును తినదలచిననూ దానిని భోజనము చేయునప్పుడే తినవలయును. అట్లుగాక తోచినప్పుడు, మాటి మాటికి తినుచుండినచో ఆహారమును జీర్ణింపజేయు అవయవములకు పనెక్కువై విశ్రాంతి దొరకనందున యవి త్వరలో బలహీనతను చెంది వ్యాధిగ్రస్తమగుట కవకాశ మేర్పడగలదు.

## పగటి భోజన సమయము :

ఉదయమున తొమ్మిది గంటల తరువాత పండ్రెండు గంటల లోపలనే భుజించవలయును. (భావ ప్రకాశము!)

## రాత్రి భోజనము :

రాత్రియందు తొమ్మిది గంటల లోపలల భోజనము చేయవలయును ఉదయమున భుజించు యాహారమునకంటె కొంత తక్కువ భుజింపవలయును. తేలికగ జీర్ణమగునట్టి యాహారమునే తినవలయును

## భుజించునప్పుడు మంగళ ద్రవ్యములను చూడవలెను :

భోజనము చేయునప్పుడు మంగళకరమైన వస్తువులను చూడవలయును. దీనివలన మనస్సుకు ఉల్లాసము, ఆయుర్వృద్ధి, ధర్మవృద్ధి గలుగును. (భావ ప్రకాశము)

## భోజనమునందు రసములను వాడు క్రమము :

భుజించునప్పుడు మొట్ట మొదట తీపు రసముగల యాహార పదార్థములను, మధ్యలో పులుపు, ఉప్పు రసములుగల పదార్థములను, చివర కారము, చేదు, ఒగరు రసములు గల ఆహార పదార్థములను తినవలయును. (సుశ్రుత సంహిత)

## భోజనమునందు పండ్లను వాడవలెను :

భుజించునప్పుడు మొదట దానిమ్మపండు, ద్రాక్షపండు మొదలగు పండ్లను తినవలెను (సుశ్రుత సంహిత)

శిశువునకు గూడ ఆరవనెలనుండియే అన్నముతో గూడ పండ్లను గూడ తినిపించవలయును. (కాశ్యప సంహిత)

## ఆహార పరిమాణము :

ఎవని కెంత ఆహారము దినిన ఏవిధమైన వికారమును గలుగక సుఖముగ జీర్ణమై బలము గలుగునో నది యతడు భుజించదగిన ఆహార ప్రమాణము. (చరక సంహిత)

**పెరుగును వాడుటలో నియమాలు :**

పెరుగును రాత్రివేళ భుజించతగదు. పగటివేళలోగూడ ప్రతిదినము వాడరాదు. చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, ఆశ్వయుజము, కార్తీకము—ఈనెలలయందు అప్పుడప్పుడు గూడ పెరుగు నుపయోగించకూడదు. పెసరపప్పు, తేనె, నెయ్యి, పంచదార, ఉసిరికకాయ—వీనిలో నేదేని యొకదానిని చేర్చకుండ పెరుగును వాడకూడదు. పూర్తిగా తోడని పెరుగు నుపయోగించరాదు. పై నియమములను అనుసరించక పెరుగును భుజించినచో నది జ్వరము, రక్తపిత్తము, విసర్పము, కుష్ఠము పాండువు—ఈ వ్యాధులను సంభవింపజేయును.

(అష్టాంగ సంగ్రహము)

ఉప్పునైనను చేర్చక పెరుగును భుజించకూడదు.

(భావ ప్రకాశము)

**భోజన క్రమము :**

భోజనమును చేయుటకుముందు కాళ్ళు, చేతులు, ముఖము—వీనిని కడుగుకొని, ఏకాంతమునందు తనకు ప్రియమైన వారితో గూడి ఏ యాహార పదార్థమును దూషింపక, తనకు ప్రియమైన ఆహార పదార్థములను మిక్కిలి త్వరపడక, మిక్కిలి ఆలసించక, మౌనముగ భుజించుటయందే లగ్నమైన మనస్సుగలవాడై తనకు ప్రియమైన వారు వడ్డించగా భుజించవలయును. (అష్టాంగ హృదయము)

భోజనమునందు మొట్టమొదట కఠినముగనుండు యాహార పదార్థములను నేతితో చేర్చి తినవలెను. అటుపిదప మృదువుగ నుండు పదార్థములను, కడపట ద్రవమైన పదార్థములను వాడవలెను.

(భావ ప్రకాశము)

**నీళ్ళు త్రాగుటలో నియమములు :**

భోజనము చేయునప్పుడు ఆహారమునందు రుచి కలుగుటకును, ఆహారము చక్కగ జీర్ణమగుటకును మధ్య మధ్య చల్లని నీళ్ళను కొద్ది కొద్దిగ త్రాగవలయును. (రాజమానసోల్లాసము)

ఒకచోట నీరును త్రాగి యది జీర్ణమగుటకు ముందుగనే వేరొక తావులోని నీరును త్రాగకూడదు. చన్నీటిని త్రాగి యది జీర్ణమగుటకుముందే కాగి చల్లారిన నీరును త్రాగకూడదు. కాగి చల్లారిన నీరును త్రాగి యది జీర్ణమైన తరువాత గూడ మరువేళ భోజనము చేయుటకు మునుపే చన్నీటిని త్రాగకూడదు. కాగి వేడిగనుండు నీళ్ళను త్రాగి యది జీర్ణమగుటకు మునుపే చన్నీటిని త్రాగకూడదు.

(అష్టాంగ సంగ్రహము)

చన్నీరు ఆరు గంటల కాలములోను, కాగి చల్లారిన నీరు మూడు గంటల కాలములోను, కాగి గోరువెచ్చగ నుండు నీరు ఒక టిన్నర గంట కాలములోను జీర్ణమగునని భావ ప్రకాశమున తెలుప బడినది.

**భుజించిన వెంటనే చేయదగినవి :**

భుజించిన వెంటనే మనస్సునకు ప్రియమైనటువంటి పాటలు, కథలు వీనిని వినవలయును, అందమైన వస్తువులు, చిత్రములు చూడవలయును. తనకు నచ్చిన రసముగల వస్తువును చప్పరించ వలయును. చందనమును పూసుకొనవలయును. మృదు గాలుపువాటిని తాకవలయును—ఇట్లు చేయుటవలన భుజింపబడిన యాహారము కడుపులో బాగుగ అమరును.

భుజించిన పిదప తాంబూలమును దరించుటయు హితమైనదే.

(సుశ్రుత సంహిత)

**భుజించిన పిదప నూరడుగులు నడువవలయును :**

భుజించిన వెంటనే మెల్ల మెల్లగ నూరడుగుల దూరము పచారు చేయవలయును. ఇటు చేయుటవలన కడుపులోని యాహారము జీర్ణమగుటకు యనుకూలముగ విడివడును. మెడ, మోకాళ్ళు, నడుము వీటియందు లాఘవ మేర్పడును. (భావ ప్రకాశము)

**భుజించిన వెంటనే చేయరాని పనులు :**

భుజించిన తర్వాత, నీరు త్రాగిన పెనుక బిగ్గరగ చాలసేపు మాట్లాడుట, త్రోవ నడచుట, పరుండుట, నిప్పునకు దగ్గరగ నుండుట బండిలో ప్రయాణము చేయుట, ఈదుట, గుర్రపుస్వారి చేయుట—ఈ పనులను చేయకూడదు. (అష్టాంగ హృదయము)

భోజనముచేసి సుమారు ఒక గంటసేపు గడుచునంతవరకు దేహ పరిశ్రమ చేయుట, స్త్రీని గలియుటయు తగదు.

(భావ ప్రకాశము)

**దప్పికతో భుజించుట, ఆకలితో నీరు త్రాగుట కూడదు :**

దప్పిక కలిగిన వెంటనే భోజనము చేయరాదు. ఆకలి గొన్న వాడు నీరు త్రాగకూడదు. దప్పికగొన్నవాడు భుజించుట వలన గుల్మ రోగము (కడుపులో నేర్పడు ఒక విధమైన బల్ల) సంభవించును. ఆకలిగలవాడు నీరు త్రాగుటవలన జలోదర వ్యాధి (కడుపులో నీరు పుట్టుట) గలుగును. (భావప్రకాశము)

**అలసట చెందిన వెంటనే భుజింపరాదు :**

అలసట నిచ్చు పనులను జేసి అలసిపోయి వెంటనే భోజనమును చేయకూడదు. నీరును త్రాగరాదు. అలసిపోయిన వెంటనే భుజించుటవలన నీరు త్రాగుటవలన జ్వరము, వాంతి సంభవించును.

(ఆత్రేయ సంహిత)

ఎక్కువ మాట్లాడుటచేత, అలసిపోయి వెంటనే భుజించుట వలన కంఠస్వరము చెడిపోవును. ఎండలో తిరిగి వచ్చిన వెంటనే పాలు త్రాగిన రక్తపిత్త వ్యాధి గలుగును. (అష్టాంగ సంగ్రహము)

**ఆకలెత్తక ముందే భుజించరాదు :**

మంచి ఆకలెత్తుటకు ముందుగనే భోజనము చేయుటవలన తలనొప్పి, అజీర్ణము, వాంతి మొదలగు వ్యాధులు సంభవించును. మరణము గూడ సంభవించవచ్చును. (సుశ్రుత సంహిత)

**ఆకలి యణగిపోయిన పిదప భుజించరాదు :**

ఆకలి యణగిపోయిన తర్వాత భుజించుటవలన భుజింపబడిన యాహారము మిక్కిలి శ్రమతో జీర్ణమగును. మరునటివేళయందు ఆహారాపేక్ష కలుగదు. (సుశ్రుత సంహిత)

**ఆకలి నణచి పెట్టగూడదు :**

ఆకలి నణచి పెట్టుటచేత ఒడలు నొప్పి, ఆహారమునందు రుచి లేకపోవుట, బడలిక, తల తిరుగునట్లుండుట, బలహీనత—మొదలగు వ్యాధులు సంభవించును. (అష్టాంగ హృదయము)

**దప్పిక నణచి పెట్టరాదు :**

దప్పి నణచి పెట్టుటచేత క్షయము, బలహీనత, చెవిటిదనము, మైకము, తల తిరుగునట్లుండుట, హృదయమునకు సంబంధించిన వ్యాధులు సంభవించును. (అష్టాంగ హృదయము)

**భుజింపదగని యాహార పదార్థములు :**

అశుభ్రమైనది, విషదూషితమైనది, ఇతరులు ఎంగిలిచేసి విడచినది, రాయి, గడ్డి, పెంకు—వీనితో గూడినది, మనస్సుకు నచ్చనిది, ముందురోజు వండబడినది, రుచిలేనిది, దుర్గంధము గలది, వాల సేపటికి ముందే వండబడినది, మిక్కిలి కఠినమైనది, మిక్కిలి చల్లబడిపోయినది, రెండవసారి వేడి చేయబడినది, గంజితో కూడినది, కాలిపోయినది, ఇట్టి ఆహారమును తినకూడదు. (సుశ్రుత సంహిత)

కూరగాయలు మిక్కిలి ఎక్కువగ గలది, చామ ధాన్యము మొదలగు ముట్టమైన ధాన్యపు అన్నము గలది, కారము, పులుపు, ఒగరు, ఉప్పు—ఈ రసములు మెండుగ గలది, ఒకే రసము గలది, తన దేహతత్వమునకు సరిపడనిది, తేలికగ జీర్ణము గానట్టిది, ఎండిపోయినది—ఇట్టి ఆహారమును భుజించకూడదు. (అష్టాంగ సంగ్రహము)

**త్రాగ తగని నీరు :**

బురదచేత మలినమైనది, పాచి, పచ్చిక, ఆకులు—వీనితో వ్యాప్తమైనది, సూర్య చంద్రుల రశ్మి సోకనట్టిది, శుభ్రమైన గాలి చేత తాకబడ నట్టిది, అప్పుడే వర్షించినట్టిది, తేటగ నుండనట్టిది, మందముగ నుండునది, నురగతోను, క్రిములతోను కూడినది, ఎండ వేడిమిచేత కాగినది, మిక్కిలి చల్లగ నుండునట్టి నీరును త్రాగ కూడదు. (అష్టాంగ హృదయము)

**విరుద్ధాహారములు :**

పండ్లను తిని పాలను త్రాగకూడదు. పాలను త్రాగి వెంటనే పండ్లను తినరాదు, పుల్లటి వస్తువులను పాలతో గూడ తినకూడదు. పాలు త్రాగినతోడనే పుల్లని పదార్థములను తినరాదు. పాలను ఉప్పు చేర్చి త్రాగరాదు. సజ్జలు, అడవి పెసలు, ఉలవలు, మినుములు, అలిసందలు—వీనిని పాలతో గూడ తినకూడదు. ఆకు కూరలనుగాని గడ్డకూరలనుగాని వెన్నతో చేర్చి తినకూడదు. ముల్లంగితో కూడ మినుముల వంటకమును తినతగదు. ఆవ్వుల నూనెలో తయారైన గోధుమ పిండివంట కండ్లను చెరచును. మద్యము, పెరుగు, తేనె వీనిని పుచ్చుకొని పైన వేడియైన పదార్థములను పుచ్చుకొనరాదు. చల్లటి వస్తువులను వేడియైన వాటితోను, క్రొత్తవైన వాటిని పాతబడిన వాటితోను పచ్చి వస్తువులను ఉడికించిన పదార్థముల తోను జేర్చి తినకూడదు. (అష్టాంగ సంగ్రహము)

ఆకుకూరలనుగాని, ముల్లంగిని తిని పాలు త్రాగరాదు. అరటి పండును పెరుగుతోగాని, మజ్జిగతోగాని, తాటిపండుతోగాని తిన కూడదు కాచియాకు కూరను పిప్పళ్ళు, మిరియాలు, తేనె, బెల్లము వీనితో చేర్చి తినకూడదు. ముందురోజు వండిన కాచియాకు కూరను తినరాదు నువ్వులను చేర్చి వండబడిన బచ్చలికూర అతిసార వ్యాధిని (బేది) గలిగించును. జింక, కోతి, వీటి మాంసమును పెరుగుతో చేర్చి తిన తగదు. కంచు పాత్రలో పదిరోజులుంచబడిన నేతిని వాడరాదు. చేపలను పాలతో గూడ తినకూడదు. (అష్టాంగ హృదయము)

ఆవాలను చేర్చి వేచబడిన పావురముయొక్క మాంసమును పాలతో గూడ తినకూడదు. (భేల సంహిత)

ముల్లంగిని బెల్లముతో చేర్చి తినతగదు. (కాశ్యప సంహిత)

ముల్లంగిని తేనెతోడ తినకూడదు. చేపలను బెల్లము, పంచదార, కలకండ వీనితో చేర్చి తినరాదు. నువ్వుల భక్షణమును కలితో తినకూడదు. (సుశ్రుత సంహిత)

వేరు ఏ యారోగ్య విధులను యనుసరింప కున్ననూ ఆహార నియమము లను మాత్రమే పాటించి హితమైన యాహారమునే భుజించినచో మానవుడు వ్యాధి విముక్తుడై, జితేంద్రియుడై నూరేండ్లు జీవించునని చరకాచార్యు లాశీర్వదించిరి.

'షట్ త్రింశతం సహస్రాణి రాత్రీణాం హిత భోజనః
జీవత్య నాతురో జంతు ర్జితాత్మా సంమత స్సతామ్'

# తెలుగులో స్వీయచరిత్రలు

## డా॥ అక్కిరాజు రమాపతిరావు

తాను వ్రాసుకొన్న తన చరిత్ర అనే అర్థంలో స్వీయ చరిత్ర మన్న పదాన్ని మొట్టమొదట పుస్తకం చేసిన వారు గురుజాడ శ్రీ రామమూర్తి గారేమోనని పిస్తుంది. వారు తమ కవి జీవితాలన్న గ్రంథానికి పీఠిక, వ్రాస్తూ, సమకాలీనులైన, కవులను, తమ గ్రంథంలో చేర్చక పోవటానికి కారణం వారు వారు తమ 'స్వీయచరిత్ర'లను వ్రాసుకొంటారని ఆశించటమే అని తెలిపారు.[1] కాని ఆయనగారాశించినట్లుగా ప్రఖ్యాతులైన ఆ కాలపు కవులు చాలా మంది స్వీయ చరిత్రలు వ్రాసుకోలేదు కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు, మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు మొదలైన గొప్ప పండిత కవులు మాత్రము, పద్య కృతులుగా తమ చరిత్రలు పూర్తిగా కాక పోయినా స్వీయచరిత్రాంశాలను గ్రథితం చేశారు. కొక్కొండ వేంకటరత్నం పంతులు గారు రచించిన బిల్వేశ్వరీయ మన్న మహా కావ్యంలోనూ, బిల్వేశ్వరీయ శతకం లోనూ, తమచరిత్రను సంగ్రహంగా చెప్పుకొన్నారు. అట్లానే మండపాక పార్వతీశ్వరకవిగారు కూడా ఆత్మచర్యాయ చర్య అన్న నామాంతరం గల 'హరిహరేశ్వర శతకాన్ని, హరిహరేశ్వరదేవ మహానుభావ, అన్న మకుటంతో తమస్వీయ చరిత్రాత్మకంగా ప్రచురపరిచారు. అముద్రిత గ్రంథ చింతామణి అన్నపేరుతో అద్భుతమైన సారస్వత పత్రికను సుమారు ఇరవై సంవత్సరాలు నిర్వహించిన యశః కాయులు పూండ్ల రామకృష్ణయ్య గారు, మండపాక వారి శతకానికి పీఠికను వ్రాస్తూ, ఈ కవిగారు సంస్కృతాంధ్రముల యందసమాన పాండిత్యము గలిగి ఖ్యాతి బొంది యున్నారు. వీరు వ్రాసిన గ్రంథములు, శతకములు, మాలికలు లోనగునవి పెక్కులున్నవి. ఇట్టి కవి చరిత్రమును ప్రత్యేక గ్రంథముగ ప్రకటింప యత్నించి తత్కవిం బ్రార్థింపగ వారు తమ బాల్యప్రభృతి జరిగిన చర్య యంతయు హరిహరేశ్వర శతకముగ రచియించి దానికిం టీక వ్రాయుచున్నారు. ఇందు నీ కలికిం బ్రెండవ సంవత్సరము మొద లిప్పటివరకు జరిగిన విద్యావిషయక, ప్రసంగములన్నియు గోచరించును. ఇప్పుడిక్కవికి నరువదియొక్కటవ సంవత్సరము జరుగుచున్నది. ఇట్టి గ్రంథ మీ భాషకు నూతనముగా దీనిం బ్రకటింప బ్రయత్నించి నారము' అని వ్రాశారు.[2]

అయితే స్వీయచరిత్ర మన్నప్రక్రియ ఆంగ్ల సాహిత్య ప్రభావం ద్వారా తెలుగులో వచ్చిన కొత్త ప్రక్రియ అనుకొంటే, ఆంగ్లంలో అనూచానంగా స్వీయచరిత్రం, వచన రచనగానే విలసిల్లటం చూడ వచ్చు. అంతేకాక మన ప్రాచీన కవులందరూ కూడా అంతో, ఇంతో, కృత్యవతారికలలో, తమస్వీయ చరిత్రను వ్రాసుకొన్నారు గదా అని అనవచ్చును. కాబట్టి స్వీయ చరిత్ర ప్రత్యేక గ్రంథంగా అందునా వచనంలో అదికాక, ఆంగ్ల సాహిత్యరీతుల ప్రభావంతో తెలుగులో ఉద్భవించిన క్రొత్త ప్రక్రియగా మనం సంభావించి సమీక్ష చేయవలసి వస్తే, తెలుగు సాహిత్యానికి అనేక నూత్న ప్రక్రియలను, అందించి, తెలుగు సంస్కృతిని, అనేక విధాలుగా అర్చించిన కందుకూరి వీరేశలింగం పంతులుగారే, యీ శాఖను కూడా తెలుగులోకి మొట్ట మొదట తెచ్చారని చెప్పవలసి ఉంటుంది. అప్పటినుంచీ తెలుగులో స్వీయ చరిత్రలు కొన్ని వచ్చాయి.

స్వీయ చరిత్ర మన్న నామకరణం ఆ ప్రక్రియకు పెట్టటం తప్పనీ, వీరేశలింగం పంతులుగారికి వ్యాకరణం తెలియక, ఇట్లాప్రయోగం చేశారని, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు, పంతులు గారిని, తీవ్రంగా అధిక్షేపించారు. ఆయన మాటలోనే చెప్పాలంటే 'స్వీయ చరిత్ర మందప శబ్దము. అనాఘ్రాత పాణినీయ గంధులగు పంతులు వారిది యెరుగక గ్రంథమునకీ నామ కరణము గావించిరి' అన్నారు. తన చరిత్రను తాను వ్రాసుకోవటాన్ని 'స్వకీయ చరిత్ర'మనీ కాని, 'స్వచరిత్ర' అని కాని, 'స్వ చరిత్ర' అని కాని పిలవాలని అంతేకాని, స్వీయచరిత్ర మని అనకూడదని, బ్రహ్మయ్య శాస్త్రిగారు గట్టిగా ఆక్షేపించారు. పంతులుగారి స్వీయ చరిత్రను ఆర్యమతబోధిని అన్న పత్రికలో చాలా సంచికలలో విమర్శించారు. అయినా బ్రహ్మయ్య శాస్త్రిగారి మాట నెవరూ పట్టించుకోలేదు తెలుగులో యీ ప్రక్రియకిప్పుడు ఈ పేరే రూఢమైపోయింది. వీరేశలింగం పంతులు గారితే తరువాత ఎందరో తమ చరిత్రలను స్వీయ చరిత్రలనే సంభావించారు.

ఇంగ్లీషు ప్రభావంతో, ఆంగ్ల పదాయంలో, తెలుగులో వెలువడిన, స్వీయ చరిత్రలతో, పంతులుగారిదే మొదటిది అని చెప్పాలి. అందుకే గాబోలు. 'తెలుగు భాషలో స్వీయ చరిత్రమును వ్రాయ బూనుకొనుట కిదియే ప్రథమ ప్రయత్నము' అని పంతులు గారు పీఠికలో వ్రాసుకొన్నారు.

అసలు స్వీయ చరిత్ర లెందుకు వ్రాసుకొంటారు., వ్రాయటంలో విశేషం ఏమిటి? అని విచారిస్తే, తాము జీవించి ఉన్నకాలానికి, దేశానికి, సంఘపరమైన అభ్యుదయానికి ప్రాతినిధ్యం వహించిన మహాపురుషులు ముందు తరాల వారికి అప్పటి దేశ కాల పరిస్థితులు తాము ఎదుర్కొన్న సమస్యలు, పడిన పాట్లు, అనుభవించిన కష్ట నష్టాలు, పొందిన అవమాన సన్మానాలు, తెలియ పరచాలన్న ఉత్కంఠతో వ్రాసుకొంటారని, అదే ప్రధానమైన ప్రేరణ మనీ అనుకోవచ్చు.

ఇంగ్లీషు విజ్ఞాన సర్వస్వంలో యీ ప్రక్రియను గురించి ఇట్లా ఉన్నది[4]

"Autobiography, as the suggestive nomenclature of Southey implies is the biography of a person written by himself. Its motives are various among others self-scrutiny for self edification, self justification, as Cardinal Newman's beautifully written Apologia Projuavita (1864), a nostalgic desire to linger over enchanting memories as Selma Laserlof's Marbacha (1922), belief that

one's experiences may be helpful to others, as Hellen Keller's 'The Story of my life' (1903). an earnest attempt to orient self amid a world of confusion, as The Education of Henry Adams (1906), the urge for artistic expression or the purely commercial desire to capitalize on fame or position ఆక్స్ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువులో దీన్ని గూర్చి "(Auto + biography), The writing of one's own History, the story of one's life written by himself" అని ఉంది.

మన దేశంలోకూడా ఆధునిక కాలంలో, మహనీయులైన దేశ నాయకులు, పూత చరిత్రులైన, సంఘ సంస్కర్తలు, ఆచార్యపురుషులు, త్యాగధనులు, అనేక రంగాలలో పేరు ప్రఖ్యాతులు పొందిన వారు తమతమ మాతృభాషల్లోనూ, ఇంగ్లీషులోనూ, స్వీయ చరిత్రలు వ్రాసుకోవటం జరిగింది.

ఆధునిక ప్రమాణాలను బట్టి తెలుగులో మొట్టమొదటిసారి స్వీయచరిత్రం వ్రాసింది వీరేశలింగం పంతులుగారే నని అనుకొన్నా, తెలుగు వాళ్ళలో మాత్రం ఆయన ప్రథముడు కాక పోవచ్చు. ఏనుగుల వీరాస్వామయ్య గారి కాశీయాత్ర చరిత్రాన్ని స్వీయచరిత్రాత్మకంగా పరిగణించినా, గణించక పోయినా, 15 మాసాల, 15 రోజుల, 15 గంటల, యాత్ర వృత్తాంతంగా అనుకొన్నా, అట్లాఅని వీరాసామయ్యగారు యాత్రా చరిత్ర ముగిస్తూ వ్రాసు కొన్నారు. వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారనే మహనీయుడు 'ది లైఫ్ అండ్ జర్నల్ ఆఫ్ వెన్నెల కంట సుబ్బారావ్' అనే పేరుతో ఇంగ్లీషులో ఒక గ్రంథాన్ని వ్రాశారు కనుకా, అది 1872వ సంవత్సరంలో మద్రాసులోని ఫాస్టర్ ప్రెస్‌లో అచ్చయింది కనుకా, స్వీయచరిత్రం వ్రాసుకొన్న, ఇంగ్లీషులో వ్రాసి నప్పటికీ, మొదట తెలుగు పెద్ద మనిషి సుబ్బారావు పంతులుగారే అవుతున్నారు. ఈయన చాలా గొప్పవాడు. మద్రాసులో యీనాటి హైకోర్టు స్థానీయమైన 'సర్ అదాలత్ కోర్టు' అనే ఉన్నత న్యాయస్థానంలో పదెనిమిది భాషల తర్జుమా పనిచేసే, మహోన్నతమైన చీఫ్ ఇంటర్ ప్రెటర్ పదవిని అతి దక్షతతో బహు కాలం నిర్వహించిన ఘనుడు సుబ్బారావు పంతులు గారిది ఆసేతు శీతాచలం, రెండు మార్లు పర్యటనంచేసి, ఆయా వివరాలన్నీ సుబ్బారావు పంతులుగారు తమస్వీయ చరిత్ర లో పొందుపరిచారు. సి. ఐ. ఇ. మొదలైన బిరుదులు పొంది ఆ రోజుల్లో దేశీయులు పొంద గలిగిన అత్యున్నత అధికార స్థానాన్ని పొంది, గవర్నర్ కార్యాలోచన సభలో, సభ్యులై గొప్పసేవ చేసిన, పళె చెంచల రావు పంతులుగారనే వారు కూడా తమస్వీయచరిత్రం వ్రాసుకొన్నట్లుగా 'కొందరు వెల్లూరి గొప్పవారు' అన్న చిన్న పుస్తకంలో నంగవోలు వేంకటరంగయ్య గారు వ్రాశారు. ఈ పళె చెంచల రావు పంతులుగారు సంఘ సంస్కరణాభిమానులు మత సంస్కరణాభిమానులుకూడా వీరు వీరేశలింగం పంతులు గారికి సమకాలికులు. పంతులుగారు తలపెట్టిన సంఘ సంస్కరణోద్యమప్పు తొలినాళ్ళలో చెన్నపట్నంలో, యీ చెంచలరావు పంతులుగారు దివాన్‌బహదూర్ రఘునాథరావు గారితో కలిసి పంతులుగారికితోడ్పడినట్లు పంతులు గారి స్వీయ చరిత్రలోనే ఉన్నది. అయితే పళ్ళె చెంచల రావు పంతులుగారి స్వీయ చరిత్రం, ఇంగ్లీషులో వ్రాశారో, తెలుగులో వ్రాశారో, ఎప్పుడు ఎక్కడ అచ్చయిందో, అది సంగ్రహంగా ఉన్నదో, విపులంగా ఉన్నదో, మాత్రం శ్రీ వంగవోలు వెంకట రంగయ్య పంతులు గారు వ్రాయలేదు. ఆయన స్వీయచరిత్రలోని అంశాలంటూ, ఆయన కొన్నిభాగాలు మాత్రం ఉదహరించారు. శ్రీ చెంచల రావు పంతులుగారి స్వీయచరిత్రం లభించేట్లయితే, వీరేశ లింగం పంతులుగారి క వ్యవహిత పూర్వంగా, అప్పటి రాజకీయ వ్యవస్థ, దేశీయులైన మేధావుల కందులో ఉన్న స్థానం దేశీయుల విద్యా, విజ్ఞాన, సాంఘికాది అభివృద్ధికి వారొనర్చిన సేవ, మొదలైన విషయాలు తెలుస్తాయి. వీరేశ లింగంపంతులు గారు, తెలుగులో మొట్టమొదటగా స్వీయ చరిత్రను తామే వ్రాశామని చెప్పికొనటాన్నిబట్టి చెంచలరావు పంతులుగారు స్వీయ చరిత్ర ఇంగ్లీషులో వ్రాశారేమో అనుకోవలసి వస్తున్నది

దీన్ని బట్టి వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రయే, యీ శాఖకు శ్రీకారం అని స్పష్ట పడుతున్నది. వీరేశ లింగం పంతులుగారి స్వీయ చరిత్రం 1911వ సంవత్సరంలో మొట్టమొదటి సారి అచ్చయింది. పంతులుగారించు మించుగా అంతకు పూర్వం పది సంవత్సరాల నాడే స్వీయ చరిత్ర రచనకు శ్రీకారం చుట్టినా, అనారోగ్యాది క్లేశాల వల్లనూ, సంఘ సంస్కరణ తత్పరత్వపు శ్రమవల్లనూ, దానిని కొనసాగించలేదు. చిరస్మరణీయులు కొమర్రాజు లక్ష్మణరావుపంతులు గారు, వీరేశ లింగం గారిని, ప్రేరేపించి, స్వీయ చరిత్రను రచయింపజేసి, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి తరపున మొదటి భాగాన్ని 1911లో అచ్చువేశారు. 1915 లో తామే రెండవ భాగాన్నికూడా అచ్చువేశారు. వీరేశలింగం పంతులుగారు తమ స్వీయ చరిత్రను తమకు చేదోడు, వాదోడుగా ఉండి, సత్కర్మనిరతురాలైన ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ గారికి, అంకితం చేశారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారు ప్రచురించిన స్వీయ చరిత్ర మొదటి భాగం మొదటి పుటలో యీ విషయం స్పష్టంగా ఉంది. తరువాత వచ్చిన ముద్రణాలలో ఎవరి అలస భావమో, తెలివి తక్కువ తనమో, ఆ అంకితం పుటపరిహరించ బడింది 'నేను చేసిన సమస్త సత్ప్రయత్నములలోను, తోడు నీడగా ఉండి, సహస్ర హస్తములతో సదా నాకు సంరక్షణ భారాన్ని వహిస్తూ బిడ్డను తల్లి కాపాడినట్లు ఏబది సంవత్సరముల కాలము మన ప్రాణమునకు ప్రాణమై యుండిన నా అర్ధాంగి లక్ష్మి శ్రీమతి రాజ్యలక్ష్మికి నేనీ స్వీయచరిత్రాన్ని అంకితం చేస్తున్నానని, పంతుల గారు వ్రాసి కొన్నారు గదా. విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వాళ్ళు వేసిన మొదటి ముద్రణం కాక, తరువాత పంతులుగారి స్వీయచరిత్రం మూడు సార్లు ప్రచురణ పొందింది కాని ఆ తరువాత మూడు ప్రచురణలలో కూడా యీ అంకితం విషయం కనిపించదు.

వీరేశలింగంపంతులు గారి స్వీయచరిత్రను గూర్చి చెప్పవలసి వస్తే, అది ఇంచుమించుగా అర్థ శతాబ్ది ఆంధ్ర దేశపు సాంఘిక చరిత్ర మని చెప్పవలసి ఉంటుంది. అఖిల భారత దేశానికి రాజా రామమోహన రాయల వారెటువంటి సేవ చేశారో, దక్షిణ భారతానికి వీరేశలింగం పంతులు గారటువంటి సేవ చేశారు. తెలుగు సాహిత్యాన్ని, ఆయన సుసంపన్నం చేశారు. 'మహా వీరుడు, కార్యశూరుడు, ఆస్తిక మతావలంబకుడు, సంఘ సంస్కర్త, వచన రచనా పితామహుడు, శతా

టీక గ్రంథ కర్త, మహాదాత, మహాకవి యైన వీరేశ లింగ మహామహుని చరిత్రమును, నాంధ్ర దేశమునందు జనించిన ప్రతి పురుషుడు ప్రతి స్త్రీయు, జదివి యుందు గల వందల కొలది నీతి పాఠములు నేర్చుకొని ధన్యులగుదురు గాక' అని చిలకమర్తి వారాశించారు వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రం 1936 లో చిలకమర్తి పీఠికతోను, 1955లో భావరాజు వెంకట కృష్ణారావు గారి పీఠికతోను, ద్వితీయ, తృతీయ ముద్రణలుగా వెలువడింది 1962లో శ్రీ అంకరాజు శంకర రావుగారు, స్వీయచరిత్రను సంక్షిప్త ప్రతిగా వెలువరించారు. కాబట్టి యీ అరవై సంవత్సరాలలో పంతులు గారి స్వీయ చరిత్రం నాలుగు ముద్రణలు పొందింది ఇటీవల ప్రథమభాగపు ఆంగ్లానువాదం కూడా వెలువడింది శ్రీ వేమూరి రామకృష్ణా రావు గారు చాలా కాలం క్రితం పంతులుగారి స్వీయ చరిత్రను ఆంగ్లంలోకి అనువదించడానికి పూనుకొన్నట్లుగా తెలుస్తున్నది. అది ఇటీవల అచ్చయింది.

వీరేశలింగంపంతులుగారి స్వీయ చరిత్రం వెలువడ్డ తర్వాత ఇంచు మించుగా యీ అరవై సంవత్సరాలలో అరవై స్వీయ చరిత్రలు వెలువడలేదు. ఏదైనా ఒక రంగంలో గణనీయమైన కృషిచేసి ఘనతను పొందిన వ్యక్తితప్ప స్వీయ చరిత్రను వ్రాసుకోవటం— సార్థకం కాదు. కనుకనే ఎక్కువ సంఖ్యలో యీ చరిత్రలు రాలేదు.

పంతులుగారి తరవాత ప్రచురింపబడి వెంటనే పేర్కొనదగింది శ్రీ రాంభొట్ల జగన్నాథశాస్త్రిగారి స్వీయ చరిత్రం చాలా అద్భుతమైనది. నిప్పచ్చరపు పేద సంసారంనుంచి స్వయం కృషితో యీ మహానుభావుడు గొప్ప వకీలుగా పేరు ప్రఖ్యాతు లార్జించి, ధనం సంపాదించి, సార్థక జీవితాన్ని గడిపారు తమ స్వీయ చరిత్రానికి ముందుమాటగా ఆయన ఇటా వ్రాశారు "చరిత్ర వ్రాయు నలవాటు హూణ భాష కృపిచే గలిగిన సారము. స్వీయ చరిత భరత ఖండ వాసులకు అంబురాసిమధ్య నెక్కడనో చిక్కిపోయి తెలియకుండిన భూమివలె నుండెను. సాధారణముగా మన కవులు వంశావళుల వ్రాయుటకును, మన భూమి యేలిక లట్టి వంశ వృక్షంబులు వ్రాయించుకొనుటకు సమ్మతించిరే కాని, సామాన్య జనులలో పురుష సింహులనందగు వారి చరిత్రల దలపెట్టరైరి. కృతికర్త వ్రాయు నవతారిక గాని, కృతిపతి యుభిలషించు 'వంశ వర్ణన'గాని లోకాతీతుండగు నొక్క మహాపురుషు జీవితంబును చర్యగాని, యనుభవాదులంగాని పూర్ణముగా నిర్మింప వీలియదు. వెనుక నున్నవారు, ముందు వున్నవా రెటుల జీవించిరో తెలిసికొనలేక పోయినప్పుడు 'అనుభవము' అనుమాట కర్థము వ్యర్థమగును. ప్రతివారును స్వానుభవమువలననే జీవన మారంభించుచున్న దేశస్థితి దలుపు కాలచక్ర మింకొక విధముగా దిరుగుటయేగాక, నాలుగైదు శతాబ్దముల వెనుక నుండవలసి వచ్చును. అది కేవల మసంగతము."[6]

ఈ దృష్టితో శ్రీ జగన్నాథశాస్త్రిగారు తమ స్వీయ చరిత్రాన్ని రచించారన్నమాట. ఇంకా యీవిధంగా ఆయన అన్నారు. 'మహనీయుల చరిత్రలు మంచి చెడ్డల నెరింగించుచున్నవి శుభా శుభాదుల లోకమున కెరింగించుటయె పుస్తకములు వ్రాయుటకు ముఖ్య ఫలమని తలంచెదను. ఈ దేశమున స్వచరిత్రములు తెలుపు పుస్తకము లరుదు. ఇవి యున్నచో నా యా జనంబుల వంశములు, ఎందరి వారల యవస్థాత్యర్థులు వారి వారి చదువులు ప్రయోజనములు లోనుగా గల సంగతులు వానివలనం దెలియును. వంశావళి తెలియుటవలన మేలు కలదని నా తలంపు. తరుచుగా నీ దేశంపు జనంబులు వారి వారి ప్రపితామహునికి ముందు వాని పేరైన నెరుంగరు. నను యెరింగిన చందంబున స్వీయ చరిత్రము వ్రాయుట మంచి యని తలంచినాడను. కావున నా తెలిసినంత వట్టు వచ్చినంత' స్వభాషతో నా చరిత్రము వ్రాసి కొంటిని.' లోకోక్తులు, సామెతలు, సంస్కృత సాహిత్యం మంచి తెలుగు భారత, భాగవతాదులనుంచి లోక వృత్తాన్ని, మానవ స్వభావాన్ని విధి చెయిదలను తెలిపే అనర్ఘ రత్నాలవంటి ఉదాహరణ వాక్యాలతో శ్లోకాలతో, జగన్నాథశాస్త్రిగారి స్వీయ చరిత్రము గొప్ప సాహిత్య గ్రంథంగా ఉన్నది. తమ జీవితంలోని ఆ యా సన్నివేశాలకు అనుగుణమైన వ్యాఖ్యానాలను, భారతీయ విజ్ఞానంనుంచి ఆయన ఉద్ధరించిన గచ్చ ద్యాఖ్యగా సంతరించారు. పుస్తకంనిండా ఇలాటి సామెతలు, లోకోక్తులు చాలా కనబడతాయి. చోడవరంలో యీ శాస్త్రిగారి చాలాకాలం ప్లీడరుగా పని చేశారు. తమ చిన్న తనంలో కాలి నడకన కాశీ పోయి వచ్చారు. ఆ కాలపు పరిస్థితులు చాలా ఆసక్తిదాయకంగా ఉన్నాయి. కళింగాంధ్రమూ, ఉత్కళదేశము అక్కడి పరిస్థితులు, ఆచార వ్యవహారాలు, వీరి స్వీయ చరిత్ర ద్వారా తెలుసుకో వచ్చు.

తరువాత 15 సంవత్సరాలవరకూ తెలుగులో స్వీయ చరిత్రం వెలువడలేదు. 1931 లో వల్లూరి సూర్యనారాయణరావుగారి స్వీయ చరిత్రం వెలువడింది. వల్లూరి సూర్యనారాయణరావుగారు గొప్ప న్యాయవాదులుగా ప్రసిద్ధి కెక్కారు. చిన్న నవల చదువుతున్నట్లుగా చాలా ఆసక్తికరంగా సాగుతుంది వీరి స్వీయ చరిత్రం చదువుతుంటే. 162 పుటల గ్రంథం. సూర్యనారాయణరావు పంతులుగారు దేవాదాయ ధర్మాదాయ అభియోగాల విషయంలో చాలా సేవ చేశారు. న్యాయ శాస్త్ర విద్యార్థులకు అత్యంతం ఉత్కంఠ గొలిపే విషయాలు వ్రాశారు. ఆ కాలంలో గోదావరి జిల్లాల సాంఘిక స్వరూపము, మద్రాసు చదువు, అక్కడి స్థితిగతులు, వీరేశలింగంపంతులుగారి సంస్కరణోద్యమం మొదలైన విషయాలీ స్వీయ చరిత్రంలో ప్రసక్తమైనాయి.

1933 లో రాయసం వెంకట శివుడుగారి 'ఆత్మ చరిత్రము' ఆంధ్ర గ్రంథమాల వారు ప్రచురించారు వెంకట శివుడు గారు సర్వాకిమిడిలోను, నెల్లూరులోను ఆ కాలంలో ప్రసిద్ధ విద్యా సంస్థలకు ప్రిన్సిపాల్‌గా పని చేశారు. ఇది 654 పుటల బృహద్గ్రంథం. సకోద్యారిక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారు ఈ గ్రంథానికి పరిచయ వాక్యాల వ్రాశారు వెంకట శివుడుగారు స్త్రీలకోసం 'జనానా' అనే మాస పత్రికను కొంతకాలం నిర్వహించారు. సంఘ సంస్కరణ విషయకంగా కొంత కృషి చేశారు. వీరేశలింగం పంతులుగారి అమూల్యాలు. వీరేశలింగం పంతులుగారు తమకు వ్రాసిన ఉత్తరాలను కొన్నిటిని ఆత్మచరిత్రకు అనుబంధంగా వీరు చేర్చారు. బీద కుటుంబంలో పుట్టినా, స్వయం కృషిచేత, నియమ పాలనాపూర్వకమైన, చరితార్థమైన జీవనం గడపడంచేత, ఆత్మచరిత్రం విలువైనదిగా ఉన్నది. వీరేశలింగంపంతులుగారు, రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు, దేశిరాజు పెదబాపయ్యగారు, మన్నవ బుచ్చయ్య పంతులు గారు మొదలైన మహనీయుల సంఘ సంస్కరణ కృషి, అప్పటి సాంఘిక సమస్యలు,


పుల్లని, తియ్యని
నారింజపళ్లు బోలెడు తెచ్చి,
రసాలు పిండి చేశా చూడు
న్యూట్రిన్
ఆరెంజ్
క్యాండీ
నిజానికి పిల్లలూ! ఈ న్యూట్రిన్
ఆరెంజి క్యాండీలు అసలు నారింజ
తొనలను మించి రుచించు,
నువ్వు తిని నీ వాళ్లను తినిపించు!
nutrine
జిహ్వకు మిఠాయి యిందు
ఫలరస పూరిత విందు!
న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్,
చిత్తూరు (ఆం.ప్ర)

వీరి చరిత్రం నుండి తెలుసుకోవచ్చు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి ఆత్మ చరిత్రాన్ని గూర్చి వ్రాస్తూ ఈ గ్రంథము 'గతించిన యేబదేండ్ల ఆంధ్రాభ్యుదయమును సింహావలోకనము చేయుటకును, భావ్యభ్యుదయమునకును సాధనముగా నున్నది. . . . సాహిత్య రచనలందును, సాంఘిక వ్యవస్థలందును, మతాచారములందును, నిత్యజీవనమునందును, సంప్రాప్తమైన భావక్రియా పరివర్తనమును గ్రహించుటకు వినియోగపడు చున్నది'' అన్నారు.

తరువాత 1942 లో చిలకమర్తి లక్ష్మీనరసింహం కవిస్వీయ చరిత్రం వెలువడింది. అంటే రాయసం వెంకటశివుడుగారి ఆత్మచరిత్రం వచ్చిన తొమ్మిదేళ్ళకు గాని ఇంకో స్వీయ చరిత్రం రాలేదన్నమాట. చిలకమర్తి స్వీయచరిత్రం. అనేక విషయాలను పురస్కరించుకొని గొప్ప స్వీయ చరిత్రమని చెప్పవలసి ఉంటుంది. ద్వితీయ ముద్రణం కూడా పొందింది. వ్రాత ప్రతిలో ఎనిమిదివందల పుటలు వచ్చిందని, సుమారు ఐదు నెలలు పట్టిందనీ ఇది వ్రాయటానికి, చిలకమర్తి పీఠికలో వ్రాశారు. ఇరవై రెండేళ్ళకే ఆయన గయోపాఖ్యానం రచించారు. ఆయన గయోపాఖ్యానం లక్షప్రతులపైన అమ్ముడు పోయి తెలుగులో చరిత్ర సృష్టించింది. ప్రకాశం పంతులుగారు చిలకమర్తి వారు వ్రాసిన నాటకాలలో వేషాలు వేయటం, మండల సంఘ సంస్కరణ సభలు, రాజకీయసభలు, ఆంధ్రోద్యమం వీరేశలింగం పంతులుగారితో సంఘ సంస్కరణ కృషిలో పాల్గొనటం, గాంధీ మహాత్ముని ఉద్యమానికి ముందే, రామమోహనరాయల పేరు మీదుగా నిమ్నజాత్యుద్ధరణంకోసం పాఠశాలలు స్థాపించటం, చిలకమర్తి స్వీయచరిత్ర నవరసభరితంగా ఉంది. తనకు ఇరవై ఏడు సంవత్సరాలప్పుడు, ఆయన మొదటిసారి నవలల పోటీలో బహుమతి గెల్చుకున్నారు ఆ తరువాత నాలుగైదు సంవత్సరాలు, పోటీకి వ్రాసి బహుమానాలు పొందారు. చిలకమర్తికి దృష్టికి అవరోధం ఉండేది. అయినా ఆయన అవిశ్రాంత జీవనం గడిపారు మహత్కార్యాలు సాధించారు. గొప్ప గ్రంథాలు వ్రాశారు. నాటకాలు, నవలలు, మహనీయుల జీవిత చరిత్రలు, ప్రహసనాలు, తెలుగుతల్లికి అమూల్యాలంకారాలుగా అర్పించారు. చిలకమర్తి గొప్ప కవి. గొప్ప నవలా రచయిత. సంస్కర్త తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసినవాడు వచన రచనను దిద్ది తీర్చిన మహనీయుడు. సుమారు నాలుగు వందల పుటల్లో యీయన స్వీయచరిత్రం ఆద్యంతం మనోహరమైనది. 1957 వ సంవత్సరంలో చిలకమర్తి స్వీయచరిత్రం మరో ముద్రణం పొందింది.

1946 వ సంవత్సరంలో ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులుగారి స్వీయచరిత్రం 'నా జీవితయాత్ర' అనే పేరులో వెలువడింది. ప్రకాశం పంతులుగారి త్యాగం, సాహసం, దొడ్డ వ్యక్తిత్వము, ఆంధ్రదేశమంతా ఖ్యాతి పొందినదే. ఇటీవల అంటే క్రిందటి సంవత్సరం పంతులుగారి శతజయంత్యుత్సవ వత్సరాన్ని పురస్కరించుకొని, పంతులుగారి స్వీయచరిత్రం మూడూ, నాలుగూ భాగాలు, వెలువడ్డాయి. నీటితో పాటుగా తెన్నేట విశ్వనాథంగారు, అనుబంధముద్రణంగా, పంతులు గారు కీర్తిశేషులైన వరకూ, వారి చరిత్రాన్ని ఒక సంపుటంగా ప్రకటించారు. దీంతో పంతులుగారు తాము వ్రాసుకొన్నంత వరకూ పూర్తి స్వీయ చరిత్రం, అనంతర కాలంలోని వారి జీవిత విశేషాలు వెలుగు చూసినట్లైంది. దక్షిణాన తిరుచునాపల్లి నుంచి ఉత్తరాన విశాఖపట్నం వరకూ, అన్ని న్యాయ స్థానాలలోను, వాదించి లక్షలార్జించాను, స్థిరచరాస్తుల నెన్నిటినో సంపాదించాను, అని పంతులుగారు స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు. స్వరాజ్య పత్రికను నిర్వహించటం, సంచలన పూరితమైన రాజకీయ జీవితాన్ని గడపటం, ప్రజల హృదయాలలో, తమ ప్రియతమ నాయకుడుగా ప్రతిష్ఠితులు కావడం, మొదలైన విషయాలన్నీ పంతులుగారి స్వీయ చరిత్రలో చాలా ఆసక్తిని కలిగిస్తాయి. ఆ నాటి రాజమహేంద్రవరం, అప్పటి మునిసిపల్ రాజకీయాలు నాటకాలు, సంస్కృతీ, చరిత్రా, విదేశంలో బారిష్టరు చదువు, తొలి నాళ్ళలో కాంగ్రెస నిర్వహించిన పాత్ర, దక్షిణాది రాజకీయాల కారాగారవాసాలు, ఆంధ్ర రాష్ట్రోద్యమం, మొదలైన విషయాలన్నీ ప్రకాశం పంతులు గారు తమ స్వీయచరిత్రలో వివరంగ వ్రాశారు మళ్ళీ 1957 వ సంవత్సరంలో ప్రథమభాగం మరో ముద్రణను కూడా పొందడం పంతులుగారి స్వీయ చరిత్రం ఆంధ్ర ప్రజకు ప్రీతిపాత్రమైనదనటానికి నిదర్శనం.

ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి స్వీయచరిత్రం వ్రాసుకోకపోయినా, వారు రచించిన తెలంగాణా ఆంధ్రోద్యమాన్ని స్వీయచరిత్రగానే భావించవచ్చు. 1950 సంవత్సరానికే పంతులుగారి యీ చరిత్ర రెండు సంపుటాలలో వెలువడింది. ఇందులో పంతులుగారి కుటుంబ వృత్తాంతం చాల సంక్షేపంగానే ప్రసక్తమైనా, వారి జీవితమంతా నిజాం రాష్ట్రంలోని ఆంధ్రాభ్యుదయానికి ధారపోసిన వార కావటంవలన, ఆయన చరిత్రకు తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రకు అవినాభావ సంబంధమే కావడం వల్ల, దీని ఆయన స్వీయ చరిత్రంగానే యెంచ వచ్చు తెలంగాణంలో వివిధ ప్రాంతాలలో జరిగిన పదమూడు ఆంధ్ర మహాసభల యావద్వృత్తాంతమూ నిజాం నిరంకుశ పరిపాలనలో, ప్రజల ప్రాథమిక స్వాతంత్ర్యాలు ఏవిధంగ భంగమవుతూ వచ్చినదీ, తమ ప్రాథమిక హక్కుల నేవిధంగా ఎన్ని త్యాగాలు చేసి, ప్రజలు సాధించుకొన్నదీ, హనుమంతరావు పంతులు గారు తమ ఆంధ్రోద్యమ చరిత్రలో వివరించారు తెలంగాణ పునరుజ్జీవనం తెలుసుకో గోరిన వారు పంతులు గారి రెండు సంపుటాలు చదివితే చాలా లాభం పొందుతారు.

రాజకీయ నాయకులు, ఉద్యమ కర్తలు, సంఘ సంస్కర్తలు మాత్రమే కాక, ఆధునికులలో పండితులు కవులూ కూడ కొందరు స్వీయ చరిత్రలు వ్రాసుకొన్నారు. అవి ప్రకటించారు. కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ స్వీయచరిత్రను ప్రజ్ఞాప్రభాకరం పేరుతో వెలువరించారు ఇది 1951 లో వెలువడింది. ప్రభాకర శాస్త్రిగారు పరిశోధకాగ్రేసరులని, గొప్ప పండితులని, మాత్రమే చాలామంది యెరుగుదురు కాని ఆయన గొప్ప ఆధ్యాత్మిక శక్తులు సాధించిన యోగిపుంగవు లన్న విషయం వారి స్వీయచరిత్రను బట్టి తెలుసుకోవచ్చు. కుంభకోణంలో వెలసి, మాష్టరుగారుగా ప్రశస్తికెక్కి భృక్తరహిత తారకరాజయోగమనే పేరులో, ఒకానొక యోగ మార్గాన్ని అనుగ్రహించిన సిద్ధ పురుషులు, ప్రభాకరశాస్త్రిగారికి ఆ యోగాన్ని ఉపదేశించారు. నాటినుంచి శ్రీ శాస్త్రిగారిలో అనేక

దివ్యశక్తులు ప్రకాశితము లైనవి. వారి అకాల మరణంతో శ్రీ శాస్త్రి గారి స్వీయచరిత్రం అసమగ్రంగానే ఉండిపోయింది.

1952 వ సంవత్సరంలో కొండా వెంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్రం వెల్లువడింది. వెంకటప్పయ్య పంతులుగారు గొప్ప నిర్మాణ కార్యక్రమ నిర్వహణ దక్షులు. ఈ శతాబ్దిలో పొడసూపిన అపూర్వ సహాయ నిరాకరణోద్యమాన్ని, గాంధీ మహాత్ముని అడుగుజాడల్లో ఆంధ్ర దేశంలో నిర్వహించి, దేశభక్తులుగా విఖ్యాతి కెక్కినవారు వెంకటప్పయ్య పంతులుగారు. తొలినాళ్ళలోని కాంగ్రెసు రాజకీయాలు, ఆంధ్ర రాష్ట్రోద్యమము అప్పటి దేశ కాల పరిస్థితులు వెంకటప్పయ్యపంతులు గారు సరళమైన శైలిలో తమ గ్రంథంలో వివరించారు. పెదనంది పాడు ఉప్పు సత్యాగ్రహం ప్రథమాంధ్ర మహాసభలు, కాంగ్రెసులోని అప్పటి మితవాద, అతివాద పక్ష రాజకీయాలు, స్థానిక సంస్థలు, ఎన్నికలు, మద్రాసు లా కాలేజీ చదువులు, అక్కడి విశేషాలు మొదలైనవి వెంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్ర ద్వారా తెలుసుకో వచ్చు.

ఏ రాజకీయాలలో పాల్గొనక పోయినప్పటికీ, ఏ సంఘ సంస్కరణోద్యమ నాయకత్వం వహించక పోయినప్పటికీ, కవి గండపెండేరాలు, శాలువలూ పొంది, కవి భూషణాది బిరుదులు వహించకపోయినప్పటికీ, సాహితీవాద వివాదాలలో తలదూర్చకపోయినప్పటికీ నిప్పచ్చరపు పేద కుటుంబంలో పుట్టినా స్వయంకృషితో పైకివచ్చి, అనేక సంస్థలు స్థాపించి, దాన ధర్మాదులు చేసి, సాంఘిక గౌరవాదులు పొంది, భోగభాగ్యాదులనుభవించిన మహనీయుని జీవిత చరిత్రము కె. ఎన్. కేసరి గారి 'నా చిన్ననాటి ముచ్చట్లు'. ఇది 1953 వ సంవత్సరంలో పుస్తక రూపంలో వెలువడింది. ముచ్చట్ల పేరున 28 అధ్యాయాలలో, యీ శతాబ్దిపూర్వార్ధంలో గుంటూరు, నెల్లూరు జిల్లాల సాంఘికచరిత్రము, మద్రాసు విశేషాలు తెలియ చేశారు. కేసరిగారు నిర్వహించిన గృహలక్ష్మి అన్న మాసపత్రికలోను, ఆంధ్ర జ్యోతి అన్న మాసపత్రికలోనూ యీ ముచ్చట్లు ముందుగా ప్రకటితములైనవి. "ఆ నాటి చెన్న నగరము యెట్లుండెనో, అప్పటి విద్యార్థు లెట్లు కాలము గడిపిరో, రోడ్లు కాఫీహోటళ్లు, భవనములు ఏ రీతిన ఉండెడివో తెలుసుకొనుటకు అనువగు వర్ణనలు కలవు. ఉత్తర దక్షిణ దేశయాత్రలో, ఆయా క్షేత్రములు మలబారు పరిస్థితులు, నంబూద్రి బ్రాహ్మణుల వృత్తాంతము, వివిధ నాటక రచనలు, సమాజములు, చిత్రలేఖనము, సంగీతము— ఇది అది అననేల వివిధ విషయములను గురించి తెలుసుకోదగిన హంశములు కలవు" అని దీనికి పరిచయ వాక్యాలు వ్రాసిన అప్పటి మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు వ్రాశారు. ఇది చాలా గొప్ప గ్రంథం.

దరిశి చెంచయ్యగారి 'నేనూ — నాదేశం' తెలుగులో అపూర్వమైన గ్రంథం అని చెప్పవలసి ఉంటుంది. ఈ గ్రంథం కూడా 1952, 53 ప్రాంతాలలో వెలువడింది. ఈ శతాబ్ది ప్రథమార్ధంలో తెలుగుదేశంలో వచ్చిన ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలోని ఉద్యమాలు, వాటి ప్రభావాలు, ఫలితాలు, వీరి స్వీయచరిత్రం ద్వారా తెలుసుకోవచ్చు. భారత స్వాతంత్ర్యోద్యమాన్ని సాయుధ విప్లవంగా మార్చి, స్వాతంత్ర్యాన్ని కాలహరణం లేకుండా వెనువెంటనే సంపాదించుకొవలెనని, విదేశాలలో ఒక రహస్యోద్యమం, ఆనాటి భారతీయ విద్యార్థులు లేవ తీశారు. ఇదే గదర్ ఉద్యమం. ఈ ఉద్యమం 1913—1919 ల మధ్య తీవ్రంగా సాగింది. 'గదర్ అంటే సైనికులు తిరుగుబాటు చేసి నూతన ప్రభుత్వస్థాపనకై సాయుధ పోరాటాన్ని సాగించడమని అర్థం.' అని గచయిత వివరించారు. 1912 వ సంవత్సరంలో చెంచయ్య గారు, అమెరికాలోని కాలిఫోర్నియా యూనివర్శిటీలో విద్యాభ్యాసం నిమిత్తం చేరారు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో అప్పుడు మూడువేల ఐదువందల మంది విద్యార్థులు చదువుకుంటూ ఉండే వారని, అందులో వెయ్యమంది స్త్రీలని, సుమారు 500 మంది విద్యార్థులు ఇతర దేశాల నుంచి వచ్చిన వారని, భారతదేశం నుంచి వచ్చినవారు 30 మంది విద్యార్థులుండే వారని వీళ్ళలో రెండు రాజకీయ పార్టీ లుండేవని, చెంచయ్యగారు భారతీయ స్వాతంత్ర్య సంగ్రామాన్ని గూర్చిన చాలా అద్భుతమైన విషయాలు వ్రాశారు. లాలా హరదయాళ్ శ్యాంజీ కృష్ణవర్మ మొదలైన విప్లవవీరుల వృత్తాంతాలు, పరమాద్భుతాలుగా ఉన్నాయి. 1947 వ సంవత్సరం వరకూ గదర్ పార్టీ ని గురించి ఏమీ వ్రాయకూడదని, ప్రసక్తి లేకూడదని ప్రభుత్వ నిషేధం వుండేది. చెంచయ్యగారు మళ్ళీ మన దేశం వచ్చిన తరువాత, సంఘ సంస్కరణోద్యమాలలోనూ, స్వాతంత్ర్యోద్యమంలోనూ పాల్గొన్నారు. తెలుగులో వచ్చిన గొప్ప స్వీయ చరిత్రలలో చెంచయ్యగారిది ఒకటిగా చెప్పాలి.

1959 వ సంవత్సరంలో పెద్దిభొట్ల వీరయ్యగారి స్వీయ చరిత్ర వచ్చింది. ఈ శతాబ్ది ప్రథమపాదంలో, కాంగ్రెసు రాజకీయాలలో, నిర్మాణాత్మక కార్యక్రమాలలో చురుకుగా పనిచేసి, సంస్కరణోద్యమాలలో పాల్గొని ప్రసిద్ధికెక్కిన వారు వీరయ్యగారు. బెజవాడలో న్యాయవాదిగా ఉండేవారు. 'నా స్వీయ చరిత్ర నుంచి విద్యార్థులు రాజకీయముల వారు, ఉద్యోగస్తులు, న్యాయవాదులు, న్యాయాధికారులు, యాత్రార్థులు మొదలగువారు తెలిసికొనగల సంగతులున్నవని నమ్ముచున్నాను" అన్నారు వీరయ్యగారు.

1959 వ సంవత్సరంలోనే అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు గారి 'నా జీవిత కథ — నవ్యాంధ్రం' ప్రచురణం పొందింది. ఇది చాలా గొప్ప స్వీయచరిత్రము. 500 పుటల పరిమితిలో నవ్యాంధ్ర దేశం సమగ్రంగా ఆవిష్కరణను పొందింది. పెద్దిభొట్ల వీరయ్యగారి, అయ్యదేవర కాళేశ్వరరావుగారి స్వీయ చరిత్రలను గూర్చి ప్రస్తావిస్తూ సుప్రసిద్ధ చరిత్రకారులు, గ్రంథ కర్తలు, శ్రీ దిగవల్లి వేంకటశివ రావుగారి ట్లా వ్రాశారు. "ఇవి కేవలము వ్యక్తుల జీవిత చరిత్రలే గాక లోకమాన్య తిలకు మహాశయుని కాలమునుండి గాంధీ మహాత్ముని నిర్యాణం వరకును మన దేశములో జరిగిన రాజకీయోద్యమముల చరిత్రముగా దేశములోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక వ్యవస్థలందు, ప్రజల చిత్తవృత్తులందు, వ్యక్తుల జీవిత విధానము లందు కలిగిన గొప్ప మార్పులను గూర్చి వర్ణించు చరిత్రలుగ నున్నవి. దేశములో కలిగిన యీ మార్పులకు శ్రీ కాళేశ్వరరావు, వీరయ్యగార జీవితములు గొప్ప ఉదాహరణములుగ నున్నవి" అని పెద్దిభొట్ల వీరయ్యగారి స్వీయచరిత్రకు తొలిపలుకులు వ్రాస్తూ శ్రీ శివరావుగారు

వ్రాశారు. అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారి స్వీయచరిత్ర గడచిన శతాబ్దపు సమగ్రాంధ్ర దేశపు చరిత్రయే అని చెప్పాలి. దీన్ని పంతులుగారు రెండు సంపుటాలుగా వ్రాయ తలపోశారు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలోని ముఖ్య ఘట్టమైన ఉప్పు సత్యాగ్రహం వరకు, అంటే 1930 వ సంవత్సరం వరకు తెలుగుదేశంలో చెలరేగిన ఉద్యమాల స్వరూపాలను కాళేశ్వరరావుగారు, రసవత్తరంగా తమ స్వీయచరిత్రలో రూపొందించారు. ''దేశ స్వతంత్రము, విశాలాంధ్ర స్థాపనము స్వయముగ చూచి అనుభవించు అదృష్టము నాకు లభించెను. కావున భావి తరముల వారికి ఆంధ్ర దేశములో జరిగిన విప్లవములను గూర్చియు వాటిని నడపిన నాయకులను గూర్చియు, నాటిలో నాకు గల యనుభవములను గూర్చియు స్పష్టముగ తెలుపు నుద్దేశ్యముతో నీ గ్రంథము వ్రాసితిని'' అన్నారు కాళేశ్వర రావు గారు ఉపోద్ఘాతంలో. కాంగ్రెసు సంస్థ పుట్టిన తొలిరోజుల రాజకీయాలు, అప్పటి ఆంధ్రదేశ స్వరూపము, సాంఘిక పరిస్థితులు, జమీందారుల చరిత్రలు, సంస్కరణోద్యమాలు, విజ్ఞానచంద్రికా గ్రంథమండలి వంటి సాహిత్య ప్రచురణ సంస్థలు నిర్వహించిన మహోద్యమాలు మొదలైన వన్నీ కాళేశ్వరరావు పంతులుగారి స్వీయచరిత్రలో ప్రసక్తమైనవి. సుప్రసిద్ధ దేశభక్తుడు జాతీయకవి సుబ్రహ్మణ్యభారతి, విప్లవవాది గొప్పవక్త అయిన బిపిన్ చంద్రపాల్‌ను, మద్రాసుకు తీసుకొని వెళ్ళటానికి రాజమండ్రి వరకు ఎదురు వచ్చి, ఆయనకు స్వాగతం చెప్పి, ఆయనతో బెజవాడ వచ్చి ఒందరు వెళ్ళి, మద్రాసుకు ఆయనతో పాటు వెళ్ళటం చాలా ఆసక్తికరమైన విషయం, కాళేశ్వర రావు పంతులుగారి స్వీయచరిత్రలో ఉన్నది. పండిత మదనమోహనమాలవ్యా, బాలగంగాధర తిలక్, మహాత్మా గాంధీ మొదలైన వారితో కాళేశ్వరరావుగారికున్న వ్యక్తిగత పరిచయాలు. వారు బెజవాడ వచ్చినప్పుడు, వారి ఆతిథ్యాన్ని పొందటం మొదలైన విషయాలు, చాలా అద్భుతాలుగా ఉన్నాయి. కాళేశ్వరరావు పంతులుగారు పూర్ణపురుషులు. ఆయన గారి స్వీయ చరిత్రం అనేక విషయాలను తెలియజేస్తున్నది.

1960 వ సంవత్సరం ప్రాంతంలో వెలువడిన మరొక గొప్ప స్వీయచరిత్రము మాదిరాజు రామకోటీశ్వరరావు పంతులుగారిది. తెలంగాణా ప్రాంతంలో, చెలరేగిన అపూర్వచైతన్య విప్లవపు సమగ్ర చరిత్ర రామకోటీశ్వర రావుగారి స్వీయచరిత్ర ద్వారా తెలుసుకోవచ్చు. ఈ గ్రంథాన్ని గూర్చి తమ అభిప్రాయాన్ని తెలియ జేస్తూ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారిట్లా వ్రాశారు. ''రాజకీయములందు నా వలెనే వారును మితవాదులుగా నుండిరి. నా వలెనే వారు జైలునకు పోక తొలగియుండిరి. నిర్మాణ కార్యక్రమము లందు యెక్కువ శ్రద్ధ గలవారై వరంగల్లులోని సంస్కృత పాఠశాల, అనంత లక్ష్మి ఆయుర్వేదశాల యొక్క అభివృద్ధికిని అవిశ్రాంతముగ పాటుపడినారని నే నెరుగుదును'' రామకోటీశ్వరరావు గారి స్వీయచరిత్ర వల్ల నిజాం రాష్ట్ర సాంఘిక పరిస్థితులు, అక్కడి ఆంధ్రోద్యమ స్వరూపము అవగతం చేసుకోవచ్చు. కాళేశ్వరరావు పంతులుగారు తమ స్వీయచరిత్రకు నవ్యాంధ్ర మని కూడా చేర్చినట్లుగా మాదిరాజు రామకోటీశ్వరరావు పంతులుగారు తమ స్వీయచరిత్రను, 'అభ్యుదయ తెలంగాణా చరిత్రాంశములు' అని కూడా సంభావించారు. నిజాం ప్రభువుల పరిపాలనలో ప్రజల స్థితిగతులు ఏవిధంగా ఉండేవో, రజాకార్ల దురంతాలు, దుశ్చర్యలు ఏవిధంగా కొనసాగినవో, స్టేట్ కాంగ్రెస్ ఉద్యమం ఏవిధంగా సాగిందో, మొదలైన విషయాలు, మూసీనది హైదరాబాదు పట్టణాన్ని ముంచడం, ఆకాలంలోని న్యాయస్థానాలు, న్యాయవాదులు, ఉర్దూ పాండిత్యాలు, ఆ సంస్కృతి, మొదలైన విశేషాలన్నీ, వాలా కుతూహలం కలిగించే విధంగా సరళమైన శైలిలో రామకోటీశ్వరరావు పంతులు గారు వ్రాశారు.

1958, 1960 సంవత్సర ప్రాంతాలలో శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'అనుభవాలూ — జ్ఞాపకాలూను' అన్న స్వీయచరిత్రం మూడు సంపుటాలలో వెలువడింది. శ్రీ పాదసుబ్రహ్మణ్య శాస్త్రిగారు తెలుగుభాషలోని తీయదనాన్ని, సొగసును, నుడికారాన్ని, కలకండ పోతలుగా, కథలుగా, నవలలుగా, తెలుగు సాహిత్యాన్ని అర్పించిన మహనీయులు. 'మీ పుస్తకం చదవకపోతే, ఈ కాలం వారికెవరికీ ఇటువంటి ప్రపంచ మొకటి ఉండిందని వూహించడానికైనా వీలు లేదు. కాల పరిస్థితు లంతగా మారిపోయినవి. . . . రచనలో— అచ్చులో— మీదే ఒక స్వచ్ఛంద శయ్య, కృత్యా కృత్యాలలో మీ కున్న భావోద్రేకాలన్నీ అన్నిచోట్లా ప్రతిఫలింపించి మెరయించే శక్తి మీది. దాని వేధ శక్తి నుంచీ తప్పించుకోగలిగిన చదువరి అరుదు.'' అన్నారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ అభిప్రాయాన్ని తెలియజేస్తూ. 'ఆధుని కాంధ్రమున వాడుకభాషను నిర్మించిన కొలదిమందిలో మీరొకరు. . . మీ చిన్ననాటి తెనుగు పల్లెటూళ్ళ జీవితము, ఆచారములు, శ్రోత్రుల గృహాల శోభ, ఆ సంస్కృతి, సర్వము రమణీయముగా నున్నది. . . . సర్వధా తమరినాటి యాంధ్ర వ్యావహారిక భాషా నిర్మాతృ గణ ప్రథమగణనీయులు' అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ అభిప్రాయాన్ని వ్రాశారు. ఆనాటి ఉభయగోదావరి జిల్లాల బ్రాహ్మణాగ్రహారాల కుల విద్యలు, సాంఘిక పరిస్థితులు, యజ్ఞయాగాదులు, ఆ నాటి పెద్దలు, వదాన్యులు, సాహిత్యోద్యమాలు, వైదికాచారాలు, సాంఘికోద్యమాలు, అన్నీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ ఆత్మకథ వంటి అనుభవాలూ — జ్ఞాపకాలూనూ మూడు సంపుటాలలో అత్యద్భుతంగా వ్రాశారు. తాము దర్శించిన ఉన్నతోన్నతుల వ్యక్తిత్వాలు, విద్యా వివాదాలు, సర్వజ్ఞులా ప్రౌఢిమలు, అవధానస్పర్ధలు, మొదలైన విషయాలు, సమగ్రంగా రూపొందించారు శాస్త్రిగారు. తమ కనుల ముందు తాము చూసిన సంగతులేకాక, తమ తాత ముత్తాతల కాలంనాటి సంగతులు, వాళ్ళ పాండిత్యాతిశయాలు, అప్పటి సంస్కృతి, జీవిత విధానాలు, క్రమంగా దేశ కాల పరిస్థితులలో వచ్చిన మార్పులు, మొదలైన విషయాలన్నీ అత్యంతమూ ఉత్కంఠ జనకాలుగా వర్ణించారు శాస్త్రిగారు. ఈ మూడు సంపుటాలేగాక ఇంకా కొన్ని సంపుటాలుగా కూడా అనుభవాలూ, జ్ఞాపకాలూ వెలువరించాలని శాస్త్రిగారుద్దేశించారు కాని, వారి అకాల మరణం వల్ల అది నెరవేర లేదు.

తెలుగులో కవి పండితులు, సాహిత్య వేత్తలు, సరస్వతీమూర్తులు వెలువరించిన స్వీయచరిత్రలలో శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీ కృష్ణస్వీయచరిత్రం కూడా ప్రథమగణ్యమైనదిగా చెప్పాలి. వీరి స్వీయచరిత్రం 1957 లోనే వెలువడింది. శ్రీ పాద కృష్ణమూర్తి

శాస్త్రిగారు మహామహోపాధ్యాయులు. గొప్ప పండిత కవులు. ద్విశతాధిక గ్రంథకర్తలు. భారత భాగవత రామాయణాలను, ఒక్క చేతి మీదుగా, యథామూలంగా అనువదించిన శక్తిసంపన్నులు. వీరు తమ జీవిత కాలంలో సందర్శించిన వివిధ సంస్థానాధిపతులు తమకు చేసిన సత్కారాలు, తాము రచించిన గ్రంథాల వివరాలు, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారితో తమకు సంభవించిన వాదవివాదాలు, మొదలైన విషయాలన్నీ తమ స్వీయచరిత్రంలో వ్రాశారు. తాము చూసిన పుణ్యక్షేత్ర మహిమాభివర్ణనలు కూడా సంగ్రహంగా తమ స్వీయచరిత్రలో చేర్చారు. వీరి స్వీయ చరిత్రం విపులంగానూ, సమగ్రంగానూ లేదు. అయితే ఆ కాలంనాటి సాంఘిక పరిస్థితులు తెలుసుకోవడానికి దర్పణ ప్రాయంగా ఉంది. అనేక అద్భుతమైన వృత్తాంతాలు శాస్త్రిగారి స్వీయచరిత్ర ద్వారా తెలుసుకోవచ్చు. మహామహిమాన్వితుడైన, తపస్సంపన్నుడైన, అవధూత స్థితిపొందిన త్రిలింగ స్వామిని గూర్చి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిన వృత్తాంతం చాలా అద్భుతంగా ఉన్నది.

పూర్తిగా స్వీయచరిత్రలే అని చెప్పలేక పోయినా, చెళ్ళపిళ్ళ వారు ప్రకటించిన కథలు— గాథలు, మూడు భాగాలలోని అనేక వృత్తాంతాలు, శ్రీపాదవారు ప్రకటించిన చెళ్ళపిళ్ళ చెరలాటం వంటి, వాదవివాద పరామర్శలు, ఇంకా కవులు ప్రచురిస్తూ వచ్చిన పరస్పరాభియోగ విమర్శనలు, కొంతలో కొంత యాత్రా చరిత్రలు, దినచర్యలు, జాబులు, స్మృతులు, అనుభవాలు, జ్ఞాపకాలు మొదలైనవన్నీ స్వీయ చరిత్రాత్మక సాహిత్యం క్రిందికే చేరుతవి.

మహిళామతల్లులు, తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియల లోనూ అంతో ఇంతో కృషి చేసి, పేరు ప్రఖ్యాతు లార్జించారు ఇతఃపూర్వము, ఇప్పుడూనూ అట్లానే స్వీయ చరిత్రను కాని లేదా అనుభవాల రూపంగా కాని, ఏవైనా గ్రంథాలు ప్రచురింపారా అన్న ఆసక్తి కలగడం సహజమే. శ్రీమతి సంగం లక్ష్మీ బాయమ్మగారు 'నా అనుభవములు' అనే పేరుతో, ఒక చిన్న గ్రంథం ప్రకటించారు. ఈమె గారు విద్యాధికురాలు. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో మంత్రి వర్గంలో మంత్రిణిగా పని చేసిన వారు. సంక్షేమ కార్యక్రమాల నెన్నిటినో సమర్థవంతంగా నిర్వహించిన వారు. నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నవారు. భూదానోద్యమంలో పనిచేసిన వారు. స్వాతంత్ర్య భానూదయం కాకపూర్వం, నైజాం పరిపాలన నుండి తెలంగాణం, విముక్తి పొందనినాడు, మతోన్మాదులు గావించిన దుండగాలు, రజాకార్లు సాగించిన దారుణమైన దురంతాలు, ఆ నాటి సాంఘిక పరిస్థితులు, రాజకీయాలు, తాము చదివిన రోజుల, సహపాఠులతో కల్పించిన కథలు, పువ్వుల పరిమళం వంటి, మనోహరమైన, అత్యంతా కర్షణీయమైన శైలిలో, భావోద్విగ్నతతో సరసపాలుట్టిపడ వర్ణించారు. చాలా ఆకట్టుకొనే శైలి. అచ్చమైన తెలంగాణా నుడికారపు సొయగం ఉట్టిపడేట్లుగా కొన్ని కొన్ని అనుభవాలను వ్రాశారు. 1955, 56 ప్రాంతాలలో యీ గ్రంథం ప్రచురింపబడి ఉంటుంది.

ఇట్లానే శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు రచించిన 'అప్పారావుగారూ — నేనూ' అనే పేరుతో ఒక గ్రంథం స్మృతులు రచించిన స్వీయచరిత్రలలో చాలా అద్భుతమైనది. నిసర్గ మనోహరమైన శైలితో, సెలయేరు ప్రవహించినట్లుగా, ఇందులో కథనం సాగింది. బసవరాజు అప్పారావుగారి సహధర్మచారిణిగా ఆయన కోమలమైన, మృదులమైన వ్యక్తిత్వాన్ని, యీమె సరిగ్గా మూర్తిమంతం చేశారీ గ్రంథంలో. ఇది చిన్న గ్రంథమే అయినా చాలా విలువైనది. బసవరాజు అప్పారావుగారు భావకవులలో ఎన్నదగినవారు. మిక్కిలి సుకుమారమైన మనఃప్రవృత్తి వీరిది. వారి మనసెరిగిన ఇల్లాలు శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు. అప్పారావుగారి స్నేహితులను గురించీ, అభిరుచులను గురించి, వారితో తాము చూసిన యాత్రా స్థలాలను గూర్చీ, అప్పటి కాంగ్రెసు రాజకీయాలనుగురించీ, ఆంధ్రోద్యమాన్ని గూర్చి, రాజ్యలక్ష్మమ్మ గారు, అనేకమైన విషయాలు వ్రాశారు. 1962 ప్రాంతంలో యీ గ్రంథం వెలువడింది.

'నా స్మృతిపథంలో' అనే పేరున మొదటి సంపుటాన్ని, 'సాగుతున్నయాత్ర' అన్న పేరుతో రెండోసంపుటాన్ని, ఆచంట జానకిరామ్ వెలువరించారు. అన్నిటా జానకిరాంగారు భావుకులు. ఆకాశవాణి కార్యక్రమాలను బహు సంవత్సరాలు నిర్వహించిన వారు. ఆయన అనుభవాలు, జ్ఞాపకాలు, కవి మిత్రులతో పరిచయాలు, భావోద్వేగంతో, కవితావేశంతో, చిన్న చిన్న కథలుగా, కవితా ఖండికలుగా, ఆయన వ్రాశారు వారు ప్రసారం చేసిన సంగీత కార్యక్రమాలు, నాటకాలు, సాహిత్యప్రసంగాలు, వాటి వాటి కృత్యాద్యవస్థలు, వాటివాటి పూర్వరంగాలు, తమ జ్ఞాపకాలుగా, ఆయన ఆ రెండు సంపుటాలలో వివరించారు.

కాకినాడ బాంబు కేసులో ద్వీపాంతరవాసశిక్షను పొంది అండమాన్ కారాగారవాస శిక్ష ననుభవించిన ప్రతివాదిభయంకరాచార్యుల వారు 'అండమాన్ జీవితం' పేరుతో, స్వీయచరిత్రాత్మకమైన గ్రంథాన్ని ప్రచురించారు. బ్రిటిషు పరిపాలనలో, దేశ స్వాతంత్ర్యోద్యమంలో దేశభక్తులు, సత్యాగ్రహులు, విప్లవవాదులు ఎటువంటి క్రూర శిక్షలనుభవించారో, ఎన్ని బాధలుపడ్డారో, ఎన్ని కష్ట నష్టాల కోర్చుకొన్నారో, ఎన్ని నిర్బంధాలకు గురి అయినారో, భయంకరాచార్యుల వారి 'అండమాన్ జీవితం' ద్వారా తెలుసుకోవచ్చు. ఇటీవల డా. పి. తిరుమలరావుగారి 'గడచిన రోజులు' అన్న పేరుతో స్వీయచరిత్రం వెలువడింది. ఆ స్వీయచరిత్రలో ఆంధ్రదేశంలో అఖిల భారత కాంగ్రెస్ సభలూ, వాటి విశేషాలు, విద్యార్థులు విద్యాలయాలు విడిచి, స్వాతంత్ర్య సమరంలో ఏవిధంగా పాల్గొన్నదీ, కారాగారవాస శిక్ష లేవిధంగా అనుభవించిందీ, మొదలైన విషయాలు వివరించారు. కాకినాడ కాంగ్రెస్ సభలనూ, బాంబు కేసును, కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు.

1967 వ సంవత్సరంలో కొండా వెంకట రంగారెడ్డిగారి స్వీయచరిత్రం వెలువడింది. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలోని ప్రజాహిత కార్యములన్నిటిలోనూ వెంకట రంగారెడ్డిగారు పాల్గొన్న వారే. హైదరాబాదు స్టేటు కాంగ్రెసు నిర్వహించిన ఉద్యమంలోను, గ్రంథాలయోద్యమంలోను, ఆంధ్రోద్యమంలోనూ వెంకట రంగారెడ్డిగారు నాయకులుగా కృషి చేశారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడటానికి పూర్వము ప్రత్యేక తెలంగాణ ఏర్పడాలని తాము కృషి చేశామని కూడా వారు స్వీయచరిత్రలో వ్రాసుకొన్నారు. తరవాత ఆంధ్రప్రదేశ్ ఏర్పడటం తర్వాత వారు ఉపముఖ్యమంత్రిగా కూడా పనిచేశారు. 1960లో

ప్రత్యేక తెలంగాణా ఉద్యమ సందర్భంగా కూడా వీరు ప్రత్యేక తెలంగాణా ఏర్పడాలని కోరి కృషి చేశారు. అప్పుడు తమ స్వీయ చరిత్రలోని పూర్వపు తమ అభిప్రాయాలను, కొన్నిటిని మార్చుకొని, ద్వితీయ ముద్రణం గావించారు.

ఇటీవలనే అంటే 1972 లో రావి నారాయణరెడ్డిగారి స్వీయ చరిత్రం వచ్చింది. తెలంగాణాలోని ప్రజోద్యమాలను 1950 ప్రాంతంలో చెలరేగిన సాయుధ విప్లవాన్ని గూర్చిన తఫ్సీళ్లు ఇందులో ఉన్నాయి. వీరు ప్రఖ్యాత మితవాద కమ్యూనిస్టు నాయకులు. తెలంగాణా ఆంధ్ర మహాసభలలో కూడా గొప్పగా కృషిచేసి విశాలాంధ్ర స్థాపనకోసం, తెలుగుల ఐకమత్యం కోసం పాటుపడిన వారు.

తెలుగులో రాజకీయనాయకులు, దేశ సేవాధురంధరులు వ్రాసిన స్వీయ చరిత్రలు ఇంకా కొన్ని ఉన్నట్లుగా చెప్పలేము. సాహితీవేత్తలు మాత్రము ఇంకా కొందరు తమ అనుభవాలను, జ్ఞాపకాలను, ఆత్మ చరిత్రములను ప్రచురించారు.

ప్రఖ్యాత పత్రికా రచయిత శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు గారి అనుభవాలు, జ్ఞాపకాలు ఇటీవలనే వెలువడ్డాయి. ఇది చిన్న పుస్తకము. వెనుకటితరం కాంగ్రెసు నాయకులు గొట్టిపాటి బ్రహ్మయ్య గారు 'నా జీవిత నౌక' పేరుతో తమ స్వీయచరిత్రను ఒక దినపత్రికలో ప్రకటించారు కాని అది ఇంకా పుస్తకరూపంలో రాలేదు.

వెంగపోలు ముని సుబ్రహ్మణ్యం అనే ఆయన తమ స్వీయ చరిత్రాంశాలను ఇంగ్లీషులో వ్రాసినట్లూ, దాని అనువాద భాగాలను తాము ప్రచురిస్తున్నట్లూ పేర్కొని ఇటీవల ఒకానొక వారపత్రిక, కొన్ని భాగాలు ప్రచురించింది.

నెల్లూరు రామానాయుడు గారనేవారు, 'జమీన్ రైతు' అని నెల్లూరునుంచి వచ్చే పత్రికలో తమ జీవిత విశేషాలను ప్రచురించారు. ఇది పుస్తక రూపాన వచ్చిందో రాలేదో తెలియటం లేదు. ఇట్లానే ప్రఖ్యాత ఆయుర్వేద పండితులు డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారు తమ జీవిత విశేషాలను 'ధన్వంతరి' అనే ఆయుర్వేద వైద్య విజ్ఞాన మాస పత్రికలో ప్రచురించినారట. ఇది పుస్తక రూపంలో వచ్చిందో రాలేదో తెలియదు.

వెనుకటి తరానికి చెంది బ్రాహ్మమత ప్రభావితులై, సంఘ సంస్కరణ కార్యక్రమాలలో యధాశక్తి పాల్గొన్న బల భద్రయ్య కొటయ్య గారనేవారు, కృష్ణాజిల్లా, దివి తాలూకా, వక్కలగడ్డ నివాసి, తమ స్వీయచరిత్రను వ్రాసుకొన్నట్లూ, దానిని తాము చూసినట్లు, చదివినట్లు, ఎన్నో జీవిత చరిత్రలు వ్రాసి ప్రఖ్యాతులైన గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు, ఈ వ్యాసకర్తకు తెలియజేశారు కాని ఆ గ్రంధాన్ని యీ వ్యాసకర్త చూడటం పడింది కాదు. ఇట్లానే దాసరి లక్ష్మణస్వామిగారు కూడా జీవితయాత్ర పేరున తమ స్వీయచరిత్రను వ్రాసుకొన్నట్లుగా గొర్రెపాటి వారు వ్రాశారు.

కళాప్రపూర్ణ గిడుగు వెంకట సీతాపతి పంతులుగారు చాలా సంగ్రహంగా తమ స్వీయ చరిత్రను ప్రకటించారు. ఇది 1962 లోనే వచ్చింది. కేవలం 60 పుటలన చిన్న గ్రంధం విపులంగా రచించటానికి వేసుకొన్న సంగ్రహ ప్రణాళికలాగా ఉన్నది. తమ తండ్రి గారున్నూ తామున్నూ కలిసి, చేసిన సారస్వత సేవ, సవరభాషా కృషి, కళింగాంధ్రలోని సాంఘిక పరిస్థితులు, రాజకీయాలు మొదలైన విషయాలన్నీ ఇందులో సంగ్రహంగా వారు తెలియ జేశారు.

శృంగారం సర్వారాయ కవిగారు సచ్చరిత్రం పేరుతో తమ స్వీయ చరిత్రను వ్రాసుకొన్నట్లుగా మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రిగారు తమ ఆంధ్ర రచయితలన్న గ్రంధంలో ప్రస్తావించారు.

అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు స్వీయ చరిత్రం రచించారు కాని, అది అసంపూర్ణం. వారి జీవితంలో ముప్పది సంవత్సరాల వయసు వచ్చినవరకే తమ చరిత్రను వారు వ్రాశారు. ఇది పుస్తక రూపాన వెలువడ లేదు. 1955 లో ఆంధ్రపత్రిక దినపత్రికలో నారాయణదాసుగారి అసమగ్ర స్వీయ చరిత్రం వెలువడింది.[8]

సుప్రసిద్ధ 'ధారచయిత, నవలా రచయిత, ప్రతిభా సంపన్నుడు స్వర్గీయ బుచ్చిబాబు 'నా అంతరంగ కథనం' పేరుతో తమ స్వీయచరిత్రను ప్రకటించారు. తమ జీవిత సంఘటనలకు, తామే వ్యాఖ్యానం చేస్తూ ఆయా సన్నివేశాలను వారంధులో వివరించారు. తాము వ్రాసిన నవలల, కథల, ప్రేరణలు, ఆయా పాత్రల పూర్వరంగాలు, సవ్యాఖ్యానరూపంగా ఆయనగారి జీవిత విశేషాలతో బుచ్చిబాబుగారు అంతరంగకథనంలో సంతరించారు. అంతరంగ కథనమంతా ముందుగా ఒక వారపత్రికలో వెలువడింది. తరువాత పుస్తకరూపంలో 1968 లో వచ్చింది స్వీయ చరిత్రలలో బుచ్చిబాబుగారి అంతరంగ కథనం కొత్త తరహాకు చెందింది. కొత్త శిల్ప మన్నమాట. చాలా ఆసక్తికరంగా, ఒక కథ చదువుతున్నట్లు, నవల చదువుతున్నట్లు, అనుభూతి నిస్తుంది యీ పుస్తకం.

లలిత కళాకోవిదుడు, సుప్రసిద్ధ చిత్రకళా విమర్శకుడు శ్రీ సంజీవదేవ్ 'స్మృతి బింబాలు' అనే పేరుతో తమ అనుభవాలు, జ్ఞాపకాలు ఇటీవల ఒక దిన పత్రిక సారతస్వతానుబంధంలో ధారావాహికంగా ప్రచురించారు. ఇది ఇంకా పుస్తకరూపంలో వెలువడినట్లు లేదు.

వెనుకటితరంలో పండిత మండలాగ్రగణ్యులైన వేదం వేంకటరాయశాస్త్రి గారు తమ స్వీయచరిత్రను వ్రాసుకొనే ఉద్దేశంతో, సంగ్రహ ప్రణాళికను రచించినట్లుగా, అధ్యాయ విభాగం గావించినట్లుగా, ఆయా సన్నివేశాలను, సంగ్రహంగా వ్రాసిపెట్టినట్లుగా ఆధారా లున్నాయి.[9] కాని ఆంధ్రుల దురదృష్టం వల్ల అది వెలుగు చూడలేదు. మహోపాధ్యాయ ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మగారు అత్యంత సంగ్రహంగా తమ స్వీయచరిత్రలోని ముఖ్యాలు చెప్పినట్లూ, ఆయనగారు చెప్పినది చెప్పినట్లుగా తాము వ్రాసినట్లూ, దానిని ప్రచురిస్తూ శ్రీ పురిపండా అప్పలస్వామిగారు ప్రకటించారు.[10] శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు కూడా స్వీయ చరిత్ర విరచించే ఉద్దేశంతో, సంగ్రహ ప్రణాళికను, ఆయా సన్నివేశాలను వ్రాసిపెట్టినట్లుగా నవ్యాంధ్ర సాహిత్య వీధులన్న పుస్తకంలో శ్రీ కురుగంటి సీతారామయ్య గారు వ్రాశారు. కాని శివశంకరస్వామిగారు, తమ జీవితానుభవాలను గ్రంధ రూపంలో ప్రచురించినట్లు లేదు.

ఇక ఆధునికులలో కూడా కొందరు తమ స్వీయచరిత్రలను పద్యకృతులుగా, వెలయించిన వారున్నారు. తిరుపతి వేంకట కవులు,

'జాతక చర్య' పేరుతో, తమ స్వీయచరిత్రను రెండు భాగాలుగా వెల బుచ్చారు. పెన్మత్స సత్యనారాయణరాజుగారు 'తెలుగురాజు' పేరుతో తను స్వీయచరిత్రను ప్రచురించారు. కవి కోకిల గుర్రం జాషువా 'నా కథ' పేరుతో, తమ స్వీయచరిత్ర సంగ్రహాన్ని పద్యకృతిగా ప్రచురించారు. ఇందులో పద్యాలన్నీ కలకండ అచ్చులలాగానే ఉన్నాయి. తెలుగుపలుకు బడి పసందు ఎరిగిన, గొప్ప కవి తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు 'నా కదలు' పేరుతో వివిధ పత్రికలలో తమ స్వీయచరిత్ర లోని ఘట్టాలను ప్రకటిస్తున్నారు.

పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు, నందిరాజు చలపతిరావు గారు, చిలుకూరి నారాయణరావుగారు, కూచి నరసింహంగారు, కురుగంటి సీతారామయ్యగారు మొదలైనవారు, వెనుకటి తరానికిచెందిన కవి పండిత ప్రకాండులు, తమ స్వీయచరిత్రలు వ్రాసుకొన్నారని 'నా వాఙ్మయ మిత్రులు' న్న పేరుతో ఇటీవల శ్రీ వేకుమళ్ళ కామేశ్వర రావుగారు ప్రకటించిన గ్రంథంలో వ్రాశారు. కాని ఆయా గ్రంథాలు వెలుగు చూసినట్లు ఆధారాలు లేవు పుస్తక రూపాన ప్రకటింపబడ లేదు కస్తూరి శివశంకర కవిగారనే వారు తమ అనుభవాలను, ప్రచురించారని మధునాపంతుల వారు వ్రాశారు. ఈ విధంగా తమ అనుభవాలను, జ్ఞాపకాలను, ఆయా సందర్భాలలో, వివిధ పత్రికలలో వ్రాసిన కవులు, పండితులు, రాజకీయవేత్తలు ఎందరో వున్నారు. స్థానం నరసింహారావుగారు, నాట్యకళ మొదలైన పత్రికలలో తమ అనుభవాలను వ్రాశారు నట స్థానం పేరుతో, తమ జీవితానుభవాలను కూడా ఆయన వ్రాసుకొన్నారట. అది పుస్తక రూపాన వచ్చిందో రాలేదో తెలియదు. కళావెంకటరావుగారు ఆంధ్రపత్రిక రజతోత్సవ సంచికలో 1959 లో రాజకీయ స్మృతులనే పేరుతో, తమ జ్ఞాపకాలను వ్రాశారు. సుప్రసిద్ధ కవి పండితులు పింగళి లక్ష్మీకాంతంగారు తమ జీవితచరిత్ర సంగ్రహాన్ని సలబ్బె _ పద్యాలలో వ్రాసుకొన్నారని వారి అభిమాను లొకరు వారిని స్మరిస్తూ వ్రాశారు.

బందా కనకలింగేశ్వరరావు గారూ, సి. ఎస్. ఆర్ ఆంజనేయులు గారూ వంటి వారు, నాటక ప్రదర్శనలు, సినిమాలలో భూమికలు ధరించడం మొదలైన విషయాలకు సంబంధించిన అనుభవాలను ఆయా పత్రికలలో వ్రాశారు.

సుప్రసిద్ధ సంఘ సేవకురాలు, విదుషిమణి, శ్రీమతి ఎల్లాప్రెగడ సీతాకుమారి గారు, మహిళాభ్యున్నతి కొరకు తాము పాటుపడిన విషయాలను, ఎదుర్కొన్న సమస్యలను, వివరిస్తూ, ఇటీవలనే తమ స్వీయ చరిత్రను పూర్తి చేశారు. కాని ఇది ఇంకా పుస్తక రూపాన వెలువడ లేదు ఏ పత్రికలోనూ, ఆయా విశేషాలు వెలువడ లేదు.

తెలంగాణంలో సాంస్కృతిసోద్యమానికి అపారమైన కృషి సల్పిన ఉత్తమ శ్లోకుడు, కథకుడు, కవి, చరిత్రకారుడు, విమర్శకుడు, నాటక రచయిత, పత్రికా సంపాదకుడు, పరమప్రామాణికుడు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రామాయణ విశేషముల వంటి మహోద్గ్రంథ రచయిత, స్మరణీయులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు, తమ స్వీయచరిత్రను, నాతి విపులంగా వ్రాసుకొన్నారు. అది వారి పుత్రుల వద్ద ఉన్నది. పుస్తక రూపాన అచ్చుకాలేదు. ఈ గ్రంథం వెలువడితే, ఎన్నో సారస్వతోద్యమ చరిత్రలు వెలుగులోకి వస్తాయి.

అఖిలభారత ఖ్యాతి నార్జించిన సుప్రసిద్ధ పత్రికా రచయితలు శ్రీ కోటంరాజు రామారావు, కుందూరి ఈశ్వరదత్, మొదలైనవారు తమ స్వీయ చరిత్రలు వ్రాసుకొన్నారు.— తెలుగువారే అయినా, యీ స్వీయ చరిత్రలు, వారు ఇంగ్లీషులో వ్రాయటం వల్ల, తెలుగుసాహిత్య చరిత్రలో వీటిని పేర్కొనే అవకాశం లేదు. ఆచార్యోత్తముడు, ఉత్తమ శ్లోకుడు, ప్రొఫెసర్ డి ఎస్. శర్మగారు. తమ స్వీయ చరిత్రను 'ఫ్రం లిటరేచర్ టు రిలిజియన్'' అనే పేరుతో ప్రచురించారు. ఇందులో తెలుగు దేశపు సాంఘిక స్థితిగతులు, ఆధునిక తెలుగుదేశపు చరిత్ర ప్రసక్తమైనది కాని, ఇది కూడా ఇంగ్లీషులోనే ఉండటం వల్ల, తెలుగు స్వీయచరిత్రలలో చేర్చేందుకు అవకాశం లేదు.

ఇంకా ఎందరెందరో మహానుభావులు, కవులు పండితులు, రాజకీయవేత్తలు, దేశనాయకులు, సంఘ సంస్కర్తలు, తమ స్వీయ చరిత్రలను వ్రాసి తెలుగులోని యీ శాఖను సుసంపన్నం చేయగల రని ఆశిద్దాం.

## సూచికలు :—

1 'కవి జీవితములు'— రాజయోగి— 1893 జూన్ ఈ పత్రిక గురజాడ శ్రీరామమూర్తిగారు నిర్వహించెవారు

2 'అముద్రిత గ్రంథ చింతామణి' — 1894 ఫిబ్రవరి

3 కృతి విమర్శనము, సరస్వతి సం 13, సం. 3— 1911 మార్చినెల— ఈ పత్రిక కాకినాడ నుంచి వెలువడుతూ ఉండేది.

4. Encyclopeadia Britannica — 11 Volume page 783—1956 edited by Walter yust.

5 'కొందరు నెల్లూరి గొప్పవారు—రాజమంత్రప్రవీణ శ్రీ పళ్ళె చెంచలరావు పంతులుగారు''— శ్రీ వంగవోలు వెంకటరంగయ్య, సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు— 1933.

6. స్వీయచరిత్రము— రాంభొట్ల జగన్నాథ శాస్త్రి— 1916.

7. పీఠిక— శ్రీ దిగవల్లి వేంకట శివరావు— 1959.

8. ఆదిభట్ల నారాయణదాసుగారి ఆత్మకథ, 1—7—55 ఆంధ్ర పత్రిక (దినపత్రిక).

9 వేదం వేంకటరాయశాస్త్రి జీవిత చరిత్రము— వి. వి. శాస్త్రి— 1949.

10. మహోపాధ్యాయ శ్రీ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ శత వార్షికోత్సవ సంచిక— హైదరాబాదు— 1965. (సంపాదకులు: శ్రీ నిడుదవోలు వేంకటరావు, దేవగుప్తాపు విశ్వేశ్వర రావు)

# మన జాతీయ విహంగం 'నెమలి'



## వేదం రామశాస్త్రి

మన కళలుగానీ, కావ్యాలుగానీ రాజ ప్రాసాద ప్రాంగణాలలోనే ప్రభవించి ప్రశస్తిగాంచినవి ఒకనాడు. రాజాంతఃపురాలలో పావురాళ్ళు సందేశానికీ, మయూరములు నృత్య సౌందర్యానికీ పెంచబడ్డాయి.

అష్టాదశ వర్ణనలో ఉపవన వర్ణనమునందు మయూర నృత్య వర్ణన చేయుట ఒక విశేషం. కవీశ్వరులు మగ నెమలి పింఛమును, స్త్రీల కేశపాశంతో పోల్చి ఎంతో వర్ణించియున్నారు.

నెమలి స్వరూప స్వభావాలను ఒకానొక కవి ఇలా చిత్రించాడు శ్రవణపేయంగా.

"కేకా కర్ణామృతం తే సకుసుమ కబరీ
కాంతి హారా కలాపా
కంఠచ్ఛాయా పురారే ర్గల రుచి రుచిరా
స్నేహపాదం మేఘ సంఘైః
విశ్వద్వేషీ ద్విజిహ్వా స్ఫురదః రుసి శిఖైః
నిత్య మాహార వృత్తి
కైః పుణ్యైః ప్రాప్త మేత త్సకలమపి సఖే
చిత్ర వృత్తం మయూరా"

"ఓ మయూరమా! నీ కేకలు కర్ణామృతం లాంటివి పొన్ను కన్నులుగల నీ పింఛపు వన్నె చిన్నెలు చూడముచ్చటైనవి శివుని కంఠంలోలాగే నీకూ 'నీలకంఠం' అమరింది. మేఘంతో నీకు నెస్తం. ప్రపంచం ద్వేషించే పాముల రక్త మాంసాలే నీ కాహారం ప్రతిరోజూ. ఇవన్నీ నీలో ఒప్పేందుకు—నీ వెంత పుణ్యం చేసుకొన్నావో గదా!"

'షడ్జం మయూరో వదతి' అని అమరం చాటుతూంది. షడ్జ, వృషభ, గాంధార, క్రౌంచ, పంచమ, ధైవతము, నిషాదం అనే వాటిలో 'షడ్జ స్వరం' అంటే నెమలి గొంతుక అన్నమాట. ఇది ఒక స్వర విశేషం.

కవి సమయాల్లో కూడా 'గిరౌర్మయూరో గగనేన మేఘః'— అని మేఘ ప్రాశస్త్యం చెప్పబడింది.

పూర్వం దేవతలపైకి తారకాసురుడు, శూరపద్ముడు, సింహముఖుడు—అనే రాక్షస సోదరులు దండెత్తారు.

దేవతలకు సేనాధిపతియైన కుమారస్వామి తన శూలాయుధంతో—తారకాసురుణ్ణి సంహరించాడు. దాంతో అతని తమ్ముడైన సింహముఖునకు కోపంవచ్చి పగ తీర్చుకోడానికై కుమారస్వామి పైకి దూకాడు. వాణ్ణీ కులిశాయుధంతో ముక్కముక్కలు చేశాడు సుబ్రహ్మణ్యస్వామి.

ఆ ముగ్గురిలో—మిగిలినవాడు శూరపద్ముడు. అతడు కుమారస్వామి దాటికి భయపడి సముద్రంలో దాక్కొన్నాడు. కుమారస్వామి సముద్రంలో ప్రవేశించి వానిని చీల్చి చెండాడాడు. కాని శూరపద్ముడో అనేక వరములు పొందినవాడవటంచేత వానికి చావులేదు. ఆ రాక్షసుడు కాస్తా ఒక మామిడిమ్రానైపోయాడు. కుమారస్వామి ఆ మ్రానును రెండుభాగాలుగా తెగ్గొట్టాడు. ఒక భాగం కోడిగానూ, రెండవభాగం 'నెమలి' గానూ రెండు రూపాలు ధరించాడా రాక్షసుడు. వెంటనే కుమారస్వామికి 'శరణాగతి' చెందినవా రెండున్నూ 'కోడి, నెమలి'. కోడి కుమారస్వామికి ధ్వజమైంది. నెమలి కుమారస్వామి కరుణా దృష్టికి పాత్రమై—అతని వాహనమైనది.

నెమలి, కోడి ఈ రెంటికీ ఆంగ్లంలో ఉన్న పేర్లు గమనిస్తే కొంత దగ్గర పోలిక లున్నాయి. 'పీ—కాక్' (నెమలి) మొదటి 'పీ' తీసేస్తే కాక్' (కోడి) అవుతుంది. అంతేకాదు. ఈ రెంటికీ 'కాలజ్ఞానం' ఉంది. ఈ రెంటినీ కుమారస్వామి గ్రహించుటకు కారణం? కుమారస్వామియే సూర్యుడు. సూర్యుని అవతారమే కుమారస్వామి. ఈ యిరువురకు భేదం లేదు. అదీగాక సూర్య గమనాన్నిబట్టికదా మనం 'కాల నిర్ణయం' చేస్తాం! అందుకే కుమారస్వామి తన వాహనమును నెమలిని, ధ్వజమును కోడినీ నిర్ణయించుకున్నాడు. 'నెమలి' యే వాహనమైనందున 'మయూర వాహనుడ'ని కుమారస్వామికి పేరు.

ఇక మన సాహిత్యం పరికిద్దాం! వాల్మీకి రామాయణంలో మయూర వర్ణన కోకొల్లలు. దేవేంద్రుడు తన వేయి కన్నులను నెమలి పింఛంలో అమరేట్లు చేశాడు. అంతేకాదు. పాములవల్ల భయం కలుగకుండునటూ, వర్షం కురిసేప్పుడు పరమ ప్రీతి కలిగేట్లు గానూ—మూడు వరాల్ని ప్రసాదించాడు. ఇది రామాయణం ఉత్తర కాండలోనిది.

నిఘంటువుల్లో—మయూర మాంసాన్ని హేమంత, శిశిర, వసంత ఋతువుల్లో తినవచ్చునని, ఇతర కాలాల్లో తినరాదనీ— అంటూ

'హేమంత కాలే శిశిరే వసంతే
సేవ్యం హి మాయూర మశంతి మాంసం

ఉష్ణో హి బర్హో విషబోజ నైశ్చ
వర్హా శరద్గ్రీష్మ ముఖేష్వ పథ్యః'

అని పేర్కొన్నారు. దానిపించము ఉష్ణాన్ని కలిగిస్తుందట.

మయూరుడనే ఒక రాక్షసుని వృత్తాంతం మహా భారతంలో వర్ణింపబడింది.

మయూరుడనే కవి సంస్కృత కవి. అతడు సూర్య శతకాన్ని రచించి తన కుష్ఠురోగాన్నే పోగొట్టుకున్నాడట.

ఆరభటీ నృత్యం చేస్తున్నవట నెమళ్లు—అని కవికుల గురువు కాళిదాసు మేఘ సందేశంలో 'నెమళ్ల ఆటను 'నెమళ్ల నృత్యాన్ని' వర్ణించి యున్నాడు.

అభిజ్ఞాన శాకుంతల నాటకంలో 'వృధ్మ యు మయూర హస్తా ప్రవిశ్య, శకుంత లావణ్యం,సౌందర్య లావణ్యం'అని వృత్తిగా మయూరాన్ని భరతునకు ఆట వస్తువుగా ఇచ్చినటు ప్రస్తావం ఉంది.

ఋతువులను శాకుంతలంలో వర్ణించేప్పుడు గ్రీష్మాంతమున వర్షోదయకాలంలో నెమళ్ళు నర్తించేవనీ, వర్ణింపబడింది. ఆ మొగ నెమలి సార్వభౌముడట! లోకానందనుడట.

ఇక విక్రమోర్వశీయంలో పురూరవుడు ఊర్వశిని వెతుక్కుంటూ పోయేటప్పుడు అడవిలో వర్షం కురవటానికి ముందు, నెమలి ఆటను చూస్తాడు. తక్షణమే దాన్ని సమీపించి దణ్ణం పెట్టి

'కేకి సార్వభౌమా లోకానందనా,
కేల్మోడ్చి వేడెదను
ఈ కానలో గంటె ఎందేని నా ప్రియ
చెప్పు మీ దయ బూని—'

అని ఉత్కంఠితు డవుతాడు. (కీ. శే వేదముః వేంకటరాయ శాస్త్రిగారి విక్రమోర్వశీయము) జవాబు చెప్పకుండా మేఘం వైపు ఉత్కంఠుడై ఆ నెమలిరాజా నృత్యం చేస్తుంటాడు.

మాళవికాగ్నిమిత్ర నాటకంలో—కాళిదాసు మధ్యాహ్నాన్నివర్ణిస్తూ వైతాళికుని ద్వారా చెప్పిన మాటలు—

"బిందు క్షేపాన్ పిపాసుః భ్రమతి చ శిఖినో వారి యంత్రం భ్రమంతం"—ఉద్యానవనాలలో తిరిగే మయూరాలు ఎండవడకు తట్టుకోలేక అక్కడే జల యంత్రాలనుండి వచ్చే నీటి ధారలు క్రింద బడి నీటి చుక్కల్ని త్రాగుతూ తిరుగుతూ ఉంటాయి. ఇందులో ఉద్యానవనాలలోని నెమళ్లను కాళిదాసు వివరించాడు.

రఘువంశంలో

'మనోభి రామా.
రథనేమి స్వనోన్ముఖాః
షడ్జ సంవాది కేకా
ద్విధా భిన్నా. శిఖండిభి' అని

పేర్కొన్న మయూర స్వర వర్ణన హృద్యాతిహృద్యం అయింది.

లలాశుకుడు తన కృష్ణ కర్ణామృతంలో 'శిఖిపింఛ భూషిత ముగ మనోహర రూపుడైన శ్రీకృష్ణుని మనోహరం రూపాన్ని మన కళ్ళులకు కట్టేటట్టు ఎలా చిత్రించాడో చూడండి!

"శించాన భూషణ శతం శిఖిపింఛమౌళిం
శీతం విలోచన రసాయన మభ్యుపైతి"
"మౌళౌ మయూర బర్హామ్"
"బర్హోత్తం స విలాస కుంతల భరం"

శీతలమై—విలోచన రసాయనమై అతని మధురాతి మధురంగా చిత్రించటంలో లీలాశుకునికి, జయదేవునికీ గల శక్తి అపారం.

ఉత్తర రామ చరిత్రలో భవభూతి అడవి నెమళ్లను వర్ణిస్తాడు. దండకారణ్యంలో అరణ్యవాస కాలమున సీతా మహా సాధ్వి ఓ నెమలిని పెంచింది. 'సీతా పరిత్యాగం' తర్వాత రాముడు దండకారణ్యంలో విహరించేప్పుడు వాసంతి రామునితో—సీత పెంచిన నెమలిని గూర్చి ఇలా అంటుంది.

'అను దినము ఏ నెమలిని సఖి (సీత) పెంచెనో నవోద్గత మఘ్ధ పింఛము నది కూయును'— ఎక్కడో తెలుసా— సననితము—ఉచ్ఛ ఖము రతనపు బొమ్మడికపు బలెన్.

ఎక్కడో తెలుసా—కదంబ వృక్షంమీద. ఇక్కడ ధ్వని చూడాలా సీత పెంచిన నెమలి పింఛము బాగా పెరిగింది. నీవు మాత్రం 'సీత' లేకుండా ఒకడవే ఉన్నావు. ఆ నెమలి చూడు— సవనితముగా నదే కూయును. ఆ కూతెంత గొప్పదో తెలుసా? అని ఉద్దీపింపజేస్తుంది రాముని.

ఇక శ్రీహరుడు తన నైషధంలో మయూరాన్ని వర్ణించి యున్నాడు. దమయంతి వివాహోత్సవంలో ఉద్యానవనానికి వెళ్లాడు.

'విలాస వాసి తట విచి వాదనాత్
పికాళి గీతిః శిఖి లాస్య లాఘవాత్
వనేపి తౌర్యత్రిక మార రాధితం
కృభోగ మాసోతి నథాగ భాజనం'

విలాసంగా ఉండు నడబావి ఒడ్డున అలల ధ్వని వలననూ (మృదంగ ధ్వని) కోయిలల తుమ్మెదల గానము వలనను, నెమలి నాట్యం వలనను అడవిలో గూడా నిషధరాజైన 'నలుని' నృత్య గీత వాద్య సమ్మేళనము సేవించినవి. అదృష్టవంతుడు ఎక్కడ భాగ్యము పొందడు!

ఇక తెలుగు సాహిత్యం పరికిస్తే కోకొల్లలు. అది నన్నయ 'మయూరముల్ పురివిప్పి యాడు చుండు'—అన్నాడు తిక్కన మయూర వర్ణన కొంత మాత్రమే చేశాడు. కానీ ఎఱ్ఱాప్రెగ్గడ— దుర్యోధనుని ఘోష యాత్రా సందర్భంలో మన్మధ మయూరాళి మధుకర కీర కోకిలా లాపములు ఆకరింప చేశాడు.

పార్వతి శివునిగూర్చి విరహవేదన పొందుతుంది. ఆమె చెలికత్తె చెప్పినట్లు—కవిరాజ శిఖామణి నన్నెచోడుడు విరహోద్దీపన కరములైన వటువంటి ఈ క్రిందివి మానవలసిందిగా చెలి చెపుతుంది. అందు నెమలి నృత్యం చూడవద్దు అంటుంది 'ఆడెడి నెమ్మి' కనుగొనకు మమ్మ, బయల్పడు వాడు చిల్కతో నాడకు మమ్మ, లేటిగెడ నాలతి సేయకుమమ్మ వెన్నెలు జాడకు మమ్మ, తెమ్మెరల జోకకు మమ్మ తలర్చు మాని క్రీడకు పోకుమమ్మ యని నెచ్చెలికత్తెకు జెప్పె సమ్మతిన్'—

ఇది ఉద్దీపన విభావం. ఏవి రసమును ఉద్దీపింపజేస్తావో—అవి ఉద్దీపన విభావాలు.

శ్రీమదాంధ్ర మహా భాగవతములో బమ్మెర పోతరాజు 'నలువ మెరయుడిన తెరంగున మెరయు నురుములును, నురుముల కులికి పడక కికురుపొడుచు మెడలు త్రిప్పుచు, పింఛముల కొంచెంబులు చేయుచు విప్పి దెప్పరంబుగ నొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును మయూర పోషణంబులు, భీషణంబులై చెవులు సోకిన ననూనంబులైన మానంబుల నాసలు చెడి యొండరులకు క్రిందుపడి క్రందుకొను విరహ జనులు' అని వర్షర్తువును వర్ణించుచు సంస్కృత మూలంలోలేని మయూర నృత్యాన్ని కూడా చొప్పించాడు.

కవి సార్వభౌముడు శ్రీనాధుడు తన వీధి నాటకంలో 'హో కుమారస్వామి—శైవ వాహ్యములారా—కోడి పుంజులారా?' అని సంబోధించాడు.

ఇక శృంగార నైషధంలో స్త్రీలంతా మండల నృత్యంచేస్తుంటారు ఒక వైపు. రెండో వైపు వాళ్ళకు పోటీగా నెమళ్ళూ నృత్యం చేస్తున్నవట! "ఆ రామా రమణుల్ రమాపతియు దైత్యారాతియుం బోలె శృంగార క్రీడల బ్రొద్దు పుచ్చిరి రహిన్ గంధర్వ కన్యా కళా కీరాలాపక పుంస కోకిల కుహూ కేకీ 'మయూరాంగనా" చారీ మండలి తాండవార భటికా సంరంభ సంభావ నవన్"

సాహితీసమరాంగణచక్రవర్తియైన శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో కృకవాకధ్వజుడు —అని కుమారస్వామిని సూచించియున్నాడు.

ఇక అద్యతనాంధ్ర సాహిత్యం పరికిస్తే ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు 'జడ కుచ్చులు' అనే తమ ఖండ కావ్యంలో మయూరాల నృత్యోత్సవ క్రీడోన్మాదాన్ని ఇలా వర్ణించారు—

'నీడల్ గట్టగ భూమియందు చదలన్ వ్రేలాడు కాదంబినీ
చూడాకృష్ణ కలాప గుచ్ఛములపై చూడ్కుల్ కడాలించి లీ
లా డోలా సుఖలాలనీయ రతి సోలన్ సాగె నృత్యోత్సవ
క్రీడోన్మాదములై మయూరములు సాగెన్ పింఛము ల్విప్పుచున్.'

నవయుగ కవిచక్రవర్తి కీ. శే. గుఱ్ఱం జాషువా కవి— తమ ఖండ కావ్య సంపుటి తొలిభాగంలో 'నెమలి' స్వరూప స్వభావాలను—సహజంగా చిత్రించాడు— చూడుడు.

"పొన్నుంగన్నులు నెత్తికెక్క గులికింపుల గంట గర్వంబునన్
దన్నుస్సీ చెలికత్తెలం బ్రణయ కంధిస్ముంచి తేలింప నీ
సాన్నిధ్యంబున నాట్యమాడు సతిపజ్జన్ పారవశ్యంబునన్
గన్నుల్సోద్దువు నిచ్చలు న్నెమలి చానా! యెంతపుణ్యాత్మవో."

"భర్మ సోపాంబట్టు జిలుగుటంబరము దాల్చి
విపిన వీధుల్లలో దాండవించు చుండ
జేరువన్ నిల్చి మాసిన చీర గట్టి
మురిసికొను పతివ్రతవు సుందరులలోన."

కథ చక్రవర్తి కీ. శే. చింతా దీక్షితులు— "ధగధగ మెరిసే కాంతిని చల్లే, కళ్ళు నెమలి కెవరిచ్చారో, అని ప్రశ్నించుకొని "పురి విప్పుతు నాట్యమాడగా, తాండవ కృష్ణుడు జ్ఞప్తికి రాడా" అని భావుకత గపుతాడు.

"పూసపాటివారి లోగిళ్లలోనూ
పురి ఇప్పి ఆడింది పున్నెంపు నెమలి
ఆట కూటరానిలో ఆడేటినెమలి
వేటకాడొచ్చాడు ఆట చాలించు'—

అని జానపదగేయాల్లో కూడా జాతీయ విహంగంచోటు చేసుకుంది.

ఇక చందస్సును పరికిస్తే మయూర వృత్తం— భజసనగగ—అను గణములు, తొమ్మిదవ అక్షరం యతి.

మయూరసారి— లేక మయూర భాషిణీ— గణములు— రజ, రగ, 7 వ అక్షరము యతి.

మత్తమయూరము— గణములు— మ, త, య, స, గ 8 వ అక్షరము యతి.

ఘన మయూరము— గణములు— న, న, భ, స, ర, ల, గ

మయూరగతి— గణములు 7 భ గణములు, గ గ.

'శిఖరిణీ' వృత్తం. ,య, మ, న, భ వ గణములు— పదమూడవ అక్షరం యతి.

'క్రౌంచపదం' అని ఒక వృత్తానికి పేరు. భ, మ, స, భ, న, న, న, య— గణములు. పదునొకండవ అక్షరం యతి. వృత్తాలలో నెమలి పేరేగాక, నృత్యం కూడా తాండవిస్తుంది.

భారతదేశాన్ని మొగలులు పాలిస్తున్న రోజుల్లో— నాదిర్షా మొగలులపై దండెత్తి వారి మయూర సింహాసనాన్ని పర్షియాకు తరలించాడు. అది పర్షియానుండి ఇంగ్లండుకు చేరి ఇప్పుడు బ్రిటిష్ మ్యూజియంలో ఉంది.

ఈ మయూర సింహాసనాన్ని నిర్మించినవాడు షాజహాను. దీనిని బట్టి అన్ని జాతుల వారికీ అభిమాన పాత్రమైందీ నెమలి. అందుకే ఈనాడు 'నెమలి' భారత జాతీయ విహంగమై విరాజిల్లు చున్నది.

'మేఘాలు అందం, నీలాలు అందం, అందాలన్నీ 'జీవం' దాల్చాయి. అవంతా 'నెమలి'లో నాట్యం చేశాయి. సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అన్నారు. అందుకే కాబోలు నెమలి కన్నులు జీవం ఉట్టిపడేలా ఉంటాయి.

# శాసనపరిశోధన — నూతన చరిత్రాంశములు

## శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రి

ఇటీవల ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వముచే పురావస్తు శాఖయందు నెలకొల్పబడిన శాసన పరిశోధన విభాగము సాగించిన కృషి ఫలితముగను ఇతరుల వ్యక్తిగతమగు ఆసక్తి వలనను నూతన చరిత్రాంశములను ఆవిష్కరించు కొన్ని శాసనములు బయల్పడినవి. అందు కొన్ని ముద్రితములు, అముద్రితములు గూడా కొన్నిగలవు. వాటిలోని ముఖ్యాంశము లిందు తెలుపబడు చున్నవి.

**1. మహామేఘవాహనుని నాటి గుంటుపల్లి శాసనము:—1**

ఏలూరు తాలూకా జీలకర్రగూడెం దగ్గర గుంటుపల్లియను చోట మహాలయములు కొన్ని గలవు. ఈ శాసన మిచట క్రొత్తగా బయల్పడెను. క్రీస్తు పూర్వము రెండవ శతాబ్దికి చెందిన బ్రాహ్మీలిపి యందుత్కీర్ణమై యున్నది. బాష ప్రాకృతము. చేది వంశమునకు, చెందిన మహామేఘ వాహన బిరుదాంకితుడైన ఖార వేలుని సందేశ లేఖకుడు చులగోముడనువాడు దీనిని వేయించెను. అందాతడు అచట మండపమొకదానిని నిర్మించి నట్లున్నది. శాసనము సంక్షిప్తమై చిన్నదైనను ఆంధ్ర ప్రదేశ్ ప్రాచీన చరిత్ర కతి ముఖ్యమగు నూతనాంశమును తెలుపు చున్నది. ఈ ఖార వేలుడు క్రీ. పూ. 150 ప్రాంతమందున కళింగమునేలిన గొప్పరాజు. ఉత్తరమును, దక్షిణమునను అనేక రాజ్యములను జయించెను. ఒరిస్సా రాష్ట్రములో ఉదయగిరి కొండలలో హాథి గుహలలో నితని విజయములను గూర్చి తెలుపు విపుల శాసనము కలదు.2 తన ద్వితీయ రాజ్య వర్షమున పశ్చిమ దిశగ దండయాత్ర వెడలి, (శాత వాహన రాజైన) శాత కర్ణిని, సరకు సేయక కణ్ణబెన్న (కృష్ణ) ను చేరి ముసిక నగరమును ముట్టడించు నట్లు చెప్పుకొనెను. ఖారవేలుని యీ దండయాత్ర పశ్చిమ దిశ యందు జరిగి యుండుటచే ఆ ప్రాంతము మహారాష్ట్రమై యుండుననియు అచటనే శాతకర్ణితో తనకు పోరు జరిగి యుండుననియు చరిత్ర కారులిప్పటివరకు చెప్పుచుండిరి. శాత వాహనుల శాసనము లధికముగా నదే ప్రాంతములో గలవు గనుక శాత వాహనుల మొదటి నివాసము మహారాష్ట్రమందున్న నాసిక ప్రాంతమే యగునని యీ హాథి గుహ శాసనము ధ్రువ పరచు చున్నట్లు వారు వాదించుచుండిరి. కాని ప్రస్తుత గుంటుపల్లి శాసనము ఖార వేలుడు ఏలూరు ప్రాంతము కూడ వచ్చినట్లు తెలుపు చున్నది. కనుక శాతకర్ణి రాజ్యములో కృష్ణా నదిని, సమీపించినది ధాన్యకటకముకూడా కావచ్చును గదా. అనగా ఖార వేలుని, నాటికే శాతవాహనులు ధరణికోట ప్రాంతము నంతను తమ యేలుబడిలో నుంచుకొని రని స్పష్టము. ఇంక పశ్చిమ దిశ యనగా కళింగమునకు వేంగి మండలము పశ్చిమమే యగును. అచటి వారు వీరిని, పడమటి వారనియు వీరు వారిని తూర్పువారనియు నేటికిని వాడుక ప్రసిద్ధమై యున్నది. శాతవాహనులు మొదటినుండి ఆంధ్ర ప్రాంతము వారే ననియు వారు రాజకీయ విజయముల ఫలితముగనే అన్య ప్రాంతములతో సంబంధము కలిగి యుండరనియు ధ్రువ మగు చున్నది.

**2. విష్ణు కుండిన రాజ వంశావళి:—**

ఈ వంశమునకు చెందిన శాసనము లింతకు పూర్వమేడెనిమిది మాత్రమే లభించినవి.3 వాటివలన వారి వంశ క్రమముగాని రాజ్య కాలముగాని నిర్ణయమగుట అతి కష్ట సాధ్యముగ నుండెను. ఆ సమస్యలు నేటివరకు అపరిష్కృతముగనే యున్నవి. వాటిలో ఆ యా రాజుల విజయరాజ్య సంవత్సరములే గాని వాటిని నిర్ణయించు వేరొక శతాబ్దమువంటివి లేకుండుటచే వారి రాజ్య కాలములలోనే సుమారేబది సంవత్సరముల వ్యత్యాసమునకు తావుండెడిది. అట్లే వారి వంశ క్రమమును గూర్చి కూడ సునిశ్చితముగా జెప్ప వీలులేక కొన్ని సంశయములతో గూడియున్నది

సుమారు పది సంవత్సరముల క్రిందట నల్లగొండజిల్లా రామన్నపేట తాలూక తుమ్మలగూడెం గ్రామంలో ఈ రాజులకు చెందిన మరి రెండు తామ్ర పట్టికలు దొరికినవి. వీటిని ప్రథమముగా శ్రీయుత బి. యన్. శాస్త్రిగారు కనుగొనిరి. వారే భారతిలో ఇంద్రపాల నగర విష్ణుకుండిన శాసనములను శీర్షికతో ప్రకటించియుండిరి.4 వీటినే మరల డాక్టరు మారేమండ రామారావుగారు Journal of Indian History— Trivandrum5 పత్రికలో ఆంగ్లములో ప్రకటించిరి. తర్వాత డా. అజయమిత్రశాస్త్రిగారు6 వి. వి. మిరాసిగారు కూడ కొంత వ్రాసిరి.7 అట్లే డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు

---

(1) దీనిని డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారు (కేంద్ర పురావస్తుశాఖ) మొదట కనుగొనిరి. వారే యీ శాసనమును ఆం. ప్ర. ప్రభుత్వముద్వారా ప్రకటించిరి.

(2) ఎపిగ్రాఫియా ఇండికా XX పుట 72..

(3) 1. మాధవవర్మ ఈపూరు శాసనము Ep. Ind. XVII P. 334 ff

2. దేవవర్మ పుత్రుడగు రెండవ మాధవవర్మ ఈపూరు శాసనము. Ep. Ind. XVII.

3. మాధవవర్మ పోలమూరు శాసనము J. A. H. R. S. VI. P. 17 ff.

4. ఇంద్ర భట్టారకవర్మ రామతీర్థ శాసనము Ep. Ind. XII. 133 ff.

5. విక్రమేంద్రభట్టారకుని చిక్కుళ్ల శాసనము Ep. Ind. IV. 193 ff,

6. విక్రమేంద్ర భట్టారకుని తుండి శాసనము AP. Arch. Series No.

7. మాధవవర్మ ఖానాపూరు శాసనము

(4) 1965 జూన్, జూలై సంచికలు

(5) Journal of Indian History XLIII PP 683 f

(6) „ „ XLIV PP. 733 f

(7) „ „ L P. 1 f

కూడ వీటిని గూర్చి కొంత చర్చించియుండిరి.8 కాని యింకను వీటిని గూర్చి సమీక్ష చేయుట యుక్తమని తోచుచున్నది.

ఇందొకటి గోవిందవర్మ తన అగ్రమహిషియగు పరమ మహాదేవి నిర్మించిన విహారమునకు "ధూప దీప గన్ధ పుష్ప ధ్వజ పాన భోజన శయనాసన గ్లాన భైషజ్య ఖణ్డస్ఫుటిత శీర్ణాన్ సంస్కారా" దుల కొరకు ద్వావెంగుదల పెణ్కపఱ అను గ్రామమును దాన మొసర్చి నట్లు గలదు. ఈ గోవిందవర్మ మహారాజ ఇన్ద్రవర్మ పౌత్రుడనియు, మహారాజ మాధవవర్మ పుత్రుడనియు ఇందు చెప్పబడెను ఇతనిని గూర్చిన ప్రశస్తియంతయు ఇతడు గొప్ప బౌద్ధ మతానుయాయి అని తోచునట్లుండును. కాని అతను వైదిక ధర్మమును కూడ ప్రోత్స హించి కొన్ని దేవాలయములను కూడ నిర్మించినట్లు కలదు. భార్య యగు పరమ మహాదేవిని బట్టియే యితనికి బౌద్ధ మతాదరణము అధికమైనట్లు తోచును.

ఇంక రెండవ శాసనము ఉత్తమాశ్రయుడను బిరుద నామము గల రెండవ విక్రమేంద్ర భట్టారక వర్మ యిచ్చినది. ఇన్ద్రపురము నందు పరమ భట్టారికా మహాదేవి నిర్మించిన విహారమునకు అచట నివ సించు భిక్షుసంఘ పరిభోగార్థము ఇరుణ్డోరు గ్రామమును ఈ మహారాజు సర్వ బాధా పరిహారముగా దాన మొసర్చినట్లిందు చెప్పబడెను. దానమిచ్చిన కాలము పదునొకండవ విజయ రాజ్యవత్సరమున కార్తిక కృష్ణ పక్షమందు అష్టమి దినము. శాసనాంతమున మరల శక నృప కాలము 488 సంవత్స రములు గడచిన పిమ్మట ఈ దాన మొసగ బడినట్లు కలదు. విష్ణు కుండిన శాసనములలో శతాబ్దములను తెలుపు శాసన మిది యొక్క టియే. అంతేగాక దక్షిణ దేశమందు శక వత్సరములను తెలుపు ఆధా రములలో నిదియే మొదటిది 9

విష్ణుకుండిన రాజవంశావళిని గూర్చి ముఖ్యముగ నీ శాసనము కొన్ని విశేషాంగములను తెలుపు చున్నది. ఇందు అయిదుగురు రాజులు క్రమముగ పేర్కొనబడిరి. 1. గోవిందవర్మ 2. మాధవవర్మ 3. మొదటి విక్రమేంద్రవర్మ 4. ఇంద్ర భట్టారకవర్మ 5. రెండవ విక్రమేంద్రవర్మ ( శాసనదాత). దీనిని మూల వంశావళిగ గ్రహించి మిగిలిన శాసనములందున్న రాజులను దీని యం దంతర్భావముచేయు టయో లేక కొలది మార్పులతో శాఖాంతరముగ సూచించుటయో సులభమగు చున్నది. వీరిలో కొందరి రాజ్య వర్షము లిదివరకే తెలిసి యుండుటచే ప్రస్తుత శాసనము దీయబడిన రెండవ విక్రమేంద్రుని పదునొకండవ రాజ్య వర్షమునకు సరియగు శకాబ్దము 488 ననుసరించి రించి విష్ణుకుండిన రాజ్యకాలమును స్థూలముగనైన నిశ్చయింప వీలగు చున్నది. అనగా శాసన కాలము క్రీస్తు 566 అయినచో విక్రమేంద్రుని రాజ్యాభిషేకము దానికి పదునొకండు వత్సరములకు పూర్వము జరిగియుండును. రామతీర్థము తామ్రపట్టిక ఇతని తండ్రియగు ఇంద్ర భట్టారకునిచే తన 27 వ రాజ్య వర్షమునం దీయబడినది గనుక నతడు కనీసము అంతకాలము రాజ్యము చేసియుండునని ఎంచిన అతని రాజ్యాభిషేక కాలము క్రీ. శ 566—(11 + 27)=528 అయియుండును. ఇంద్రవర్మకు పూర్వము తన తండ్రియగు మొదటి విక్రమేంద్రుడు రాజ్యము చేయకయే మృతి నొందియుండు నని కొందరి నిర్ణయము. అట్లే ఈపూరు రెండవ శాసనము నిచ్చిన దేవ వర్మ పుత్రుడగు రెండవ మాధవవర్మను గూర్చి కూడ సంశయము కలదు. ఈ రెండు సంశయములు తొలిగిన కాని మొదటి మాధవ చక్ర వర్తి యొక్క రాజ్యకాలము నిశ్చయింప వీలుకాదు.

ఈ శాసనమువలన మొదటి గోవిందవర్మ బౌద్ధ మతాభి మానియై యనేక విహారములను కట్టించినట్లు తెలియుచున్నది. వీటిలో మొదటి శాసనమందు శాసనకర్తయైన రెండవ గోవిందవర్మ కూడ బౌద్ధమును బాగుగ ప్రోత్సహించినట్లున్నది వీ రిరువురు ఒకడే యని కొందరి మతము కాగా మరికొందరు వీరు భిన్న వ్యక్తులయి యుందురని తలంచు చుండిరి. రెండవ శాసనమందు ఆజ్ఞప్తియు గోదావరి తామ్ర పట్టిక నొసగిన పృథ్వీమూలుడు ఇంద్ర భట్టారక వర్మకు సమకాలీనుడై యుండెను గనుక అతనికి అల్లుడుగ వర్ణింప బడిన గోవిందరాజు రెండవ గోవిందవర్మ యగునని భావింపబడు చున్నది. ఇట్లు అనేక విశేషాంశము లీ క్రొత్త శాసనముల వలన ఉత్పన్నము లగు చున్నను, ఆంధ్రేతి హాసములో విష్ణుకుండిన అధ్యాయమునకు ఇవి క్రొత్త స్వరూప మిచ్చినవనుట నిర్వివాదము.

ఇక్ష్వాకుల కాలమునకు చెందిన శాసన మొకటి నూతనముగ లభించెను. ఇది పల్నాడు తాలూక దాచేపల్లి దగ్గర దొరకెను.10 కేసన పల్లియను గ్రామములో శిథిలమైయున్న బౌద్ధ స్తూపమునకు చెందిన స్తంభముపైన క్రీస్తు మొదటి శతాబ్దినాటి బ్రాహ్మీలిపిలో వ్రాయబడినది. ఇందు ఇక్ష్వాకు వంశకర్తయైన మొదటి శాంత మూలుని పదవ రాజ్యవర్షము చెప్పబడినది. ఈ రాజును గూర్చిన ప్రశంస యింతవరకు తన సంతతివారి శాసనములనుబట్టి మాత్రమే తెలియుచున్నది. కాని యిది స్వయముగ తన రాజ్యకాలమునాటిదే యగుటచే నాతడు కొంతకాలము రాజ్యమేలినట్లు నిర్ణయింప వీలగు చున్నది.11

కరీంనగరు జిల్లాలో కుర్క్యాల గ్రామ సమీపమున బొమ్మలు గుట్టపైన వేములవాడ చాళుక్యవంశపు రెండవ అరికేసరి (క్రీ 930—955 సుమారు) రాజునాటి శాసనమొకటి దొరకెను. అరికేసరి యాస్థానమున వర్ధిల్లి విక్రమార్జున విజయమను గొప్ప కన్నడ కావ్యమును రచించిన పంపకవి సోదరుడగు జినవల్లభుడు వ్రాయించిన శాసనమిది. వీరి పుట్టుపూర్వోత్తరములను జెప్పుచు వీరు కమ్మనాడు (ఆంధ్ర మండలము ప్రకాశం జిల్లా) లో చేరిన వంగిపఱ్ఱు గ్రామ

---

8. Andhrapradesh Annual Report on Epigraphy 1966. P 84 f
9. 'లోక విభాగము'ను జైన గ్రంథమున 380 శకవత్సరము వాడబడినట్లు చెప్పుదురు.
10. శ్రీయుత పి. రామచంద్రమూర్తి ఎం. ఏ. అసిస్టెంటు డైరెక్టరు, పురావస్తుశాఖ, ఆం. ప్ర. తమ అన్వేషణ కార్యక్రమములో దీనిని వెలువరించిరి.
11. డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారు దీనిని గూర్చి విపులముగ Epigraphia Andhrica 1 లో చర్చించిరి.

నివాసులమని చెప్పుకొనెను. కన్నడ కవిత్రయమున జేరిన పంపకవి యాంధ్రుడని దీనివలన నిశ్చయమగు చున్నది. ఈ శాసనములో తుది యందు కొన్ని తెలుగు కంద పద్యములు గూడ గలవు. దీనిని గూర్చి డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు విమర్శనాత్మక పత్రమును వ్రాసి మైసూరు హిస్టరీ కాంగ్రెసు సమావేశములో ఉపన్యసించిరి.[12]

రాయలసీమలో లభించిన నూతన శాసనములలో చాళుక్య సత్యాశ్రయుని నాటి దొకటి కలదు. కర్నూలుజిల్లా మహానందికి చేరువలో కడమల కాల్వయను నొక గ్రామములో శివనందీశ్వరదేవునికొరకు నిర్మితమైన ప్రాచీన చాళుక్యులనాటి ఆలయము కలదు[13] దాని ఆవరణములో నొక చిన్న యేకశిలానిర్మిత ఆలయ ప్రతి కృతిపై (అది) సత్యాశ్రయ భటారుని అనుచరు డొకడు నిర్మించెనని గలదు. దీనినిబట్టి యిప్పటికి ప్రధాన ఆలయము నిర్మితమై యున్నదని గ్రహించవలెను. సత్యాశ్రయు డనగా బాదామి చాళుక్య చక్రవర్తియగు రెండవ పులకేశి (క్రీ 611—642). ఇట్టి దేవాలయములు ఆంధ్రప్రదేశములో కర్నూలుకి తుంగభద్ర కావలియొడ్డుపైనున్న అలంపుర క్షేత్రమున నవబ్రహ్మేశ్వరాలయములు ప్రసిద్ధమై యున్నవి (1. బాలబ్రహ్మేశ్వర, 2 గరుడ బ్రహ్మేశ్వర, 3. స్వర్గబ్రహ్మేశ్వర, 4. పద్మబ్రహ్మేశ్వర, 5. కుమార బ్రహ్మేశ్వర, 6 అర్కబ్రహ్మేశ్వర, 7. తారక బ్రహ్మేశ్వర, 8. విశ్వబ్రహ్మేశ్వర, 9 వీరబ్రహ్మ అనుపేర్లలో నీ యాలయములు గలవు. ఇవికూడా బాదామి చాళుక్య రాజులచే నిర్మింప బడినట్లు అచటి శాసనములు తెలుపు చున్నవి. ఇంతవరకట్టి శాసనములలో పులకేశి మనుమడగు వినయాదిత్యుని నాటిది అతి ప్రాచీనమైనది. ఈ మధ్య కొలది మాసముల క్రిందట ప్రసిద్ధ పరిశోధకులును స్థానిక విద్వాంసులు నగు శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు మరొక నవీనశాసనము నావిష్కరించిరి. అది పులకేశి చక్రవర్తిపుత్రుడగు 'అనివారిత విక్రమ' బిరుదాంచితుడగు మొదటి విక్రమాదిత్యునిది (క్రీ 654—680) అందాతని భార్య అందొక ఆలయ ప్రతిష్ఠ జేయునపుడు బ్రాహ్మణున కొసగిన దానమును తెలుపును. ఇదియే యీ యాలయములందలి ప్రాచీన శాసనము. ఇచటి నవబ్రహ్మేశ్వరాలయములు ప్రసిద్ధమై యున్న విధముగ మహానంది ప్రాంతమున నవనందీశ్వరాలయములు ప్రసిద్ధములని చెప్పుదురు. కాని వాటిలో మహానందీశ్వరాలయము, పైజెప్పిన కడమల కాల్వలోని శివనందీశ్వరాలయము మాత్రమే బాగున్నవి మిగిలిన వాటిలో ఓంకార నందీశ్వరము, కృష్ణనందీశ్వరము మున్నగు మరికొన్ని నామ మాత్రముగ తెలియు చున్నవి. ఆలయ శిధిలములు గూడ నాయా స్థలములందు గానరావు పాణ్యంలో పాణ్యేశ్వరుని గుడిలో ఇదే విధమగు నొక శిధిలాలయము గలదు.

గిద్దలూరు దగ్గర సత్యవోలులో ఇదేవిధమగు నిర్మాణముగల ఆలయములు మరికొన్ని గలవు అచట శాసనాధారములు అంతగా కానరావు.

ఈ ఆలయము లన్నిటయందు వాటి నిర్మాణములో ఒక ప్రత్యేకత గానవచ్చును. బాదామిచాళుక్యుల నాడు నిర్మించబడిన బాదామి, పట్టడకల్లు అయిహోలు మున్నగుచోట్ల యిట్టి ఆలయ నిర్మాణముల ప్రసిద్ధములుగ నున్నవి విమాన నిర్మాణము ఏటవాలుగ స్తూపి ఆకారములో నాలుగు తలములను కలిగియుండుట, పై భాగమందు ఆమలకాకారములోనుండు శిఖరము; మధ్య మధ్య మూలల మీద ఆమలిక భాగములు, శుకనాసియనబడు అర్ధమండప పై భాగమున నటరాజ విగ్రహము, మున్నగు కొన్ని శిల్పవిధానములీ తరగతి ఆలయములలో గానవచ్చును నిర్మాణ మంతయు పూర్తిగా శిలాత్మకముగనే యుండును. చూచుట కతిమనోహరముగ నుండును. ఇవి బాదామి మున్నగు చోట్ల కర్నాట దేశమందును అలంపురము, సత్యవోలు, మహానంది మున్నగు చోట్ల ఆంధ్రప్రదేశమందును గలవు మహానందీశ్వరుని గుడి మొదటి కట్టడము తర్వాత మరమ్మతుల వలన అనేక మార్పులుచెంది అసలు కట్టడమేదో నిర్ణయింప వీలు లేకున్నది. కాని కడమల కాల్వలోని దేవాలయము చెక్కుచెదరక మొదటి నిర్మాణములో చక్కగ లభ్యమగు చున్నది. అంతేగాక ఈ ప్రాంతములో గల యిట్టి ఆలయము లన్నిటిలోను ఇది ప్రాచీనమగునని కూడ ప్రస్తుత మచట లభించిన సత్యాశ్రయుని (రెండవ పులికేశి) నాటి శాసనమును బట్టియేగాక నిర్మాణ విధానమును బట్టి గూడ నిర్ణయింప వీలగు చున్నది. దీని నిర్మాణములో బౌద్ధశిల్ప సంప్రదాయములు కొన్ని గోచరించును. విష్ణుకుండిన రాజైన గోవిందవర్మ 'విబుధ భవన ప్రతిస్పర్ధి శోభాసముదయానేక మహా విహారములను నిర్మించెనని గలదు. అట్లే మరొక గోవింద వర్మ తనను గురించి అనేక దేవాయతన, విహార, సభా, ప్రపా, తటాక, ఉదపాన, ఆరామ, ప్రతిసంస్కార పూర్వకరణేన అలంకృత సకలదిగన్తరేణ" అని చెప్పుకొనెను. దీనినిబట్టి విష్ణుకుండినుల నాడు కూడ దేవాలయములు నిర్మించుట బాగుగ నున్నట్లు విశదమగు చున్నది. ప్రస్తుత కడమల కాల్వ శివనందీశ్వరాలయము రెండవ పులకేశి నాటికేయున్నది గనుక విష్ణుకుండినుల నాటి శిల్పులే దానిని నిర్మించియుందురనుటకు అవకాశ మేర్పడు చున్నది. విష్ణుకుండినులను నిర్జించియే గద బాదామి చాళుక్యులు తెలంగాణములోను, గిద్దలూరు నంద్యాల ప్రాంతమును ఆక్రమించినది. ఒక గోవిందవర్మను గూర్చి 'శ్రీ పార్వతేయ పూర్వాపర క్షితి పతి పరంపరాహార మధ్య నిరుపమ విరాజిత కౌస్తుభాయ మాన యశో జన్మన' అని ప్రశంస కలదు. దీనిని బట్టి వారు శ్రీ పర్వతమునకు తూర్పు పడమరులుగ కొంత రాజ్యమును కలిగియుండిరని నిశ్చయముగ తెలియు చున్నది వారి రాజ్యములోనే కడమల కాల్వ, సత్యవోలు, మహానంది మున్నగునవి చేరియున్నవనుకొనుటలో తప్పులేదు. అమరావతి స్తూప నిర్మాణమునందు జగద్విఖ్యాతమైన నేర్పరితనమును చూపగలిగిన ఆంధ్రశిల్పి దానితోనే అంతరించిపోయెననుటకంటె విష్ణుకుండిన రాజుల కాలములో గూడ కొన్ని దేవాయతనములు, విహారములు కట్టుచునే యుండిరనుట సమంజసము గదా. కాని అట్టివి మన కింతవరకు కానరాలేదు గనుక నిశ్చితముగ ఈ కట్టడము విష్ణుకుండినుల

---

12. డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు దీనిని మొదట కనుగొని 'జినవల్లభుని గంగాధరశాసన"మని భారతి 1967 మార్చి సంచికలో ప్రకటించిరి.

13. ఈ యాలయమును ప్రథమముగ పురావస్తుశాఖకు చెందిన శ్రీ ఎస్. ఎస్ రామచంద్రమూర్తిగారు గుర్తించిరి. వారి సహాయమున ప్రస్తుత రచయిత యీ శాసనమును కనుగొన గలిగెను.

నాటిదేనని నిరూపింపజాల కున్నాము. అట్టి స్థితిలో కడమలకాల్వలోని శివనందీశ్వరాలయమువద్ద రెండవ పులకేశి నాటి శాసనము లభించుట ఆంధ్ర దేవాలయ చరిత్ర కెంతో తోడ్పడగలదనియు దీనిని భావి పరిశోధకు లుపకరించుకొనగలరనియు ఆశించెదము. అమరావతి బౌద్ధ స్థూపకౌశలమును బోలిన దేవాలయ నిర్మాణ కౌశలమానాడుండి తీరవలయును. దానినే పల్లవులు స్వీకరించి నన్నను తప్పు కాజాలదు. వారి కాలములో ప్రాంతీయముగ కొన్ని మార్పులు వచ్చిన మాట వాస్తవమే. కాని బాదామిచాళుక్యుల దేవాలయ విశిష్టతమటుకు ఆంధ్ర ప్రాంతమునకు చెందిన మూల సంప్రదాయ మనవచ్చును కడమల కాల్వ లోని శివనందీశ్వరుని గుడి కిరుప్రక్కల పరివారదేవతలకు చెందిన మరి కొన్ని చిన్న దేవళములు అదె పోలికలో గలవు. విక్రమాదిత్యుని నాటి శిథిల శాసనము కూడ నచట గలదు. ఇప్పటికి శాసనాధారములలో కడు ప్రాచీన దేవాలయమని చెప్పదగిన వాటిలో నిది యొకటి.

కాకతీయ చరిత్ర కుపకరించు కొన్ని ముఖ్యశాసనము లీనడుమ బయల్పడినవి కాకతిమ్మైలాంబ వేయించిన బయ్యారం చెరువుశాసనము.—14 ఇందు కాకతివంశపు రాజుల సుదీర్ఘమగు వంశావళి చెప్పబడెను. దుర్జయవంశమున వెన్నన్నపుడుదయించి కాకతి (యను నగరము) నుండి యేలుటనుబట్టి యీ వంశమువారికి కాకతీయులను వ్యవహారము వచ్చెననియు, అతని పుత్రుడు, పౌత్రుడు, ప్రపౌత్రుడు వరుసగ గుండ సంజ్ఞకలవారని యందు కలదు. మూడవగుండరాజు పుత్రుడు ఎఱ్ఱభూపతి, అతని తర్వాత నాలుగవ గుండరాజు పేర్కొనబడిరి ఇతనికి గరుడాంక బేతరాజు జనించెను అతడే మన చరిత్రకారులు చెప్పు మొదటి బేతరాజు, ఇతనికి పుత్రుడు మొదటి ప్రోలరాజు, పౌత్రుడు త్రిభువన మల్ల బిరుదుగల రెండవబేతరాజు. ఇతని పుత్రుడు రెండవ ప్రోలరాజు అతనికి రుద్రదేవుడు, మహదేవుడు మున్నగువారు పుట్టిరి మహదేవునికి పుత్రుడు గణపతి దేవుడు, పుత్రిక మైలాంబ. ఈమెను మహదేవుడు తన మేనమామయగు నతవాటి వక్కడిమల్ల దుర్గరాజు పౌత్రుడైన నతవాటి రుద్రునికిచ్చి వివాహము చేసెను ఆమె తన తల్లియగు బయ్యల మహాదేవి స్మారకముగ నీ బృహత్తటాకమును నిర్మించెనని తెలుపుటకు శాసనము వేయించెను దీని యందు జెప్పబడిన మూడవ గుండన, ఎఱ్ఱన, నాల్గవ గుండనల పేర్లు ఇంతకుపూర్వమే తూర్పు చాళుక్యరాజగు దానార్ణవుని మాంగల్లు శాసనములో గుర్తించబడియున్నను వారు కాకతీయులలో నెట్లు సంబంధించియుండిరో చెప్ప వీలుగాకుండెను ఈ శాసనము వారు మొదటి బేతరాజుకి తండ్రి తాతల తరమువారేనని తెలియు చున్నది. అంతేగాక ఎఱ్ఱన తరువాత బేతరాజొకడు అనామకుడై మృతుడైనట్లు తెలియు చున్నది. ఈ బేతని పుత్రుడే నాలుగవ కాకర్త్యగుండ్యన రాష్ట్రకూట రెండవ కృష్ణరాజు వేంగిపై దండెత్తి చాళుక్య మొదటిభీమునితో చేసిన యుద్ధములో మూడవ కాకర్త్యగుండన పాల్గొని యసువులు బాసిన రాష్ట్ర కూట దణ్డాధిపతియని మాంగల్లు శాసనమును బట్టి తెలియు చున్నది. ఆ యుద్ధానంతరము వీరు రాష్ట్రకూట సామంతులుగ తెలంగాణమున స్థిరపడిరి నాలుగవ గుండరాజు రాష్ట్ర కూట మూడవ కృష్ణుని అజ్ఞతో వేంగిరాజగు రెండవ అమ్మరాజును క్రీ శ. 956 ప్రాంతమున నోడించి ఆదేశమునుండి తరిమి అతని ప్రత్యర్థియు సవతి సోదరుడును అయిన దానార్ణవుని తాత్కాలికముగ వేంగిసింహాసన మెక్కించి అతనిచే మాంగల్లు గ్రామమునొక బ్రాహ్మణునకు దాన మిప్పించెను. ఈ విధముగ రాష్ట్ర కూట సేనానులగు కాకతీయులు తెలుగు దేశమును మొదట యెట్లు చేరిరో తెలియుచున్నది. ఈ నాలుగవ గుండ్యన తానిప్పించిన మాంగల్లు శాసనములో తాము రాష్ట్రకూటులమని స్పష్టముగ జెప్పుకొనెను ఇతని పుత్రుడగు మొదటి బేతరాజు గరుడ బేతరాజని బయ్యారం శాసనములో గలదు. ఈ 'గరుడ పదము' వారి వంశలాంఛనమగు గరుడ సూచకము. సువర్ణ గరుడ ధ్వజులని రాష్ట్రకూటులలో పలువురు చెప్పబడుట శాసనములందు కానవచ్చును. కనుక కాకతీయు లొకానొక రాష్ట్రకూట శాఖకు చెందిన పలుకుబడిగల సేనాధిపతులుగ రాష్ట్ర కూట రాజుల పనుపున తెలుగు దేశమునకు వచ్చి స్థిరపడిన సామంతులని తెలియు చున్నది క్రీ.973లో రాష్ట్రకూట రాజ్యపతనానంతరము వారి రాజకీయవారసులైన పశ్చిమ చాళుక్యులకు సామంతులుగ తెలంగాణములో ప్రాబల్యమును పొంది రుద్రుని సమయములో చాళుక్య రాజ్య మస్తమించునపుడు స్వతంత్రులైరి స్వతంత్ర కాకతీయ రాజ్య మనుమకొండ రాజధానిగ సవతరించెను.

కరీంనగరుజిల్లాలో శనిగర గ్రామములో కాకతీయ వంశము లోని మొదటిబేతరాజు, మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజులకు సంబంధించిన శాసనములు క్రొత్తగా లభించినవి 15 వీరిలో మొదటి యిద్దరిని గూర్చిన శాసనము లింతవరకు లేకుండుటచే నివియే వారికి చెందినవి అంతేగాక మొదటి బేతరాజు 973 వ శక వత్సరము అనగా క్రీ. 1051 వరకు జీవించియున్నట్లు వాని శాసనము తెలుపుచున్నది రెండవ శాసనము శకాబ్దము 975 లో మొదటి ప్రోలునిచే వేయించబడినది అనగా నీతడు క్రీస్తు 1053 నాటికి రాజ్యభారము వహించెనని తెలియు చున్నది అట్లే మూడవ శాసనము రెండవ బేతరాజు క్రీస్తు 1107 వరకు ఉన్నట్లును, మరొకటి రెండవ ప్రోలుడు క్రీస్తు 1149 వరకు ఉన్నట్లును తెలుపు చున్నవి. ఇట్లు తేదీలతోగూడిన పూర్తి శాసనములు నాలుగు శనిగరములో లభించుటచే ఈ నలుగురి జీవిత కాలములను నిర్ణయించ వీలుగనున్నది 16

ఓరుగంటి ప్రాంతమున నిర్వహింపబడిన శాసన పరిశోధన కార్యక్రమములోనొక అజ్ఞాత విద్వత్కవి తెలియవచ్చెను సంస్కృత వాఙ్మయ చరిత్రయందు చేర్చదగిన గొప్ప విద్వాంసు డీతడు గణపతి దేవుడు, రుద్రమదేవుల కాలమున రాజగురువుగా ప్రసిద్ధినొందిన గోళకీ మఠాధిపతియునైన విశ్వేశ్వర శివాచార్యుల పుత్రుడీతడు పేరు నరసింహార్య. ఇతని వైదుష్యమును ప్రశంసించు శ్లోకములు కోట శిథిల

---

14 దీనిని ప్రస్తుత రచయిత 1967, ఏప్రిల్ భారతిలో ప్రకటించెను.

15. ఈ శాసనములు పురావస్తుశాఖకు చెందిన శ్రీ మల్లికార్జున రావుగారి ద్వారా సేకరించబడినవి.

16 ఈ శాసనములు 1971 నవంబరు, 1972 మే నెల భారతి సంచికలలో ప్రస్తుత రచయితచే ప్రకటింపబడినవి.

ద్వారములపైనను పరిసరమందున్న గుట్టలపైనను దొరకుచున్నవి ఇతడు ప్రతాపరుద్రుని యాస్థానమందున్నటు తెలియుచున్నది (క్రీ. 1290—1323). ప్రతాపరుద్రుని ప్రతిభను కీర్తించు శ్లోక మొకటి యితని రచితము క్రింద 'నరసింహార్య:' అని వ్రాల చేయ బడినది దొరుకుటచే నితడు ప్రతాపరుద్రుని ఆస్థాన విద్వాంసులలో నొకడని చెప్ప వీలగుచున్నది. ఇతడు ఋగ్వేదమునకు ఛాయన (లేక టీక వ్యాఖ్య), ఒకే దినములో పదునెనిమిదిసర్గలుగల కాకతీయ చరిత్ర మును రచించెనట.

> "ఋక్ఛాయా రచితా నిరర్గళ గిరా యేనాధిక స్స్ఫేయసే
> శాస్త్ర గ్రన్థకృత నృసింహ కృతినా హ్యగ్రగ్రి గర్వచ్ఛిదా
> అహ్నైకేన హి కాకతీయ చరితే తేనాష్ట సిద్ధృతా:
> శ్లాఘాఘాట నిసర్గనిర్గళ యశసర్గా నరా ఎతా"

ఇంతేగాక దశ విధములగు రూపకములను గూడ నితడు రచించినట్లు చెప్పుకొనెను. కాని యివి యేవియు మనకు లభ్యముగుట లేదు. ఉరుసు గుట్ట యనబడు నొక కొండపై రెండు శాసన కావ్యము లితని రచిత ములు గలవు అందొకటి యసంపూర్ణముగ నున్నది ఉన్నభాగమైనను స్పష్టముగ లేక నిరుపయోగముగ నున్నది. రెండవది సంపూర్ణముగను, స్పష్టముగను లభించు చున్నది. ఇదియు చిన్న ఖండ కావ్యము 62 శ్లోకములు గలది పదకృతి మృదుమధురమగు శైలి. మేఘ సందేశము వందువలె ఒకానొక సిద్ధ దంపతుల విరహమును వర్ణించుచును వారి పునః వివాహ మిందు కథావస్తువుగ స్వీకరింపబడినది నాయికానాయకుల సంభోగ శృంగారమే కావ్యోద్దేశము. కావ్యాంతమున "విశ్వేశ్వరం నృసి ంహార్య నరసింహార్యకృతి" అని కలదు. ఇట్లు బహుముఖ పాండిత్యముగల నరసింహార్యుడని ప్రకటించుచున్న శాసన కావ్యమిది.[17]

కర్నూలు తాలూక కోడుమూరు గ్రామములో మొదటి హరి హరరాయలు శాసన మొకటి లభించెను. ఇది శకము 1261 (క్రీ 1340) నాటిది. పూర్వ పశ్చిమ సముద్రాధిపతి వీరశ్రీ భండారి హరియప్ప ఒడయరు జగతాపిగుత్తిలో రాజ్యము చేయుచుండగా శ్రీశైల మల్లికార్జున దేవునికి చేయబడిన దానము. ప్రఖ్యాత విజయనగర సామ్రాజ్య స్థాపకులగు మొదటి హరిహరరాయలు మొదటి బుక్క రాయలు హొయ్సల రాజు కొలువునందున్న అధికారులని కొందరు చరిత్రకారులు చెప్పినవాదము సరికాదని డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు సోపపత్తికముగ ఖండించి వారియన్నలు సోదరులు కాకతీయ కడపటి చక్రవర్తియైన ప్రతాపరుద్రుని భండాగారాధ్యక్షు లని నిరూపించిరి. అందుకు వారు విద్యారణ్య వృత్తాంతమును, విద్యారణ్య కాలజ్ఞానము, మున్నగు గ్రంథముల నాధారముగ తెలిపిరి.[18] కాని యీ యాధారములను వుక్కిడి పురాణములని కొందరు త్రోసిపుచ్చిరి. ఇంక వెంకటరమణయ్యగారు చూపిన శాసనాధారములను గూడా తప్పుడు తేదీలవని కన్నడ విద్వాంసులు త్రోసిపుచ్చు చుండిరి. అట్టి శాసనములలో నెల్లూరుజిల్లాలోని గోజలవీడు శాసన మొకటి. ఇందలి తేదీ శకము 1236 (క్రీ. 1314) వ వర్షమనియు అందు చెప్ప బడిన బుక్కరాయ ఒడెయలు సంగముని తండ్రియనియు వెంకట రమణయ్యగారు చెప్పగా ప్రతివాదులు దాని తేదీని శకము 1296 (క్రీ. 1374) అనియు అందలి బుక్కఒడయలు స్వతంత్ర రాజైన మొదటి బుక్కరాయలని చెప్పుచుండిరి ఇట్టి వివాదమును ప్రస్తుత కోడుమూరు శాసనము తొలగించు చున్నది. ఈ శాసనమందు హరి యప్ప ఒడయలు (మొదట హరిహరరాయలు) భండారి యని స్పష్టముగ చెప్పబడెను కనుక శ్రీ రమణయ్యగారు చూపిన గ్రంథాధారములు సత్యములని స్వీకరింపక తప్పదు విజయనగర సామ్రాజ్య స్థాపకులైన హరిహరరాయలు, బుక్కరాయలు తెలుగు వారే. కాకతీయ ప్రతాప రుద్రుని భండారికులు (కోశాధికారులు) అనియే నిర్వివాదముగ వెల్లడి యగు చున్నది.

క్రొన్నూతన శాసనములు నూతనముగ బయల్పడుటచే ఆంధ్రదేశ చరిత్రలో కొన్ని సందేహములు తొలగుటయేగాక నూతన చరిత్రాంశ ములు బయల్పడు చున్నవి

---

17. ఈ కావ్యమును 'సిద్ధోద్వాహ'మను శీర్షికతో ప్రస్తుత రచ యితచే ప్రకటింపబడినది. A. P. Govt. Epigraphy Series No. 2.

18. పురా ద్వాపరశేషే వీరౌ భ్రాతరౌ తు యశస్వినౌ,
కోశాగార ప్రతిపకౌ వీర రుద్ర మహీపతే:
సురలోకేన నిర్జిత్య వీరరుద్రే ధృతే తదా
ఆగతౌ యువనా క్రాన్తా వసహాయౌ శిలాపురాత్
............................
జ్యేష్ఠో హరిహరో నామ కనిష్ఠో బుక్క సంజ్ఞక:
............................
(విద్యారణ్య కాలజ్ఞానమునుండి)
Further Sources of Vijayanagara History. No. 14.

[ఈ వ్యాసమును ప్రకటించుటకు అనుమతించిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వము వారికి కృతజ్ఞతలు.]

# నన్నెచోడుని ప్రయోగవిశేషములు

శ్రీ ఆంగీరస

ఆంధ్ర ప్రబంధాలలో ప్రథమమే కాకుండా ప్రముఖ స్థానాన్ని ఆక్రమించినదని పేరు పడినది నన్నెచోడకవి రచించిన కుమార సంభవం! రచయిత టెంకణాదిత్యుడనీ, కవిరాజ శిఖామణి అనీ బిరుదులు గ్రహించిన రాజకవులలో ప్రథముడు.

దాక్షిణాత్యులైన విద్వత్కవులు గానీ, పాలకులుగానీ, తమ మాతృభాషతో పాటు ఇతర ద్రావిడ భాషలలోనూ, సంస్కృతం లోనూ మంచి ప్రవేశం కలిగి ఉండేవారు. ఆ ఇతర భాషాపదాలను తమ భాషకు చెందినవిగానే గ్రహించి, స్వేచ్ఛగా ఉపయోగించుకొనే వారు. అలాటి పదాలు కుమార సంభవంలో చాలా కనిపిస్తాయి. నన్నెచోడ మహాకవి ఇట్టి పదాలతోపాటు కొన్ని సంస్కృతపదాలను ప్రసిద్ధంగా ఉండే అర్థాన్ని విడిచి విలక్షణమైన అర్థంలో ప్రయోగించడమూ కొన్ని పదాలను కల్పించడమూ, కొన్నింటిని మార్చడమూ కూడా ఉన్నది. విలక్షణంగా ఉండే అతని విశిష్ట ప్రయోగాలను మచ్చునకు కొన్నిటిని చూపడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.

తత్సమ పదాలుగా తెలుగులోకి వచ్చిన కొన్ని సంస్కృత పదాలలో కొన్ని:—

1. అవసరము—

ఈ పదానికి ఆవశ్యకమైనదనీ, సమయమనీ, తొందర అనీ అర్థాలు ప్రసిద్ధాలు. దీనిని 'అనుమతి' అనే అర్థంలో నన్నెచోడుడు వాడినాడు.

'వ. త ద్ద్వారపాలక నివారితులై నిలిచి తదనంతరంబ పరమేశ్వరు నవసరంబు వడసి' (ఆ. 7—156) నిఘంటువులలో ఈ అర్థం కానరాదు.

2. కటాక్షించు:—

దీనికి 'కడకంటితో చూచు, అనుగ్రహించు' అనే అర్థాలే వాడుకలో కానవస్తున్నవి. 'తిరస్కరించు, అనాదరించు' అనే అర్థాల్లో ఇది కు. సం. లో ప్రయోగింపబడి ఉన్నది.

'. . . . పరమేశ్వరు నిరాకరించుచు, నితర సురవరుల విశేషించుచున్న కృతక విప్రు నగజ కటాక్షించుచు, (ఆ. 7—26) కృతక విప్రు నగజ కటాక్షించి' (ఆ. 7—44).

3. గణికా సమూహి—

గణికా శబ్దానికి 'వేశ్య' అనే అర్థమే నిఘంటువులలోనూ, వాడుకలోనూ ఉన్నది. నన్నెచోడుడు మాత్రం 'చెలికత్తె' అనే అర్థంలో దీనిని వాడి యున్నాడు.

'. . . . రేకులు గదలకుండ
మున్ను గొనివచ్చి గణికా సమూహి తోడ
గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు.'

(ఆ. 3—108)

'సమూహం' అనడానికి బదులు 'సమూహి' అని వాడడం కూడా ఒక విశేషం.

4. గభస్తి—

ఈ పదానికి 'సూర్యుడు, అగ్నిదేవుని భార్య, కిరణము', అనే అర్థాలు మాత్రం కానవస్తున్నవి. 'కాంతి' అనే అర్థంలో ప్రయోగించడం నన్నెచోడుని ప్రత్యేకత.

'అలకల కాంతిఁ గప్పె లలి
తాక్షి విభూతి నిజాల కాక్ష సం
చల తర దీప్తిఁ గప్పె వి
సల్ స్మితదీధితి పర్వియలతో
నగలికతిలాల కాక్ష దర
హాస గభస్తి ముతాధరారుణో
జ్జ్వల రుచిఁ గప్పె నన్నిటికి
నన్నువు పెట్టినమాడ్కిఁ బొల్పగన్'

(ఆ. 9—11)

ఇక్కడ 'గభస్తి' పదం కాంతిని తెలిపే పదాలకు పర్యాయ పదంగా వాడబడినది. ఈ అర్థంలో 'విభూతి'ని వాడడమూ గమనార్హమే.

5. గహనము—

ఈ పదం విశేష్యంగా ఉన్నప్పుడు 'అడవి, గుహ, దుఃఖం, జలం' అనీ, విశేషణంగా ఉన్నప్పుడు 'దట్టమైనది, చొరరానిది, ఎరుగరానిది' అనీ అర్థాలలో ఉన్నట్లు నిఘంటువులవల్ల తెలుస్తున్నది. అడవి, దురవగాహం అనే అర్థాలు మాత్రం ప్రసిద్ధంగా ఉన్నవి. 'అసాధ్యం' లేక 'గొప్ప' అనే అర్థం ఉన్నట్లు ఈ గ్రంథాన్ని బట్టియే తెలుస్తున్నది.

'ఇట్టు దనుజేంద్రుం డయుత తనూజా యుతానుజ వరు లొక్కట భూ రజఃపటలంబునుంబోలె గజవదను మదజలా సారంబున మగ్నులం గని మహామనస్వి గావున దానికి గహనంబైన మనోబలంబున భుజ బలంబ నిజబలంబుగాఁ గైకొని . . . .' (ఆ. 12—119)

6 ధార—

ఈ పదానికి నీటిధార, వాదర అనే అర్థాలే ప్రసిద్ధాలు. కాహళి లేక బాకా అనే అర్థం కానరాదు. కవిరాజశిఖామణి 'ధారలు'ను కాహళు లనే అర్థంలో ఉపయోగించాడు.

'ధారలు పట్టఁ బంపు తల
తంత్రముఁ దావడి నంపు రత్న భం
డారముతోడ గుఱ్ఱపు ద
డంబులు మ్రుంగలి నంపు సందడిన్
జేరఁగ నీకు మేనగలఁ
జంద్రములన్ మొఱయింపుము . . . .' (ఆ. 11—5)

'దార' అనేది అచ్చికంగా ఈ అర్థంలో నిఘంటువులలో కాన వస్తున్నది. 'ధార'ను బట్టియే ఇది యేర్పడిఉన్నా ఉండవచ్చును.

7. నిజము—

ఈ పదానికి సహజం, స్వకీయం, శాశ్వతం— అనే అర్థాలు మాత్రం ఉన్నవి. (దేశ్యమయి ఉంటే 'సత్యం' అని అర్థం) కు. సం. లో మాత్రం 'విధము'— రీతి' అనే అర్థంలో వాడ బడింది.

'ఇలఁ బుట్టదు, పుట్టియుఁ దా
నిలువదు, నిలిచియును పొక్క నిజమునఁ దిరమై
కలదాక నెయిద నేరదు
వెలయాండురు కలుపు. ....' (ఆ. 8—165).

ఇక్కడి 'నిజా'నిక మరొక అర్థం కుదరదు.

8. నిరతము—

ఈ పదానికి 'స్థిరము, ఎల్లప్పుడు, అవిచ్ఛిన్నం' అనే అర్థాలె ప్రసిద్ధంగా ఉన్నవి. 'అధికమైన ఆసక్తి' అనే అర్థం ఉన్నట్లు కానరాదు. రాదు. నన్నెచోడుడు మాత్రం

'చెనసి కలహభీతి చేతుల తీఁట వోఁ
బొడువఁజాలునేని మృడుఁడ కాక
నిరత మిగురు గుట్టి నెత్తురు త్రాగిన
భంగి కాక నాకు బాలుఁడెదురె?'
(ఆ. 10—146)

'అధికానకి' అనే అర్థంలోనే 'నిరతం' అని వాడినాడు. ఇగురుకుట్టి నెత్తురు త్రాగడ మంటే— పళ్ళు కట్టుకున్నప్పుడు పంటి యిగురుకు దెబ్బ తగిలి నెత్తురు రాగా, దానిని పీల్చడ మన్న మాట.

9. పరిచ్ఛేదము—

గ్రంథంలోని భాగానికీ, అవధికి—లేక హద్దుకూ 'పరిచ్ఛేదం' అని వాడుక నిఘంటువులు ఆ అర్థాలనే చెప్పుచున్నవి. 'పరిచ్ఛేదం' అంటే 'నిశ్చయం' అని నన్నెచోడుడు అర్థం గ్రహించాడు.

'ఇట్టి పుణ్యసతులు రణ మరణ పరిచ్ఛేదులైన పతులతోడన మరణ పరిచ్ఛేదలగు చుండిరి.' (ఆ. 11— 59)

మరణ పరిచ్ఛేదు లంటే మరణించడానికి నిశ్చయించుకొన్నవారని అర్థం.

10. ప్రస్తవము—

దీనికి 'స్తోత్రగీతం, వినయం, ప్రస్తావం' అనే అర్థాలు నిఘంటువులలో ఉన్నవి నన్నెచోడుడు దీనిని 'సమయం' అనే అర్థంలో ప్రయోగించి యున్నాడు.

సాధారణంగా తెలుగు కావ్యాలలో 'అయ్యవసరంబున'— అని వాడడం ఉన్నది. కు. సం. లో దానికి మారుగా 'తత్ప్రస్తవంబున'— (ఆ. 1—97, ఆ. 7—66) అని కానవస్తున్నది.

'ప్రయోజనం' అనే అర్థంలో కూడా ఇది కానవస్తున్నది. 11—వ ఆశ్వాసంలోని 133—వ పద్యంలో ఎత్తుగీతి—

'పతుల ప్రస్తవంబ పుట్టకుఁ దీర్పంగ
వలయు ననుటఁ దెలుపువార పోలె.'

11. ప్రాప్తి—

ఈ పదానికి లాభం, వ్యాప్తి, పొందుట మున్నగు అర్థాలు కొన్ని ఉన్నవి. 'సాధ్యం' అనే అర్థాన్ని నన్నెచోడుడు మాత్రం చెప్పినట్లు—

'.... ... ...
గరళం బభ్యవహార మంతక తను
క్షారంబు మైపూత పం
కరుహాసీన శిరఃకపాల మురు భి
క్షా పాత్రగా విశ్వసం
హారు వర్తించు మహోగ్రలోప హతి నే
యంబూన నీ ప్రాప్తియే?' (ఆ. 4—77)

అనే పద్యం వల్ల తెలుస్తున్నది. అతడు ఈ పదాన్ని, (అర్హం) 'ఉచిత' మనే అర్థంలో కూడా వాడియున్నాడు.

'......పాపకర్మ! నిను జూ
డం గూడునే! కేవల
స్త్రీయే! పార్వతి నన్యథా మతిగఁ దాఁ
గాంతింప నీ ప్రాప్తియే?' (ఆ 7—52).

'పరమున కేను దాసినని
పల్కఁగఁ బ్రాప్తుండఁగాను ...' (ఆ. 7—136)

అనేది కూడా పై అర్థాన్నే తెలుపుతున్నది.

12 భద్రము—

ఈ పదానికి శుభం, పదిలం, శ్రేష్ఠం మొదలైన అర్థాలు కొన్ని నిఘంటువులలో ఉన్నవి. శుభం, జాగ్రత్త (పదిలం) అన్న అర్థాలే ప్రసిద్ధాలు. కాని 'లిన్నె' అనే అర్థం కు. సం. లో తప్ప మరొక గ్రంథంలో ఉన్నట్లు కానరాద.

'కనక హర్మ్యములతోఁ బెనగిన పవడంపు
భద్రంబులది వీరభద్ర పురము' (ఆ. 7—150)

తెలుగునాట కొన్నిచోట్ల లిన్నె అనడానికి 'భద్రం' అని చెప్పడం వుంది. సుంకాలు వసూలు చేసే లిన్నెను సుంకభద్రం అని అనడం కలదు.

13. రయము—

ఈ పదానికి 'నదీప్రవాహం, వేగం' అనే అర్థాలు మాత్రమే నిఘంటువులలో ఉన్నవి. వాడుకలో కూడా ఆ అర్థాలే కానవస్తున్నవి. 'వేగం' అనే అర్థంలోనే కాకుండా 'విధం' అర్థంలోనూ నన్నెచోడుడు ఈ పదాన్ని ఉపయోగించాడు.

'పొలయు నశోకవల్లి విడి
పువ్వుల గుత్తుల మీఁదఁ గ్రాలు కెం
దలిరులొ నాగ మై నడిరి
దండడి వహ్నిశిఖా కలాపములో
గల కొనఁ బ్రేలి దూలికొని
కాలె రయంబున లక్క బొమ్మ న
గ్గల మగు వహ్నిచుట్టుకొని
కాలు రయంబున నిస్తుషంబు గాన్.'
(ఆ. 2—45)

14. లషితము—

కోరదగినది లేక కోరిక అనే అర్థంలో 'లషితం' అనే దానికి 'అభి' అనే ఉపసర్గ చేరవలసి ఉన్నది. అభిలషితం, అభిలాష— మొదలైన రూపాలే ప్రసిద్ధంగా ఉంటున్నవి. నన్నెచోడుడు మాత్రం ఉపసర్గరహితంగానే దీనిని గ్రంథాదినే ప్రయోగించి యున్నాడు—

"శ్రీ వాణీంద్రామరేంద్రా
  ర్చిత మకుట మణి శ్రేణిధామాంఘ్రి పద్మా
జీవోద్య త్కేసరుం డా
  శ్రితజన లషితా శేష వస్తుప్రదుండు."

(ఆ. 1—1)

15 వస్తువు—

వస్తువనే పదానికి పదార్థం, తత్త్వం, కథాంశం మున్నగు అర్థాలు ఉన్నవి గాని 'బంగారం' అనే అర్థం కానరాదు. నన్నెచోడుడు 'బంగారు శిఖరం' అనుటకు 'వస్తుశిఖరం' అని చెప్పియున్నాడు—

'స్ఫటికాద్రిమీద విభ్రాజిల్లు వాస్తు శృం
గంబునా రత్నజూటంబు పూన్చి' (ఆ 9— 24)

ఇక్కడ శివుని జటాజూటం స్ఫటికపర్వతంపై బంగారు శిఖరం లాగ ఉన్నదని వర్ణన.

16. విస్తరము—

• ఈ పదానికి వ్యాప్తి, ఆధిక్యం, సమూహం, వివరించడం, పాన్పు మున్నగు అర్థాలతోపాటు 'పీట, పీఠం' అనే అర్థం కూడా నిఘంటువులలో ఉన్నదే కాని, వాడుకలో ఉన్నట్లు లేదు. కు. సం. లో ఈ అర్థంలో కానవస్తున్నది.

'విస్తరం బయ్యెను బరుసవేది వేది
యయ్యెఁజింతామణులు వెలయంగ మీఁద
నౌషధులు నిధుల్ దీపములయ్యె ననలుఁ
డొలసి వర హోమకుండమ్మై వెలుగు చుండె.' (ఆ. 9—4).

17. శిక్షించు—

శిక్షించడ మంటే అపరాధికి దండన. విధించడమనీ, విద్యాభ్యాసం చేయించడ మనీ అర్థాలు ఉన్నవి. ఆజ్ఞాపించడమనేది కొత్త అర్థం. నన్నెచోడుడు ఈ అర్థంలో ఈ పదాన్ని ప్రయోగించాడు.

'ఆక్షితి ధరపతి శివుఁ బ్ర
త్యక్షముగాఁ గొలుచు చుండుమని తత్పరుఁడై
శిక్షించి గౌరి నందు సు
రక్షితముగ నునిచి నిజపురంబున కరిగెన్.'

(ఆ. 3—104)

ఇక్కడ హిమవంతుడు, తన పుత్రికయైన పార్వతిని శివుని సేవిస్తూ ఉండవలెనని ఆజ్ఞాపించి నట్లు ఉన్నది. దీనికి 'నియమించడం' అని అర్థం చెప్పినా చెప్పవచ్చును.

18. సంకాశము:—

దీనికి 'సమీపంలో ఉన్నది, పోలినది' అనే అర్థాలు మాత్రం కాన వస్తున్నవి. 'కాంతి' అనే అర్థం కానరాదు. కు. సం. లో ఆ అర్థంలో ఇది ప్రయోగించబడి ఉన్నది.

"కటివృత వ్యాఘ్ర చర్మంబు కంటె మున్న
మేఖలోరగ ఫణములు మిగిలి వెలిఁగెఁ
బాదపీఠోరు వజ్రప్రభాతి కంటె
మున్న పదనఖ సంకాశ మున్నతిల్లె."

(ఆ. 7—57 ఎత్తుగీతి).

19. హంసోదకంబులు—

ఈ పదం ఇదివరలో నిఘంటువులకు ఎక్కలేదు. హంస, ఉదక— అనే పదద్వయి సమాసం వల్ల ఏర్పడిన కొత్త పదం. దీనికి నన్నెచోడుని ప్రయోగం మాత్రమే కానవస్తున్నది. 'సూర్యరశ్మి తప్తములై రాత్రి చంద్రకిరణములచే చల్లఁబడిన జలము'లని దీనికి నిడుదవోలు వేంకటరావుగారు అర్థం చెప్పారు.

వ్యుత్పత్తిని బట్టి చూస్తే— హంసుడు సూర్యుడు కాబట్టి సూర్యకిరణాలచేత తప్తములైన జలాలని అర్థం గ్రహించడం సముచితంగానే ఉన్నది.

'అంత నంత పురాభ్యంతర ప్రౌఢకాంత లత్యంత సంతోషంబున సుగంధ తైలాభ్యంగనామలకోద్వర్తన పూర్వం బపరిమిత పరిమళిత హంసోదకంబుల.

ఒడలి భస్మరజంబు పోఁగడిగి పుచ్చి
జడలు విచ్చిన గర మొప్పె శైల తనయ
కాలపరిణతి నిర్ముక్త గళిత పర్ణ
మధుకరాకీర్ణ తరులతా మహిమవోలె.'

(ఆ. 7—78, 79)

పార్వతీ దేవికి తలంటి స్నానం చేయించే వర్ణనలోని దిది. పయి అర్థం ఇక్కడ సముచితంగానే ఉన్నది.

20. హరిద్రారాగము—

ఈ సమస్తపదం నిఘంటువులలో లేదు. 'నటించే ప్రేమ— నిలుకడలేని ప్రేమ' అనే అర్థంలో ఇది కు. సం. లో వాడబడింది.

'ఈఁగికిఁ గలుచు హరిద్రా
రాగంబది నిల్వ దెయిది రతి మేడ్పడి సం
భోగగతిఁ గలుచు విటుని వి
రాగంబది నిల్చు భావరనజననంబై.'

(ఆ.8—163)

డబ్బుకోసం చూపే ప్రేమ నిలిచి ఉండదనీ, మనసారా ఉండేదే స్థిరమయినదని దీనిలో చెప్పబడింది. ఇక్కడి 'విరాగ' పదానికి 'వైరాగ్య' మనే అర్థం తీసుకోకూడదు. 'విశిష్టమైన రాగం— అధికమైన ప్రేమ' అనే అర్థాన్ని గ్రహించాలి 'విభాతి' మున్నగు ఇతర ప్రయోగాలున్నూ 'వి' అనే ఉపసర్గకు 'విశేషమైన' అనే అర్థాన్నే వ్యక్తపరుస్తూ ఉన్నవి.

వ్యుత్పత్తినిబట్టి చూస్తే హరిద్రా రాగమంటే— పసుపువల్ల ఏర్పడిన ఎరుపురంగని అర్థం. పసుపు, సున్నం కలిపితే ఎర్రని పారాణి తయారవుతుంది. పసుపు నీటిలో సున్నం కలిపితే వసంతం తయారవుతుంది అందులో ముంచిన గుడ్డలు ఎర్రగానే ఉంటాయి. వాటిని ఎండవేస్తే, ఆ రంగు నిలవకుండా పోతుంది.

'రాగం' అనే పదానికి 'రంగు' అనే అర్థాన్ని తీసుకున్నా తీసుకోవచ్చు. పసుపు వల్ల ఏర్పడిన రంగునీళ్లలో— పసుపు నీళ్లలో ముంచి ఆరవేసిన బట్టకు— ఆ రంగు పోవడం అనుభవ సిద్ధం. ఆ రంగు అస్థిరమైనది. అట్టి అస్థిరమైన ప్రేమను హరిద్రారాగంతో అభిన్నంగా చెప్పడం— అందువల్ల 'నిలుకడ లేని ప్రేమ' అనే అర్థం ఏర్పడడం సముచితంగానే ఉన్నది.

ఈ విధంగా ఎన్నో తత్సమ పదాలకు విలక్షణంగా ఉండే అర్థాలను కవిరాజశిఖామణి గ్రహించాడు. కొన్ని పదాలను మార్చి వేసినాడు.

'రథం' అనే దానికి 'అరదం' తద్భవమని అందరికీ తెలుసును. అరదాన్ని రథ పర్యాయమైన తత్సమంగా గ్రహించి నన్నెచోడుడు అశ్వాశ్వతర శిబికాందోళకరి కరి, ఉష్ట్రకర భారదానీకవాహ, నములు (ఆ. 11— 12) అని సుదీర్ఘమైన తత్సమ సమాసంలో ప్రయోగించాడు.

అల్పులు— అనుటకు 'అలుపులు' అని, 'హర్షము' నకు హరుషము' అని, 'ధూప పటము'నకు 'ధూపటము' అని, 'సమూహము'నకు, 'సమూహి' అని, భువనానికి 'భువని' అని, 'గర్జించు' అనుటకు 'గర్జు' అని— ఈవిధమైన ప్రయోగాలు ఎన్నో కు. సం. లో కానవస్తున్నవి.

ఇతర దాక్షిణాత్యపదాలు కొన్ని తెలుగులో కలిసిపోయి నిరాఘాటంగా వాడుకలో ఉంటున్నవి. 'మందు'—అనే అర్థంలో ఉన్న 'ఎరియు' తమిళం నుంచి ఎన్నడో మన భాషలో ప్రవేశించింది. 'గాదిలి' అనేది భర్త, భార్య, ప్రియుడు, ప్రియురాలు, ప్రియమైన వాడు మున్నగు అర్థాలలో సరళాదిగా ఉన్నది. 'భార్య' అనే అర్థంలో 'కాదిలి' అని పరుషాదిగా కు. సం. లో కానవస్తున్నది. 'కాదల్' అనే తమిళపదాన్ని అనుసరించి వచ్చినదే యిది! 'కాదిలి' మొదటి రూపమని, దానిని అనుసరించే 'గాదిలి' వచ్చినదని గ్రహించాలి.

'నాయి' అంటే తమిళంలో కుక్క. ఆ పదం ఆ అర్థంలోనే కు. సం. 1—29 లో ఉన్నది.

'కట్టాయం' తమిళ పదం. 'నిర్బంధంగా, తప్పకుండా' అనే అర్థం. అది కు. సం.లో (8—177) ఆ అర్థంలోనే ఉన్నది. 'తళియ' (వంట) (10—190) కూడా తమిళ పదమే!

'సేల్లై' అనే తమిళ పదానికి 'సేన' అని అర్థం. ఆ పదం ఆ అర్థంలోనే ఇందులో (4—43)లో వాడబడి ఉన్నది.

'మొసరు' పదానికి కన్నడంలో 'పెరుగు' అని అర్థం. ఆ పదం అదే అర్థంలో కు. సం. లో (1—12) ప్రయోగించ బడింది.

అచ్చిక పదాలలో కొన్ని—

1. అంకటు=ఆటంకము— అడ్డు. దీనికి నిఘంటువులలో ఈ అర్థం కానరాదు.

> 'అంకగొన నుభయ బలములు
> పొంకం బఱి తలరి సెలర———' (ఆ. 12—69)

2. అగ్గడి(జీవము)= మొండి (ప్రాణము)

> 'ప్రాణ వల్లభుండు భస్మపుంజముగ నా
> యెదురఁ జూడఁ జూడ నెరిసి పోక
> కనియు రొడలఁ బాసి చనదయ్యె నగ్గడి
> జీవమింక నేమి సేయుదాన?' (ఆ.5—92)

ఇక్కడ మన్మథుడు శివుని కంటిమంట వలన భస్మం కాగా దుఃఖిస్తున్న రతీదేవి తనది 'మొండిప్రాణం' అని చెప్పడం ఎంతో యుక్తంగా ఉన్నది. 'అగ్గడి' పదం నిఘంటువులలో లేదు.

3. ఎడ.

ఈ పదానికి 'లోకముని వ్యవహారం' అనే అర్థం నన్నెచోడుని ప్రయోగాన్ని బట్టియే తెలుస్తున్నది.

> 'అబల గడునెడ యెఱుఁగని యాడదాన
> మెలఁత నతిభీత నన్నుఁ నమ్మించి తెచ్చి
> కాననంబులోఁ గన్నులు కట్టి కాటు
> పఱచి నీటుచు పోఁజన్నె భావజన్మ?' (ఆ. 5—85.)

మన్మథుడు శివుని కంటిమంటవల్ల భస్మంకాగా, రతీదేవి విలపిస్తూ చెప్పిన పద్యం యిది!

4. ఓటుకండ.

ఈ పదాన్ని నన్నెచోడుడు, 'భయం' అనే అర్థంలో ప్రయోగించాడు.

> 'ఆజ శిరోదళనుఁడన్నదరు లేదనియుఁ
> బ్రళయాగ్ని రుద్రుఁడన్ భయములేక (ఆ. 4—61)

5. కండవడము

ఈ పదానికి 'తెరచీర' అనే అర్థం కు. సం. లో చెప్పబడి ఉన్నది

> 'ననిచిన కల్పవల్లి మద
> నాగ గతిన్ నడపాడఁ జొచ్చెనో
> యనఁ జనుదెంచెఁ గండవడ
> మల్లన వెల్వడి బాలికాళితో
> ఘన పటలంబు వెల్వడు శి
> తాసిత తారక సంభృతేందుల
> ఖనయముఁ ద్రోసిసేయుచు న
> గప్రియ నందన చెన్ను వింతగాన్. (ఆ.9—20.)

ఈ పదం 'కాండపట' పదానికి తద్భవం. కాండం అంటే కర్ర కాబట్టి, దానికి కట్టే వస్త్రం కాండపటమని చెప్పడం సముచితమైనదే. తెర కట్టవలసినప్పుడు, పొడుగాటి కర్రను మీదిభాగంలో అడ్డంగా కట్టి, దానికి గుడ్డను వ్రేలాడవేస్తారుగదా!

6. గుళ్లు.

గుళ్లంటే దేవాలయాలూ, పరివేషాలు అనే అర్థాలు ప్రసిద్ధంగా ఉన్నవి. ధ్వజాలనే అర్థం కు. సం. లోనే గ్రహించ బడింది.

> 'అనుచు రాగిల్లి జయ జయ ధ్వనులు చెలఁగఁ
> బొంగి ముప్పుట లాడిరి పుష్ప వృష్టి

కురిసెఁ గురివెందగింజల నెల్ల గుల్ఫగట్టి
యొసర వాయించి రమరు లత్యుత్సవమున.'
(ఆ. 10—104)

7. చప్పరము.

దీనికి పందిరి, పంటె శకటము, మండపము, గుడారము మొదలైన అర్థాలు ఉన్నవి గాని, 'ఆకాశం' అనే అర్థం నిఘంటువుల లోనూ కానరాదు. కు. సం.లో మాత్రం

'ధర నిదాఘ వాతాహతి నెరియకుండ
విధి తమాలమంటపము గావించెననఁగ
నొప్పె నీలాభ్ర పటల మచ్చప్పరమున
కాలుగ నెల్ల దెస వానకాలు లమరె.'
(ఆ 6—97.)

8. పూన్పు—

పూనుధాతువునకు ప్రేరణార్థంలో 'పూన్పు' అనే రూపం. 'పూను' అనే దానికి ఉండే అర్థాలు దీనికీ సంక్రమిస్తాయి. కాని 'పూజించు' అనే అర్థంలో 'పూన్పు' అనే ప్రయోగం నన్నెచోడుని రచనలోనే కాన వస్తుంది.

'హరి వికచామలాంబుజ స
హస్రము పూన్చి మృగాంకు కందు వి
స్ఫురిత విలాసితాబ్జ మని
పుచ్చుగఁ జూచిన చేయి చూచి చం
దురుఁడధి రాహు సావి చెలు
దువ్వలఁ దూలఁగ జారుచున్న నీ
శ్వరుపురఁ జూచి నవ్వు పర
మేశ్వరుఁ డీవుత మీ కభీష్టముల్.' (ఆ 1—3.)

9. పేర్బిందులు.

పేర్బిందులంటే చెమట బిందువు లని అర్థం. ఈ అర్థంలో ఈ పదాన్ని నన్నెచోడుడే వాడినాడు.

'పులయు నిట్టూర్పుల కలకలంబులతోన
యార్తరవంబు మిన్నంద్రువఁ జెలఁగ.
దందడిఁ దొఱఁగు పేర్బిందులతోడన
కన్నీరు తొరల గడలు కొనఁగ—' (ఆ. 5—70.)

'పేర్బిందులు' మిశ్రసమాసం. ఇక్కడి 'పేరు'కు నామధేయమని కాని, దండ అని కాని, గొప్ప అని కాని అర్థంకాదు. తమిళంలో 'పేర్' వ్యక్తిని తెలిపే పదం. ఆ అర్థమే యిక్కడా గ్రహించ బడింది. మానవుల మీద వుండే (నీటి) బిందువులు చెమట బిందువులే అవతాయి. అందువల్ల 'పేర్బిందులు' చెమట బిందువు లైనాయి.

10. సావి.

సావి అంటే భ్రాంతి. ఈ అర్థంలో ఈ పదం కు. సం. లోనే కానవస్తున్నది. 'పూన్పు' అనే దానికిచ్చిన ఉదాహరణంలో 'రాహుసావి' అనేదాన్ని చూడవచ్చును.

'జలజమును సావి కోకములు
షట్పదముల్ వలతెంచి తద్దయున్' (ఆ. 8—8.)

అనే చోట కూడా 'సావి' అనే దానికి 'భ్రాంతి' అనియే అర్థాన్ని గ్రహించాలి.

మచ్చునకు మాత్రం ఇట్టి కొన్ని ప్రయోగాలు ఇవ్వబడి నవి. ఉపమావాచకం మీద ఉపమావాచకాన్ని నన్నెచోడకవి వాడుతూ ఉంటాడు.

'నింగి ముట్టియున్న జంగమ మల్లయు
వరము నందుఁ గనిన వస్తుకవిత
దగిలి వారియంద నొగడింతు రవికి దీ
పమున నర్చలిచ్చు వగిదివోలె.' (ఆ. 1—48.)

ఇక్కడ 'వగిది, వోలె' అనేవి రెండూ పోలికను తెలిపేవే! ఈ రెండింటిలో ఒకటి ఉంటే చాలు.

ఇట్టి విశిష్ట ప్రయోగాలు కవిరాజశిఖామణి కృతిలో ఎన్నో ఉన్నవి. ఇవి అతని కవితా ప్రాచీనతనూ, స్వాతంత్ర్యాన్నీ, రచనా వైశిష్ట్యాన్నీ వెల్లడి చెయ్యగలవు.

# ఆంధ్ర వాఙ్మయ ప్రారంభ కాలమున మహారాష్ట్ర ప్రభావము

శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి

ఆంధ్ర భాషమీదను వాఙ్మయముమీదను సంస్కృత ప్రాకృత తమిళ కన్నడ భాషల ప్రభావమును గురించి అపారకృషి జరిగినదిగాని మహారాష్ట్ర భాషయొక్కగాని, వాఙ్మయముయొక్కగాని సంస్కృతి యొక్కగాని ప్రభావమును గురించి ఎక్కువగా కానరాదు. ప్రాచీన ప్రాకృతమే మహారాష్ట్ర భాషయనియు, శాతవాహనులనాడు ఆంధ్ర మహారాష్ట్రులకు భేదమేలేదని తెలుగులో కనబడు పెక్కు ప్రాకృత శబ్దములకు అదే కారణమనియు పండితులు తలంచియున్నందున ఈ విషయము ప్రత్యేక పరిశోధనను ఆకర్షింప లేదు. ఈ భావమునే ఇటీవల పండితులు తమ వ్యాసములలో వ్యక్తపరచియున్నారు. 'తెలుగు వాఙ్మయముమీద మహారాష్ట్ర వాఙ్మయ ప్రభావము' అని శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు తెలుగు విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి, మూడవ సంపుటములో (పు 638) ఒక చిన్నవ్యాసము వ్రాసియున్నారు. ప్రాకృతములను గురించి వ్రాయుచు మన పండితులు ఇదివరకు ఎంతో వ్రాసియేయున్నారు. కాని ఆంధ్ర వాఙ్మయ ప్రారంభ కాలమున అనగా నన్నయ, తిక్కన ఎఱ్ఱనలు తెలుగు కవితకు రూపు రేఖలు తీర్చి దిద్దిన కాలమున, వారిమీదకాకపోయినను, తర్వాతివారి కైనను మార్గదర్శకమైన కవితా విధానములు, నూతన కావ్య మార్గములు మహారాష్ట్ర భాషా సంపర్కము వలన కలిగియుండ రాదా యని అనుమానించుటకు కూడ బొత్తిగా ఎచ్చటను సూత్రప్రాయముగా ప్రమాణము కానరాదు భాషాభివృద్ధి జరిగిన కాలమున మహారాష్ట్ర ప్రాకృత తమిళ భాషల సంపర్కము ప్రభావము నిస్సందేహము. మీదు మిక్కిలి అతి స్పష్టము. వాఙ్మయము పొడచూపునాటికి సంస్కృత కర్ణాట వాఙ్మయములు కనబడుచున్నవి. ఇంతేకాదు శ్రీ పుట్టపర్తి వారన్నట్లు 'ఆంధ్రమువలెనే మరాఠీకిని పదునొకండవ శతాబ్దివరకు పరిణతమైన స్వరూపమే లేదు. అదియు మన తెలుగువలె గాసట బీసట గానే యుండినది. నాటివిగా మనకు కన్పించునవి కొన్ని పాటలును సామెతలు మాత్రమే.' ఇది నన్నయ కాలపు పరిస్థితి. మరాఠీ భాషలో కావ్య రచన పదుమూడవ శతాబ్దమునుండియే కనబడుచున్నది. భక్త కవులు, పండితకవులు, సంప్రదాయ ప్రవక్తలు భాషాభివృద్ధి నొనర్చిరి గాని వారి రచనల ప్రభావము స్పష్టముగా ఏదియు మన వాఙ్మయముమీద కానరాదు. ఏమైనను కలిగిన అదంతయు చాల తర్వాతి కాలముననే. కాబట్టియే అతి ప్రాచీన ప్రాకృత మహారాష్ట్ర ప్రభావానంతరము, అనగా శాతవాహనుల యనంతరము పన్నెండు పదుమూడు శతాబ్దముల కాలము వరకు ఆంధ్ర వాఙ్మయము మీద మహారాష్ట్ర భాషయొక్కగాని సంస్కృతియొక్కగాని ప్రభావములేనట్లే తలంపబడు చున్నది. అదే కారణము పండితులెవరును కవిత్రయ కాలమున మన భాషా సంప్రదాయముల మీద మహారాష్ట్ర సంస్కృతి ప్రభావమున్నట్లు బొత్తిగా శంకింపను కూడలేదు.

మఱి ఇట్లుండగా, ఈ పరిశోధక వ్యాసమునకు కవకాశమెట్లన్న ప్రశ్నకు సమాధానముగా ఒక కొంత శంకకు అవకాశము నాకు కనబడుచున్నది. ఆంధ్ర వాఙ్మయము నందలి లక్షణకారులలో కేతన మొదటి వాడు, విన్నకోట పెద్దన రెండవ వాడు. కేతన చెప్పని నూతన విషయములను విన్నకోట పెద్దన చెప్పినాడు. కావ్యభేదములను చెప్పుచు ముక్తకాది చాటు ప్రబంధముల వరుసలో 'ఉదాహరణము' 'బిరుదావళి' మొదలైన వానిని చేర్చి వీనికి సంగీతముతోగల సంబంధమును తెలుపుటయే గాక, ఉదాహరణమును గూర్చి ఇట్లు విశదీకరించినాడు.

క. ధరఁజాటు కృతులలోనం
బరఁగు నుదాహరణ మను ప్రబంధము, తద్వి
స్తరలక్షణంబు బరువడిఁ
బరికింపఁగఁ దగు నశేష భాషా కవులున్.

క. చతుర శ్రుత్య శ్రాది వి
తతయతి తాళములు గలుగు దళముల నెల్లన్
గ్రత గుచ్ఛాను ప్రాసం
బతలితగతి నిలుపందగు నుదాహరణలకున్.

క. సురభాషాది ప్రాకృత
పరిభాషలనైన నితర భాషలనైనన్
విరచించుట యుక్త ముదా
హరణ మిలాసురముఖాదులగు పుణ్యులకున్.

ఇట్లు చెప్పి ఉదాహరణ భేదములు పెక్కులు కలవన్నాడు.

తే. గ్రంథ బాహుళ్య భీరుత్వ కథనమదియు
ధర నుదాహరణాది భేదములు పెక్కు
తెలియఁ గొండెడ, మఱికొన్ని తేట పఱుతుఁ
బటు పదార్థాప్తి జాటు ప్రబంధములను

అందు బిరుదావళిని పేర్కొన్నాడు.

క. బిరు శబ్దంబు విరోధో
త్కరము మహారాష్ట్ర భాషఁ దత్తద విధులన్
బిరుదములనఁ జనువానిన
ధర బిరుదావళి యొనర్పఁదగు నండ్రు బుధుల్.

చ. అతుఁ కులక్రమాగతము
లై భుజ విక్రమ సంభవంబులై
ప్రతి పదసార్థకంబు లయి
పార్థివ కర్ణ కఠోరకంబులై
వితరణ లబ్ద పూర్వ పృథి
వీవగ చిహ్నములై తనర్చు మ
ద్యత బిరుదాళి చేత బిరు
దార్థము చెప్పఁ యొప్పు నెప్పుడున్.

క. వినయ భుజ విక్రమ క్రమ
ఘన వితరణ రణ విహార కరుణాది కళా

జనన స్థలులగు గుణములఁ
బెనుఁ పొందఁగఁ జెప్పవలయు బిరుదావళికిన్.

ఇట్లు చెప్పిన తర్వాత బిరుదావళిని తెలుగులో వ్రాయుడని చెప్పక సంస్కృతమందో ప్రాకృతమందో వ్రాయుడని ఆదేశించినాడు.

క. సముచిత తాళదళమ్ముల
సమధిక పటు గౌడ రీతి సందర్భములన్
సుమనోభాషం బొలుపుగ
నమరింపుడు కవులు ప్రాకృతాదులనైనన్.

ఇంతటితో 'సోక ధీర, గంభీర, జయ, దేవదేవ' అని రాజులను పొగడవలె నట

తే. పద్య దళ వాక్య తద్దళ పరి సమాప్తి
గుదురు పట్టను నెడనెడఁ గలుగ వలయు
ధీర గంభీర జయ దేవదేవ యనెడు
లలిత సంబుద్ధి వచనంబు లొలయవలయు.

ఆదిలో ఆశీర్వచనముండ వలయునట.

క. ఉచిత విభక్తిక్రమును గుణ
రుచిరాలంకార రస నిరూఢము నాశీ
ర్వచనంబును నగు పద్యము
రచియింప గ వలయు మొదల రంజన మొప్పన్

ఇట్లు చెప్పుచు ఇదంతయు కవులు రాజులను దీవించు ప్రక్రియయని తెలిపినాడు.

క. బంధురముగ నిట్టతుల
స్కంధ చతుష్కంబు చేతఁ గవి విభునియశో
గంధాధివాసితాశా
సింధూరముగ దీవనల విశేషింపఁ దగున్'

చక్రవాళమును కావ్యభేదమును గురించి చెప్పుచు అందు,

క. కవి నామ నాయక స్వ
స్తివచ. కవితాద్య పద్య శిఖరంబులఁ బ
ల్లవమైన వర్ణయుగళం
బవిరళముగ వాద్యమునకు నాద్యక్షరముల్.

ఇట్లనుటచే ఇదొక స్వస్తి వాచకరీతి యని విశదమగు చున్నది. ఇవెల్ల చాటుకావ్యములని మరల నిట్లన్నాడు—

క. ఇవి యెల్లను నానావిధ
కవికృత శాస్త్రముల చేతఁ గల్పితములు పె
క్కు విధంబులఁ జాటుకృతి
ప్రవరంబులు బరఁగు నెఱుఁగబడు గొండెడలన్

వెంటనే ఒక సీస పద్యములో అంతవరకు చెప్పిన చాటు ప్రబంధములను గూర్చి మనోహరముగా చెప్పినాడు.

సీ. ఆపూర్ణ లక్షణోదాహరణావళి
యుల్లంబునకు నింపు నొసఁగదేని,
బిరుదావళీముఖ్య పృథుల ప్రబంధౌఘ
ములు దిగంతంబుల మ్రోయవేని,
పలుచతుర్భద్రాది భవ్యచాటూక్తులు
నృపతుల వీనులు నిండవేని,
మధురార్థ దండక మంజరీ మంజుత
బుధుల నింపులమీరఁ బుచ్చదేని,
గొరలి చని ముక్తకాదులు కీర్తిలతలఁ
జక్రవాళాద్రి మీఁదికిఁ జాపవేని
గడఁగి మెచ్చునె యొక పాటి గంతచాటు
చాటు కృతులకు విశ్వేశ చక్రవర్తి.

ఇదంతయు చూడఁగా నీ వాఙ్మయం ప్రక్రియయు క్రొత్తగా పిద్దన కాలమున ఏర్పడినది కాదనియు ఎంతకాలమునుండియో కవుల వ్యవహారములలోనుండినదనియు, తన లక్షణముకూడ సమగ్రము కాదనియు, ఇతరాకరములనుండి ఎరుగ దగిన దెంతయో కలదని ఇతని యభిప్రాయమనియు తెలియుచున్నది. మఱియు ఇదంతయు తెలుగు సంప్రదాయమాయనుటకు కూడ అవకాశములేనియట్లుగా సంస్కృతమందో ప్రాకృతమందో రచింప వలసినట్లుగాను చెప్పినాడు. మఱి ఇదంతయు సంస్కృత కావ్యమార్గముగా నుండి మనవారు గ్రహించి రాయన్న, విద్యానాథుని వరకు ప్రాచీనాలంకారికు లెవరును చెప్పక అతడే మొదటి పర్యాయము క్షుద్ర కావ్యములంగూర్చి లఘువుగాను, అందు నుదాహరణమును చేర్చనందున ఇది సంస్కృత కావ్యమార్గము కాదనియు, ఒకవేళ ఉండినను ప్రచారము తక్కువయనియు తోచు చున్నది ఆంధ్రవాఙ్మయమునకు తొలి ఉదాహరణమైన బసవోదాహరణ రచయిత పాల్కురికి సోమనాథుఁడు విద్యానాథుని సమకాలికుడే.

సంస్కృత వాఙ్మయమందు ఉదాహరణను గురించి చెప్పిన వాడు కాళిదాసు విక్రమోర్వశీయమందును రఘువంశమందును ఉదాహరణ కవితను ప్రస్తావించినాడు. అది కీర్తి ప్రశస్తిగా తోచుచున్నది. కాని దీనిని గురించి దండ్యాది ఆలంకారికులు చెప్పక పోవుట వింత. రఘువంశములో నాలవసర్గలో 78వ శ్లోకమున రఘువుయొక్క దిగ్విజయమును గురించి చెప్పుచు ఆతఁడు ఉత్సవ సంకేతులనుజయించగా ఆజయమును కిన్నరులు ఒక ప్రబంధముగా రచించి పాడి రన్నాడు.

"శరైరుత్సవ సంకేతాన్, సకృత్వా విరతోత్సవాన్
జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్"

ఇందుకు మల్లినాథ వ్యాఖ్య 'జయోదాహరణం జయఖ్యాపకం ప్రబంధ విశేషం' అని. విక్రమోర్వశీయమందు కేశిదానవుని నుండి ఉర్వశిని పురూరవుడు విడిపించినవార్తను ఇంద్రుడు దూత చిత్రరథుడను గంధర్వరాజు చారణుల వలన వారు పాడిన జయోదాహరణముచే నెరిగినాడట "వయస్య, కేశినాహృత మూర్వశీం నారదా దుపశ్రుత్య ప్రత్యాహరణార్థ మస్యాః శతక్రతునా గంధర్వసేనా సమాదిష్టా. తతోవయ మంతరా చారణేభ్యస్త్వదీయం జయోదాహరణం శ్రుత్వా మిహస్థముపాగతాః" వ్యాఖ్యం 'జయోదాహరణం విజయవార్తాం'? ద్వితీయాంకమున ఉర్వశి భూర్జ పత్రమున వ్రాసిన ప్రేమలేఖనుకూడ పురూరవుడు—

"తుల్యానురాగ పిశునం లలితార్థ బంధం
పత్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః

ఉచ్ఛృంఖలం మనుసతే మదిరేక్షణాయాః
తస్యాః సమాగతి మివాననమాన నేన"

వ్యాఖ్య—ఉదాహరణం—ఉక్తిః. కాని 'లలితార్థబన్ధ' మట.

బిరుదశబ్దముమీద వ్యాఖ్యానించుచు మా తాతగారు తమ శృంగార నైషధ సర్వంకషలో నిట్లు వ్రాసినారు (పు.20) "బిరుదము (బిరుదును) గురించి అప్పకవి— 'క్షితి మహారాష్ట్ర భాషచేఁ జెప్పఁ బడెడు భీకరోక్తులు బిరుదులై చెక్కుదవరు....

'అతిభుజవిక్రమోద్భటములై రిపుకర్ణకఠోరకంబులై
యతులిత వీరవాక్యములయి యాదిమ పార్థివలాంఛనంబులై
ప్రతి పద నూతనంబులయి బాసిలు సూక్తులుగూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్పఁ జొప్పు బిరుదావళి సార్వవిభక్తికంబుగాన్'

(అని తర్వాత కావ్యా. చూడామణిపద్యము బిరుశబ్దంబు, ఇత్యాది ఉదాహరించి ఇట్లు వ్రాసిరి) 'బిరు' అనగా (మహారాష్ట్ర బాష యందు) విరోధము— దానిని ఇచ్చునది 'బిరుదము' అని వ్యుత్పత్త్యర్థము. ఈ పెద్దన చెప్పిన 'విరోధము' అప్పకవిచెప్పిన 'రిపుకర్ణకఠోరక' త యందుగాన్పించుచున్నది. మనకు గోచరించిన బిరుదములు ప్రాయికముగా కన్నడభాషా మిశ్రములుగా నున్నవి, 'మహారాష్ట్ర భాష' యనుట యుప లక్షకము" అని వ్రాసినారు.

మరి నాకు తెలిసినంతలో కన్నడ వాఙ్మయములో ఉదాహరణ ప్రక్రియ కానరాదు, బిరుద ప్రక్రియయు కానరాదు. తెలుగులోను ఎక్కుడు ప్రచారమునకు రాలేదు. పెద్దనాది మహాకవులెవరును ఎందుచేతనో వ్రాయలేదు. విద్యానాథుని తర్వాతి ఆలంకారికులలో సాహిత్య దర్పణ కారుడు విశ్వనాథ కవి బిరుదమణి మాలను పేర్కొన్నాడు.

శృంగార నైషధమందే కైవారమను శబ్దము రెండు మూడు చోట్ల ప్రయుక్తమైనది. 'తగుఁగైవార మొనర్ప' 1—36, 'బలభిద్వహ్నియమాపు చేతనులకుం బ్రహ్మయు నేమెల్లముం గవిభూపాలుని యొద్దఁ బాఠకుల మీకైవారదుర్భాషణంబులకుం గాని, యతండు మెచ్చఁడు, దయాబుద్ధిం బరాధీన వృత్తుల నిర్వేదం మమ్మొగావ దగు నీద్రోహంబు లోగొందగన్' ఆ 7—89. ఇచ్చట ప్రకరణము దమయంతీ స్వయంవరము ముగిసిన తర్వాత తమ తమ చోట్లకు మరలుచుండిన దిక్పాలురకు మన్మథుడు, రతీదేవి, క్రోధుఁడు, లోభుడు, మోహుఁడు, కలిపురుషుఁడు ఎదుర. పడిరి. అందుకలి పురుషుడు దమయంతీ స్వయం వరమునకు పోవుచుండెనట. అప్పుడు కలిపురుషుని సైన్య భటులు యుభయపార్శ్వంబులలో నడచుచు బట్లు అతనిని పొగడుచు వైదిక ధర్మంబును దూషించుచుండిరట. 'వాచాటులై చెట్టిభటులు వోలెఁ గర్ణకంటకంబులైన దుర్వర్ణంబులు........ గైవారంబు సేయు పాఠకులం గనుంగొని" దేవతలు దిక్పాలురు కోపింప. 'భయంబంది యవ్వంది జనంబులు' బృందారకులకు నమస్కరించి యిట్లనిరి బలభిద్వహ్ని... వంది జాతులము మా వాచాటవాటోపమునకు నల్గకుమయ్యా యనిమిషేంద్ర..." అని ప్రార్థించిరట.

ఇచ్చట కైవార శబ్దమునకు తాతగారిట్లు వ్యాఖ్య వ్రాసిరి. "కైవార—ఈ శబ్దము సంస్కృతమని సీతారామాచార్యుల వారు అభిప్రాయపడి అందులకు ఈ పద్యమునందలి ఈయుదాహరణమునే చూపినారు. కర్ణాటక నిఘంటువులలో నిది అచ్చకర్ణాటక శబ్దము గానే పఠింప బడియున్నది. సంస్కృతమందు వాచస్పత్య రాధాకాంతీయాద్యాధునిక నిఘంటువులలోగాని ఉపలబ్ధములయిన శ్లోకనిబద్ధ ప్రాక్తన నిఘంటువులలోనిగాని ప్రసిద్ధ కావ్యములలో గాని ఇది కనబడలేదు. కన్నడమందును దీనికి స్తుతియే యర్థము. 'చారణర కైవార' అను కర్నాటక భారత ప్రయోగమందును బట్టుల స్తుతి గానే యున్నది. అరవములోను ఈ శబ్దము స్తుతి పరముగా కలదు.

"అర్థమును శబ్దస్వరూపమునుంబట్టి చూడఁగా ఇది దేశ్యమయినఁ గావలయు కాదేని, 'కవివార' (కవులయవసరము—కవులు ప్రభువును దర్శించునట్టి సమయము 'నివ హావసరౌ వారౌ' అను.) అనుపదము గాని, లేక—'కవి వ్యాహార' (—కవుల భాషణములు) అను పదము ప్రాకృత మర్యాద ప్రకారము (కఇవా ఆర—కయివార—అని) మార్పులు చెందిగాని కైవారమై యుండును. ఇప్పటికిని బట్టు రాజులు కవనములుగానే స్తుతి చేయుట ప్రసిద్ధమై యున్నది. 'కైవార దుర్భాషణంబు' లనుచో ము లోపము 'నెత్తపలక' 'చప్పర మంచము' ఇత్యాదులందుంబోలె నొండె, రాహుత్తశబ్దమువలె కైవార శబ్దము సంస్కృతేతరమయ్యును సంస్కృత భ్రమచే సిద్ధసమాన మందు ఘటితమైనదనియు దానంజేసి ము లోపము కలిగినదనియు నొండె, తలంప వలయును. మఱియు (అని, మోల్స్వోర్త్,'', కెన్నెడీ గారల మరాటీ నిఘంటువు ఫజాల్—అలీ గారి పారసీ నిఘంటువులనుండి ఒకరిపక్షము లభించువాడు అనియు పగ, ద్వేషము, చెడుకోరెడు, వైరి యైన, వైరముగల మున్నగు నర్థముల నుదాహరించి, ఇట్లు వ్రాసిరి) పారసీ శబ్దములు మెండుగా మహారాష్ట్ర భాషయందు చొచ్చి యుండుట చేతను, ప్రకృత శబ్దము పారసీనుండి మరాటీలోను, అందుండి ద్రావిడ భాషలలోను రూపార్థములందు ఇంచుక మార్పులు చెంది ప్రవేశించిన దనుమతము సమాలోచనీయముగా నున్నది".

ఇందులకు అనుగుణముగా యక్షగానములలో 'కైవారము' అను నొక ప్రక్రియ కనబడుచున్నది. (చూ. శ్రీ యస్వీ జోగారావు గారి ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర 1 భాగము పు. 271)

"తంజాపూరు విజయరాఘవాస్థాన యక్షగానములలో దఱుచుగా నిది నాందిప్రాయమైన గ్రంథప్రారంభ పద్యమైనంతనే రూపక ప్రరోచన సూచనగా ప్రయుక్తమగును. ఇది ప్రాయికముగా సంస్కృత సమాస ప్రచురము, సంబుద్ధ్యంతమునై రెండేసి సంబుద్ధుల కంత్య ప్రాసము కలిగి యొక స్తోత్ర పారప్రాయమైన రచన. ఉదా —విజయరాఘవ కల్యాణమునుండి— 'పరాకుస్వామి, శ్రీ రాజగోపాల సేవాధురీణ, సీమంతినీ మోహన పంచబాణ....విజయరాఘవ మహీపాల విజయలక్ష్మీ విశాల, పరాకు, దత్తావధానుండవై చిత్తగింపుము." సంగీతరత్నాకరమున గద్యప్రబంధము వెంట 'కైవాడ' మొక ప్రబంధముగా పేర్కొన బడినది. (4—200) అందిది ధ్రువోద్గ్రాహములు గలదిగాఁ జెప్పఁ బడినది. శ్రీనాథుని భీమఖండమున గంధర్వులు 'కైవారపదాను సార కమనీయముగా ప్రావేశిక ధ్రువా గానా వళులం బరిఢవించి' రని చెప్పి యున్నాడు. అసలిది రాజుల నుద్దేశించి

వందిమాగధులు పఠించు రాజవంశబిరుద ప్రశంసాత్మకమైన గద్య విశేషముగా ప్రసిద్ధము"

ఇందువలన తాతగారూహించినట్లు ఇవి కవి గద్యలు—అనగా కవి వ్యాహారములు. 'వచనము లేక గద్య' అను శీర్షిక క్రింద శ్రీ జోగారావు గారు, దీనికి ముందరి పుటలో నిట్లు వ్రాసియున్నారు. "యక్షగానములందు వచనము సంధి ప్రయోజనాత్మకముగను, పాత్ర సంభాషణములందును వర్ణన సందర్భములందును గూడ ప్రయుక్తమైనది కొన్ని యక్షగాన గ్రంథాంతములందు కవిగద్యలు గలవు. తంజావూరు యక్షగానములందు గొన్నిట గ్రంథాంత గద్య కవి విషయకము. కృతి పతిశుభాశంసనపురస్సరమునై 'భరత వాక్య' మను పేర నున్నది."

అని తర్వాత 'యక్ష గానములందు ప్రయుక్తములైన గద్య ప్రబేదములలో విశిష్టములైన వాని నీక్రింది విధముగ పరిగణింప నగును' అని ఈ క్రింది వానిని పేర్కొన్నారు. (1) చూర్ణిక, (2) కైవారము, (3) విన్నపము, (4) ముచ్చట, (5) కొరవంజి గద్దె, (6) ప్రాసవచనము. వీనికి సంగీతముతో గల సంబంధమును తెల్పినారు. 'సంగీత రత్నాకరమందు గద్యమొక ప్రబంధముగాఁ బరిగణింప బడినది అందు 'గద్యం నిగద్యతే ఛందోహీనం పదకదంబకః' అనియు 'చూర్ణం శాంతేరసే పీతం గాతవ్యం బ్రహ్మదైవతమ్, వైదర్భీ రీతి సంపన్నం సాత్త్వతీం వృత్తి మాశ్రితమ్." అని చెప్పబడినది. (4—185, 186) ఈ చూర్ణ శబ్దము యొక్క రూపాంతరమే చూర్ణిక అనేక యక గానములందు చూర్ణికకుఁ ప్రసక్తి గలదు గాని యుంచుమించు అన్నిట నది సంస్కృత కేవలముగ నున్నది" కైవారము పూర్వోక్తమే. "విన్నపమొక గద్య ప్రభేదముగా తాళ్లపాక కవుల కాలమునుండియు పరిగణింప బడుచు వచ్చుచున్నది..... ...ఒక విధమైన యొడుపుతో, తూగుతో నడచునట్టిది'.. ముచ్చట—"ఇదియు నొకవిధమగు తూగు గల గద్య విశేషము .....అంత్యప్రాస విశిష్టమై యుండును". కొరవంజి గద్దె—'ఎఱుకత చెప్పు సోదెనే గద్దె యనియు నందురు. అనగా నది సోదె చెప్పునప్పుడొక కూనిరాగపు టొడుపుతో జదువు గద్యయే." ప్రాసవచనము—'....పాదనియతియుఁ ప్రాసనియతియు గన్పట్టుచున్నవి. చరణములు గణబద్ధములు గావు కాని మాత్రల పరిమితి సుమారులో సరిపోవు చుండును ఒక్కొక్క చరణము రమారమి నడిమికి రెండు దళములుగా విరుగును అట్టియతి పాటింపబడును. అంత్య ప్రాస నియమములేదు.

ఇందువలన భారతదేశమందే అతి ప్రాచీన కాలమునుండియు రాజులను పొగడుటకు వందిమాగధులు, బట్రాజులు, వివిధ కవితా ప్రక్రియలను కల్పించుకొని స్తోత్రపాఠములు చేయుచుండిరనియు వానిలో కైవారమొక విశిష్టమైనదే గాక అన్నిటికిని కూడ మొదటిదో లేక సామాన్య వాచకముగా నుండెనో యనియు తోచుచున్నది. కైవారమును పొగడుట అను నర్థమున శ్రీనాథుడు శృంగారనైషధమున పెగడన్న దండనాయకుని గురించి ప్రయోగించి యున్నాడు.

మ. తగు గైవారమొనర్ప విక్రమ కళా
ధౌరేయతా శాలి శ్రీ
పెగడన్న ధ్వజినీశుఁ.........
కిన్నరదంపతులు మన్మథుని విజయములను పాడిగటి.
(శృం. నై. ఆ 7 ప. 163).

శా. చూడాహేమ విటంక కోణములయం
దుల్మొట్టి యొవ్వారికిం
జూడం గాళ్ళ వడుంకు నన్నెలవునం
జోద్యంబు వేద్యంబుగాఁ
బాడుంగోమల పంచమస్వరమునం
బంచేషు శౌర్యాంకము
క్రీడా కిన్నరయుగ్మముల్ నఖర పా
ళిం గిన్నెర మీటుచున్."

'పంచేషు శౌర్యాంకముల్ = మన్మథుని పరాక్రమబిరుదములను' అని సర్వంకష వ్యాఖ్య.

ఈ కైవారాది స్తోత్ర పాఠములకును యక్షగానములకును ప్రారంభదశలో చాల దగ్గర సంబంధము కనబడుచున్నది. యక్ష గంధర్వాదుల సంగీత ప్రావీణ్యమును వారు దిక్పాలురను స్తుతించుటను అతిప్రాచీనములనుట నిర్వివాదము, జగత్ప్రసిద్ధము. చూచినంతలో ఉదాహరణముగాని, కైవారము, బిరుదావళిగాని చాటు ప్రబంధములలో ఏదిగాని, అన్నిగాని స్తోత్రము చేయుటకు ఏర్పడినవనుట చక్కగా తెలియు చున్నది. పైగా ఈ ప్రక్రియలు దండ్యాది ప్రాచీనులు చెప్పక విద్యానాథుడు చెప్పుట చేతను. సంస్కృత వాఙ్మయమం దెవరి రచన గాని ప్రాచీనము దొరకనందునను, 'ప్రాకృతాదులనైనన్' అని పెద్దన చెప్పుటచేతను ఇవన్నియు ప్రాకృతదేశి రచనలుగా నుండియుండును. కాళిదాసు రఘు విక్రమోర్వశీయములలో రెండు చోట్ల పరాక్రమ వర్ణనగాను, సంకీర్తనగాను నిర్దేశించి, ఉర్వశి ప్రేమ లేఖను కూడ ఉదాహరణమని చెప్పి దానిని ప్రాకృతమున వ్రాయుట చూడదగినది. ఉదాహరణ భేదములు పెక్కులు కలవని పెద్దన చెప్పిన దానిని, ఈ ఈయుర్వశి ప్రాకృత పద్యమును చూడగా ప్రార్థనగా కూడదవి రచన సాగింపవచ్చునని తోచుచున్నది. కాళిదాసు కంటె అర్వాచీనుడు దండి క్షుద్ర కావ్యములను గురించి చెప్పకపోవుటకు కారణము అవి ప్రాకృత కావ్యమార్గములుగా నుండి యుండును ఓరుగంటివాడుగాన విద్యానాథుడు చెప్పెనేమో గాని, అతనికి తర్వాతి వాడు ఓఢ్రుడు విశ్వనాథ కవిరాజు కూడ ఉదాహరణమునుగాని క్షుద్రకావ్యములనుగాని చెప్పక ఖండకావ్యములను గద్యకావ్య భేదములలో ముక్తకము. వృత్త గంధి చూర్ణకము ఉత్కలికా ప్రాయములను నాలిగింటిని చెప్పివదలి నాడు. గద్యపద్యములు యగు రాజస్తుతి బిరుదమనబడు నన్నాడు. అంతే. కావ్యబేదములను చెప్పునప్పుడు ఒక పద్ధతి కానరాదు. జాపితాలుగా నుండును. కావ్యాలంకారచూడామణి కారుడే వీనిని ఒక ఏర్పాటునకు సమకూర్చినవాడు, విశదముగా తెలిపినవాడు.

చాటు ప్రబంధములకు తోడుగా మనము యక్షగానమును కూడ చేర్చుకొనవలయును యక్షగానములు నన్నయ తిక్కనల కాలమునగాని, ఎఱ్ఱన కాలమునగాని లేక తర్వాత మన తెలుగులో కనబడుచున్నవి. కాకతీయ రాజులలో గణపతి చక్రవర్తి తర్వాత సామ్రాజ్యము విస్తృతమై ఓరుగల్లు మహానగరము ఎల్లవారిని భారతీయులను ఆకర్షింప సాగినది. అప్పటి ప్రజారంజక ప్రదర్శనములలోని

కొన్ని ప్రక్రియలు క్రమముగా యక్షగాన రచనకు, దారి తీసినట్లు కనబడుచున్నది. దీని పుట్టుపూర్వోత్తరములను గురించి ఇచ్చట చర్చించుట అనవసరము. ఇదివరకే పండితులు చర్చించి యక్షగాన మొక 'కేవల దేశి రచన కాదనియు సంస్కృత ప్రాకృత వాఙ్మయముల నుండి మనవారు గ్రహించి పెంపొందించిన దృశ్యప్రబంధ విశేష మనియు దోచెడిని' (నే. వెం. దాక్షిణా. సాహి. పు 111) అని అభిప్రాయ పడి యున్నారు. కావ్యాలంకారచూడామణి కారుడు, శ్రీనాథుని సమ కాలికుడు దీనికి లక్షణము చెప్పడు. చాల తర్వాతివాడు అప్పకవి చెప్పుట ఆశ్చర్యము! శ్రీనాథుడు యక్షగానమును చక్కగా ఎఱుగును. ఇందువలన లక్షణ గ్రంధముల కెక్కుటకు తగిన అరతి ఈ కావ్య ప్రక్రియకు నాటికింకను రాలేదనియు, ఇది యొక ప్రజారంజక గానముగా మాత్రమే నాటి కుండిన దనియు, అప్పకవి నాటికి నాటక ప్రదర్శనము వంటిదిగా మారినను దాని ప్రారంభ దశను జ్ఞప్తి యందుంచుకొన్న కవి సంప్రదాయమును 'తుదనేడు లఘువులు' అను సీసమున నాతడు తెల్పెననియు తెలియుచున్నది. ఇది రగడభేదముల చేకూర్చవలయునట. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ ఉదాహరణ వాఙ్మయములో నిట్లు వ్రాసియున్నారు. (ద్వి. ము. పు. 17.)...'యక్ష గానములకు నీయుదాహరణములే మూలమని చెప్ప నొప్పును. ఉదా హరణములలో నియతముగా బ్రయుక్తములగు రగడలు యక్షగానమున కొలది మార్పులతో నుపయుక్తములగును. అప్పకవి యీ విధానము నిట్లు తెలిపినాడు' అని 'తుదనేడులఘువులు' పద్యము నుదాహరించి నారు. 'పై రగడలు తాళమున కెట్లు సరిపోవునో 'చందస్సు— రగడలు' అను శీర్షిక క్రింద (పు. 70) వివరించినారు. 'ఉదాహరణమున నుపయుక్తములగు రగడలు... ప్రాచీనకాలము నుండి యున్నట్లు తెలియుచున్నను వీనికి తెలుగులో ప్రథమచ్ఛందోగ్రంథమని చెప్పబడు కవిజనాశ్రయమందు లక్షణములేదు. కావ్యాలంకార చూడామణిలో లక్షణ మసమగ్రము. రగడలను గూర్చి విపులముగా చెప్పినవాడు అనంతుడు..' అని వీనికి సంగీతము తోడి సంబంధమును, తాళవిధానాది కమును చెప్పి, ఇట్లన్నారు 'రగడలు నన్నయభట్టు భారతమునను,, నన్నిచోడుడు కుమారసంభవమున నుపయోగింపకపోయినను తరువాతి కవులు వీనిని.. వాడుక చేసిరి. రగడలు కన్నడమున క్రీ. . 840 ప్రాంతముననే వర్ధిల్లుచున్నట్లు కవిరాజ మార్గము తెలుపుచున్నది. క్రీ. శ. 940 లో పంపమహాకవి.. క్రీ. శ. 990 ప్రాంతమున నాగవర్మ ఛందోంబుధియందు.. (కలవు). తెలుగున.. కవిజనాశ్రయమున... లేవు... 1402 కావ్యాలంకారచూడామణిలో నలతిగను.. 1435 లో అనంతుని ఛందస్సున సంపూర్ణముగను విపులముగను నీరగడలకు లక్షణము చెప్పబడినది. దాని ననుసరించియే తరువాతి వారును లక్షణములను రచించిరి. 'సంస్కృతమున రగడ ప్రచారమునలేదు. ఇది దాక్షిణాత్య సంస్కృత కావ్యముల యందు మాత్రము కన్పట్టుచున్నది. క్రీ శ. 9వ శతాబ్ది నాటి సోమదేవసూరి 'యశస్తిలక' చంపువున రగడలు కలవు. ఇవి దేశియచ్ఛందో విశేషము లగుటచే కేవల సాంస్కృతికుడగు యశస్తి లక వ్యాఖ్యాతకు వీనివిశిష్టత గోచరింపలేదు... రగడలు తొలుత శాసనములందు ప్రయుక్తములైనవి. కన్నడదేశమున చాళుక్య శాసనము లలో నివి గానవచ్చుచున్నవి. తెలుగు దేశమునను తొలుతనిది..రాజరాజ నరేంద్రుని కోరిమిల్లి శాసనమున గుర్తించితిని. ఇది సంస్కృత భాషామయమైనను దేశిరచన యగుటచేతను మనము ముఖ్యముగా పరిగణింపదగినది. ఇది కావ్యములలో తరువాత ప్రయుక్తమగుట చేతనే, దీనిని దేశి రచనా క్రింద పరిగణింప వలెననియు, నవియే ప్రత్యేకముగ నుపయుక్తములగుటచే, నుదాహరణ రచనము కావ్యరచన కంటె ప్రాచీనమనియు స్పష్టమగుచున్నది.. నన్నయ నన్నెచోడు లిరువురును దానిని గ్రహింపకపోవుట యాశ్చర్యకరముగ నున్నది. 'కాని యాయానాటి కవి యింకను గేయప్రదానములై యుండి యుదాహరణముల కెక్కి యుత్తమకావ్య వాఙ్మయమున ప్రయుక్తము కాలేదని యూహింపనై యున్నది.'

తర్వాత వాఙ్మయ చరిత్రమున వీనిని ఎట్లు మనవారు ప్రయోగించిరో వివరించినారు. 'ఆంధ్ర ఛందస్సంప్రదాయములలో ద్విపదలకు వలె రగడలకు నొక ప్రత్యేక విశిష్ట స్థానము గడించిన వాడు పాల్కురికి సోమనాథుడు. ఈతడీ ఛందస్సును కన్నడము నుండి గ్రహించి కన్నడమున యతిని యతిలేని యాఛందస్సునకు యతి నియతి గల్పించి సమానవర్ణాద్యంత ప్రాసలను నిర్ణయించి దీనినొక మనోహర గేయ ఛందస్సుగా తీర్చి దిద్దినాడు. తాను ప్రత్యేకముగ కన్నడమున తెలుగున రగడలు వ్రాసినాడు. ఆతని గద్యకృతులన్నియు రగడలే.'' అని వివరించి నారు. ప్రకరణము చివర రగడలను తెలుగు కవులు ఏయే సందర్భములో ప్రయోగించిరో తెలుపుచు 'ఇవి పద్య ప్రబంధముల యందే యుండుననియు రగడలు తాళాంగ ప్రధానములై సంగీతమున కనువైనను నివియక్షగానములలో కను పట్టవు. దీనికి కారణము రగడ లుదాహరణములలో నక్షరగణయుక్తములగు చంప కోత్పలమాలికాది వృత్తములతో పాటు ప్రయుక్తములైనవి. అనగా వానికి సంగీత కృతులలో ప్రాధాన్యములేక సాహిత్యకృతులలో నున్నదని యర్థము.''

ఇచ్చట వింత యేమనగా వెంకటరావు గారు చెప్పిన దానికి విరుద్ధముగా 'ఆదినుండి యనేకాంధ్ర యక్షగానములందతి ప్రచుర ముగా కనుపట్టుచున్న జంపె త్రిపుటాది తాళలయాశ్రములగు రచన ములను మన లాక్షణికులు రేకులనియు నవి వివిధ రాగ విస్తృతులనియు గుర్తించిరి' అని శ్రీ యస్వీ జోగారావుగారు వ్రాసియున్నారు. (ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర (పు. 225.) 'ఇవియే ప్రాచీనకాలమున ప్రసిద్ధములై యుండిన జక్కుల రేకులై యుండవచ్చును..ఈ రేకులు మూలప్రకృతి యగు రగడ ప్రాచీన కన్నడ లాక్షణికుడగు నాగవర్మ (క్రీ. శ. 12వ శతాబ్ది) పేర్కొనిన 'రఘుటాంబంధ'మే కావచ్చును.'

ఇచ్చట జోగారావుగారి అధోజ్ఞాపిక (ఆం. య. వా. చరిత్ర పు 225) ''ఇవివైతాళీయ జాతులనియు (అనగా దేశీయగీత ప్రబంధము లని యర్థము) రగడ యొక చాటు ప్రబంధమనియు మన లాక్షణిక మతము. (చూ. కావ్యాలంకార చూ 4—40) లక్షణసార సంగ్రహము 2. 128—140 అప్పకవీయము 1. 30, 4. 290. అప్పకవి మతమున రగడయేకాదు గద్య, ద్విపద, మంజరి దండకము మొ ... చాటు ప్రబంధములే.''

యక్షగానము యొక్క పుట్టుపూర్వోత్తరములనుగాని, ఉదాహరణము యొక్క మూలముగాని నేనిచ్చట చర్చించుటకు ప్రయ

ళ్ళింపను. నాకు కావలసినది యక్షగానమునకు మూలాధారమైన ఛందస్సంప్రదాయముగాని దీనితో అత్యంత సంబంధముగల ఉదాహరణాదులుగాని అన్నియు నిట్టి సంబంధములేగాని నామమాత్రము మహాప్రబంధములు గానముటయు ఇంకను ఈవిధమైన వాఙ్మయము నన్నయ తిక్కన ఎఱ్ఱనల కాలమున తెనుగు కవులు చేపట్టలేదు. తిక్కన తర్వాత ప్రతాపరుద్ర చక్రవర్తి కాలముననే ఉదాహరణ ప్రక్రియకు లక్షణమును రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణమును పాల్కురికి సోమనాథుని బసవోదాహరణమును కనబడుచున్నవి. సోమనాథుడు, ప్రతాపరుద్రుని కాలమువాడు గాని అంతకుముందు వాడనుట కుదురదు. అంతకుముందీ వాఙ్మయ శాఖకు నిదర్శనము లేవు. శ్రీనాథుని కాలము నకు చక్కగా దేశమున ప్రచారమునకు యక్షగానముతో పాటు వచ్చినవి.

మరి ఇవి సంస్కృత రచనలు కావు దేశిరచనలని మన విమర్శకులు యొప్పిపోయిరి. దేశియనగా నేమి? వెలుగని వెంకటరావుగారి తలంపు. "నేడు మనకు లభించిన నాలుగు సంస్కృతోదాహరణములు ఆంధ్రోదాహరణ లక్షణలక్షితములై యున్నవి. కావున, నుదాహరణములు మార్గదేశి కవితా భేదమున రెండు దెఱుగులుగా నేర్పడిన 'కవితా పథము' లలో తెలుగున దేశికవితా శాఖలో ప్రత్యేక విశిష్టత గలవిగా నెన్నవగును. సంస్కృతమువనే రేకపోయినప్పుడు పేశభాషలలో లేకుండుటలో నాశ్చర్యములేదు. తెలుగు కన్నడములందు సాహితీ రీతులను వెలయించిన ద్రవిడ కన్నడ భాషలలో నివిలేవు. తరువాత సారస్వత స్థానమందిన మళయాళ మహారాష్ట్ర, ఘూర్జర భాషలలో నివిలేనేలేవు. కావున భారతీయ దేశ భాషలలో నొక స్వతంత్ర విశిష్టశాఖ వెలయించిన గౌరవము తెలుగుదేయని నిశ్చయముగా చెప్పవచ్చును."

తెలుగులో రచనలు కానవచ్చి ఇతర భాషలలో లేకపోయినంత మాత్రము చేత ఈ భాషా ప్రక్రియలు, కవితా రీతులు పూర్తిగా తెలుగువారి హృదయములలో మొలకెత్తి అభివృద్ధియైనవని చెప్పుటకు సాధ్యపడదు.

ఆంధ్ర వాఙ్మయము మీద తిక్కన కాలమున ఓరుగంటి ప్రభావము ఇంతదనియన రాక ఒక ఉప్పెనవలె వచ్చి అనతికాలముననే, తత్పూర్వమెన్నడును లేని అభివృద్ధికి కారణమైనది. గణపతి చక్రవర్తి నెల్లూరివఱకు జైత్రయాత్ర జరిపి నెల్లూరి మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడు కాగా నాతని పునఃప్రతిష్ఠితుని చేసెనదియు, ఈ సందర్భమున తిక్కన సోమయాజి ఓరుగంటికి పోయి తన యాంధ్ర మహాభారతమును గణపతి చక్రవర్తికి వినిపించి ఆ చక్రవర్తి యొక్క రాకకు కారణ భూతుడైనదియు చరిత్ర ప్రసిద్ధము. ఈ కాలమున దక్షిణాపథమున లెక్కలేని రాజకీయము లేర్పడినవి. తిక్కన గతించిన ఇరువది మువ్వదేండ్ల కాలమున నుండిన తన తాత పెద్దయామాత్యుని కవితా నైపుణ్యమును తిక్కన వర్ణించి నాడు,

"సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
ఘటికలో నొక శతకంబుఁ జెప్ప
చిత్ర చతుర్భద్ర చతురుత్తరాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
[illegible]

కావ్యవర్గము జెప్పగా ప్రబంధంబులు
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప
నెల్లవిద్యల నంచు తెలుఁగనేర్తు
ననుచు నెల్లూరి తిరుకాళమనుజ విభుని
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెరసి
మహిమ గాంచిన పెద్దయమాత్యునకు"

ఇదంతయు మహారాష్ట్ర సంస్కృతి ప్రభావమని నాకు తోచు చున్నది. ఇదునిక మహారాష్ట్ర భాషయు దాని యభివృద్ధియు ఎంత అర్వాచీనములైనను ఆ జాతిలో అనాదిగా నొక సంస్కారముండి యుండవలెను. దాని ప్రభావము దక్షిణాపథమున లేని మీదను, బొత్తిగా లేకపోవునా. ఆ జాతి కొన్ని శతాబ్దములు నిద్రాణముగా నుండినదా. ప్రాచీన శాతవాహనుల కాలమున ఆంధ్రులతో అభేద ప్రతిపత్తితో నుండి సప్తశతిలో భాగస్థులైన మహారాష్ట్రులు, ఏమైపోయిరి. వాస్తవముగా ఆంధ్రులలో లీనమైపోయిరి. 'పాలును నీరునులాలె నెమ్మమై' నుండిరి. మరాఠీ భాష తర్వాతిదే. ప్రాచీన కాలమున ప్రాకృత భాషా శబ్దజాలములోనే గాని వ్యాకరణాంశము లలో అంతగా కానరాక పోవుట వాస్తవమే. కాని తెనుగు ప్రాకృత నుండి పుట్టిన దనుభావము మనవారికి అనాదిగా నున్నది. విన్నకోట పెద్దన, శ్రీనాథుని సమకాలికుడు, తన కావ్యాలంకార చూడామణిలో వ్యాకరణ ప్రకరణమున 72వ పద్యము.

తెలుగుం బ్రాకృత భంగిన
బలియుటచే నేకవచన బహువచన పదం
బులె కాని ద్వివచనంబులు
గలుగవు దత్క్రియలు గారకంబుల యందున్.

అని తెలిపినాడు గదా. తత్సమ తద్భవములు, ప్రాకృత సమప్రాకృత భవములు మన వ్యాకరణములలో స్పష్టములే. అనంతర వాఙ్మయ మభివృద్ధియైన కాలమున తెలియదు గాని చాటుకృతులలో ప్రాకృత ప్రభావము కలదనియు, బిరుశబ్దము మహారాష్ట్ర భాషయనియు కావ్యాలంకారచూడామణికారుడు చెప్పిన దానికర్థ మేమో అంతలావు గ్రంథమును ఉదాహరణవాఙ్మయము మీద రచించిన పరిశోధకపరమేశ్వరుల దృష్టి నాకర్షింపకపోవుట యాశ్చ ర్యము. ఉదాహరణములను 'సుమనోవాసం బొలుపుగ చమరింపుడు కవులు ప్రాకృతాదులన్నైనన్' అన్న వాక్యమును గురించి ఒక్క యక్షరము కూడ వ్రాయలేదు. బిరుదావలికిని ఉదాహరణమునకును బొత్తిగా సంబంధము లేదా? దానిని కూడ సార్వవిభక్తికముగా వ్రాయ నలెనని పెద్దన చెప్పినాడే దానికే మర్మము? ఉదాహరణ బిరుదావళుల పరస్పర సంబంధమును గూర్చి పరిశోధించినట్లు కాన రాదు. స్పష్టముగా, దెబ్బకొట్టినట్లు పెద్దన చెప్పుచుండగా ఉదా హరణాదులు తెలుగువారే తయారు చేసిరి, ఇతరుల వద్ద నేర్చుకొన్నది కాదని వ్రాయుట విశ్వసింపదగియుండ లేదు. మహారాష్ట్ర భాషలో గాని తదితర వాఙ్మయములలో ప్రత్యక్ష నిదర్శనములు లేనంతమాత్రమున ఆ వాఙ్మయమున నవిపుట్ట లేదనుట సరికాదని తోచుచున్నది.

అసలు కాళిదాసే 'ఉదాహరణ' ప్రసక్తి చేసినాడని వీరు గుర్తించి యున్నారు. కాళిదాసు కాలమును గురించి ఎన్ని భిన్నాభిప్రాయము లున్నను అతడు గుప్త చక్రవర్తుల కాలమున, క్రీ. శ. నాలుగైదు శతాబ్దుల సంధికాలమున నుండెననుటయే సాధువు. ఇది చరిత్రకారుల విశ్వాసము కూడ. దానికి తోడు అతడు ఆంధ్ర శాతవాహనులను చెప్పడు. ఇందుచే క్రీ. పూ. 240కి, ఆంధ్రులకు ముందువాడైనను కావలెను. ఇది కుదురదు. నాటికి మౌర్యులున్నారు. హూణులు రాలేదు. హూణుల రాక క్రీ. శ. 300 లేక 400 ప్రాంతము. ఆంధ్రులును కి తర్వాత 240 కి లేరు. ఐహోలె శాసనమున (క్రీ. శ. 634), కవితా శ్రిత కాళిదాసు భార కీర్తిః' అని ప్రశస్తిగన్న వానికి తటాలున ప్రసిద్ధి వచ్చియుండదు. కాబట్టి, అంతకు ఒక శతాబ్దమో అంతకు కొంత మించియో పూర్వుడై యుండవలెను. పైగా కాళిదాస విక్రమోర్వశీయ మందు పాటలకు మహారాష్ట్రిని అతడాశ్రయించుటయు, అందలి చతుర్థాంకము మన తర్వాతి యక్షగానముల తీరున నుండుటయు ముఖ్యముగా గమనింపవలసిన విషయములు. ఉదాహరణము కీర్తి ప్రఖ్యాపనకైన జయోదాహరణమని అతడు స్పష్టముగానే వ్రాసి యున్నాడు. వీనిని చూడగా ఉదాహరణాది చాటు కవితా రీతులు, కాళిదాసు కాలము నుండియే కలవనియు, వీనిని ఎక్కువగా మహారాష్ట్ర ప్రాకృతములో వ్రాయుచుండిరనియు తలచుట తప్పుగాదు.

మఱియొక విషయము సంస్కృత నాటకములలో పాత్రోచిత భాషా ప్రయోగాదికములను చెప్పు భాషా విభాగ ప్రకరణమున 'అనీచులును పండితులును నగు పురుషులకు (భాష) సంస్కృతము, అట్టి స్త్రీలకు శౌరసేని ప్రయోగింప వలయును, ఆ స్త్రీలకే గాథలయందు మహారాష్ట్రిని ప్రయోగించునది....' ఇత్యాదిగా కలదు (చూ. సాహిత్య దర్పణము 6వ పరిచ్ఛేదము. 434 సూత్రము పూ. తాతగారి అనువాదము) మరి స్త్రీలచే గాక ఉన్మత్తపురూరవసుని కని చతుర్థాంకమున కాళిదాసు గాథా ఛందస్సును ప్రయోగించి నాడు. భరతనాట్య శాస్త్రమందును సంగీత శాస్త్రమందును పరిశోధించిన యక్షగాన ఉదాహరణాదులందలి సంప్రదాయములన్నియు సంగీత మందలి మార్గదేశి సంగీత సంప్రదాయాను సరణములేగాని తెనుగు వారి కల్పనలు గావు. ఎంతవరకు తెనుగుతనమునగా ఆ ప్రాచీన సామగ్రిని గ్రహించి క్రమముగా రాయల యుగమునకు సంస్కృత నాటకముల మీద జనులకు మోజ తగ్గిపోవు కాలమునకు, జనబాహుళ్యమున కొక నాట్య సంగీత రూపకకల్పన చేయుట మాత్రమే.

మహారాష్ట్ర భాషలోను లేక ఆ జనులలో ఈ సంప్రదాయాదు లుండిన యెడల వారు వ్రాసియుండరా, మరికావ్యరచనయే కానరాదే అన్న, వాస్తవమే. ప్రాచీన మహారాష్ట్రి అంతరించి మరాఠీ వచ్చు నప్పటికి చాల మార్పు ఏర్పడినది. మహారాష్ట్రులందరును కొంతకాలము అప్రసిద్ధులై యుండి తర్వాత తలయెత్తిరి. అనేకులు ఆంధ్రదేశ మునకు వలసలు వచ్చి తమ కవితా సంప్రదాయములను తెలుగు వారికి అందిచ్చి ఆంధ్రభాషా వికాసమునకును వాఙ్మయాభివృద్ధికిని తోడ్పడి ఆంధ్రులై పోయిరి. పైకి కానరాక అంతర్లీనముగా నిడనలె నుండు ఆంధ్ర మహారాష్ట్రుల చరిత్రను పరిశోధించుట ఆంధ్రులకు కర్తవ్యము. ఇది రెండుగా విభజింప వలెను. (1) మరాఠీ భాషాభి వృద్ధి (2) ఆంధ్రదేశమునకు మహారాష్ట్రుల రాక.

(1) తెనుగు భాషాసమితి, సంస్కృతి సం. 3 లో మహారాష్ట్ర వాఙ్మయ ప్రభావమును గురించి (పుట 638) శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు గారిట్లు వ్రాసినారు. "ప్రాకృతభాషా భేదముల ములలో మహారాష్ట్రి' యు యొకటి గలదు. అది శృంగారబహుళమైనదట. అమృతమయమట! దానిని జదువనివారికి 'బువువిల్లు శాస్త్ర మర్మము' వివరించుటకే యధికారము లేదని యా కవుల నవాలు. కవి వత్సలుడైన హాలచక్రవర్తి ప్రాకృతగాథలను సేకరించి యొక స్వరూపము గొనగి పుణ్యము కట్టికొనెను. హాలుడు ఆంధ్రుడు .........మహారాష్ట్రిని అతడు రాజభాషగను గౌరవించెను. ......నాడు ప్రాకృత భాషా పాండిత్యము లేనివాడే అరుదు.... .గాథా సప్తశతియందు నిండుగా పుంజుకొన్నది ఆంధ్రజీవనమే.. నేటి మరాఠీకి 'మహారాష్ట్ర' ప్రాకృతమే మూలభాష కనుక నా వాఙ్మయమునకు పురుడు తీర్చిన అదృష్టము పూర్తిగా కాకున్నను సగ పాలునకు పైగా మనది ....ఆంధ్రమునకు వలెనే మరాఠీకిని పదునొకండవ శతాబ్దము వరకు సరియైన స్వరూపములేదు. 'అది యును మన తెలుగు వలె గాసట బీసటగానే యుండినది. నాటివిగా మనకు కన్పించునవి కొన్ని పాటలును సామెతలు మాత్రమే...... జైన బౌద్ధములు తెనుగు నేలపై వలెనే యచటను తాండవించెను. ...పాలకురికి సోమనాథుడు కొన్ని మహారాష్ట్ర భక్త చరితములను వర్ణించెను. ఆనాడు ప్రాకృత మహారాష్ట్రములకు అంత భేదము లేదు. కనుక అతని కా భాష వచ్చి యుండును. జైన బౌద్ధుల వలెనే వీరశైవులును మత వ్యాప్తికి సామాన్య ప్రజల భాష నాశ్రయించుటయే కీలకమని నమ్మినవారు గదా.."

చూడగా మహారాష్ట్ర భాషలో వాఙ్మయము ప్రాచీన కాలము నాటిది లేక పోయినను ఆ భాష ప్రజా బాహుళ్యము యొక్క వాడుకలో దక్షిణా పథములోనుండి ఆంధ్రదేశముమీద తన ప్రభావమును చూపినదని పండితుల యభిప్రాయమని తెలియుచున్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1962లో ప్రకటించిన దక్షిణ భారత సాహిత్యములు అను చిన్న పుస్తకమున మహారాష్ట్ర సాహిత్యము మీద సంగ్రహముగా నొక వ్యాసము శ్రీ గుండేరావు హార్కారే గారిది 75 పుటలది కలదు. ఇట్లు వ్రాసియున్నారు. "పరిశోధకుల యభిప్రాయము ననుసరించి ప్రస్తుత మరాఠీ భాష సంస్కృతము, పాలీ, అర్ధమాగధి, పైశాచి, మహారాష్ట్రి యను నైదు భాషల యపభ్రంశ స్వరూపముల సంయోగము వలన నుద్భవించిన దని తెలుచున్నది."

"పదియవ శతాబ్దము నాటి యపభ్రంశ స్వరూపములైన మహారాష్ట్ర జైన మతగ్రంథములలో మరాఠీ శబ్దము లధికముగా నుండుటవల్ల నిట్లూహించుట కవకాశమెక్కువగా నున్నది కాని మరాఠీ భాష యపభ్రంశము వల్లనే యేర్పడిన యపభ్రంశ రూప మని మాత్రము నూహింప గూడదు. ఏలనన, ఎన్నియో ప్రాకృత

భాషల వల్లను విదేశీయ భాషల వల్లను జన్మించిన మరాఠీ భాషలో సంస్కృతీకరణము గూడ నొక విశిష్టమైన ముఖ్యాంశము.'

"ఈ భాష యొక్క కాల నిర్ణయము— శిలా తామ్ర శాసనములు— ప్రాచీన గ్రంధములు—(1) ఉద్యోతనసూరి 7వ శతాబ్ది కువలయమాలలో మరాఠీ పదములు— (2) శా. శ. 1139 (క్రీ. శ. 1127) సోమేశ్వరుని మానసోల్లాసము (అభిలషితార్ధ చింతామణి) లో కొన్ని మరాఠీ శబ్దములున్నవని వి. ల. భావేగారు..... కాని దీని వల్ల కాజాలదని కొందరు.... బౌద్ధమతము—మత విషయిక విప్లవములు— వైదిక, ధార్మిక, సంప్రదాయములలో మార్పులు గోపరాష్ట్రము— నల్ల రాష్ట్రము— పాండు రాష్ట్రము—అపరాంత— విదర్భ— అశ్మక మొద— క్రొత్తగా ఆ కాలముననే— బహుశా అప్పడే ఈ మహారాష్ట్రమును సంకేత శబ్దము పుట్టియుండ వచ్చును. క్రీ. పూ. నుండియే వాడుకలోనికి వచ్చినది— వాత్స్యాయనుడు— వరరుచి—హ్యూఎన్‌త్సాంగ్—దండి—రచనలలో మహారాష్ట్ర శబ్దము — మహా కాంతారమునుండి మ. రా. పదముద్భవించినదని పి. వి. కాణే గారు. మహర్ + రట్టనుండి అని మరి కొందరు" (చూ. పులకేశిని ఐహోలె శాసనము — "అగమ దధిపతిత్వం యోమహారాష్ట్రకానాం నవనవతి సహస్ర (199000) గ్రామ భాజాం త్రయాణాం")

"(కర్ణాటక) గంగరాజమంత్రి చాముండరాయుడు—శ్రావణ బెళగోళని 'బాహుబలి' లేక, గోమటేశ్వరు'ని శిలా విగ్రహము క్రీ. శ. 98 లో శిలాశాసనమునందలి మొదటి వాక్యము 'చాముండ రాయే కరవియలే" (చాముండ రాయడు చేయించెను) మహారాష్ట్ర భాషలో దీని కంటే పూర్వము శ్రీ శ. 736 లోని యొక తామ్ర శా చికుర్డే గ్రామున—మరాఠీ పదములు కలవని శ్రీ రాజవాడే గారు"

"7—8. శతా. వాదము రూఢి."

"జ్ఞానేశ్వరుడు తన గీతాభాష్యమున.. మరాఠీ శబ్దమును మలబార్థములో వాడి యున్నాడు."

"ఈ మరాఠీ భాషాభివృద్ధికి భక్త కవులు, పండితకవులు సంప్రదాయ ప్రవక్తలు — బహువిధముల తోడ్పడియున్నారు.—భక్తిజ్ఞాన వైరాగ్యములు— ముకుందరాజు (1128—1198) ఆదికవి. ఇతనికి పూర్వమే నాథ సంప్రదాయము— పారిభాషిక పదములు—తరువాత మహానుభావ సంప్రదాయము — తాత్త్విక—భక్తిజ్ఞాన—పారిభాషిక పదములు— తరువాత జ్ఞానదేవుడు— నామదేవాదులు— భక్తిసాహిత్యము—"

'మహమ్మదీయుల దండయాత్రలు—కరువు కాటకములు— వాఙ్మయాభివృద్ధి కుంటుపడి పోయెను.... ఐనను ఏకనాథుని, ప్రచారము.... తుకారాం...."

'ఇంతవరకు...... రాజపోషణ బొత్తిగా లేదు......భిక్షాటనము— పారమార్థిక దృష్టి— దేశాటనము— పోతన వంటి వారు—దేవగిరి యాదవ రాజ రామదేవుని యాస్థానములో నున్న నరేంద్రకవి వాణీ విక్రయము నంగీకరింపక.... దేశమును గూడ వదలి వెళ్లి పోయెనట."........

'యాదవవంశపురాజులు — రెండు శాఖలు — దేవగిరిదౌలతాబాదున— సేవుణ ఉత్తరమున — రెండవది హొయసల—కర్ణాటకమున ద్వార సముద్రమున. మొదటి వ్యాసకర్త భీష్మాచార్య పండితుడు—దేవగిరి రామదేవుని కాలము.........

'తెలుగు భాషలో నున్నట్లు గ్రాంథిక వ్యావహారిక భేదములు మరాఠీభాషలో లేవు......... కొద్ది భేదములున్నను సాధారణముగా మహారాష్ట్ర దేశమందంతటను పండితులొకే విధమగుభాషను మాట్లాడుచున్నారు...... నాలుగు విధములగు ఉపభాషలు వాడుకలో నున్నవి'

తర్వాత శ్రీ హర్కారే గారు 'సాహిత్యము ఛందస్సు" అను శీర్షిక క్రింద నిట్లు వ్రాసినారు. 'మరాఠీ కవులు సంస్కృత వృత్తములను యథేచ్ఛముగా వాడినారు. అనుష్టుప్పు, ఇంద్రవజ్రము ఉపేంద్రవజ్రము, శాలిని, వంశము, పుష్పితాగ్ర వియోగిని, భుజంగ ప్రయాతము, వసంత తిలక, మాలిని, పృథ్వి, మందాక్రాంతము మొద లగు వృత్తములు— రసభావములకు తగిన రీతిని ఉపయోగించినారు. శిఖరిణి, హరిణి శార్దూల విక్రీడితము, స్రగ్ధర, మందార మాల యను వాని నెక్కువగ వాడియున్నారు. ఈ యక్షరగణ వృత్తములే గాక, 'ఆర్యా'—'గీతి' మొదలగు మాత్రాగణ వృత్తములు పైవానికన్నను విపులముగా వాడినారు తెలుగున వాడిన 'చంపకమాల' మరాఠీలో కనిపించదు. సంస్కృతమున వాడునట్టి చంపకమాలనే వారు గ్రహించిరి. శార్దూలమును వాడిరేగాని 'మత్తేభము'న రచనలు లేవు.

'సంస్కృత చందస్సే గాక, మరాఠీ దేశ వృత్తములను గూడ విశేషముగా వాడియున్నారు. బహుశః యవి యన్నియు మాత్రాగణములే యై యుండును.'

'మరాఠీ— ఘటనా—పరంపరా' యను గ్రంథమున దేశి వృత్తము లెక్కువగా నుదహరింప బడినవి.

'తెనుగున నన్నయ గారి వివిధ వృత్త రచనలు, తిక్కన గారి కందములు, శ్రీనాథుని సీసములు, ధూర్జటి శార్దూలములు, వేమన యాటవెలదులు, ప్రఖ్యాతములై యున్నటులే మరాఠీలో 'ఆర్యా' వృత్తము ప్రసిద్ధమై యున్నది.'

'మరాఠీ కావ్యరచన సంస్కృత సాహిత్యము ననుసరించినది. ....
..... తెలుగులోవలె ప్రతిపాదమునందును ప్రాసయతి నియమము లేక, సంస్కృత ఛందోరీతినే పాటింతురు. కాని అంత్యనియమములు మాత్రము తప్పని సరిగా పాటింతురు. ఈ నియమమును ప్రథమ ద్వితీయ పాదములందు గాని ద్వితీయ చతుర్థ పాదములందు గాని పాటింతురు అక్షర గణముగల వృత్తములలో ప్రథమ ద్వితీయ చతుర్థపాదములలో నంత్యనియమము లవశ్యములు.

'మాత్రాగణ వృత్తములలో ప్రాయశః ద్వితీయ చతుర్థ పాదములకు అంత్య నియమము పాటింప బడును.

కురుకటికా సివహోతా
తో ఉత్తర బాళ పారగడ బడలా!

స్వపర బలాలళ నేణుని
బావిశ బహు బాయకాంత బడబడలా.

పై ఉదాహృతమైన యార్యావృత్తములో రెండు మరియు నాలుగవ పాదాంతములందు నాలుగక్షరముల యమక గర్భితమైన యంత్యనియమములు గలదు.'

'చాళుక్య సోమేశ్వరుడు (1126—1138) మానసోల్లాసమున 36 వ అధ్యాయమున దశావతారమును లోక గీతమున పేర్కొను చున్నాడు.

'ముకుందరాజు (క్రీ. శ. 1188) మరాఠీ భాషలో ఆది కవి.... వివేక సింధువను కావ్యము 'ఓవీ' యను దేశివృత్తములలో వ్రాసెను..... సంస్కృత ఛందోరీతులలో చేరదు.

'నాథ సంప్రదాయము ఉత్తర భారతమునుండి దక్షిణ దేశమునకు ప్రాకి మహారాష్ట్రమున నెక్కువగా వ్యాపించినది. మచ్ఛేంద్ర నాథుడీ సంప్రదాయమునకు మూలపురుషుడు. వీరు యోగాభ్యాసమునందు ప్రావీణ్యము సంపాదించిన వారు."

ఆంధ్రదేశమందలి సారంగధరుని కథ వీరి వలన తెలుగుదేశమునకు వచ్చినదే గాని రాజరాజనరేంద్రునికి సంబంధించినది కాదనుట ఈ వరకే విజ్ఞులెరింగిన విషయము.

'పన్నెండవ శతాబ్దములో ముకుందరాజు తర్వాత పేర్కొనదగిన ప్రసిద్ధ పురుషులు హేమాద్రి బోపదేవుడను వారు. వీరిలో హేమాద్రి లేక హేమారపంత్ అను పండితుడు మహాదేవరావు రామదేవరావు అను వారు రాజ్యమేలు కాలమున ప్రధానిగా నుండెను.' హేమాద్రి సర్వతో ముఖ పాండిత్యము గలవాడు. గొప్ప ధార్మికుడు. ....నాగరలిపిని మార్చి మోడీయను నొక క్రొత్త లిపిని సృష్టించి మహారాష్ట్ర భాషకు మహోపకార మొనర్చెను తెలుగున గొలుసు వ్రాతవలె దీనికి లేఖనా సౌకర్యమెక్కువగా గలదు "

ఈ హేమాద్రి యే కాకతీయ రుద్రదేవుని గురించి 'త్రిల్లింగాధి పతే. పశోర్విసనం రుద్రస్య రౌద్రాకృతే.' అన్నవాడు.

'మహాను భావ పంథాకు చేరిన చక్రధరుడు (13 శతా?) దీక్షా విధులను గూర్చి దండకముగా వ్రాసెనట. ఇతనికి హంసోబా యను నామెతో వరంగల్లులో వివాహము జరిగెనట. ...... 1286 లో మరాఠీ కవయిత్రి మహదాయిసా స్త్రీలపాటలను 'ధవళే'యను గ్రంథముగా వ్రాసినది. చక్రధరుని శిష్యురాలు..... జ్ఞానదేవుడు దేవగిరి రామదేవుని కాలమువాడు జ్ఞానేశ్వరి యను భగవద్గీత వ్యాఖ్యను వ్రాసెను.... నామదేవుడు 1270—1350. పర్భనీ మండలము వాడు. (విద్యారణ్యుల సమకాలికుడు) అభంగవృత్తములలో తొలిసారి రచన సాగించెను. సిక్కుల రచనలలో నితని రచనలు కలిసి యున్నవి. పంజాబులో ఇతని దేవాలయములు పెక్కులు కలవు 1318 లో దేవగిరి పతనము. 1323 ఓరుగల్లు పతనము 1338 లో విజయనగర స్థాపనము. 1347 లో బహమనీ రాజ్యస్థాపనము. 1490లో బహమనీ రాజ్యము ఐదు భాగములైనది 1350—1490 వరకు మహారాష్ట్రం సాహిత్యమునకు గ్రహణ కాలము.

ఇట్లు అభివృద్ధి గాంచిన మహారాష్ట్రి (మరాఠీ)కి వాఙ్మయము తర్వాతిదే గాని భాష తత్పూర్వ మెంతకాలము నుండియో యుండి యున్నట్లే ఏర్పడు చున్నది గదా. పులకేసి సత్యాశ్రయుని నాటికే 99000 గ్రామములు గలదేశమందు వారుండిరి గదా. నాటికి గ్రంథస్థము గాకపోయినను ప్రాచీన మహారాష్ట్రినుండి శాతవాహనుల కాలమునుండి జనుల వాడుకలో నుండి సంస్కృత నాటక సంగీతాదికములకు ఆదృతమగు చుండి జానపదవాఙ్మయాదులైన ఉదాహరణాదులలో కూడ ప్రయోక్తమగుచు వృద్ధి యగుచునే యుండినట్లు గ్రహింప దగును. మతంగాదులు చెప్పినదేశి బృహద్దేశి సంగీతమున కననగు ప్రక్రియయంతయు మహారాష్ట్రులదే యగునేమో!

ఈ మహారాష్ట్ర సంస్కృతి యంతయు మరాఠీ భాషాభివృద్ధికి ముందే ఆంధ్రదేశమునకు వచ్చి యుండవలెను. లేదా ఆసంస్కృతికి కారకులైన జనులు ప్రాచీన ప్రాకృతభాష అంతరించి మరాఠీ భాష తలయెత్తు లోపల తమదేశమును సెలవులకై వీడి కర్ణాటకదేశమునకును ఆంధ్రదేశమునకును వలస వచ్చి ఇచ్చటి భాషలలో తమ ప్రజ్ఞలను చూపియుండ వలెను. లేక పోయిన ఆంధ్రాలంకారికుల రచనకు అర్థమగపడదు. ఇక మహారాష్ట్రులు లేక మరాఠీలు ఆంధ్రదేశమునకు వలసలు వచ్చిన చరిత్ర అరయదగినది.

(2) ఆంధ్రదేశమునకు మహారాష్ట్రుల రాక — స్పష్టముగా వీరు ఆంధ్రులతో, అనగా తెలుగువారితో సంబంధమెప్పు డేర్పరచుకొని తెలియదు గాని కాకతీయరాజులు తల యెత్తునప్పటికే కుదిరియున్నది. పురాణములలో నుండియు అతిప్రాచీన వాఙ్మయముల నుండియు మహారాష్ట్ర దేశమేదో గుర్తించుట కష్టముగాని వాత్స్యాయన సూత్ర వ్యాఖ్యాత 'నర్మదా కర్ణాట విషయయోర్మధ్యే మహారాష్ట్ర విషయః" అని వ్రాసెనని శ్రీ రాయ చౌదరిగారు వ్రాయుచున్నారు. (**The Early History of the Deccan** P. 37—38) పులకేశి జయించిన గ్రామము లేవో తెలియుటలేదు. యువన్‌చ్వాంగ్ వర్ణించిన (641) మహారాష్ట్ర దేశమేదో సరిగా తెలియదు. రెండవ పుల కేశినే ఆతడు మహారాష్ట్ర ప్రభువనెను. ఆతడు ఆదేశమును జయించినందున నాడు వారి రాజధాని నాసికగా నుండును. శక్తి సంగమ తంత్రము (అర్వాచీనమే)న న్ర్యంబకము నుండి కర్ణాటకము వఱకు ఈ దేశమనియు ఇందులో ఉజ్జయినియు మార్జార తీర్థమును, కోలాపుర నివాసినీ స్థానము కలదట. ఇందలి ఉజ్జయిని మాళవదేశముదిగా నుండజాలదు గాని నాసిక జిల్లాలోని ఉజ్జయిని (సిన్నార్ తాలూకా)గా నుండును. ప్రతిష్ఠానము (ప్రరాన్) మహారాష్ట్రములోనిది. క్రీ. శ. 611 ప్రాంతమున మహారాష్ట్ర దేశమును రాష్ట్రకూటులు పాలించినట్లు (**Epigraphia Indica XI 279**) ఒక అభిప్రాయము కలదు. రాష్ట్రకూటులే మహారాష్ట్రులైన యెడల వీరు కర్ణాటకమును 750 ప్రాంతమున జయించి రెండు శతాబ్దములు పాలించి కన్నడ భాషను ఆదరించుట విచారణీయము. వీరి కిలట్టలూరు పురవరాధీశ్వరులని బిరుదు. ఇది ఉస్మానాబాదు జిల్లాలోనిది. దంతిదుర్గుని కాలమునకు (క్రీ. శ. 750) వీరు మహారాష్ట్రమును చేరి దాదాపు నాలుగు పురుషాంతరములై వీరు పూర్తిగా మహారాష్ట్రులై, కర్ణాటకులను

జయించిన దొక ప్రతిష్ఠగా చెప్పుకొనిరని శ్రీ డా. అలేకరుగారి యభిప్రాయము. (The Early History of the Deccan P. 250) తర్వాత కర్ణాటకులైపోయిరట. వీరి రాజధాని మొదట ఏదో తెలియదు. క్రీ. శ. 814—80 ప్రాంతమువాడైన మొదటి అమోఘవర్షుని కాలముననే మాన్యఖేటము వీరి రాజధానియైనది. తొలి రాజధాని ఏది? ఎల్లోర గుహాశాసనాలలో వీరి ప్రశస్తి విపులముగా దొరకుట చేతను, ఆ గుహాలకు విచ్చిన ప్రాధాన్యము చేతను దాని చెంతనే యుండవలెను. మూడవ గోవిందరాజు కాలమున మయూరఖండి యనునది నాసిక కడ రాజధానిగా నుండినట్లు తెలియుచున్నది. మహారాష్ట్ర దేశపాలకులుగా నుండి కూడ వీరు ఆ భాషను వదలి కన్నడమును ఆదరించుటయు విచారింపదగియున్నది

రాష్ట్రకూటులు పోయి మరల చాళుక్యులు క్రీ. శ. 973 లో తలయెత్తిన కాలమున మహారాష్ట్ర దేశమున యాదవులు కనబడుచున్నారు. తొమ్మిదవ శతాబ్దమున పరిపాలించిన సేవుణ చంద్రుడను రాజు వలన దీనికి సేవుణ రాజ్యము సేవుణ దేశము అని పేరు వచ్చినది. ఈతడు సేవుణపురమను యొకట నిర్మించి రాజధానిగా జేసికొనెను. ఈ యాదవులు మొదట రాష్ట్రకూట సామంతులుగా నుండి తర్వాత చాళుక్యుల సామంతులైరి. వీరిలో యాదవ భిల్లముడు పరమార మహిపతి వలంజుని యుద్ధమున చంపి తైలపునికి సాయమొనర్చెను. క్రీ. శ. 1050 తర్వాత ద్వితీయ సేవుణ చంద్రుని కాలమున ఈ రాజవంశము పైకివచ్చినది క్రీ. శ. 1145 ప్రాంతమున రాజ్యమునకు వచ్చిన మల్లుగి కాకతీయ రుద్రదేవునికి శత్రువాయెను కల్యాణి చాళుక్యులు 1150కి తర్వాత బలహీనులు కాగా యాదవులును కాకతీయులును పోరాడుచుండిరి. మల్లుగి ఓరుగంటి మీదనొక దండయాత్ర సలిపెను. మూడవ తైలపుడు 1162 లో గతించగా యాదవులతో పాటు హోయసలులు, కాకతీయులు అందరును, స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. నాలవ చాళుక్య సోమేశ్వరుడు కొన్ని విజయములు పొంది మరల కొంత పునరుద్ధరించిన చాళుక్య సామ్రాజ్యము నిలువ లేదు. 1185 లో హోయసలులు ద్వారసముద్రము నుండి మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక ప్రతాపచక్రవర్తి బిరుదముతో పాలింపసాగిరి దేవగిరి యాదవులు బలహీనులైనందున వారి జ్ఞాతి భిల్లముడు కొంకణమును మధ్యమహారాష్ట్రమును జయించి మాళవ గూర్జరముల మీద దండయాత్రలు సలిపి తుదకు దేవగిరిని స్వాధీనము చేసికొని 1187 లో స్వాతంత్ర్యము ప్రకటించుటయే గాక సమ్రాట్ బిరుదములు ధరించి హోయసలులను ఒక హద్దులో నుంచెను. చాళుక్యుల కల్యాణ నగరమును ఆక్రమించెను చాళుక్యుల సామ్రాజ్యమునంతటిని స్వాధీనము చేసికొనెను. తనపేరిట నొక శకమును స్థాపించెను కాని హోయసలు వదలక దక్షిణ దేశమును పాండ్యులతో కలిసి జయించి యాదవులను మరల ఓడించిరి కృష్ణా, తుంగభద్ర నదుల ప్రదేశములు హోయసలులు ఆక్రమించి బలవంతులైరి. కృష్ణకు ఎగువను మహారాష్ట్రులే బలవంతులుగా నుండిరి. కృష్ణా మరి ప్రభా నదులు వీరికి సరిహద్దులుగా కుదిరినవి.

ఇప్పుడు దాదాపు 1195కు తర్వాత, యాదవులు కాకతీయుల మీదికి తిరిగిరి. కాకతీయ రుద్రదేవుని తమ్ముడు మహాదేవరాజు దేవగిరిమీద దండయాత్రలు సల్పియుండెను. యాదవరాజు జైతుగి (1191—1210?) రుద్రదేవుని చంపి ఆతని తమ్ముని కుమారుని గణపతి చెరపట్టుకొనెను. మహాదేవరాజు యాదవులతో ఎంతో పోరాడెను గాని యుద్ధములో మరణించెను కాకతీయరాజ్యమందు అల్లరు లేర్పడినవి కాని రేచెర్ల రుద్రదేవుడు సామ్రాజ్యమును కాపాడి కాకతీయరాజ్య భారధౌరేయ బిరుదమును దాల్చి గణపతికి సాయపడెను. ఇంతలో జైతుగియు గణపతిని చెఱనుండి విడిపించి మైత్రి నెరపెను. (1198) 1200 నుండి ఆంధ్రులకు మహారాష్ట్రులకును స్నేహము కుదిరెను.

ఈకాలమందే హేమాద్రి పండితుడుండెనది. ఆంధ్రమహారాష్ట్రుల స్నేహము కొనసాగినది. మరియొక ఆశ్చర్యకర చరిత్రాంశము గుర్తింపదగినది. సేవుణ యాదవరాజ కుటుంబికులు, రాజ్యమునకు రానివారు కాకతీయుల నాశ్రయించి శ్రీమంతులై ఆంధ్రదేశముననే తమ బలగముతో స్థిరనివాసము లేర్పరచుకొనిరి అట్టి వాడు సారంగపాణి దేవరాజు. ఇతడు యాదవరాజు మహాదేవరాజు (క్రీ. శ. 1260—70) తండ్రి. ఆశ్చర్యమేమనగా తండ్రి కాకతీయ సామంతుడు, కుమారుడు సేవుణ సామ్రాజ్యాధిపతి ఇది ఎట్లన్న యాదవ సింఘణుని (1199)చే గణపతి వదలబడిన తర్వాత ఇరువురికీ స్నేహసంబంధములు కొనసాగినవి. సింఘణుని తర్వాత యాదవరాజ్యమున కల్లోలములు నెలకొనినవి అతని కుమారుడు రాజు కాలేదు ఈ సారంగపాణియే ఆకుమారుడు రుద్రాంబ రాజ్యారోహణ కాలమున యాదవులు ఆమెను ఎదిరించి యాదవరాజు మహాదేవుడు ఓరుగంటిని ముట్టడింపగా రుద్రాంబ శత్రువులను జయించుటయే గాక యాదవ రాజధానిని కూడ ప్రవేశించి మహాదేవరాజు వలన బంగారు నాణెపు రాసులను కప్పముగ్రహించి తన పరివారమునకు పంచిపెట్టినదట. ఈ మహాదేవునికి ముందు పాలించిన వాడు యాదవ కృష్ణుడు (క్రీ. శ. 1246—1260) ఈ కృష్ణ మహాదేవు లిరువురును పై సారంగపాణి యొక్క కుమారులే. ఇతడెప్పుడో ఆంధ్రదేశమునకు వచ్చి సామంతుల్లో (?) ప్రభువై యాదవరాజ్యమును ఉపేక్షింపగా నితని కుమారులు అచట ప్రభువులైరి. ఇతడు మాత్రము రుద్రాంబను నమ్మిన బంటుగా నుండెను. ఈ విషయము ప్రతాపచరిత్రలో తెలియుచున్నది. దీనికి అనుగుణముగా, కృష్ణాజిల్లా, కైకలూరు తాలూకా, రాచపట్నములో 1922 లో దొరకిన యాదవుల బంగారు నాణెములు మహారాష్ట్రుల సంబంధమును—వ్యాపారము గాని, పాలనము గాని— మైత్రి గాని— తెలుపుచున్నవి ఈ సారంగపాణి దేవ మహారాజు క్రీ. శ. 1267 లో పానుంగల్లులో ఛాయా సోమనాథాలయమును నిర్మించెను అందు తాను రుద్రాంబకు సామంతుడనని తెలుపుకొనెను.

ఓరుగంటి ప్రాంతమేగాక గణపతి చక్రవర్తి కాలమునను తర్వాతను కూడ కడప, నెల్లూరు, కర్నూలు ప్రాంతములలో మహారాష్ట్రులుండి పట్టిన విదర్శనము చాల దొరకినవి. ఈ విషయమును శ్రీ నేలటూరు వెంకట రమణయ్యగారు కాయస్థ రాజులు అను వ్యాసమున, శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారి లభనందన సంపుటి, పుట 282 తెలిపియున్నారు "కాకతీయ యుగమునందు ఆంధ్రదేశమును పాలించిన రాజవంశములలో కాయస్థ వంశమొక్కటి. కాయస్థులు ఆంధ్రదేశజులుగారు. ఆంధ్ర ప్రజలలో కాయస్థులు లేరు. . . . అన్యదేశములనుండి ఆంధ్రదేశమునకు వచ్చి యచ్చట స్థిరనివాసము లేర్పరచు

కొని కాలక్రమమున రాజ్యాధిపత్యమునుబడసిరి. . . . వీరిలో ప్రథమము డుదయగిన (వాడు) గంగయసాహిణి . . . . . . క్రీ. శ. 13 వ శతాబ్ది ప్రారంభము నుండియు పెక్కండ్రు మహారాష్ట్రు లేకారణము వనో స్వదేశమును వదలి ఆంధ్రదేశమునకు వలస వచ్చి యచ్చటనే స్థిర నివాసము లేర్పరచుకొనినట్లప్పటి శాసనముల వల్ల తెలియుచున్నది. మహారాష్ట్రులను మన పూర్వికులు 'అరె'లని పిలుచువారు. ఇది ఆర్య శబ్దమునకు వికృతి. ఆరెలు స్థిరనివాసము లేర్పరచుకొనిన లావులకు ఆరెవీడులని సార్థకనామము కలిగినది.'' (ఇచ్చట శ్రీ. నే. వెం గారు కర్నూలు, చిత్తూరు, నెల్లూరుజిల్లాలలోని ఆరెవీడులను విపులముగా గుర్తించినారు) ''ఇట్లు దేశాంతరాగతులైన ఆరెవారు కాకతీయులతో నేకీభవించి ముత్తుకూరు యుద్ధమున పాండ్యరాజులతో యుద్ధము చేసి పరాజితులై పారిపోయిరని పాండ్యశాసనములందు చెప్పియున్నది. పైజెప్పిన ఆరెలవలె కాయస్థులు కూడ మహారాష్ట్రమునుండి తెలుగు దేశమునకు వలసలు వచ్చినవారు కాదగుదురు.''

''కాయస్థరాజులు పాలించిన దేశము పానుగల్లు మొదలు మార్జ వాడిదనుక కొన్నిటియందు పానుగల్లు మొదలు కైవారము కోట వరకు పానుగల్లు అనుపేరుగల స్థలములు రెండు గలవు. ఒకటి మహ బూబునగరుజిల్లా యందున్నది. మరియొకటి నల్లగొండజిల్లా యందున్నది. ఈ రెంటిలో రెండవదే కాయస్థరాజుల శాసనములలో పేర్కొనబడిన పానుగలు. మార్జవాడి యనునది మహారాజ వాడియొక్క అపభ్రంశరూపము. ఇది 7000 రాజ్యము. మొదట నిది రేనాడు 7000 అని శాసనములలో పేర్కొనబడి యున్నది. . . . కైవారము కోట ఇప్పటి మైసూరు రాష్ట్రాంతర్గతమైన కోలారుజిల్లా లోని చింతామణి తాలూకా యందున్నది. కాయస్థరాజులు . . . వారి శాసనములు కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకాలోను గుంటూరు జిల్లా పల్నాడు వినుకొండ తాలూకాలలోను నెల్లూరుజిల్లా దర్శి డివిషనులలోను కడపజిల్లా యందంతటను గానవచ్చుచున్నవి. . . .''

మొదటి కాయస్థ మహామండలేశ్వరుడు గంగయసాహిణి తిక్కన సోమయాజికి సమకాలికుడు. నిర్వచనోత్తరరామాయణము పీఠిక యందలి ఈ పద్యము ప్రసిద్ధము—

> ''రంగదుదార కీర్తి యగు
> రక్కెస గంగని బెంజలంబు మై
> భంగమొనర్చి మన్మ జన
> పాలుడు బల్విడి నాచికొన్న లా
> ఝ్యాలగము నెల్లనిచ్చి దన
> యాశ్రితవత్సల వృత్తి యేర్పడన్
> గంగయసాహిణిం బదము
> గైకొన బంచె బరాక్రమోన్నతిన్.''

''మనుమసిద్ధి కాకతీయ గణపతికి మిత్రుడు. . . . నెల్లూరు రాజ్యము అంతఃకలహము వలన కలతపడి యుండ . . . తిక్కన సోమయాజులు ఓరుగంటికి పోయి గణపతిదేవుని సాయము వేడి''నది తెలిసి నదే. ''గణపతి దేవుడును మనుమసిద్ధిని అతని రాజ్యమునందు పున. ప్రతిష్ఠ చేసియుండ. . . . గణపతి దేవునికి ప్రత్యుపకారము సేయు వాంఛతో మనుమ సిద్ధి గంగయసాహిణిని తోడ్పడియుండ వచ్చును.''

తర్వాత నెల్లూరి చరిత్రలో జటావర్మ సుందర పాండ్యుడు నెల్లూరి రాజ్యమును జయించి, ఆ రణములో మనుమసిద్ధి రణమరణము నందె, కాకతీయులు కొంతకాలము తగ్గియుండిన సందర్భమున సేవుణ యాదవులు కాకతీయుల పక్షమున నెల్లూరికి వచ్చి యుద్ధమున నిలువజాలక పోయినదియు చరిత్ర ప్రసిద్ధమే.

ఇంతదూరము ఎందులకు వ్రాయవలసి వచ్చెననగా తిక్కన కాలము నాటికి ఆంధ్ర దేశమునకు మహారాష్ట్రులతో పూర్తిగా సంబంధము కుదిరి కొంత కాలము సాగినది ఈ మహారాష్ట్రులు ఆంధ్రులలో కలసిపోయినారు. ఇట్టి వీరి సాహిత్య ప్రక్రియలుగాని విద్యావినోదములుగాని తామరాకుమీద నీటివలె, అంటక, ఆంధ్రుల మీద తమ ప్రభావమును బొత్తిగా చూపక, ఎందును చేరక యుండెనవా? లేక ఆ వచ్చిన వారు తమ భాషనుగాని సంస్కృతిని గాని త్యజించి వచ్చిరా? అసంభవము. భాష తెలుగైనందున ఈ దేశమునకు తగినట్లు తమ మహారాష్ట్ర భావములను, పద్ధతులను, రీతులను, పక్కణాలను, ఆంధ్రీకరించి యుందురు.

తిక్కనకు తర్వాత నవి ఆంధ్ర వాఙ్మయములో కనబడుటయే ఇందులకు తార్కాణము. విద్యానాథ పాల్కురికి సోమనాథ త్రిపురాంతకాదులు మహారాష్ట్ర పండితులతో దప్పక మెలగి యుందురు. ఎక్కడెక్కడి వారు ఓరుగంటిలో కలయుచుండిరి ఓరుగంటిలో ఆరెలు నివసించుచుండిన వాడయుండెనదని క్రీడాభిరామము ప్రేమాభిరామము ననుసరించి చెప్పుచున్నది. ఆరెమరాటీల కథలు మనకు క్రొత్తకాదు.

జానపద వాఙ్మయములోని యక్షగానాదులలోను ప్రసిద్ధమైన బాలనాగమ్మ కథ, మాయలమరాఠి, అతని మంత్రశక్తి, పానుగల్లు మున్నగునవి పానుగంటిలో మహారాష్ట్ర శార్ఙ్గదేవుడు మాండలిక ప్రభువు స్థిరనివాస మేర్పరచుకొన్నదానిని జ్ఞాపకపరచుచున్నవి. బాలనాగమ్మ కథను గురించి వ్రాయుచు శ్రీ జోగారావుగారు (యక్షగాన చరిత్ర) ''ఇందలి కథారంగములగు పానుగల్లు, నాగళ్లపూడి, గండికోటయు తెలంగాణా రాయలసీమలకు చెందినవగుట గమనింపదగినది'' అని వ్రాసినారు. ఈ మరాఠీ కథలే దేశమున వ్యాపించియుండును. కథలు, యక్షగానములకు మూలరూపములైన నాటక ప్రక్రియలు, ఉదాహరణ బిరుదావళ్యాదులవంటి స్తోత్రపరసాహిత్యము లేక ఎంతో దేశి సంగీత ప్రక్రియ వ్యాపించి క్రమముగా తంజావూరాదులకు వ్యాపించియుండును. ఉదాహరణ ప్రక్రియవంటిదే సంగీతము నవావరణకృతియని యొకటి ఇటీవల నా దృష్టిపథమునకు వచ్చినది. గొప్ప సంగీత విద్వాంసులగు ముత్తుస్వామిదీక్షితులవారు (1775) ''తిరువారూరు శ్రీ కమలాంబానవావరణకృతు'లని వ్రాసిరి. అందు అష్టవిభక్తులును వచ్చునట్లు భిన్నరాగములలో ఎనిమిది కృతులు వ్రాసి మొదటిదిగా నొక ధ్యానకృతియు, చివర ఎనిమిది విభక్తులును కలసి ఒక చోటి యుండే వచ్చునట్లు ఒక కృతియు, అటు వెనుక పదునొకండవదిగా మంగళాచరణ కృతియు, వీనిని కూడ భిన్నరాగములలో నిబంధించినారు. ఇదియొక చక్కని సంగీత ప్రబంధము. దీనిని చూడగానే ఎట్టి చదువరికిని ఉదాహరణవాఙ్మయము వెంటనే స్మృతికి రాకమానదు. ఇది అర్వాచీన రచనయైనను రచన ప్రక్రియ ప్రాచీనమువిగానే యుండును. యక్షగానాదులలో వచ్చు తాళభేదముల చరిత్ర సంగీత శాస్త్రమున ఎంతవెనుకకు పోవునో ఎవరు చెప్పగలరు. సంగీతమందు ప్రామాణికుడైన శార్ఙ్గపాణిదేవుడు యాదవసింఘణుని యాస్థానివాడు (1132—1169) ఈతనికి నిశ్శంకయని కూడ ఇంటిపేరు కనబడుచున్నది. శివలెంక కొమ్మనలాట నిశ్శంకనాథుడు ఈ కొమ్మనకు నిశ్శంకకొమ్మనయని కూడ పేరు. ఇదంతయు సమాలోచింపగా సంస్కృతాంధ్ర ప్రాకృత మహారాష్ట్ర కర్ణాటక తమిళభాషలలో మంచి ప్రవేశమేగాక చక్కని సంగీతజ్ఞానమును చారిత్ర పరిశోధనానుభవమును గల బుద్ధిమంతులు పూనుకొని పరిశోధించిన యెడల ఆశ్చర్యకర నూతన వాఙ్మయ చరిత్రాంశములు వెలువడగలవని తోచుచున్నది. పెద్దలు పరిశీలింతురుగాక!

# ఎరుపు (కథ)

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

ఆకాశం రక్తం కక్కింది. చూస్తూండగానే ఎరుపు చీకట్లలో కలిసి మాయమవుతున్నది ఎదురుగుండా గుడిసెలో దీపం వెలిగింది. అది కూడా ఎంతో సేపు ఉండదు. తర్వాత చీకటి. ఏమీ కనిపించదు.

ప్రొద్దున ఏడు గంటలనుంచీ పదింటిదాకా—సారథి మేడ వెనకవైపు వరండాలో కూర్చుని గమనించే సమయంలో—ఆమె, ఆ గుడిసెలోని స్త్రీ, వంట ప్రయత్నంలో ఉంటుంది. ఆ గుడిసెకి బయట తడికలో అమర్చిన నీళ్ల గదికీ మధ్య ఎన్నోసార్లు రాకపోకలు సాగిస్తూ ఉంటుంది. ఒక చట్టి, ఒక గిన్నె, ఒక గరిటె, ఏదో ఒకటి తెచ్చి కడిగి తీసుకువెళ్లడమో, నీళ్లు నింపి తీసుకు వెళ్లడమో చేస్తూ ఉంటుంది. కోళ్లకు గింజలు చల్లుతూ ఉంటుంది.

ఆమె కదలికలు, రాకపోకలు చూడ ముచ్చటగా ఉంటాయి.

సాయంత్రం నాలుగ్గంటలకు ముంగిలి వూడ్చి, నీళ్లు చల్లుతూ ముగ్గు దర్శనమిస్తుంది. ఆ పని పూర్తికాగానే స్నానం చెయ్యడానికి తడకలచాటుకి వెడుతుంది. కుచ్చెళ్లుపోసి పురితిప్పి తెచ్చుకున్న చాకింటి చీరని ఒకవైపు తడికెమీద పెడుతుంది. కట్టుకున్న బట్టలు విప్పి సారథివైపున్న తడికెమీద వేస్తుంది. వివస్త్రగా నిల్చున్న ఆ క్షణంలో ఆమె ముఖం, చెయ్యి, భుజం, అలా కనిపించి లిప్తలో అదృశ్యమవుతాయి. ధ్వని ప్రధానమైన వాక్యంలాగ ఆ దృశ్యం అతనిలో రసానుభూతి కలిగిస్తుంది. ఆమె కదలికల్ని చూస్తూ ఉండటంలో కలిగే మొత్తం ఆకర్షణకీ అది తారస్థాయి.

స్నానం పూర్తి చేశాక, చీర చుట్టబెట్టుకుని గబగబా లోపలికి వెడుతూ కనిపించే దృశ్యంలో ఆకర్షణ ఉండదు. ఏదో చెప్పరాని నిర్వేదం అతని మనస్సుని ఆవరిస్తుంది.

సాయంత్రం అయిదున్నర, ఆరు, ప్రాంతాల కాకి దుస్తుల్లో వున్న ఒక వ్యక్తి—ఆమె భర్త—అక్కడికి వస్తాడు. వాకిటిముందు మంచం వాల్చుకుని కూర్చుంటాడు. ఆమె టీ తెచ్చి యిస్తుంది. అతను కబుర్లు చెబుతూ ఉంటాడు. ఆమె అటూ యిటూ తిరుగుతూ, కాస్సేపు వాకిలిముందు, సారథ కెదురుగా నుంచునీ, కాస్సేపు భర్త దగ్గరగా నుంచునీ, నవ్వుతూ మాట్లాడుతూ ఉంటుంది. తాను ఆమెని చూస్తున్నట్లే, తన ఉనికిని ఆమె కూడా గమనిస్తూ ఉంటుందనే సారథి అనుమానం.

ఆ భర్త రోజూ కనిపించడు. రెండు మూడు రోజులకూ, ఒక్కోసారి వారం రోజుల తర్వాతా, కనిపిస్తాడు. బస్సు డ్రైవరో, లారీ డ్రైవరో కావచ్చు. అతనెవరో, ఆమే అతనూ, భార్యాభర్తలు అవుతారో కారో కూడా సారథికి తెలీదు. తెలుసుకోవాలనీ లేదు. ప్రత్యక్షంగా కనిపించేదేదో అందంగా, ఆకర్షకంగా ఉండగా, దాని అనుభూతితో సంబంధంలేని లౌకికమైన వివరాల్ని ఎందుకు తెలుసుకోవడం? తెలుసుకోవడంలో అర్థం, ఆనందమేమీ లేనప్పుడు!

నిస్సారమైపోయిన జీవితంలో యిదే తనకు మిగిలిన 'సెక్స్' అనుభూతి. శారీరకమైన 'సెక్స్' నిషిద్ధం అన్నాడు డాక్టరు. అయిదు నెలల్రికితం రక్తం పడింది. క్షయ అని నిర్ధారణ అయినప్పుడు భయం వేసింది. మిగిలింది నిస్పృహ. వ్యాధి ప్రారంభదశలోనే ఉన్నదనీ, శానిటోరియమ్‌కి ఎక్కడికీ వెళ్లనక్కరలేదనీ ధైర్యం చెప్పాడు డాక్టరు. వెళ్లినా వెళ్లకపోయినా శరీరం పనికిరానిదైపోయింది!

భార్య పుట్టింటికి వెళ్లింది. ఆమెకు వ్యాధి సంగతి తెలీదు. వ్యాధి బయట పడడం, ఆమె ప్రయాణం కావడం రెండూ ఒక సమయంలోనే తటస్థించాయి. ఆలోచించడానికి వ్యవధిలేదు. పురుడు పోసుకోవడానికి వెళ్తున్న ఆమెతో వ్యాధిసంగతి చెప్పడ మెందుకని చెప్పలేదు.

ఆమె వెళ్లిపోయాక క్రమంగా అర్థమైంది తన జీవితంలో వచ్చిన మార్పు. 'సెక్స్' నిషిద్ధమని డాక్టరు చెప్పినప్పుడు అర్థంకాలేదు గాని, యిప్పుడు తెలుస్తోంది—మనస్సు శరీరంనుంచి వేరుపడుతోంది! క్రమంగా అలా వేరుపడటంలోనే యిదివరలో గుర్తించని సత్యాల్ని గుర్తిస్తోంది!

ఎదురుగుండా కనిపించే గుడిసెలోని ఆ స్త్రీ భర్తతో అలా కబుర్లు చెబుతూ, నవ్వుతూ వుంటే మొదట్లో తనని కవ్విస్తూ ఉన్నట్లుండేది. సారథిలో అసూయ, బాధ కలిగేవి. లేచి వెళ్లిపోయేవాడు. మంచంమీద పడుకుని అదేపనిగా ఆలోచించేవాడు. ఎన్నో వూహలు వచ్చేవి. ఆ కాకీ దుస్తుల వ్యక్తి గొప్ప అదృష్టవంతుడుగా కనిపించేవాడు. అతనిలో 'పరకాయ ప్రవేశం' చేసి ఆ జీవితాన్ని వూహించుకునేవాడు. అలా మనస్సు రెక్కలు విప్పడంతో క్రొత్త సంగతులు అర్థమయ్యాయి. ఆ స్త్రీమీద చొరవ, అధికారం లభించడం, ఆమెకు చేరువ కావడం, ఆమెను అనుభవించడం ఎంతో బావుంటుందని కోరిక చెబుతుంది. కాని యధార్థంలో తను ఆ కాకీ దుస్తుల వాడైనప్పుడు, తనకు అసలు 'నీళ్లగది సన్నివేశం' కనిపించదు! అప్పుడు ఆ సమయంలో తను ఏ బస్సునో, లారీనో నడుపుతూ 'డ్యూటీ'మీద ఉంటాడు. సాయంత్రం



"చింత"

చిత్రికారుడు. శ్రీ కె. ఎస్. వి నరసింహామ్.

టీ తాగుతూ ఎన్ని కబుర్లు చెప్పినా, రాత్రికిగాని, ఆ గుడ్డిదీపం కాస్తా ఆర్పివేశాకగాని, అంటే చీకట్లోగాని, ఆమె చేరువకాదు! చీకట్లో అందానికీ, ఆకారానికీ—తన మనసు యిప్పుడు పొందే రసానుభూతికీ—అస్కారం ఎక్కడ? అప్పుడు అంతా ఒకటే! సర్వం జగన్నాథం!! ఆ చీకట్లో ఆమె ద్వారా లభించే శారీరకానుభూతికీ, యిదివరకు తా నెరిగివున్న శారీరకానుభూతికీ తేడా ఏమైనా ఉంటుందా? ఉంటే ఎలా ఉంటుంది? తేడాలు ఏమైనా దృష్టి, మనస్సు, తెచ్చిపెట్టేవే. కేవలం శరీరమే, స్పర్శే అయితే చీకటో దానికి తేడాలు తెలీవు! అలాంటప్పుడు ఆ లారీ డ్రైవరును చూచి అసూయపడటం దేనికి?

అసలు 'సెక్స్' మనస్సుకి సంబంధించిందా? శరీరానికి సంబంధించిందా? అని ప్రశ్న. భార్యను దూరంనుంచీ, కేవలం స్త్రీగా చూస్తూంటే ఎంతో ఆకర్షణగా ఉంటుంది. ఆమె 'భార్య'గా దగ్గరచేరి సంసార విషయాలూ, బంధువుల్ని గురించీ, డబ్బు గొడవా మాట్లాడినప్పుడు, ఆ ఆకర్షణ ఉండదు. చీకాకు కలుగుతుంది ఆమెతో పక్కమీద చేరడంలో ఆకర్షణ తాలూకు ప్రేరణ ఉద్రేకాన్ని కలిగించినా, అనుభవ పర్యవసానంలో దాని స్పృహే కనిపించదు! పర్యవసానం నిస్సారంగా 'మృత్యువు'లా ఉంటుంది. రసరాహిత్యమేతప్ప రసానుభూతి తోచదు. మొదటినుంచీ, పెళ్లయినప్పటినుంచీ, ఈ అనుభూతి అలానే ఉన్నదని చెప్పడానికి వీల్లేద 'సెక్స్' అలవాటుగా, విధాయకంగా మారడంవల్లే మృత్యుస్పర్శగా తయారైందని సారథి వూహా క్షయ అంకురించడానికి కూడా ఆ 'మృత్యు స్పర్శే' కారణం అయి వుంటుందని అతని అనుమానం. అలాంటి శారీరకమైన 'సెక్స్' అనుభవాన్ని ఎదుర్కోవడానికి యిప్పుడు తను సంసిద్ధుడే!

"క్షయ రావడానికి కారణమేమిటి?" అని డాక్టర్ని సూటిగా ప్రశ్నించాడొకసారి డాక్టరు రామం తన స్నేహితుడు. అతను ఏవేవో కారణాలు సూచించాడు. అవన్నీ తన విషయంలో వర్తించేవికావు క్షయ తన వంశంలో లేదు. తనకెప్పుడూ మలేరియా రాలేదు, తను బలహీనుడూ కాలేదు పరిసరాల్లో, తిండిలో, ఎక్కడా లోపం రాలేదు. కాని తనలో ఏదో అసంతృప్తిమాత్రం—మనస్సుకీ శరీరానికీ మధ్య అవ్యక్తమైన సంఘర్షణ ఫలితం కాబోలు అది—క్రమంగా ప్రస్ఫుటమవుతూ వస్తోంది. అది పిల్లలు లేకపోవడంవల్ల కాబోలు అనుకున్నాడు. పెళ్లయి అయిదేళ్లవుతోంది. ఇప్పుడు తను తండ్రి కాబోతున్నాడు. క్షయ వచ్చింది. రెండింటిలో ఏదో ఒకటి జరగకపోతే అర్థం ఉండేది రెండూ ఒకసారే జరగటం జీవితం ఎంత అర్థరహితమో నిరూపిస్తోంది....

'సెక్స్' అనుభూతి విషయంలో మనస్సుకీ శరీరానికీ విభేదాన్ని కల్పించడం తర్కించి చూస్తే సబబుగా తోచదు. కంటికి మాత్రమే కనిపించి (కన్ను మూసినా తెరచినా) స్పర్శకి అందుబాటులో లేనిదాన్ని 'మానసిక' మనీ, స్పర్శ వగైరా యింద్రియాలకి అందుబాటులో ఉండేదాన్ని 'శారీరక' మనీ విభజించడం సవ్యంగా తోచదు. అన్ని యింద్రియాలూ శరీరానికే చెందినప్పుడు, ఏ యింద్రియంతో అనుభవించినా అది శారీరకానుభవమే అవుతుంది. పోనీ నిర్వచనంలో యింద్రియాలకు బదులు యింద్రియార్థాలకే ప్రాధాన్యం యిస్తే, అప్పుడు సర్వవిధాలైన అనుభూతులూ —స్పర్శ, సంపర్కం, రుచి కూడా— మానసికమే నని సిద్ధాంతం చేయాలి. మరి కంటితో అనుభవించడానికీ కౌగిలితో అనుభవించడానికీ తేడా ఏమిటి? తాత్త్వికంగా ఏమీలేదు! కంటితో అనుభవించి ఎందుకు తృప్తి చెందరాదు?

పోతే కంటికీ వంటికీ ఒక సంబంధం ఉంది. కంటితో చూస్తే కలిగే ఆకర్షణే, స్పర్శకూ, కౌగిలింతకూ ప్రేరణ అవుతున్నది. చూచినదాన్ని అందుబాటులోకి, స్వాధీనంలోకి తెచ్చుకుని దాన్ని 'నిజం' చేసుకోవాలనే తాపత్రయమే మనిషికి అన్ని ఆవేదనలూ, కష్టాలూ కలిగిస్తోంది. స్వాధీనంలోకి రానిది 'నిజం' కాదా? ఆకాశంలో కనిపించే ఇంద్రధనుస్సు 'నిజం' కాదా? అది 'అక్కడ' లేదు! చంద్రుణ్ణి చేరుకోవచ్చు గాని, యింద్ర ధనుస్సుని అందుకోవడం వీలుపడదు కదా! ఇంద్రధనుస్సు రంగులు మన కన్నులు మాత్రమే అనుభవించగలిగే నిజం. అందుకే మనుష్యులు దాన్ని గట్టి 'నిజం'గా పరిగణించరు!

ఆకాశంలో చంద్రుడు అమృతమూర్తిగా కనిపిస్తాడు. ఐస్‌క్రీంలా తినెయ్యాలనే కోరిక పుడుతుంది. ఆ చంద్రలోకం ఎంత అందంగా, హాయిగా ఉంటుందో అనిపిస్తుంది. మానవుడు చంద్రుణ్ణి గూర్చి తరతరాలుగా కన్న కలలు సాహిత్యం నిండా వ్యాపించి ఉన్నాయి. కాని చంద్రుడు మానవునికి అందుబాటులోకి వచ్చేప్పటికి ఆ అనుభవం ఎలా ఉంది? వెడితే అక్కడ కొండలూ, గోతులూ, ఎడారీ తప్ప మరేమీ లేదు! అలా 'నిజ'మైన చంద్రుణ్ణి ఏం చేసుకోను! అక్కడినుంచీ చూస్తే భూమి దివ్యసుందరంగా దర్శన మిచ్చిందట! చూపుతో ఉన్న ఆనందం పొందటంలో లేదే!

తన మనస్సు 'శరీరం' నుంచీ వేరుపడుతోంది. అలా వేరుపడటంలోనే స్వచ్ఛమైన ఆనందం ఉన్నది. స్వేచ్ఛ ఉన్నది. శరీరాన్ని గూర్చి, శారీరకమైన 'సెక్స్'ని గూర్చి యిక తను తాపత్రయపడక పోవడమే వివేకం, అనుకున్నాడు సారథి......

ప్రొద్దున సూర్యోదయదృశ్యం ఎంత ఆహ్లాదకరంగా ఉంది! తర్వాత కాస్సేపటికి రిక్షాలో డాక్టరు దగ్గరికి వెడుతుంటే, ఆ సూర్యుని కిరణాలు శరీరానికి కలిగించిన బాధని సహించలేకపోయాడు. మనుష్యులు దూరంనుంచీ చూస్తున్నంత సేపూ చైతన్యంతో, ఏదో చేస్తూ, మాట్లాడుతూ, నవ్వుతూ, కోపగిస్తూ, అద్భుతంగా ఆసక్తినీ ఆనందాన్నీ కలిగిస్తారు. మానవజాతి సమస్తాన్నీ తను ప్రేమిస్తున్నట్టే ఉంటుంది కాని ఒక రిక్షా మాట్లాడుకోవాలన్నా, ఒక అంగడిలో వస్తువులు బేరంచేసినా, మనుష్యులు చేసే జాప్యం, పెట్టే పేచీలూ, తికమకలూ, పాలవాడూ కూరగాయలవాడూ చేసే మోసాలూ, విసుగునీ చిరాకునీ కలిగించడమేకాదు, ద్వేషాన్ని కూడా రగిలిస్తాయి! మనుష్యుల పట్ల సామూహికంగా తనకి ద్వేషం లేదు. పెద్దగా ప్రేమా లేదు! కాని ఒక్కొక్క వ్యక్తి పట్ల తనకు ఆసక్తీ, జాలీ, ఆప్యాయతా కలుగుతాయి!

డాక్టరుచేత యింజక్షను చేయించుకోవడంకంటె, నర్సు నిర్మలచేత ఎక్స్‌రే తీయించుకోవడమే సరదాగా ఉంటుంది! ఆమె చాల నాజూకుగా మల్లెపువ్వులా ఉంటుంది. పొంకంగావున్న ఆ వక్షానికీ, నీటైన స్పష్టమైన హావభావాలకూ తగినట్లు, ఎందుకోగాని ఆమె కళ్లల్లో చురుకుదనమూ ఆహ్వానమూ కనిపించవు నిస్పృహాయతా, పరాధీనత్వమూ మాత్రమే కనిపిస్తాయి ఆమెను చూస్తూంటే 'అడవిగాచిన వెన్నెల' జ్ఞాపకం వస్తుంది. ఆమెమీద ఎందుకో ఆప్యాయత కలుగుతుంది.

ఇవాళ ఎక్స్‌రే చూచి డాక్టరు రామం అన్నాడు: "స్పాట్స్ అన్నీ యించుమించు కవరైపోయినట్లే! రిమార్కబుల్ యింప్రూవ్‌మెంట్, సారథీ! ఇంకొక మాసంలో డ్యూటీలో జాయిన్ కాదల్చుకున్నా కావచ్చు.. అఫ్‌కోర్స్, ఉండవలసిన జాగ్రత్తలో ఎలాగూ ఉండక తప్పదు"

"నీకు ఎలా కృతజ్ఞత తెలుపుకోవాలో తెలీదు రామం! నీకూ, నర్స్ నిర్మలకీ ఎంతో ఋణపడి ఉన్నాను. ఆమెతో వ్యక్తిగతంగా మాట్లాడి థాంక్స్ చెప్పాలని వుంది" అన్నాడు సారథి.

"ఏం, యింతవరకూ ఆమెతో ఎప్పుడూ మాట్లాడనే లేదా?"

"లేదు. ఆమె చాల ముక్తసరిగా ఉంటుంది. అలా పూరికే మాట్లాడే రకంగా కూడా తోచదు అయినా నేను వచ్చినప్పుడు ప్రతి సారీ ఏ లోటూ లేకుండా ఆదరంతో చూస్తుంది. అందుకే నాకు అభిమానం ఏర్పడింది. వ్యక్తిగా ఆమెపట్ల ఆసక్తి కూడా కలిగింది...."

"కలిగిందా! నకు ఆడవాళ్ళ జాలి పనికిరాదని చెబుతూనే ఉన్నా నుగా" అన్నాడు నవ్వుతూ రామం.

"జాలి అంటే కేవలం మనిషిగా కూడా ఆసక్తి చూపించడానికి వీల్లేదా?"

"అందులోనే ప్రమాదం ఉంది మరి. ప్రారంభంలో అంతా అమాయకంగానే ఉంటుంది."

"అదికాదు నా అభిప్రాయం. ఆమెను చూస్తే ఒక కుతూహలం. క్షయ మూలంగా నేను పోగొట్టుకొన్న దేమిటో అర్థం చేసుకుని, సమాధానపడటానికి ప్రయత్నం చేస్తున్నాను. మరి ఏ వ్యాధీలేని నిర్మల లాంటి వాళ్ళు జీవితంలో ఎలా సమాధానపడుతున్నారా? అనిపిస్తుంది. అందుకే ఆసక్తి చూపించాను"

రామం నవ్వేశాడు. సారథివైపు అదో విధంగా చూశాడు.

"సారథీ, ఏమిటి నువ్వనేది! నల్లనివన్నీ నీళ్ళూ, తెల్లనివన్నీ పాలు అని తప్ప అంతకంటె నువ్వు తెలుసుకోలేదంటే ఆశ్చర్యం వేస్తుంది. నిర్మలా ఈజ్ ఎ టైప్! కొంచం రేటు ఎక్కువే అనుకో. నీకు వంటికి పడదనేతప్ప, నువ్వు కావాలంటే అందుబాటులోనే ఉంది" అన్నాడు.

సారథికి తల తిరిగినట్లయింది.

"మరి అలాంటి దాన్ని నీ నర్సింగ్‌హోంలో....." సందేహం వెలిబుచ్చాడు సారథి.

"అలాంటివాళ్లే పనికొస్తారు. బిజినెస్ లైక్‌గా, సైంటిఫిక్‌గా ఉంటారు. హృదయసంబంధమైన జబ్బులు వాళ్లకు రావు. రొమాన్స్‌కి యిమ్యూన్‌గా ఉంటారు. లేనిపోని వూహలతో ఆశలతో తలనొప్పి తెచ్చి కోరు, తెచ్చిపెట్టరు."

ఆ ప్రస్తావన అంతటితో ముగిసింది. నిర్మలతో మాట్లాడా లని మళ్ళీ రామంతో అనలేదు. తిరిగి వస్తూ తనలో నిర్మలపట్ల కలిగిన అభిప్రాయాన్నిగూర్చి తర్కించుకున్నాడు. ఆలోచించే కొద్దీ తన మొదటి అభిప్రాయానికి, రామం చెప్పిన వివరాలవల్ల వచ్చిన భంగపాటు, సహా లేదు నిర్మలపట్ల కలిగిన ఆప్యాయత యిప్పుడు జాలిగా మారింది. పాపం! ఏం చేస్తుంది. యీ మనుష్యులూ, యీ వ్యవస్థ, ఆమెనట్లా తీర్చి దిద్దాయి! ...కానీ...

జాలి? ఎందుకు జాలి? ఆమె 'మర్యాదస్తురాలు' కాలేకపోయింది దనేనా? ఆమె ఎవణ్నో కట్టుకుని, వాడి అధికారానికి లోబడి బ్రతకటం లేదనేనా? ఆమె బ్రతుకుతున్న విధానం, ఆమెకు తృప్తినిస్తూ ఉందో లేదో తనకేం తెలుసు? సమాజానికి ఒక మార్గం, ఒకనీతి ఉందని భ్రమ పడతాముగాని, సమాజంలోని మనుష్యుల్లో ఒకరి మార్గం మరొక రిది కాదు! అందరిలోనూ రెండు ముఖాలు ఉన్నాయి. ఒకటి సమాజ పరంగానూ, మరొకటి వ్యక్తిగతంగానూ ఉంటుంది సమాజపరంగా ఉండేది ముసుగు (Mask) మాత్రమే! దాని వెనుక ఎవరి కిష్టం వచ్చినట్లు వాళ్లుంటారు.

నిర్మల వేసుకున్న ముసుగు—పెళ్లికాని నిన్సుగో— బాగానే ఉంది. వ్యక్తిగతంగ ఆమె జీవిస్తున్న జీవితమూ ఆమెకి బాగానే ఉండ వచ్చు. బాగా లేదనడానికి సారథి అనెవ్వరు? తనకి నర్సుగా ఆమెచేసిన సేవ, యువతిగా కలిగించిన ఆహ్లాదమూ, నిజంకాక అబద్ధ మెలా లవుతాయి? ఆమె యవ్వనము 'అడవిగా చిన వెన్నెల' అనుకొని ఆప్యా యత ననుభవించడం కాని, ఆమె రహస్య జీవితాన్నిగూర్చి విని జాలి పడటం కాని, పై నిజాన్ని మరీ దగ్గరగా అందుబాటులోకి తెచ్చు కునే ప్రయత్నంగా గాని చాలాకా సౌందర్యాన్ని విలువనీ నాశనం చేస్తున్నది. చంద్రుణ్ణి భూమిమీదనుంచే దూరం నుంచే చూడాలి, దగ్గరకు వెడితే ఏముంది? నీ బాధ, వొవ్వం లవతలివాళ్లకు అక్కర లేదు!

అందుకే ఎదురుగుండా సత్యముగా కనుపించే ఆ గుడిసెలోని స్త్రీ విషయంలోనూడా, వివరాలు తెలుసుకోవడం అనవసరమే!

*　　　*　　　*

స్నేహితుడు విశ్వాన్ని రైలెక్కించడానికి సారథి స్టేషన్‌కి వెళ్ళాడు. విశ్వం ఇంజనీరింగు చదివాడు. నాలుగేళ్ళు నాగార్జున సాగర్‌లో పనిచేశాడు తాత్కాలికమైన ఉద్యోగమేనని, పనిలోంచి తొల గించారు. ఏడాదికి పైగా ఎన్ని ప్రయత్నాలు చేసినా మళ్ళీ ఉద్యోగం దొరక లేదు ఎన్నో ఆశలు పెట్టుకుని చదివించారు తల్లిదండ్రులు. ఆర్థికంగ శక్తిలేక పోయినా తెలివైన కుర్రవాడనీ, ఇంజనీరింగ్‌లో సీటు వచ్చిందనీ, ఉన్నదంతా వూడ్చి పెట్టి వస్తులుండి చదివించారు. ఒక వూరి వారు. విశ్వం కుటుంబం తనకు తెలుసు.

విశ్వం ఒక కొయ్యపెట్టె, ఒక మడత మంచం పట్టుకొచ్చి— "ఇందులో పుస్తకాలున్నాయి. ఈ రెండు వస్తువులూ అట్టే పెట్టు. తిరిగి వచ్చాక తీసుకుంటాను" అన్నాడు.

"ఏం, ఉద్యోగం దొరికిందా? ఏవూ వెడుతున్నావ్?"

"ఉద్యోగం దొరకలేదు శ్రీకాకుళం వెడుతున్నాను."

"ఎందుకు శ్రీకాకుళం?"

"అంతకంటె ప్రస్తుతం చేసేపనేం లేదు గనక."

చివరకు విశ్వం వివరించాడు. వెళ్ళి విప్లవకారులతో కొంత కాలం గడుపుతాడట. (1969) ఈ వ్యవస్థలో యువకులకూ, ప్రజ్ఞా వంతులకూ అవకాశం లేదు రాజకీయంగా నైతికంగా, కుళ్ళి పోయిన ఈ వ్యవస్థని మార్చడం సాధ్యం కాదు. దీన్ని కూకటి వేళ్లతో పెళ్ల గించాలి. దీన్ని తుడిచిపెట్టాలి. మసి చెయ్యాలి. శ్రీకాకుళం నుంచీ

ఈ దావాగ్ని వ్యాపిస్తూ వస్తోంది. విశ్వం ఈ ధోరణిలో ఆవేశంగా మాట్లాడాడు.

"ఇంతకూ నువ్వెళ్ళి చేసే దేమిటి?"

"రక్తం కళ్ల జూడటం. ఈ వ్యవస్థ మూలస్తంభాలని కూల ద్రోయటం. ప్రజావిరోధుల గుండెల్లోకి తూటాలు పేల్చటం.."

"వాళ్ళెవరో నీకు తెలీదు, అంటే వ్యక్తిగతంగా. ఎరుగని మనుష్యులని వాళ్ళు ధనవంతులని తెలిసినంత మాత్రాన, విప్లవ సిద్ధాంతం కోసం చంపబూనటం హృదయావేశంతో సంబంధంలేని ఆ పని, కేవలం యాంత్రిక మైనది కదా, అది నిన్నూ యంత్రంగా మార్చి వేస్తుంది. నువ్వూ ఒక కీలుబొమ్మవే అవుతావు... వ్యక్తిత్వం, వెర్రి సిద్ధాంతాలకు బలి పెట్టాక, మిగిలేదేమీ ఉండదు." సారథి వాదన.

"నువ్వు ఎవళ్లని మనుష్యు లంటున్నావు? వాళ్ళు మనుష్యులు కారు రాక్షసులు!.... హృదయావేశం, అంటే వ్యక్తిగతమైన ద్వేషం, లేకుండా విప్లవంకోసం కర్తవ్యం నిర్వహించడమే కదా ఉత్తమమార్గం... యుద్ధంలో సైనికుడు అలానే చేస్తాడు. సైనికుడు ఆజ్ఞలు శిరసా వహించాలి గాని, యుద్ధ రంగంలో ఒక్కొక్కరూ సొంతంగా ఆలోచించడం ప్రారంభించ కూడదు. ఆ పరిస్థితిలో వ్యక్తిత్వం ప్రశ్నే లేదు!" అని విశ్వం సమాధానం.

"అసలిదంతా ఒక భ్రమ. ఒక ఎండ మావిని చూచి పరుగెత్తడం. మీరు సాధించ బోయే నూతన వ్యవస్థలో మానవ సంబంధాలు కందెనవేసిన చక్రంలా సులువుగా ఆప్యాయంగా పరివర్తిస్తాయి అనుకోడం, అనుకునేంతవరకే బాగుంటున్నది గాని, అందులో నిజంగా నాకు నమ్మకం కలగడం లేదు.. విప్లవంలో హుకుంలు జారీ చేసే వాళ్ళే రేపు విప్లవానంతరం ఆ అలవాటు వదులుకోలేక, తమ చెప్పు చేతల్లో ఉండేవాళ్లని, అలాగే ఉపయోగించు కుంటూ, వాళ్ళనీ, ప్రజలందర్నీ బానిసలుగా చూస్తారు.... అప్పుడేమవుతాయి నీఆశలూ, ఆశయాలూ?"

సమాధానంగా విప్లవాత్మక మార్క్సిజమ్‌ను గురించి విశ్వం ఎంతో వాదించాడు. అలాంటి పర్యవసానం ఉండదన్నాడు. ..చివరకు ఒక్క మాట అన్నాడు. "సీనియర్ సారథీ! భవిష్యత్తునుగూర్చి, విప్లవకారుల మన: పరిణామాన్ని గూర్చి మనం యిప్పుడెందు కాలోచించడం! ఈ నాటి పరిస్థితిలో, నాకు స్వయంగా యింతకంటే చెయ్యవలసిన మంచి పని మరొకటి కనిపించడు! ఏదైనా ఉంటే నువ్వు చెప్పు. చేస్తాను... ఉద్యోగం యిస్తే చెయ్యనన్నానా? కబుర్లు చెప్పి కపటనాటకాలాడుతూ, నీతులు వల్లిస్తూ వ్యవస్థని చేజిక్కించుకుని, యువకుల్నీ, అమాయకుల్నీ, పేదవారినీ హింసిస్తున్న రాక్షసులపై యుద్ధం ప్రకటించడం, యిప్పటికిదే కర్తవ్యం. ఇదే జీవితం, రేపటి సంగతి అక్కరలేదు' భవిష్యత్తు బాగుంటుందనే ఆశతోనే ముందుకు నెడదాం. అందుకే శ్రీకాకుళం వెళ్లే ఏర్పాటు చేసుకున్నాను. అక్కడ నన్ను ఆహ్వానించే మిత్రులున్నారు....," అంటే యిక్కడ లేరనేగా భావం!

సారథికి అతని మన స్థితి అవగాహన అయింది. అతనితో స్టేషన్‌కి వెళ్ళాడు. గార్డు విజిల్ యిచ్చాడు. రైలు కదిలింది విశ్వం ముందుకు సాగిపోతూండగా నిలబడి చూస్తున్నాడు సారథి. ఇంతలో రైలు ఆగిపోయింది. ప్లాట్‌ఫారమ్ మీద సంచలనం, జనం పరుగెత్తారు. గుంపు చేరారు. సారథి అటువైపు వెళ్ళాడు. ఎవరో పంద్రెండేళ్ల కుర్రాడు రైలందుకోవడానికి పరుగెత్తి రైలుకీ, ప్లాట్‌ఫారమ్‌కీ మధ్య యిరుక్కు పోయాడు. బయటికి తీశారు. అతని రెండు కాళ్ళూ, విరిగి పోయాయి. రక్తపు ముద్ద అయిపోయాడు. అంతా అయిదు నిముషాల్లో రైలు బయలుదేరింది. సారథి వెనక్కి నడిచాడు. విశ్వం మళ్లీ కనిపించలేదు. రైలు వెళ్ళిపోయింది.

తిరిగి వస్తూంటే కాళ్ళు తెగిన ఆ రక్తపు ముద్ద కళ్లకు కట్టినట్టయింది. ఆ కుర్రాడు బ్రతుకుతాడా? బ్రతికినా కాళ్ళులేని వాని జీవితం ఎలా ఉంటుంది.? విశ్వం రైలెక్కి వెడుతూండగా అలా జరగటం శుభ సూచకంగా లేదే! అని బాధ.

* * *

సారథి మళ్లీ ఉద్యోగంలో చేరాడు.

ఏకాంతం వదలి మనుష్యుల్లో పడ్డాడు.

క్షయ నయమైందని డాక్టరు చెప్పిన తర్వాత మానసికంగా తనలో వచ్చిన మార్పు సారథికి చీకాకు కలిగిస్తోంది. ప్రొద్దుటి పూట పదింటికి ఆఫీసుకి బయలుదేరే దాకా పూర్వం లాగే వరండాలో కూర్చుని పేపరు ముందుపెట్టుకుని ఆ గుడిసెలోని స్త్రీని గమనిస్తూ ఉంటాడు. కాని సాయంత్రాలు మాత్రం ఒక్కోరోజు ఆమె స్నానం చేసే వేళకు యిల్లు చేరుకోలేక పోతున్నాడు. క్షయ మూలంగా ఏకాంత వాసం చేసిన రోజుల్లో ఏర్పరచుకున్న సిద్ధాంతాల్నీ, జాగ్రత్తల్నీ అతను మరచిపోలేదు. కాని ఆఫీసుకు వెళ్లి రావడంలో సినిమాలకు వెళ్లడంలో అతని మనస్సు ఉద్వేగాన్ని అనుభవిస్తూ కోర్కెలని ఆకట్టుకోలేక పోతోంది. ఈ లోకంలో కనుపించే సౌందర్య సర్వస్వాన్నీ తనలో కలుపుకోవాలనే కోర్కె, శారీరకమైన 'సెక్స్' వాంఛగా మళ్లీ మళ్లీ తలెత్తుతూ ఉంది. కాని క్షయతో తూట్లుపడిన ఊపిరితిత్తులూ, నీరసంతో వగర్చే ఏళ్ళూ, శరీరంయొక్క అల్పత్వం, ఆ కోర్కెని అపహాస్యంచేస్తున్నది, ఈ దేహంతో అనంతమైన సౌందర్య పిపాస తీరదు. శారీరకమైన 'సెక్స్' ఒక ఉపశాంతి మాత్రమే! నిజానికి ఉపశాంతి కూడా కాదు! ఇది తనకు తెలిసినప్పటికీ, వ్యాధి నయమై శరీరం పుంజుకోవడంవల్ల, శరీరం చేస్తున్న ఆందోళన, మృత్యుభయం లేదన్న ధీమావల్ల అణచుకోవడానికి వీల్లేనిదిగా ఉంటోంది.

మనిషి—అంటే మనస్సు—గొప్ప అవకాశమిది. అందుకే శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం అన్నారు. ఏతాత్త్విక దృక్పథమూ, రాజకీయ వాదమూ, సామాజిక సిద్ధాంతమూ మనిషిని నియమించ లేవు. అవసరానికి ఉపయోగపడతాయి తప్ప. విశ్వం పరిస్థితులకూ, మనస్తత్వానికీ, విప్లవ రాజకీయాలు పనికివచ్చాయి. నిర్మలకు బహుశా శాస్త్రీయ దృక్పథమూ, స్త్రీస్వాతంత్ర్య సిద్ధాంతాలూ ఉపయోగపడతాయి. క్షయరోగిగా తనకు సర్వమూ మానసికమే నన్న తత్వం నచ్చినట్టు... కాని తనింకా క్షయరోగినే నన్న సంగతి మరచిపోకూడదు. మరచిపోతే ప్రమాదం.....

"అయ్యగారూ, మనకు గుడ్డు సప్లై చేసే ఆడమనిషి వో పది రూపాయలు ఎడ్వాన్సు కావాలంటుంది. ఉన్నకోళ్ళు పొదుగు తున్నాయంట.

కొత్త పెట్టెలు కొంటానికి డబ్బు పెట్టుబడి కావాలంట. ఆ మనిషయితే, నమ్మకంగా తాజా గుడ్లు యిస్తది. రెండు రోజుల్నించీ, ఎక్కడెక్కడో తిరిగొస్తున్న. మంచివి దొరకటంలే.''

"ఎవరా మనిషి? ఎక్కడుంటుంది?"

"ఇక్కడే, మనింటి వెనకాల గుడిసెలో'' అంటూ పళ్లికిలించాడు వెంకయ్య,

"ఎవరు?" అని మళ్లీ అడిగాడు సారథి.

ఎవరో చెప్పని తెలిసినా, వెంకయ్య నవ్వు చిరాకు కలిగించింది.

"మీరు మేడమీద వరండాలో కూచుంటే ఆ కనిపించే గుడిసెలో వుంటాది. మీరు చూసే వుంటారు."

"ఆఁ ...ఎవరావిడ? ఆమెభర ఏం చేస్తాడు?"

"వాడు లారీ డ్రైవరు. కట్టుకున్నాడు గాదు. లేవదీసుకొచ్చిన బాపతు"

"ఏ వూరు?"

"చిలకల పూడి"

"బందరు దగ్గర చిలకల పూడేనా?"

"ఆ అదే! .. అయితే నెం మంచి మనిషన్నండి! .. మరి డబ్బిస్తారా? తనే వచ్చి అడుగుతా నంటుంది. అదే గాకుండా....ఆఫీసులో ఏదైనా స్వీపరో, నీళ్ల మనిషో, పని యిప్పిస్తే జాగర్తగా చేసుకుంటా పంటది.... మీతో వచ్చి కష్ట సుఖాలు చెప్పుకోవాలంట.."

"అలాగే... ఈ పదీ పట్టుకెళ్లి యివ్వు."

మరునటి రోజు రాత్రి భోజనంచేసి కూర్చున్నాడు సారథి. ముందర బల్లమీద తమలపాకులూ, వక్కపొడీ, సున్నం ఉన్నాయి. వెంకయ్య ఆమెని ప్రవేశ పెట్టాడు. వంటయింట్లో పనుందని వెళ్లిపోయాడు.

తమలపాకు చేతిలోకి తీసుకుని తొడిమ గిల్లుతూ "ఏమిటి?" అన్నాడు సారథి.

"ఇది తీసుకోండి" అన్నదామె.

తలెత్తి చూచాడు. పదిరూపాయల నోటు యివ్వబోతోంది.

"అవసరం లేదు. కోళ్ళు కొన్నాను. డబ్బు లవసరం లేదు." అన్నది వివరిస్తూ,

దగ్గరగా చూస్తే ఆమె చాలా నాజూకు మనిషిగా, దూరం నుంచి తను వూహించినదానికంటె ఆకర్షణీయంగా కనిపించింది. ఆమె చిరునవ్వుతో, దగ్గరగా వచ్చి నోటు తన వైపుకి చాచి నిల్చుంది.

"తమల పాకుని ఎడమచేతిలోకి మార్చుకుని, ఆ నోటు తీసుకుని పళ్ళెంలో పెట్టాడు."

"మరి వెంకయ్యతో అలా చెప్పడ మెందుకు?"

"వెంకయ్యకు డబ్బు విషయం చెబితే గాని, యిక్కడకు తీసుకు రాడని."

**సారథి ఆమె చొరవకు ఆశ్చర్యపడి అలా చూస్తూ ఉండిపోయాడు.**

ఆమె పళ్ళెంలోని ఆకులకు సున్నం రాసి, చుట్టి వక్కపొడి పోసి చేతి కందించింది. వ్రేళ్ళు తాకాయి

"ఏమిటలా చూస్తున్నారు? మేడమీద నుంచి ప్రొద్దస్తమానం అలా చూస్తూ కూర్చుంటే ఎవళ్లయినా ఎలా సహిస్తారు?" అన్నదామె.

ఆమె తమలపాకు చిలకలు చుట్టుతూ, అందిస్తూ ఉంది.

"నువ్వెలా సహించావ్?" అన్నాడు ఈ సారి ఆమెచేతిని పట్టుకుని వదల్లేదు సారథి.

"అబ్బ, వదలండి.... వెంకయ్య వస్తాడు"

"వెంకయ్యేగా యిక్కడకి తీసుకొచ్చాడు?"

"ఇహ నే వెళ్తాను."

"అంతలోనే? నువ్వు వచ్చిన పనేమిటో చెప్పకుండానే?"

"మీడబ్బు మీకిచ్చాను" పిమ్మల్ని చూశాను. ఆపైన మీ దయ"

"నీ పేరేమిటి?"

"రాజమ్మ, రాజలక్ష్మి"

"అయితే రాజలక్ష్మి, నీకేం ఉద్యోగం కావాలి? నువ్వెంత దాకా చదువుకున్నావ్?"

"అయిదో తరగతి... మీ పాదాల దగ్గర ఏ ఉద్యోగమైనాసరే... మీ బాంచను" అన్నది నవ్వుల మధ్య కొంటెగా.

"సరే, నువ్వు తెలంగాణా కూడా చూశావన్న మాట."

"ఆ.. అన్నమాట' ఏడాది ఉన్నందొరా!" అన్నది తెలంగాణా యాసతో.

"తాంబూలం వేసుకో రాజలక్ష్మి"

"ఏదీ, మీరివ్వందే!"

సారథి లేచాడు. వెళ్లి గదితలుపు గడియపెట్టి, ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

తర్వాత ఆమె యించుమించు రోజూ వస్తూనే వుంది. సారథి ఏమి యివ్వబోయినా, చీరెలువంటి బహుమానాలుకాని వస్తువులు కాని, ఆమె తీసుకోవడానికి నిరాకరించింది. గుడిసెలో కాపురమున్నా తనకు దారిద్ర్యం లెదన్నది. వెంకయ్యకు మాత్రం అతని జీతంగాక అదనంగా యివ్వమని ఆమె సలహా.

శారీరకమైన "సెక్సు" మానసికమైనఆకర్షణ స్థాయిని అందుకో లేదన్న సారథి సిద్ధాంతం కొత్త అనుభవంతో, నిరాధారమని తేలింది మనస్సు మనస్సుగా అందుకోలేని శిఖరాగ్రాన్ని దేనితో ఈ అనుభవం అందుకుంటోంది. సారథికి యిప్పుడు సందేహాలూ, వూహాలూ, రావడం లేదు. ఆమె రాకకు ఎదురు చూడడమే మనుగడకి అర్థంపరమార్థంగా ఉన్నది. నిజానికి ఈ అనుభూతి శరీరాన్నీ మనస్సునీ అధిగమించిన దివ్యానుభూతిగా ఉంది ...

ఒక నెల గడిచింది. సారథికి రాత్రి పూట దగ్గు వస్తోంది. రాజలక్ష్మి యిప్పుడు మూడు నాలుగు రోజులు వరుసగా వెంకయ్య

చేత కబురు పెట్టితేగాని, రావడం లేదు. వచ్చినప్పుడు, "మీ ఆరోగ్యం జాగ్రత్త. మీరు డాక్టర్ని చూశారా?" అంటున్నది.

సారథికి డాక్టరు దగ్గరకు వెళ్లడానికి మనస్కరించడం లేదు.

సారథికి మగ పిల్లవాడు పుట్టాడని టెలిగ్రాం వచ్చింది.

రాజలక్ష్మితో చెప్పాడు.

"ఇహనేం! వెళ్లిరండి... మీ ఆవిడ కూడా వచ్చేస్తుంది తొందర లోనే!"

సారథి ఆలోచిస్తున్నాడు. ఏమీ అనలేదు.

"వచ్చే నెలలో మేం కూడా వెళ్లి పోతున్నాం" అన్నదామె.

"ఎక్కడికి?"

"మరో వూరు."

"నువ్వు వెళ్లడం దేనికి? వెడితే అతను వెళ్లనీ, ఈ వూళ్లో మంచి ఇల్లు చూస్తాను అక్కడ ఉందుగాని, నువ్వేం నాకు భారం కాదు." అన్నాడు సారథి.

"ఆమె నవ్వుతోంది." బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుని.

"మంచివాడే! నా భర్త నన్నలా వదలి వెళ్తాడా? నన్ను చంపేస్తాడు?"

"నీ భర్తా? నిన్ను లేవదీసుకు వచ్చాడుగా, అతనికేం అధికారం?"

"కాదు. దైవ సాక్షిగా తాళికట్టిన భర్త."

"మరి వెంకయ్య అలా చెప్పాడేం?"

"వెంకయ్యకు అలా చెబితే గాని, అర్థం కాదు! మీతో స్నేహం చేసుకోవడానికి ఎన్నిపాట్లు పడ్డాననీ!"

"మరి నీ భర్త, నువ్వు చేస్తున్న దేమిటి?"

"ఆయన లోకం చూపించిన మొగుడు, నువ్వు మనస్సుకి నచ్చిన వాడివి."

"మరి నాతో ఉండక, అతనితో వెళ్లిపోతా నంటా వేం?"

"అది అంతే! నలుగురూ నడిచే దోవని నడవ్వొద్దా?"

సారథి ప్రాథేయ పడ్డాడు. అలిగాడు. ఆశలు పెట్టాడు. ఆస్తి వ్రాసి ఇస్తా నన్నాడు. రాజలక్ష్మి ససేమిరా అన్నది.

ఆ రాత్రి ఆమె వెళ్లి పోయాక అతనికి రక్తం వాంతి అయింది. బేసిన్‌లో ఆ ఎరుపు మీద కొళాయి త్రిప్పి, నోరు కడుక్కుని వచ్చి పడుకున్నాడు.

రాజ లక్ష్మికి కబురు చెయ్యగా, చెయ్యగా నాలుగు రోజులకి వచ్చింది. ఆమె భర్త ఆ తెల్లవారు జామున వస్తాడట. మరుసటిరోజే తను వెళ్లి పోతుందట వచ్చేనెల దాకా ఆగదట.

సారథి ఆపిల్ పండు ముక్కలు కోస్తున్నాడు. కత్తి పదునుగా ఉంది. వేలుకోసుకున్న రక్తం చివ్వుమని, ముక్కలకు అంటింది.

"మీ రక్తం అంటిన ముక్క నేను తినాలి." అన్నది రాజ లక్ష్మి.

ఆరాత్రి అతని కౌగిట్లో మైమరచి కన్నుల మూసిన క్షణంలో, కత్తి ఆమె గొంతులో గాఢంగా దిగబడింది.

సారథిని పోలీసులు పట్టుకు పోయారు.

విశ్వాన్ని పోలీసులు కాల్చేశారు.

"మృత్యోర్మా౽మృతంగమయ"

# వ్రాత ప్రతుల లేఖన సంప్రదాయములు — పరిష్కర్తల వింతధోరణులు

శ్రీ వంతరాం రామకృష్ణారావు

తెలుగుకావ్యముల పరిష్కరణ నానాటికి తీసికట్టుగా ఉన్నదే కాని మెరుగుపడుటలేదు. దీనికి కారణములు రెండు. (1) అపరిజ్ఞానము, అనార్జవము, స్వవాదస్థిరీకరణాభినివేశము లోనగు దుర్గుణములు రక్తములో జీర్ణించిన లబ్ధప్రతిష్ఠులు పరిశోధకులుగా పరిష్కర్తలుగా బయలుదేరుట. (2) పరిష్కరణ మర్యాదలు నిర్దేశించు మూలసూత్రములు రూపొందించక పోవుట. వ్రాతప్రతుల లేఖన సంప్రదాయమును తెలిసికొని పరిష్కరణ చేయవలె నన్నది పరిష్కరణ మూలసూత్రములలో ఒకటి. దీనిని గమనింపని పరిష్కర్తల వింత ధోరణుల వల్ల కలిగిన అనర్థములను ఈ వ్యాసములో సంక్షేపముగా తెలుపుదును.

(1) పరుష సరళ వ్యత్యాసము :— పాండురంగ మాహాత్మ్యములో, "కప్పురము క్రుమ్మరించిన కనకక్రోవి" (4—8) అని వావిళ్ల ప్రతిలో ముద్రింపబడినది. సుపరిష్కృత మని చెప్పదగిన అకాడమి ప్రతిలో కనప క్రోవి— అను పాఠముతో నిది ముద్రింపబడినది. వీనిలో, కనక క్రోవి —అన్నదే కవిపాఠమని భాగవతపాఠ పరిశోధన గ్రంథములో చర్చించ బడినది. కనుము + క్రోవి = కనపక్రోవి— అని పరిశోధకులు, అర్థము చేసికొనిరి. రెల్లుగొట్టమను నర్థము సరిపడదు గనుక, కనక క్రోవి సాధుపాఠమనిరి. అసలు విషయమేమనగా కనక అనునది పరిష్కర్తల దిద్దుబాటే కాని పాఠముకాదు.

కనప— అన్నదే ఉపలబ్ధపాఠము. లేఖన సంప్రదాయమును గుర్తింపని పరిష్కర్తలు కనపను కనకగా సవరించిరి. అదే కవిప్రయోగ మని పరిశోధకులు చిందులు తొక్కిరి. వ్రాతప్రతులలో సరళములను పరుషములుగా వ్రాయుట సంప్రదాయము. కావున, గనప క్రోవిని, కనపక్రోవిగా లేఖకులు వ్రాసిరి. గనప = పెద్ద, గనపక్రోవి—సలక్షణ మైన ఆచ్ఛిక సమాసము. కాశీఖండములోని 'గనపతరి' అను పాఠమునకు కూడ ఇట్టి గతియే పట్టినది. 1953 కాశీఖండ ముద్రణములో— "కలప తతియుం గోలెన్" (1—133) అని కలదు. 1916 ముద్రణములో "ఘనవితతియుం బోలెన్" అని కలదు. గనప తరియుం బోలెన్— చిన్నయ సూరి నిఘంటు పాఠము. (చూ సాగరు—సూ. వి.) వ్రాతప్రతులలో, గనప శబ్దము కనప శబ్దముగా లిఖింపబడియుండును. కనపను ఒకపరిష్కరణలో— కలపగా మార్చినారు. మరొక పరిష్కరణలో— ఘనవితతిగా దిద్దివేసినారు. కీచిన వెదురు సలాకల—అను క్రీడాభిరామ పద్యము నందలి కీసిన— అను రూపము లేఖన సంప్రదాయము వల్ల వచ్చినదే. గీసిన—సాధువు గీయు = గీఱు—ఇత్యాదుల వల్ల ఇది గకారాది పదమే కాని కకారాది పదముకాదు. పరిష్కర్తలు, కీయు—ధాతువు కల దనుకొన్నారు.

(2) శ స ల వ్యత్యాసము:— వ్రాతప్రతులలో, సే—అను అక్షరమును "శా" అని వ్రాయుట సంప్రదాయము. శామంతికా ప్రసగం చితి (భాగ. 10—796) అని భాగవతములో ముద్రించినారు. శ. ర. కర్త సేమంతికా— పాఠముతోనే దీనిని చూపినాడు. లేఖన సంప్రదాయమును గుర్తింపని బాగ. పరిశోధకులు శామంతికా అన్నది చామంతి యొక్క భ్రష్టరూపమని చెప్పి తమ విజ్ఞతను చాటుకొన్నారు. భాగవతములో "శరణంబులు నీపదాబ్జ శాలా నిరతుల్" అని వ్రాతప్రతులలో కలదు. శాలా నిరతుల్— అన, దానిని కొందరు పరిష్కర్తలు సంస్మరణంబుల్—ఇత్యాదిగా దిద్దివేసినారు. పరిశోధకులు, శాలానిరతుల్—అన్నదే కవిపాఠమన్న అపవాద మును వదలలేదు. ఇటు, సెరణంబులు నీపదాబ్జ సేవానిరతుల్—కవిపాఠము లేఖన సంప్రదాయము, గ్రాంథిక భాషా తత్త్వము తెలిసినవారికి కాని యిందలి సామంజస్యము బోధపడదు.

(3) "హ—ంహ", వర్ణముల వ్యత్యాసము :— వ్రాతప్రతులలో హ్వా—ంహ, వర్ణములు పరస్పరము వ్రాతలో మారుచుండుట పరిపాటి. భాగవతములో — ఉదంచ, త్క్షరతర జింహానకు నుగ్రతర రంహానకున్—అని వ్రాతప్రతులలో కలదు. (బాగ 7—294) ఇటు జిహ్వానకు— అనియే కవిపాఠము. ఉచ్చరణ ననుసరించి శబ్దాలంకారమును నిర్వహించుకొనవలెను. "గహ్వరాంతరముల సింహ మధ్య", (శంకర. హరి 4—62) అనుచోట ఉచ్చారణ ననుసరించి ప్రాసయతి యిట్లే నిర్వహించ బడినది. లేఖన సంప్రదాయమును గుర్తించని పరిశోధకులు, జింహానకు కవి పాఠమనిరి. జ్ఞకారము వ్రాతప్రతులలో "గ్ఞ" అను రీతిని వ్రాయుబడును. అనగా, అగ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము సేయున్" (శాంతి 4—255) అనురీతిని వ్రాయబడు నన్నమాట. అంతమాత్రాన అగ్ఞానికి కవిపాఠ మనరాదు. ఉచ్చారణ ననుసరించి యతిమైత్రి సమ్మత మనుకొనవలెను. ఇట్లే జింహానకు అనుచో జిహ్వానకు— అనియే గ్రహించవలెను.

(4) యద్విత్వము — పూర్వస్వరహ్రస్వము:—దీర్ఘము మీది యకారమునకు ద్విత్వమును పూర్వస్వరమునకు హ్రస్వమును వ్రాయుట లేఖన సంప్రదాయము. 'అయ్యా కొడుకుల కొఱకై' యియ్యాగము నీయనేజ్ఞనే జేయంగా నియ్యాడ దేల పుట్టెను, మియ్యంతటి వారి కొండు మేరయు గలదే" (బాగ. 9—12) అను రీతిని వ్రాతప్రతులలో కలదు లేఖన సంప్రదాయము నెరుగని పరిశోధకులు "మియ్యంతటి" అనియే కవిప్రయోగించెనని ప్రతారించుటకు వెనుదీయలేదు. బసవ పురాణములో "అయ్యాయనుడు నేమి యయ్యాయనెడు త, దియ్యా నామంబ నజ్జియ్య యడంచి" అని ముద్రింప బడెను. అపశబ్దములు వాడరాదని ఉద్ఘోషించిన కవి తదియ్య— వంటి అపశబ్దమున వాడ యుండడన్న వివేకము పరిష్కర్తలకు లేకపోయినది. భాగవతములో

# తొల్కాప్పియము

## డా॥ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

తమిళమునందు నేడు మనకు ఉపలబ్ధము లగుచున్న గ్రంథము లలో అతి ప్రాచీనమయినది తొల్కాప్పియము ఒక్క తమిళమునందే కాక దక్షిణ దేశభాషలయందే యిదియాద్య గ్రంథము ఇది యొక లక్షణ గ్రంథము. తొల్కాప్పియర్ లేక తొల్కాప్పియనార్ గనికి కర్త తొల్కాప్పియర్ అనునది అతని అసలు నామధేయము కాదు అతని యసలుపేరు తెలియకపోవుటచే తమిళులు అతడు రచించిన గ్రంథమునుబట్టి అతనిని తొల్కాప్పియర్ అను బిరుదనామముతో సంభావించు చున్నారు అతని తలిదండ్రు లతనికి 'తీర్ణధూమాగ్ని' అని పేరు పెట్టినట్లు చెప్పుదురు ఇతని నామమును గూర్చి మరియొక యభిప్రాయము కలదు కాప్పియర్ అనునది ఒక తెగకు పేరు ఆ తెగకు చెందిన పలువురు ప్రముఖులలో ఇతడు ఆద్యు డగుటచె అతడు తొల్కాప్పియర్ అయ్యెను. అతనిపేరు మీదుగా అతని కృతికి తొల్కాప్పియర్ అయ్యెను అతని పేరుమీదుగా అతని కృతికి తొల్కాప్పియము అని పేరయ్యెను ఇళంపూరణన్ అను వ్యాఖ్యాత రచించిన వ్యాఖ్యానమునకు ఇళంపూరణం అనియు, నచ్చినార్ కినియర్ అను విద్వాంసుడు రచించిన వ్యాఖ్యానమునకు నచ్చినార్ కిని యని అనియు పేర్లు వ్యవహారములోనికి వచ్చినట్లే తొల్కాప్పియర్ రచించిన గ్రంథము తొల్కాప్పియముగా వ్యవహారములోనికి వచ్చియుండునని వారి యభిప్రాయము. ఇట్లు అతనిని బట్టి గ్రంథమునకు పేరయ్యెనో, గ్రంథమును బట్టి యతనికి పేరేర్పడెనో యిదమిత్థమని నిర్ణయింప జాలము.

ఇతడు జమదగ్నివంశ్యుడనియు, అందుచే బ్రాహ్మణు డనియు కొందరి యభిప్రాయము. తొల్కాప్పియములోని కొన్ని యాధారము లను బట్టి యితడు జైనమతావలంబకుడని తెలియు చున్నది అందలి పొరుళ్ అధికారములోని 'మరబియల్' అను నధ్యాయమున జైనుల విభాగమును అనుసరించి యతడు జీవులు, అజీవులు (ఓర్ అరివుయిర్ ఇత్యాది)అని వర్గీకరణము చేసి యుండుటయే దీనికి ఆధారము తొల్కాప్పియనార్ సతీర్థ్యు డగు పనంపారనార్ అను నొక కవీశ్వరుడు రచించిన పద్య మొకటి దీని ప్రారంభమునందు కలదు దానికి 'శిరప్పు పాయిరం' అని పేరు. అందు 'పడిమై యోన్' అని యితనిని గూర్చి ప్రస్తావింప బడి యున్నది దానిని బట్టి కూడ అతడు జైనమతావలంబకు డనుట యూహింపదగి యున్నది. 'పడిమై' అనునది జైనమతము నకు చెందిన ఒక యారాధన విధానము 'పడిమై యోన్' అనగా 'పడిమై' అను జైన సమయాచారమును పాటించువాడని యర్థము. నిలంతరు తిరువీర పాండ్యన్ అనుమహారాజు నాస్థానిలో నుండిన 'అదంగోట్టాశాన్' అనునతడు తొల్కాప్పియమును కూలంకషముగా పరిశీలించి, యందలి సిద్ధాంతములకు తన యామోదమును ప్రకటించె నని కూడ ఆ పాయిరము (పద్యము) తెలుపు చున్నది. అదంగోడు అనునది తిరువాన్కూరు ప్రాంతమున నున్న యొక గ్రామము దీనిని బట్టి తొల్కాప్పియరు కూడ తిరువాన్కూరు ప్రాంతమునకు చెంది యుండదగు నని యూహింప బడుచున్నది. తొల్కాప్పియమునందలి (ఎలుత్తు 241, 287, 378) కొన్నిసూత్రములు నేటికిని కేరళ భాషయందు నిలిచియున్న ప్రయోగములకు సంబంధించి యుండుట యీ యూహకు కొంత ఉపబలక మగుచున్నది పయి పద్యమునందు తెలుపబడిన యీ పాండ్యరాజు ఎవరో తెలియవచ్చుట లేదు సంగ కాలపు సాహిత్యమున ఈ పదము చేరరాజపరముగాను, విష్ణుపరముగాను కూడ ప్రయుక్తమై కానవచ్చుచున్నది అందుచే నిది యొక వ్యక్తి నామధేయము కాదనియు, కేవలము వర్ణనాత్మకమయిన ఒక విశేషణ మనియు తెలియును. ఇళంపూరణర్ అను వ్యాఖ్యాత జయమాకీర్తి అను పాండ్యరాజే అందు ప్రస్తావింపబడిన పాండ్యరాజని అభిప్రాయ పడుచున్నారు కాని సంగకాలమున లట్టి పేరుతో ఒక పాండరాజు వెలసి యుండెననుటకు ఎట్టి యాధారములును లభించుట లేదు. అగత్తియం అను వ్యాకరణ గ్రంథమునకు కర్త అని చెప్పబడు అగస్త్య మహర్షికి పండ్రెండుగురు శిష్యులు ఉండిరనియు, తొల్కాప్పియర్ వారిలో ఒకడనియు చెప్పుదురు

ఇతని జీవితమునకు సంబంధించిన యితర విషయములవలెనే యితని కాలము కూడ వివాదగ్రస్తమై యున్నది ఇతడు క్రీ పూ. 1000 సం క్రాంతమునకు చెందినవాడని కొందఱును క్రీ పూ. 500 సం ప్రాంతమునకు చెందినవాడని కొందఱును అభిప్రాయ పడుచున్నారు. ఇతడు క్రీ. శ. అయిదవ శతాబ్ది ఉత్తరభాగమునకు చెందినవాడని కూడ ఒక వాదము కలదు. తొల్కాప్పియము ప్రారంభమునందు రచితమయిన 'శిరప్పు పాయిర' మను పద్యమున తొల్కాప్పియర్ 'ఐందిర' (ఐంద్రము) అను ఒక వ్యాకరణమును క్షుణ్ణముగా పఠించి యుండెనని తెలుపబడినది అది పాణినికి పూర్వము వెలసిన వ్యాకరణము పాణిని క్రీ. పూ 4 లేక 5 శతాబ్దమునకు చెందినవాడు. అందుచే తొల్కాప్పియర్ కనీసము క్రీ పూ అయిదవ శతాబ్దికి చెందిన వాడనియు, తొల్కాప్పియము నాటికే తమిళమున విస్తారమయిన సాహిత్యము— దానికి లక్ష్యభూతము కాదగినట్టిది— ఉండియుండు ననియు, అతిప్రాచీన మయిన ఆ సాహిత్యమంతయు కాల గర్భమున కలిసి పోయి యుండు ననియు తమిళవిద్వాంసులు అభిప్రాయపడు చున్నారు. తొల్కాప్పియము క్రీ. పూ అయిదవ శతాబ్ద ప్రాంతమున రచితమయి యుండుననుటయే నేడు పలువురు తమిళవిద్వాంసుల అభిప్రాయము. మఱియు తొల్కాప్పియమును, సంగయుగమునందు వెలసిన తమిళసాహిత్యమును లోతుగా తఱచి పరిశీలించిన విద్వాంసులు— ప్రాచీన వ్యాఖ్యాతలకువలెనే— అది సంగయుగమునకు పూర్వకాలమునందే రచింపబడి

యుండునని యభిప్రాయపడుచున్నారు[1] వారట్లు అభిప్రాయపడుటకు కారణము లివి

వా (వచ్చు), తా (ఇచ్చు) అను ధాతువులకు ఉత్తమ మధ్యమ పురుషములయందే నియతప్రయోగము— అల్లే శెల్ (పోవు), కొడు (ఇచ్చు) అను ధాతువులు ప్రథమపురుషమునకు మాత్రమే నియతము లగుట— వియన్ కోళ్ ఒక్క ప్రథమపురుషమునందు మాత్రమే నియతముగా ప్రయుక్తమగుట— సంజ్ఞానామములకు, బిరుదనామములకు సంబంధించిన ప్రయోగ విజ్ఞానము— తాన్, పేన్ అను వానిని సంజ్ఞావాచకములుగా వ్యవహరించుట— ఈ మొదలగు సంశములు అన్నియు సంగయుగమునాటికే భాషా వ్యవహారము నుండి తొలగిపోయి, నిరాదృతము లయినట్లు కానవచ్చును. అవి తరువాత కాలమున వ్యవహారములో స్థిరపడి గ్రంథభాగమున చేర్పబడియుండ వచ్చునని యూహించుటకును వీలులేదు. ఏలయనగా సంగ యుగమునకు తరువాతి కాలమున వెలసిన సాహిత్యమునందు వీని ననుసరించిన ప్రయోగములు చూపట్టుట లేదు.

కాని యస్ వైయాపురిపిళ్ళె అను విద్వాంసుడు మాత్రము బహుజనాంగీకృత మయిన యీ యభిప్రాయమునకు విరుద్ధముగా తొల్కాప్పియము క్రీ. శ. అయిదవ శతాబ్ది ఉత్తరార్ధభాగమున రచిత మయిన గ్రంథముగా సంభావించు చున్నారు. వారి వాద సారాంశ మిది.

'ఐంద్ర' మనునది ఒక వ్యాకరణ గ్రంథము కాదు అది ఇంద్రుడు ప్రవర్తింప జేసినదిగా చెప్పబడు ఒక వ్యాకరణ సంప్రదాయము మాత్రమే అది పాణినిక పూర్వకాలమునందుండి యుండినను— ఐంద్రమను పేరు మాత్రము పాణినికి తరువాతి కాలముననే ప్రచారమునకు వచ్చినది పాణిని దానిని పేర్కొన లేదు పాణినికి తరువాతి కాలమున కూడ ఐంద్ర సంప్రదాయము జైనులు మొదలగువారిచే అనుసరింపబడుచునే యుండెను. క్రీ పూ మూడు నాలుగు శతాబ్దములకు చెందిన 'కా తంత్ర'మను వ్యాకరణము ఆ సంప్రదాయమునకు చెందినది

తొల్కాప్పియము పెక్కు తావులలో పాణినిని అనుసరించి యుండెననుట స్పష్టము. అందు పాణినిని అనుసరించిన పట్టులు పెక్కు కానవచ్చును. పతంజలి మహాభాష్యము కూడ అందు అనుసరింపబడినది. పతంజలి సమాసములను నాలుగు విధములుగా వర్గీకరించెను. పూర్వపదార్థ ప్రధానము, ఉత్తర పదార్థ ప్రధానము, అన్య పదార్థ ప్రధానము, ఉభయ పదార్థ ప్రధానము— అని. తొల్కాప్పియము ఈ వర్గీకరణమును (సొల్ 419) అనుసరించుట మాత్రమే కాక వానిని యథాతథముగా తమిళములోనికి అనువదించి ప్రయోగించెను. వానిని తెలుపు సందర్భమున 'ఎన్బ' (అని చెప్పుదురు) అని యతడు ప్రయోగించి యుండుట గూడ అతడు వానిని పూర్వ గ్రంథముల నుండి గ్రహించి యుండెననుటను నిరూపించు చున్నది

తొల్కాప్పియములో మనుధర్మశాస్త్రానుసరణము కూడ కొంత కానవచ్చును దీనినిబట్టి తొల్కాప్పియము క్రీ. శ రెండవ శతాబ్ది తరువాతి కాలమునకు చెందిన దగును. భరతుని నాట్యశాస్త్రము వాత్స్యాయనుని కామ సూత్రములు, కౌటిల్యుని అర్థ శాస్త్రము— అను గ్రంథముల ప్రభావము కూడ తొల్కాప్పియమునందు కానవచ్చును కౌటిల్యుని కాలము వివాదగ్రస్తమగుటచే అది దీని కాల నిర్ణయమునకు అంతగా తోడ్పడక పోవచ్చును భరతుని నాట్యశాస్త్రమును అనుసరించి యిందు అష్ట విధములగు రసములు, ఎనిమిది విధములగు సాత్త్వికభావములు (మెయ్‌పాడు), కామ సూత్రముల ననుసరించి తొల్కాప్పియము క్రీ. శ. 4 వ శతాబ్ది తరువాత కాలమునకు చెందిన దగును.

పయి చూపిన యీ కారణముల యాధారముతో తొల్కాప్పియర్ క్రీ. శ. అయిదవ శతాబ్దికి చెందియుండునని శ్రీ వైయాపురిపిళ్ళె అభిప్రాయపడు చున్నారు క్రీ. శ 470 లో వజ్రనంది యొక తమిళ సంఘమును స్థాపించెనని తెలియుచున్నది బహుశ వజ్రనంది స్థాపించిన యీ సంగము యొక్క యాధ్వర్యములో ఈ గ్రంథము రచితమయి యుండవచ్చును. తొల్కాప్పియమునందు 'ఓరై' (హోర— సంస్కృతము) అను పదము ప్రయుక్తమై యున్నది సంస్కృతములోని జ్యోతిషగ్రంథములలో తత్కర్తలు గ్రీకుభాషనుండి యీ పదమును గ్రహించి ప్రయోగించిరి ఆ జ్యోతిష గ్రంథములు క్రీ. శ. 3 లేక 4 శతాబ్దములకు చెందిన వగుటచే— ఆ పదమును కొంత వికారముతో ప్రయోగించిన తొల్కాప్పియర్ ఆ కాలమునకు తరువాతి వాడనుట మరింత నిశ్చయ మగుచున్నది

ఇట్లు వైయాపురిపిళ్ళె పెక్కు ఆధారములు చూపి తొల్కాప్పియమును క్రీ. శ. అయిదవ శతాబ్ది కాలములో రచితమయి యుండునని నిరూపించినను— తమ భాషా గ్రంథమునకు ప్రాచీనతా గౌరవమును కూడ సంపాదింపవలయుననెడి అభిప్రాయముతో తమిళవిద్వాంసులు పయివాదమును దేనిని సమ్మతింపక— అది క్రీ పూ అయిదవ శతాబ్ది ప్రాంతమున రచితమయి యుండు ననువాదమునే విశ్వసించు చున్నారు పాణిన్యాదుల గ్రంథములలో కానవచ్చు సంవాదములు, అనుసరణములు తొల్కాప్పియము యొక్క ప్రభావఫలితము లయి యుండ వచ్చుననియు— లేదా— ఆయా గ్రంథముల రచయితలకు ఆయా యి భావములు స్వతంత్రములుగనే యుద్భూతము లయి యుండవచ్చుననియు వారి వాదము.

ఇట్లు దీనికాలము ఇదమిత్థమని నిర్ణయింపలేకున్నను ఇది అతి ప్రాచీన కాలమునకు చెందిన లక్షణ గ్రంథమనియు—అట్టి లక్షణ గ్రంథము వెలయుటకు పూర్వము ఆ భాషలో దానికి లక్ష్యభూత మయిన విస్తారమగు సాహిత్యము వెలసి యుండుట సంభావ్యమనియు మనము అంగీకరింపక తప్పదు. కాల్డ్వెల్ మహాశయుడు దీనిని గూర్చి యిట్లు తెలిపి యున్నారు.

---

1. 'Those who have made an intensive study of this work and the cankan Literature, like the old commentators, held that Tolkappiam belongs to a pre-cankam Period.'

—T. P. Meenakshi sundaram

A History of Tamil Language p. 51

'Whatever antiquity may be attributed to Tolkappiam, it must have been preceeded by many centuries of literary culture ...It lays down rules for different kinds of poetical compositions, which must have been deduced from examples furnished.'—

తొల్కాప్పియము అనునది యీ గ్రంథమునకు తరువాతి కాలమున ఏర్పడిన వ్యవహార నామము. తొల్కాప్పియర్ దానికి ఏమని పేరు పెట్టెనో తెలియదు. తొల్కాప్పియం అనగా ప్రాచీన గ్రంధమని అర్థము. తొల్ అనగా ప్రాచీనము 'కాప్పియం' అను మాటకు రక్షకము లేక రక్షణమునకు సంబంధించినది (కాప్పు ఇయ్యన్రదు— కాప్పు— రక్షణముగా), ఇయ్యన్రదు— చేయబడినది) అని యర్థము. వ్యాకరణము యొక్క పరమార్థము బాషా రక్షణమే యగుటచే కాప్పియం అనుమాటలోనే వ్యాకరణ గ్రంథము యొక్క నిజమైన లక్ష్యము ఇమిడి యున్నదని చెప్పవచ్చును ఇట్లు ప్రాచీనమైన భాషా రక్షక గ్రంథము అను అర్థముతో ఆ గ్రంథమునకు 'తొల్కాప్పియమ' అను పేరు ఏర్పడినదని తమిళ విద్వాంసులు అభిప్రాయపడుచున్నారు కాని మరి కొందరు విద్వాంసులు, 'కావ్య'మను సంస్కృత పదమునకు 'కాప్పియం' అనునది తమిళరూపమనియు— కావ్య పద మిచట గ్రంధార్థమున ప్రయుక్త మయ్యెననియు— అందుచే ప్రాచీన గ్రంధ మను నర్థములో అది 'తొల్కాప్పియము' అని వ్యవహృత మగుచున్నదనియు అభిప్రాయ పడుచున్నారు ఈ రెండవ వాదమే సమంజసమైనదని తోచు చున్నది. కాప్పియం అనునది సంస్కృత కావ్య పదమునకు పర్యాయ మనుటను సహించని తమిళ విద్వాంసులు దానికి కల్పించిన యర్థమును తొలి వాదము వివరించును. మునుపు తెలిపినట్లు కవి నామమునుబట్టి యీ గ్రంధమునకు తొల్కాప్పియము అనుపేరు వచ్చి యుండుట యదార్థమగుచో ఈ యూహాగాన మంతయు వృధాస్త మగును.

తొల్కాప్పియము మూడు భాగములుగా రచితమైనది అందలి భాగములకు 'అదిగారము' (అదికారము) లు అని పేరు. అందు మూడు అధికారములు కలవు అవి 1 ఎలుత్తు అధికారము. 2 సొల్ అధికారము, 3 పొరుళ్ అధికారము. ఇందలి ప్రథమభాగ మగు ఎలుత్తు అధికారము (అక్షరాధికారము Orthography) నందు ధ్వని సూత్రముల ననుసరించిన వర్ణసమామ్నాయము. సంధి విధానము మొదలగునవి శాస్త్రీయముగా ప్రదర్శింపబడినవి. ద్వితీయభాగమగు సొల్ అధికారము (శబ్దసంయోజనము, వాక్యసంయోజనము— వీనికి సంబంధించిన అధికారము— Morphology) నందు శబ్దముల సంయోజనము, వివిధములగు బాషా భాగములు, సమాసము లేర్పడు విధానము మొదలగు నంశములు వివరింపబడినవి సంస్కృతమునందు వలె శబ్ద రూపములనుబట్టికాక అర్థమునుబట్టి లింగ వివక్షను తెలుపుట యందు అత్యాశ్చర్యకరమైన విషయము దీనినిబట్టి తొల్కాప్పియము నాటికే తమిళమునందు వ్యాకరణ సంబంధమైన లింగము (Grammatical gender) లేదని తెలియుచున్నది ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు దీనిని శాస్త్రీయముగా రూపొందింపబడిన ఒక గొప్ప వ్యాకరణ గ్రంధముగా సంభావించు చున్నారు. అట్లు వారు దానిని సంభావించుటకు కారణము అందలి మొదటి రెండు అధికారము లని నిశ్చయముగా చెప్పవచ్చును ఇందలి మొదటి రెండు అధికారములును భాషా శాస్త్రమునకు సంబంధించినవి కాగా మూడవది యగు పొరుళ్ అధికారము కావ్యవస్తువునకు, సంప్రదాయమునకు సంబంధించియున్నది. ఇది యీ గ్రంధములో మిక్కిలి ప్రధానమైన భాగమని చెప్పదగును చక్కగా వికాసము పొందిన తమిళుల సంస్కృతిని, వారి జీవిత విధానమును, వారి సాంఘిక సంప్రదాయములను ఇది అద్దము పట్టినట్లు వివరించు చున్నది.[2] ఇట్టి గ్రంధము వెలువడుటకు పెక్కు శతాబ్దములకు ముందునుండియే తమిళులు గొప్ప నాగరిక జీవితమును గడుపుచుండిరనియు, ఆ తరువాతనే అట్టి జీవితవిధానమును ప్రదర్శించు ఈ గ్రంధము రచితమై యుండుననియు యూహింపబడుచున్నది. శ్రీ వి. ఆర్ రామచంద్ర దీక్షితర్ పొరుళ్ అధికారమును గూర్చి యిట్లు తెలిపియున్నారు. 'This part gives us a glimpse of the political, social and religious life of the people and the importance of the work is further enhanced by several commentators of great repute.' శ్రీ టి శేష అయ్యంగార్ అను విద్వాంసుడు తెలిపిన యీ అభిప్రాయము ఇట అనుసంధింపదగి యున్నది 'Dravidian genius is conopicuous not merely in the sphere of language but also in that of Literature Of all these races of India the only people who had a poetical literature independent of Sanskrit are the Tamils, a typical dravidian people'

తొల్కాప్పియమునందలి ఒక్కొక్క యధికారమునందును కొన్ని అవాంతర విభాగములు (Sub—Sections) కలవు వానికి తమిళమున 'ఇయల్' అని పేరు. తెలుగున దానికి 'అధ్యాయము' అనునది సమానార్థకముగా గ్రహింపదగును. తొలి దగు ఎలుత్తు అధికారమునందు తొమ్మిది అధ్యాయములు (ఇయల్) రెండవది యగు సొల్ అధికారమునందు తొమ్మిది అధ్యాయములు (ఇయల్), మూడవది యగు పొరుళ్ అధికారమునందు తొమ్మిది అధ్యాయములు (ఇయల్) చొప్పున ఇందు మొత్తము ఇరువది యేడు అధ్యాయములు కలవు. ఎలుత్తు అధికారములోని అధ్యాయముల వివరము.

1. నూన్ మరబు (ధ్వనులు, సంజ్ఞలు, వ్యాకరణపరిభాష).
2. మొయిమరబు (వర్ణస్థాన నిర్ణయము)
3. పిఱప్పియల్ (ధ్వనుల ఉత్పత్తి)
4. పుణ రియల్ (సంధి— సామాన్య సూత్రము)
5. ఉరుబియల్ (ప్రాతిపదిక + విభక్తి)
6. తొగ్గై మరబు (సంధినియమముల వర్గీకరణము)
7. ఉయిర్ మయఙ్గియల్ (అచ్చు + అచ్చు। హల్లు)
8. పుళ్ళిమ యఙ్గియల్ (హల్లు + అచ్చు। హల్లు)
9. కుట్రియ లుగరప్పుణ రియల్ (అసంవృత హ్రస్వ ఉకారము + అచ్చు। హల్లు)

---

2. It is a sociological study of the Tamil people, their age-long literary and social traditions based on geographical conditions of life'
—J. M. Somasundaram Pillai p. 55.

సొల్ అధికారములోని యధ్యాయముల వివరము ఇట్లున్నది.

1 కిళవి యాక్కం (సాధ్వసాధు ప్రయోగ విజ్ఞానము)
2 వేట్రుమై ఇయల్ (విభక్తి)
3 వేట్రుమై మయజ్ఞియల్ (విభక్తి విపరిణామము)
4 విళి మరబు (సంబోధనము)
5 పెయరియల్ (నామము)
6 వినై ఇయల్ (క్రియ)
7 ఇడై ఇయల్ (నామమును, క్రియను విశేషించు అర్థరహితము లగు పదాంశములు—Non-root morphemes )
8 ఉరి ఇయల్ (స్వతంత్రములగు నామ విశేషణములు, క్రియా విశేషణములు—Root morphemes.)
9. ఎచ్చవియల్ (పరిశిష్టము లేక ప్రకీర్ణకము)

పొరుళ్ అధికారమునందు ఈ క్రింది తొమ్మిది అధ్యాయములు కలవు.

1. అగత్తిణై ఇయల్ (శృంగారము— ప్రణయము)
2 పురత్తిణై ఇయల్ (ప్రణయేతరము— యుద్ధాదికము)
3 కళవియల్ (రహస్య ప్రణయము)
4 కర్పియల్ (పవిత్రమగు వైవాహిక ప్రణయము)
5 పొరుళియల్ (వస్తువు)
6 మెయ్ పాట్టియల్ (సాత్వికాది భావములు)
7 ఉవమ ఇయల్ (అలంకారములు)
8 శెయ్యుళ్ ఇయల్ (చందస్సు, కావ్యభేదములు)
9 మరబియల్ (కావ్య ప్రయోగ సంప్రదాయము).

తొల్కాప్పియమునందలి తొలి యధికారమున 483 సూత్రములు, రెండవ యధికారమున 456 సూత్రములు, మూడవ యధికారమున 659 సూత్రములు కలవు. ఇందలి మొత్తము సూత్రముల సంఖ్య 1598 కాని యీ సూత్రముల సంఖ్య కొన్నిట హెచ్చు తగ్గులుగా నుండును. వివిధ వ్యాఖ్యాతలు ఇందలి యొక్క సూత్రమును రెండు మూడు సూత్రములుగా విభజించి పరిగణించుటచేతను, కొన్ని సందర్భములలో రెండు సూత్రములను ఒకే సూత్రముగా సంభావించుట చేతను ఈ సంఖ్యాభేదము పొడసూపు చున్నది. ఇందు మొత్తము 1610, 1611, 1612 సూత్రములు కలవని వ్యాఖ్యాతలు భిన్న సంఖ్యలు తెలిపిరి ఈ సూత్రము లన్నియు ('అగవల్ ఓసై') అగవల్ అను ఒక ప్రత్యేక మయిన లయ—Rythm) కలిగిన 'ఆశిరియ' ఛందస్సులో రచితము లయినవి. మచ్చునకు అందలి రెండు సూత్రము లన్న, వానికి నా యనువాదమును చూడుడు

అడియోర్ పాజ్గినుం వినైవలర్ పాజ్గినుం
కడివరై ఇలపుఱ త్తెన్మనార్ పులవర్.
అగత్తిణై ఇయల్ 24.

పుణర్దల్ (సమాగమము), పిరిదల్ (ఎడబాటు) మొదలగునవి బానిసల, సేవకులకును కూడ ఉండునట్లు అభివర్ణించుట దోషము కాదని విద్వాంసులు చెప్పుదురు.

ఎత్తిణై మరుజ్గినుం మగడూ ఉ మడల్ మేల్
పొర్పుడై నెరిమై ఇన్మైయాన
అగత్తిణై ఇయల్ 37.

అది లోకమార్యమునకు దూరమగుటచే ఏ వర్ణమునకు చెందిన స్త్రీ జన మయినను తాటి మట్టలతో తయారు చేయబడిన యశ్వముపై నెక్కి తమ ప్రణయమును ప్రకటించుట నిషిద్ధము.

సంగయుగమునందలి తమిళ సాహిత్యమున తాను ప్రేమించిన కన్య తమ ప్రేమమును తిరస్కరించినపుడు ప్రియుడు (నాయకుడు) వాడియైన తాటిమట్టలలో తయారు చేయబడిన యశ్వముపై నెక్కి యూరేగుచు తమ ప్రణయమును ప్రకటించు పద్ధతి కానవచ్చును. ఆ నాయిక చిత్ర పటమును కూడ అతడు ప్రదర్శించును. అతడట్లు అధిరోహించునపుడు తాటిమట్ట వాడితనముచే అతని రహస్యాంగమునుండి వీర్యము వెలువడినచో అతనికి ఆ నాయికపై ప్రేమ యుండునట్లు, రక్తము వెలువడినచో ప్రేమము లేనట్లు— పూర్వులు గ్రహింతురు. తనకు కల ప్రణయాధిక్యమును తాళాశ్వాదిరోహముచే ప్రకటించి, తన్ను తిరస్కరించిన నాయిక తన్ను వలచునట్లు నిర్బంధించుటకు నాయకుడు అట్లు ప్రవర్తించును. లట్టు ప్రణయమును ప్రకటించుట పురుషులకే తగును కాని స్త్రీ జనమునకు తగదని యీ సూత్రమునందు తెలుపబడినది

తొల్కాప్పియమును అనుసరించి కావ్య వస్తువు అగం, పుఱం అని రెండు విధములుగా విభజింపబడినది అగం అనగా శృంగారము (Esotoric) అది అహం అనుదానికి తమిళ రూపము కావచ్చును. మానవుని అంతరంగము (అహం) నకు సంబంధించిన విభాగము అగం, పుఱం అనగా అన్యోన్య ప్రణయమునకు భిన్న మయినది. యుద్ధము, పరిపాలనము, నీతి మొదలగు బాహ్య వస్తువుల వర్ణనము. పురం అనగా వెలుపటిది. బహిరంగ మయినది అని యర్థము. అది మానవుని బహిరంగ జీవిత విధానమునకు సంబంధించిన విభాగము. వీనితోపాటు పొరుళ్ అధికారమున రసము, అలంకారములు, ఛందస్సు, జాతీయములు, సామెతలు, సాహిత్య సంప్రదాయములు, కవి సమయములు మొదలగునవి విపులముగా చర్చింపబడినవి అలంకారముల కన్నిటికిని మూలము ఉపమ. ఉపమాద్యలంకారము లన్నియు విపులముగా ఇందుగల 'ఉవమఇయల్' అను అధ్యాయమున వివరింపబడినది. శెయ్యుళ్ ఇయల్ అనునది ఛందస్సును గురించియు, కావ్యభేదములను గురించియు వివరించు అధ్యాయము. ప్రాచీన తమిళ సాహిత్యమునందు కానవచ్చు ఛందస్సులు దేశీయములు, స్వతంత్రములు అనుటను మనము గుర్తింపవలసి యున్నది సంస్కృత నిరపేక్షముగా తమిళమునందు స్వతంత్రముగా నెలసిన చందస్సంప్రదాయము వారిది 'శెయ్యుళ్ ఇయల్' అను ఈ యధ్యాయము తొల్కాప్పియమునకు చాల ప్రాచీన కాలమునందే తమిళమున విస్తారమయిన కావ్య సాహిత్య ముండెననియు, వాని యాధారముననే తొల్కాప్పియర్ తమిళములోని వివిధ ఛ్ఛందస్సు లను వివరింపగల్గెననియు వూహింపబడు చున్నది మరబియల్ అను అధ్యాయమున సాహిత్య సంప్రదాయములు, కవిసమయములు, జాతీయములు, సామెతలు మొదలగునవి కలవు. భాషాలక్షణ గ్రంథములలో

పామెతలు, కవిసమయములు మొదలగువానికి కూడ స్థానము కలదని గుర్తించి వానిని గూర్చి తెలుపుట కిందు తొలిసారిగా ప్రయత్నము చేయబడినది సంస్కృతమునందును, ఇతర దక్షిణ దేశ భాషలయందును రచితములయిన లక్షణ గ్రంధములలో ఇట్టి ప్రయత్నము కానరాదు. ఇది తొల్కాప్పియమునకే విలక్షణ మయినదని భావింప వచ్చును

తొల్కాప్పియమును బట్టి ప్రాచీన కాలమున తమిళదేశము ప్రధానముగా నాలుగు భాగములుగా విభజింపబడినది అవి 1 ముల్లై (అరణ్య ప్రాంతము) 2 కురింజి (పర్వత ప్రాంతము), 3 మరుదం (మాగాణి ప్రాంతము), 4 నెయ్‌దల్ (సముద్రతీర ప్రాంతము) తరువాత అయిదవదిగా పాలై (మరుభూమి ప్రాంతము) అనునది చేర్చ బడినది. ఇవి యయిదును ప్రాచీన కాలమునందలి ప్రాదేశిక విభాగములు వీనిలో ఒక్కొక్క విభాగమునకును ప్రణయములోని వివిధ ఘట్టములు నియతముగా ప్రత్యేకింపబడినవి కురింజి (పర్వత ప్రాంతము) యందు పూర్వరాగము (Pre-marital love) అభివర్ణింప బడవలయును. ప్రశాంతము, పవిత్రము అయిన సతీపతుల అన్యోన్యాను రాగము ముల్లై (అరణ్య ప్రాంతము) యందు అభివర్ణింపదగును. పాలై (మరుభూమి) యందు విప్రలంభమును, దాని యందలి వివిధావస్థలను అభివర్ణింప వలయును నెయ్‌దల్ (సముద్ర తీర ప్రాంతము) లో నాయికా నాయకుల వివాహమునకు పూర్వము పూర్వరాగ దశలో నాయకుని యెడబాటు వలన నాయికకు కలుగు విరహావస్థ, నిర్వేదము అభివర్ణింపబడవలయును మరుదం (మాగాణి ప్రాంతము) సిరి సంపదలలో తుల దూగుచు, నాగరిక జీవితమును కలిగి యుండుటచే అందు వేశ్యావృత్తి సర్వసాధారణమై యుండును దీనిచే నాయకుడు వేశ్యా సంపర్కమును కలిగియుండుట, నాయిక అతని శీలమును, అతనికి తనపైకల ప్రేమమును శంకించుట, అతడు వేశ్యానురక్తు డయ్యెనని తెలిసినపుడు విషాదమునందుట — మొదలగు విషయములు అభివర్ణింపబడ వలయును

వీనిలో ఒక్కొక్క ప్రాదేశిక విభాగమునకును ప్రత్యేక ప్రత్యేకముగా అధిదైవతములు, జంతువులు, పక్షులు, వృక్షములు, సంగీతము వాద్యములు, ఆహారాదికము, వృత్తులు మొదలగునవి యున్నట్లు అందు అభివర్ణింపబడినది వీనికి 'కరుప్పొరుల్' అని పేరు 'కరు' అనగా గర్భము అని యర్థము గర్భసంబంధి అని భావము పయి అయిదు ప్రాదేశిక విభాగములలోను ఒక్కొక్క ప్రాంతమునకు చెందిన జనుల సంస్కృతియు, జీవిత విధానమును ఈ గర్భవస్తుజాతము నుండియే పరిణామము చెందినదని వారి అభిప్రాయము ఈ యేడు వస్తువులును ఆయా ప్రాంతము (తిణై) ల యందలి జనుల జీవిత విధానముపై ప్రభావము నెఱపి వారి యాచారములకు, అలవాట్లకు, గుణములకు ఒక వైలక్షణ్యమును కలిగించి ఆయా ప్రాంతముల ప్రత్యేక సంస్కృతులకు మూలకందము లయ్యెనని వారి సిద్ధాంతము ఒక ప్రాదేశిక విభాగమునందలి ప్రణయమును అభివర్ణింప దలచినచో ఆ కవి దానికై ప్రత్యేకించిన ప్రణయఘట్టమునే అందు జరిగినట్లుగా అభివర్ణింప వలయును. ఆ ప్రాంతమును వర్ణింపవలసి వచ్చినప్పుడు దానికై నిర్దిష్టములయిన కరుప్పొరుల్— గర్భ వస్తుజాతమునే అతడు వర్ణింప వలసి యుండును. ఇట్లు తమిళమున కావ్య రచనము కవి భావావేశమును బట్టి కాక నిర్దిష్ట సంప్రదాయమును అనుసరించి— కృత్రిమముగ సాగింపబడుచుండెనని— అట్లు సాగుట వారి యభిమతమని, యాదేశమని మనకు విదిత మగుచున్నది ఈ గ్రంధమునుబట్టి యా కాలమున ప్రణయాదికము ఇందు తెలిపినట్లే సాగుచుండెనని మనము భావింపరాదు తొల్కాప్పియర్ కళకును, సత్యమునకును కల బేదమును ఒక సూత్రమునందు వివరించి యున్నాడు (అగత్తిణై 56) నారగవళక్కు, ఉలగియువళక్కు నాటక సంప్రదాయము, లోక సంప్రదాయము—అని వానిని అతడు పేర్కొనెను భరతుడు తెలిపిన నాట్య ధర్మము, లోక ధర్మము అనువానితో ఇవి సంవదించు చున్నవి. తొల్కాప్పియమునకు పూర్వము ఈ 'తిణై' విభాగములకు కొంత అర్థమును, ఉద్దేశమును ఉండెనేమో కాని తరువాతి కాలమున వెలసిన తమిళ సాహిత్యమునందు వాని ప్రభావ మున్నట్లు కానరాదు ప్రాచీనమయిన సంప్రదాయము అనుటను తప్పించి, వానికి పెక్కు శతాబ్దముల నుండియు, నేడును కూడ తమిళమున గొప్ప ప్రాధాన్యము ఒసగబడినట్లు తోచుటలేదు. అతిలు విలక్షణము లయిన ఈ 'తిణై'లు తొల్కాప్పియర్ సృష్టిగా తోచదు పొరుల్ అధికారములోని ప్రధమ సూత్రముననే అతడు 'ఎళుతిణై ఎన్బ' (ఏడు తిణైలు అని (పెద్దలు) చెప్పుదురు) అని వచించి యుండుట యే దీనికి ఆధారము అతడు జైనమతావలంబకు డగుటచే జైనకవులనుండి అతడీ కృత్రిమ మయిన వర్గీకరణ విధానమును గ్రహించి యుండును. నాయికానాయకులు ఏకాంతముగా ఉద్యానవనమునందు లేదా అరణ్య ప్రాంతమునందు కలసికొనుట, వారి పరస్పర ప్రణయభావావేశము, తరువాత తత్ఫలితముగా నేర్పడిన వారి కలయిక— ఇత్యాదిగా 'కళవు' (రహస్య ప్రణయము) అను తిణైలో తెలుపబడిన పూర్వరాగ విధానమంతయు జైనులు భోగభూమియందు పొందు ఆనందానుభవమును స్మరింపజేయుచున్నది కనుక తొల్కాప్పియర్ అసహజములు, అరమణీయములు అయిన ఈ 'తిణై'ల సృష్టిని జైనకవులనుండి గ్రహించి యుండవచ్చుననుట సంభావ్యము

పొరుళ్ అధికారములోని అగత్తిణై ఇయల్. పుఱత్తిణై ఇయల్ ఇత్యాదిగా కల తొలి అయిదు అద్యాయములును ప్రాచీనకాలమునందలి తమిళుల సాంఘికాచారములను కొన్నిటిని ప్రతిబింబించును. అందు మొదటి దగు అగత్తిణై, మూడవదియగు కళవియల్, నాలుగవదియగు కర్పియల్, అయిదవదియగు పొరుళియల్ అనునవి 'అగం' శాఖకు చెందినవి రెండవదియగు పుఱత్తిణై ఇయల్ ప్రణయేతరమయిన 'పుఱం' శాఖకు సంబంధించినది. అగం, పుఱం అనువానిలో తొలుత 'అగం'ను గ్రహించి దానికి సంబంధించిన కొన్ని సామాన్యాంశములను మొదటిదగు అగత్తిణై ఇయల్ అను అధ్యాయమున తొల్కాప్పియర్ వివరించెను. ప్రాదేశికములయిన అయిదు తిణైలతో కలిసి మొత్తముమీద ఏడు తిణైలు—లేక శృంగార విభాగములు కలవని తొల్కాప్పియము తెలుపుచున్నది. వానిలో మొదటిది కైక్కిళై. ఇది అప్రాప్త యౌవనయగు ఒక చిన్ని కన్నెపై ఒక మధ్య వయస్కుడైన పురుషుడు ఏకతాను రాగమును కలిగియుండుటకు సంబంధించినది. నాయకుడు ఒక చిన్ని బాలికపై మోహము గొని, యా మోహ ఫలముగా విపరీతమయిన మానసికవేదనకు గుఱియయి—తనకును ఆ కన్యారత్నమునకును సంబంధించిన మంచి చెడులను చక్కగా విచా

రించి, అందు తన తప్పు ఆవంతయు లేదనియు—ఆకన్యయే తాను ప్రేమమును ప్రకటించినప్పుడు బదులు పలుకక యూరకుండిన దనియు పరిపరి విధముల స్వగతముగా పరితపించుచుండును ఇట్లు అప్రాప్త యౌవనయగు చిన్ని బాలికపై నాయకుడు ప్రేమమును ప్రకటించునేని అది 'కైక్కిళై' అగును ఏడవది యగు 'పెరుంతిణై' నయసుమీరిన మధ్య వయస్కులయొక్కయు, వయ తారతమ్యము కలవారియొక్కయు తాళాశ్వాధిరోహణము (తాను వలచిన కన్య తన్ను ఒల్లనిచో నాయకుడు ఆమెయెడ తనకు కల ప్రణయ సాంద్రతను తెలియచేయుటకై కత్తియంచువలె మిక్కిలి వాడిగానున్న తాటిమట్టను అశ్వముగా చేసికొని అధిరోహించుట. అపుడు నాయిక చిత్ర పటమును ఆ వాహనమునకు కట్టి వూరివారందరికిని తన ప్రణయమును ఎరుకపరచి ఆ నాయిక తన్ను ప్రేమింపక తప్పని పరిస్థితులు కల్పించుట)—యౌవన దశను దాటిన ఈడు జోడులేని స్త్రీ పురుషుల ప్రేమము—కామ పారవశ్యమున ఒక యువతిని బలాత్కారముగా సంభోగించుట— కామాతిరేకముచే ఒడలు మరచి అసంబద్ధ ప్రలాపము లాడుట—ఇవి యన్నియు 'పెరుంతిణై'కి సంబంధించినవి వానినడుమ నున్న అయిదు ప్రాదేశికములయిన తిణైలును యౌవన దశలోనున్న నాయికా నాయకుల అన్యోన్యానురాగమునకు సంబంధించినవి ఇందలి వీరి అన్యోన్యానురాగము మరల రెండు విధములుగా విభజింపబడినది కళవు (రహస్య ప్రణయము—పూర్వరాగము), కర్పు (వివాహానంతర ప్రణయము) అని ఇందలి మూడవ యధ్యాయము 'కళవు'ను గురించి తెలుపును 'కర్పు' — నాలుగవ యధ్యాయమునందు వివరింపబడినది. ఐదవదియగు పారుళియల్, ఆరవదియగు చెయ్యుళ్ ఇయల్‌లో కొంత భాగము (తొలి 16 సూత్రములు) ప్రణయమునకు సంబంధించిన కొన్ని ప్రకీర్ణ విషయములను తెలుపును రెండవది యగు 'పురత్తిణై ఇయల్'లో ప్రణయేతరములయిన యుద్ధాది బాహ్య విషయములకు సంబంధించిన విశేషములు విషయ విభాగ పురస్సరముగా తెలుపబడినవి

ఇట్లు కావ్యేతి వృత్తములకు సంబంధించిన విషయములుకల యధ్యాయములేకాక పారుల్ అధికారమున రసము, సాత్విక భావములు మొదలగు వానిని వివరించు నొక యధ్యాయము కలదు దానికే 'మెయ్ప్పాట్టియల్' లని పేరు. తరువాతదియగు 'ఉవమ ఇయల్‌'లో అలంకారములు చర్చింపబడినవి శెయ్యుళ్ ఇయల్ ఛందస్సును, కావ్య భేదములను వివరించును. కడపటిదియగు మరబు ఇయల్ సాహిత్య సంప్రదాయములను, కావ్య ప్రయోగములను తెలుపును ఈ యధ్యాయము లన్నియు తొల్కాప్పియర్ యొక్క అసాధారణమైన ప్రజ్ఞా విశేషమును, వైదుష్యమును చాటుచున్నవి ఛందస్సునకును, కావ్య ప్రయోగ సంప్రదాయమునకును సంబంధించిన చివరి రెండు అధ్యాయములును అద్వితీయములయిన రచనములు అని చెప్పవచ్చును శ్రీ వైయాపురిపిళ్ళై యీ రెండు అధ్యాయములను గూర్చి తెలిపియున్న అభిప్రాయము ఇటు సంభావింపదగియున్నది.

'His deep knowledge of the works of the earlier grammarians, his thoroughness on the mechanistic side of Prosody and his accuracy in

ascertaining the usage of words have not been approached by any grammarian since his time.'
—History of Tamil Language, P. 71.

పొరుళ్ అధికారమునందలి శెయ్యుళ్ ఇయల్ అను నధ్యాయమున వివిధ కావ్య భేదములు, వాని లక్షణాదికము వివరింపబడినవి అందు సూత్ర రచనము కూడ ఒక కృతిభేదముగా పరిగణింపబడినది. శెయ్యుళ్ అనగా కృతి అని అర్థము. అది 'శెయ్'—చేయు, రచించు అను నర్థము కల ధాతువునుండి యేర్పడినది అందు పేర్కొనబడిన కృతి భేదములలో రెండు మిక్కిలి ప్రధానములు. పాద నియమము, ఛందో నియమము కలది అట్టి నియమములేనిది అని సూత్రములు, గద్యము లేక వచనము, సమస్యలు పొడుపుకథలు, సామెతలు, మాంత్రికుల మంత్రములు లేక చిట్కాలు, యక్ష రాక్షసుల కథలు (Fables) భంగ్యంతర కథనము, జానపదుల అభూత కల్పనలు మొదలగునవి రెండవ జాతి క్రిందికి వచ్చును దేవతాస్తుతి, ప్రత్యక్షములు, అప్రత్యక్షములు అగు వ్యంగ్య రచనములు, హాస్య భాషణములు, సభా సమక్షమున విప యోక్తి, ఉపదేశము, మొదలగునవి మొదటి తెగకు చెందినవి ఇవి యున్నియు తొల్కాప్పియములో ఎనిమిది విధములగు కృతిభేదముల క్రింద ప్రస్తావింపబడినవి. వానిలో మఱిరెండు భేదములు మిక్కిలి ప్రధానములయినవి ఒకటి కావ్య భాషా రచనము. రెండవది వ్యావహారిక భాషా రచనము. వానిలోనే ప్రఖ్యాతేతివృత్తముతో రచితములయినవి ఉత్పాద్యేతి వృత్తముతో రచితములయినవి అని రెండు రకములుకలవు అవి గద్య పద్య మిశ్రితములయిన చంపూ కావ్యములు. లేదా నిర్వచనము లయిన కేవల పద్య కావ్యములు అవి మరిరెండు రకములు అందు మరికొన్ని చిత్ర కవితా భేదములు తెలుపబడినవి అవి అనునాసికములు, హ్రస్వాచ్చులు, దీర్ఘాచ్చులు—వీనియొక్క ఉనికికి సంబంధించినవి ఒక కావ్యము నిరనునాసికముగా రచింపబడవచ్చును. దానికి నిరనునాసిక కావ్యమని పేరు. అట్లే హ్రస్వాచ్చులు, దీర్ఘాచ్చులు, ప్లుతముల ఉనికినిబట్టి కూడ కృతి భేదములు కానవచ్చును. ఇంతకంటె వీనికి సంబంధించి వివరములు ఒసగుటకు వీలులేదు

తొల్కాప్పియర్‌కు కావ్యభాషయందు దుపయోగింపదగు శబ్దజాలము విషయమున మిక్కిలి ఉదారమయిన చిత్త వృత్తి కలదని తెలియుచున్నది. కావ్యభాషయందు దేశిపదములు, నానార్థ శబ్దములు సమానార్థక శబ్దములు, మాండలికములు, లేక ప్రాంతీయములు, సంస్కృత పదములు ప్రయోగింపదగును. ఇట్లు స్థూలముగా పదజాలమును గూర్చి తెలిపిన పిదప అతడు ఒక విశిష్టమయిన సూత్రమును ప్రతిపాదించెను. కాలక్రమమున భాషలో ఎప్పటికప్పుడు నూతన పదములు వ్యవహారములోనికి వచ్చుచుండును. అవి నూతనములు అన్న కారణమున వానిని కావ్య ప్రయోగమునకు దూరము చేయరాదని యతడు ప్రతిపాదించెను. వానిని కూడ కావ్యములందు గ్రహించి ప్రయోగింపదగునని యతడు హెచ్చరించెను. అతడు తన వ్యాకరణమందలో పెక్కు సంస్కృత శబ్దములను ప్రయోగించెను. సూత్రము, పటలము, పిండము, అరిభోతరంగము, ఖండిక (కండిగై) అను సంస్కృత పారిభాషిక పదములకు అతడు నిర్వచనము తెలిపెను. కొన్ని సంస్కృత శబ్ద రూపములను అతడు సూత్ర రూపమున సాధించి యున్నాడు. ఉదా. భరణి, చిత్తిరై పలక్కై, తామరై, తామరస, విభక్తి, అసభ్యము, సూత్రము మొదలగు కొన్ని సంస్కృత భాషా పదములను అతడు తమిళములోనికి అనువదించి ప్రయోగించెను.

తొల్కాప్పియము ఏక కర్తృకము కాదనియు, ఒకవేళ యేక కర్తృకమే యని భావించినను అందలి కొన్ని యంశములు అందు తరువాతి కాలమున చేర్చబడి యుండుననియు ఒక వాదము కలదు.[3] దానికి కారణము లేకపోలేదు అందలి కొన్ని సూత్రములలో తెలుపబడిన యంశములు ఒకదానితోనొకటి సంవదింపక యుండుటయే—నియత విధానము లేకుండుట (Inconsistency) యే అందులకు కారణము. అందలి లుప్త భాగములను పూరించు నుద్దేశముతోను, అందు విస్మృతములయిన అంశములను చేర్చి దానికి సమగ్రతను సాధించు నుద్దేశముతోను తరువాతి కాలమున విద్వాంసులు ఆయా భాగములను అందు చేర్చి యుండవచ్చుననుటను అవి సూచించుచున్నది. అట్లు కాకపోయినచో— అది వ్యాకరణ రచనమునకు సంకల్పించిన ఒక పండిత బృందము (Literary School) చేత రచింపబడి యుండవచ్చుననియు— అందుచే అది యేక కర్తృక మనుట సందేహాస్పదమనియు— వారు నానాటు భాషా వ్యవహారమునందు ఏర్పడుచు వచ్చిన క్రమ పరిణామమును గుర్తించి తదనుగుణముగా ఎప్పటికప్పుడు ఆయా యంశములను ఆ గ్రంథమునందు చొప్పించుచు వచ్చుటయు ఆ పరస్పర భిన్నములయిన అభిప్రాయములు ఉండుటకు కారణము కాదగును[4] దీనికి నిరూపకమయిన ఒక యుదాహరణము ఇందలి పొరుళ్ అధికారములోని మరబియల్ అను చివరి యధ్యాయమున 'పిళ్ళై' అను పదము మానవ శిశువు అనునర్థమున ఎప్పుడును వ్యవహృతము కాదని తెలుపబడి యున్నది కాని అందలిదే యగు రెండవ యధ్యాయమునందు 'పిళ్ళై' అనునది మానవ శిశువు అను నర్థమునందే ప్రయుక్తము కాదగునని తెలుపబడినది. చివరి యధ్యాయము కొనయందున్న కొన్ని సూత్రములు పునరుక్తము లనియు— ఛందోధికారము (శెయ్యుళ్ ఇయల్)న మునుపే తెలుపబడి యున్న 'నూల్' (గ్రంథము) అను పదమును వివరించుట అనునది ప్రయోజన రహితమయిన పునరుక్తి దోషమనియు— లేదా అవి యందు ముందె తెలుపబడిన యంశములకు వివరణాత్మకములుగా యందు ముందె తెలుపబడిన యంశములకు వివరణాత్మకములుగా రచితములయి యుండవచ్చుననియు మనము భావింపవలసి యున్నది. ఇవి తరువాతి కాలమునందు అందు చేర్చబడిన చేర్పులు లేక ప్రక్షిప్తములు అని మనము భావింప నచ్చును కనుక తొల్కాప్పియమునందు ప్రాచీన వ్యవహారానుగుణమయిన లక్షణ మేదో, నవీన వ్యవహా

3 It consists perhaps of many layers, some of which may be later day developments'
—A History of Tamil Literature. P, 17.

4 'Tolkappiam itself was the work of grammatical school developing its ideas from time to time rather than that of an individual author.'
—A, History of Tamil Language, p. 52.

లోని గుణమయిన లక్షణ మేదో గుర్తించి పరిశీలించుట మనకు కర్తవ్యమై యున్నది దీనినిబట్టి తొల్కాప్పియముననందలి అత్యధికభాగము పూర్వసంగయుగమునకు చెందినదని మనము నిర్ణయింప దగును. తొల్కాప్పియముననందు కానవచ్చు భాషకును, అతి ప్రాచీనములగు బ్రాహ్మీ శాసనములందు కానవచ్చు భాషకును వ్యత్యాస మంతగా కానరాదు.

తొల్కాప్పియమునకు తరువాతి కాలమున పెక్కు వ్యాఖ్యానములు రచింపబడినవి వానిలో ఇళంపూరణన్ (క్రీ శ 12 శతాబ్దము) రచించిన వ్యాఖ్యానము ప్రాచీనము, ప్రామాణికము అది యతని పేరు మీదుగానే 'ఇళంపూరణ౦' అని వ్యవహరింపబడుచున్నది. ఇత డిందలి అన్ని యధికారములకును వ్యాఖ్యానమును రచించెను సేనావరియర్ (క్రీ శ 15 వ శతాబ్దము) ఇందలి 'సొల్' అధికారమునకు మాత్రము ఒక వ్యాఖ్యానమును రచించెను దానికి 'సేనావరయం' అని పేరు నచ్చినార్ కినియర్ (క్రీ. శ. 16 వ శతాబ్దము) అనునతని వ్యాఖ్యానము మరియొకటి కలదు అదియు ఇళంపూరణం వలెనే అన్ని యధికారములకును చేయబడిన వ్యాఖ్యానము దానికి 'నచ్చినార్కినియం' అని పేరు వీనితోబాటు పేరాశిరియర్, కల్లాడర్, దైవచ్చిలైయార్ అనువారు రచించిన వ్యాఖ్యానములు కూడ దీనికి కలవు. ఇవి యాయా అధికారములయందలి వివిధ వ్యాకరణాంశములకు వ్యాఖ్యాన రూపమున చక్కని వివరణములను ప్రదర్శించుట మాత్రమే కాక తమ తమ కాలములందు రచితము లయిన ఉత్తమ విచన రచనములుగా కూడ పరిగణింపదగి యున్నవి ఆధునిక కాలమున కూడ దీనికి వ్యాఖ్యానములు, వివరణములు, దానిని ఆధారము చేసికొని రచింపబడిన రచనలు పెక్కు వెలువడినవి. ఇట్లు దీనికి వివిధ కాలములందు పెక్కు వ్యాఖ్యానములు రచింపబడుట కూడ ఇందలి విషయ కాఠిన్యమును, దురవగాహతను, వ్యాఖ్యానాపేక్షిత్వమును తెలియజేయు చున్నది.[5]

ఆధారములు


1. తొల్కాప్పియం— (ఆంగ్లానువాద సహితము) పి. యస్. సుబ్రహ్మణ్యశాస్త్రి.

2. A History of Tamil Literature: — డా. టి పి మీనాక్షి సుందరం.

3. A History of Tamil Language — డా. టి పి మీనాక్షిసుందరం.

4. A History of Tamil Language and Literature — యస్. వైయాపురి పిళ్ళై.

5. A History of Tamal Literature — జె యం సోమసుందరం పిళ్ళై.

6. దక్షిణ దేశ భాషా సాహిత్యములు — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

7. proceedings of the Tamil Seminar conference at Kaulalampur, Part 1

8. Tolkappiar's Theory of Linguistic Description (Paper) G. Vijaya Venugopal.

9. Problems of Homonymy and Sandhi Rules in Tolkappiam (Paper) G. Vijaya-Venugopal.

10. తొల్కాప్పియము—పొరుళ్ లధికారము (ఆంధ్రానువాదము): — డా తిమ్మావజ్ఝల కోదండ రామయ్య. (అముద్రితము).

11. దక్షిణదేశ భాషా సాహిత్యములు—తులనాత్మక పరిశీలనము: (అముద్రితము). — డా తిమ్మావజ్ఝల కోదండరామయ్య.


---

5 ఈ వ్యాసరచనమునందు నాకు మిక్కిలి తోడ్పడిన శ్రీ జి. విజయవేణుగోపాల్ గారికి నా కృతజ్ఞతలు.

# నాటకములు — ప్రదర్శనార్హత

## శ్రీ నోరి నరసింహశాస్త్రి

### 1

నాటకములు ప్రధానముగా ప్రదర్శనార్హములు కావలెనను భావము నేటి కాలమున సర్వసాధారణముగా సాహిత్య విమర్శకులందును జనసామాన్యమందును వ్యాపించి ఉన్నది. మన ప్రాచీనాలంకారికులు కూడా కావ్యములను దృశ్యములనీ, శ్రవ్యములనీ విభజించినందున వారికి గూడ అట్టి భావమే ఉండెనని తలంచుటకు అవకాశమున్నది సంస్కృత నాటక ప్రస్తావనలలో ఆ నాటకము ఏదో ఒక ఉత్సవ సందర్భములో ప్రదర్శింపబడుచున్నట్లు ప్రత్యక్ష వాక్యములు కూడా కానవస్తున్నది.

పాశ్చాత్య దేశాలలో నాటక నిర్మాణానికి ఆద్యులు గ్రీకులు. వారి ట్రాజెడీలు గాని, కామెడీలుగాని దేవతోత్సవాలలో ప్రదర్శించడానికి ఉద్దిష్టమైనవే తర్వాత రోములో లాటిను భాషలోనూ, ఫ్రాన్సు, ఇంగ్లండు స్పెయిను, ఇటలీ, జర్మనీ మొదలైన దేశాలలో వారి వారి భాషలలోను గ్రీకు నాటకాల ఒరవడిలో కొన్నీ, స్వతంత్రముగా కొన్నీ నాటకాలు పుట్టినవి ట్రాజెడీలు కామెడీలేకాక, మిస్టరీలు, మొరాలిటీలు, మాస్కులు, ఒపేరాలు, బాలేలు, కాబినెటుప్లేలు మొదలైన ఎన్నో రూపక ప్రక్రియలు అవతరించినవి.

మన దేశంలో కూడా సంస్కృత లాక్షణికులు రూపకాలను ప్రధానంగా దశ విధాలుగా విభజించినా, ఉప రూపకాలు ఎన్నెన్నో పుట్టినవి సంస్కృత లక్షణకర్తలు చెప్పనివి ఆంధ్రదేశంలో యక్షగానాలు, వీధి నాటకాలు, కలాపాలు ఇత్యాదుల వలెనే ఇతర రాష్ట్రాలలోనూ రకరకాల రూపకాలు వెలసినవి

శాస్త్రీయంగా నాటక శబ్దము దశ రూపకాలలో ఒకానొక శాఖకే వర్తించేదైనా, నేటి వ్యవహారాన్నిబట్టి అన్ని దృశ్యకావ్యాలకూ అన్వయించే విపులార్థంలో ఈ సమాలోచన ఉపక్రమింపబడుచున్నది.

అలంకారికులు శ్రవ్యములనీ, దృశ్యములనీ కావ్యాలను విభజన చేసినప్పటికి, గ్రంథాలు అచ్చు వేయడము తెలియదనడము స్పష్టమే కాని, అసలు వ్రాత అనేదైనా పుట్టినదో లేదో కూడా సందేహాస్పదమే. మన దేశంలో వేద వేదాంగాలే కాక, ఇతిహాస పురాణాలు కూడా ప్రథమ దశలో లిఖితములైనట్లు తోచదు వాల్మీకి రామాయణము రచించి కుశలవులచేత అధ్యయనము చేయించినాడు అది 'పాఠ్యే గేయేచ మధురం' అన్నదానిలో 'పాఠ్యే' అంటే పఠించినప్పుడు అనే అర్థమే కాని చదివినప్పుడు అనికాదు సంగీతయుక్తంగా పాడడమూ, సంగీతము లేకుండా వినిపించడమూ మాత్రమే 'గేయే పాఠ్యే' అనడంలో అభిప్రాయ మనడానికి సందేహంలేదు 'శ్రవ్యకావ్యము' అనడములోనే కావ్యము వినిపింపబడుతున్నదని స్పష్టపడుతున్నది.

మహాభారతము వ్యాసుడు వడి వడిగా చెప్పుతూవుంటే గణపతి వ్రాస్తూ ఉండేవాడని నేటి భారతావతారికలలో కనబడుతున్నది. సంస్కృత భారతము మొదట భాషాంతరీకరణము చేసినది నన్నయ. ఆయన ఈ విషయము చెప్పలేదు కనుక ఆ భాగము నన్నయకంటె అర్వాచీనకాలంలో ప్రక్షిప్తము చేయబడినదని అనుమానించ వచ్చును.

మా చిన్నతనములోనే కాక, ఇప్పటికి పది పదిహేనేళ్ల క్రిందటి వరకూ బ్రాహ్మణ సువాసినులు పూర్వసువాసినులూ రామాయణ భారత కథలూ, ఇతర కథలూ గేయ రూపమైనవి చెప్పుకోవడము, చెప్పడమూ శ్రుతమైనది వాళ్లు ఎక్కువ భాగము చదవడమూ, వ్రాయడమూ రానివారు ఇప్పటికీ ఆంధ్రదేశములో ఈ అభ్యాసము అన్ని కులాలలో మారుమూల పల్లెలలోనైనా నిలిచి ఉన్నదనే విశ్వాసము వీరగాథలు చాలా భాగము చెప్పుకొని వర్ణించి ప్రచారమవుతున్నవే

అచ్చువల్ల పుస్తక ప్రచురణము విస్తారముగా వ్యాప్తి చెందిన తర్వాత శ్రవ్య కావ్య రస గ్రహణంలో చెప్పలేనంత మార్పు వచ్చినది. మన కవులు నేటికీ కావ్య పఠనాలూ, కావ్యగానాలూ చేస్తున్నారు. విద్యాధికులము అనుకొనేవారు వందలూ వేలుగా సభలకు వచ్చి వింటున్నారు, ఆనందిస్తున్నామనుకొంటున్నారు. చాలా అనుభవంవల్ల విశ్లేషణం చేసిచూస్తే సభాముఖంలో ఆకర్షిస్తున్న కావ్యాలు సర్వసాధారణంగా అధమకోటికి కాకపోయినా అతి సామాన్య శ్రేణికి చెందినకావ్యాలే కాని ఉత్తమ కావ్యాలుకాదు. ఎప్పుడైనా ఉత్తమ కావ్యాలు కూడా సభాకర్షణం చేయ గలుగుతున్నవంటె దానికి కారణము, ఆ చదివేవాని కంఠ మాధుర్యమో, విచిత్రమైన పఠనము తీరోగాని దాని ఉత్తమ కావ్యగుణముకాదు.

మా మిత్రులు స్వర్గీయ బోడెపూడి వెంకటరావుగారితో నాకు పరిచయమైన కొత్త రోజులలో తమ అనుభవ మొకటి చెప్పినది జ్ఞప్తికి వస్తున్నది ఒకానొక ప్రసిద్ధకవి పఠనమునకు సంబంధించిన అనుభవమిది "బాపట్లలో వారి కావ్య పఠనము విని అద్భుతమనిపించి గ్రంథముకొని ఇంటివద్ద శాంతముగా చదువుకొన్నాను చూడగా అందులో రుచే కనిపించలేదు—మరి ఇది మోసముకాదుటండీ?" వారెంతో బాధతో ఆ ప్రశ్న వేశారు నన్ను

నేటి పరిస్థితులలో మన చెవులు శ్రవ్య కావ్యాల సూక్ష్మాలు గ్రహించే శక్తి చాలా భాగము కోల్పోయినవి శాంతంగా ఏకాంతంగా మనము మనస్సులోనో బిగ్గరగానో చదువుచున్నప్పుడేకాని ఉత్తమ కావ్యానుభవము పొందలేక పోతున్నాము ఇది శ్రీ వెంకట్రావుగారి అనుభవమేకాదు, ఎందరో సహృదయుల అనుభవము కూడా అదే! అంతమాత్రముచేత పూర్వులు శ్రవ్య కావ్యాలన్నవాటిని పరిభాష మార్చి చదువుకొనే కావ్యాలు లని వ్యవహరింపవలసిన అవసరము ఉన్నదనుకోము మాబోంట్లు ఒకవేళ వ్యాచ్యమని సూచించినా లోక వ్యవహారము ఇంకా అవలంభించే స్థితికి రాలేదు.

## 2

ఇప్పుడిక నాటకాలు—దృశ్య కావ్యాల విషయము చూతాము. దృశ్య కావ్యమంటే దృశ్యమైనది—చూడబడే కావ్యము. కావ్యము విశేష్యము, దృశ్యము విశేషణము. విశేషణ విశేష్యాలలో దేనికి ప్రాధాన్య మిస్తామనే పెద్ద తార్కిక చర్చ వదలి విశేష్యానికే ప్రాధాన్యమున్నదని అంగీకరిద్దాము. అసలు కావ్యమైతేకదా దానికి దృశ్యత్వమున్నదీ లేనిదీ విచారణ చేసేది! ముందు మనిషి ఐతేకదా, వాడు మంచివాడో చెడ్డవాడో పళ్ళటివాడో, తెల్లటివాడో—అందగాడో విరూపుడో—విచారణ చేసేది!

ఇక దృశ్యత్వమంటే ఏమిటి? మనము ఈ కాలములో నాటకీయత అనే పద మొకటి సాహిత్య విమర్శలలో వాడుతున్నాము. ఈ రెండూకాక ముఖ్యంగా నాటకాల విషయంలో ప్రదర్శన యోగ్యత అనేమాట ఇంకొకటి తరుచుగా వినవస్తున్నది. ఈ మూడూ—దృశ్యత్వమూ నాటకీయత ప్రదర్శన యోగ్యతా—సమానార్థకాలా? స్థూలంగా మూడూ ఒకటే అనే భ్రాంతి కలుగుతుంది కాని మూడిటికీ కొంత పోలిక ఉన్నా సమానార్థకాలు కావనడానికి పెద్ద విచారణ అవసరంలేదు. ప్రస్తుతము ప్రదర్శన యోగ్యతను గూర్చి కొంత లోతుగా ఆలోచిద్దాము.

కవి నాటకము వ్రాసినాడు. దానిని ప్రదర్శించడానికి ప్రదర్శకుడు గ్రహించినాడు. నాటక భాగాలు నోటితో చెప్పి భావ ప్రదర్శన చేసే నటులను అతడు ఎన్నుకుంటాడు. నాటకము ప్రదర్శించడానికి తగిన రంగస్థలము రంగులూ, దుస్తులూ మొదలైన ఆహార్యాదులు సమకూర్చుకుంటాడు. ఇంతవరకూ కవితో సహకరించవలసినది ప్రదర్శకుడు, నటులు, రంగభూమీ! ఇవన్నీ యోగ్యంగా సమకూర్చినా, చివరకు నాటకము రక్తికట్టినదీ లేనిదీ నిర్ణయించేది ప్రేక్షకులు, సామాజికులు! దృశ్య కావ్యానికి కర్త కవి ఒక్కడే ఐనా, దాని ప్రదర్శనము విజయవంతము కావడానికి, రక్తికట్టడానికి, ప్రదర్శకుడు, పాత్రధారులు, రంగస్థలము (ఆహార్యము), ప్రేక్షకులు—ఇందరి సహకారమూ కావలె. ఈ నాలుగింటిలో ఏది లోపము చేసినా నాటకము రక్తికట్టదు. ప్రదర్శకుడు అనుభవమున్నవాడే కదా! అతడు ప్రదర్శనార్హమని ఎన్నుకున్న నాటకమే ప్రదర్శనములో విఫలము కావడము కద్దు. శ్రీ విశ్వనాథ వేనరాజు నాటకము చెన్నపట్టణములో పెద్ద పెట్టున ప్రదర్శనములో విఫలమైనది. అంతమాత్రముచేత అది ప్రదర్శన యోగ్యతలేని దనవలసినదేనా?

మరి ఒకే ప్రదర్శకుడు అదే నట బృందముతో ఆహార్యాదులతో ఒక పట్టణములో ప్రదర్శించి విఫలము కావడమూ, మరియొక పట్టణములో విజయవంతము కావడమూ ఉన్నది. ఒక్కచోటనే ఒక కాలములో విఫలమై మరియొక కాలములో విజయవంతము కావడమూ ఉన్నది. వేనరాజ నాటక ప్రదర్శనము మదరాసులో విఫలము కావడానికి ముఖ్యంగా రెండు కారణాలు చెబుతారు. అందులో ఒకటి వైదిక ధర్మ శత్రువైన వేనరాజు పరాజయము నాటక వస్తువు కావడమూ, మదరాసు ప్రేక్షకులకు అది రుచించకపోవడమూ. రెండవది వేనరాజు పాత్రధారి ఆకాలపు ఆచారానికి విరుద్ధంగా అంగీలు లేకుండా రంగ ప్రవేశము చేయడమట. ఆ పాత్ర వేషము చూడగానే నాటక ప్రదర్శనము ఆపివేయవలసిన అవస్థ వచ్చినదట! ఈ రెండు కారణాలే నిజమయితే 'వేనరాజు' ప్రదర్శన యోగ్యము కాదనవలసినదేనా?

శ్రీ మాధవపెద్ది వెంకటరామయ్య అంగీలు లేకుండా దుర్యోధన పాత్ర, దేవేంద్ర పాత్ర ఇత్యాదులు ధరించి అనేక రంగాలలో అభినయించి మెప్పించడము ఎరుగుదుము. ఆ వేనరాజు పాత్రధారణలో ఆ నటుడు శ్రీ మాధవపెద్దివలె పొందాగా గాక ఏదో వికారముగా తోచి ఉండవలె.

ఇక వస్తువునందు సామాజికులకున్న అయిష్టము సంగతి. సరిగ్గా నాట్యవేదములో భరతుడు ప్రదర్శించిన ప్రథమ నాటక ప్రయోగానికే ఈ గతి పట్టినట్లు వర్ణింపబడ్డది.

ఇంద్రధ్వజ మహము సందర్భములో దేవ దానవుల సమక్షములో మహేంద్ర విజయము భరతుడు ప్రదర్శించెను. అది చూచి విరూపాక్షాది దానవులు తమ్మది పరిభవించుచున్నదని ఆగ్రహించి విఘ్నము కావించి నాట్య ప్రయోగము సాగనీయకుండచేసి సభనుండి వెడలిపోయిరి. ఇంద్రుడు విఘ్న పరిహారమునకు జర్జరము ప్రయోగించెను. ఇంతలో బ్రహ్మ సామ వచనములతో విరూపాక్షాది దైత్యులను ఇట్లనునయించెను

"మీకు కోప విషాదములు వలదు. మీరు భ్రాంతిపడినారు. నాట్యవేదము శుభమశుభము వికల్పించునె గాని దేశ కాల పాత్రల ననులకించదు. మీ యనుభావనము కాని దేవుల యనుభావనము కాని నాట్యమున నుండదు. "త్రైలోక్య భావానుకీర్తనం నాట్యం" అందరి యవస్థానుకరణమె నాట్యము దేవాసుర భావముల కిది యతీతము. నాట్యమున నియత లోకానుకార ముండదు. ద్రష్ట సాక్షిక దృష్టి కలవాడయిన చో రసాస్వాదనము కలుగగాని కలుగదు."[1]

మదరాసులో వేనరాజు నాటక ప్రదర్శనము చూచి లేచిపోయిన వారు సరిగా భరతుని ప్రథమ నాటక ప్రదర్శనము చూచిన విరూపాక్షాదులు చేసినపనే చేసినట్లు తోస్తుంది. భేదమేమంటే జర్జర ప్రయోగముచేసి మహేంద్రుడుకాని అందరికీ నచ్చజెప్పగల బ్రహ్మగాని ప్రేక్షకులలో లేకపోయినారు. భరతుడు ప్రదర్శించిన ప్రథమ నాటకమే ప్రదర్శనయోగ్యము కాదనలేముకదా!

ఈ శతాబ్దములోనే జరిగిన మరొకటి ప్రస్తావిస్తాము. మారిస్ మేటర్లింక్ అనే జగత్ప్రసిద్ధ నాటకకర్త బెల్జియమ్, ఫ్రెంచి భాషలో అనేక నాటకాలు వ్రాసినాడు. వాటిలో 'బ్లూబర్డ్' అనే నాటకమొకటి. అందులోని పాత్రలు పిల్లవాడు, పిల్ల, దీపము, పుస్తకము, రొట్టె! వాళ్ళు బ్లూబర్డ్ కోసము అన్వేషిస్తూ పోవడము నాటక వస్తువు. బ్లూబర్డ్ పాశ్చాత్య పరిభాషలో జీవుని నిత్య స్వరూపానికి ప్రతీక అనవచ్చు. మన పరిభాషలో ఆత్మ పదార్థమనవచ్చు! అది ప్రదర్శనయోగ్యమా అనే మీమాంస వచ్చినది. సహృదయుల హృదయాలను నాటకము విశ్వయంగా గాఢంగా ఆకట్టినది. యూరపులో ప్రదర్శకులంతా ప్రయోగ సాధ్యముకాదని వదలివేశారు. తుదకు ఒక ప్రదర్శకుడు సాహసించి, కొన్ని మిలియన్ల ఫ్రాంకులు ఖర్చుపెట్టి ప్రదర్శించినాడు.[2] అద్భుతంగా విజయవంతమైనది. ఈ ఒక్క ఉదా

(1) శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మ "నాట్యవేదము" నుండి.

(2) ఈ నాటకము ఆంగ్లానువాదము బహు పర్యాయాలు పఠించి ఆనందించినాను గాని ప్రయోక్త పేరు మరపు తగిలినది.

కారణము చాలును. ఏ నాటకమైనా ప్రయోగ యోగ్యమో కాదో నిర్ణయించడము అసాధ్యమని భావించడానికి.

ఇనా మరొక్క ఉదాహరణము కూడా ప్రస్తావిస్తాను. రవీంద్రుని నాటకాలు ఉన్నవి. ఆయన ఎంత గొప్ప కవియో అంత గొప్ప కథకుడూ, నాటకకర్త కూడాను. ఆయన నాటకాలు ఆయన దర్శకత్వాననే, స్వయముగా తానే పాత్రధారణ చేసి కూడా, శాంతినికేతనములోను, ఇతర చోట్లను పరిమిత ప్రేక్షకుల సమక్షములో ప్రదర్శించి రక్తి కట్టించినాడు. ఆయనయందు గల భక్తి ప్రపత్తులచేత అప్పుడప్పుడు వ్యాపార రంగస్థలాలమీద కూడ ప్రదర్శిస్తూ వచ్చారు. "చిరకుమార సభ, శేషరక్ష లాంటి కొన్ని నాటకాలు తాత్కాలికంగా మాత్రమే ప్రేక్షకుల ఆదరానికి పాత్రమయినాయి. అయినా వ్యాపార రంగస్థలాల నాటక ప్రయోగ పద్ధతికీ రవీంద్ర నాటకాలకూ యెప్పుడూ పొత్తు కలియలేదనే చెప్పాలి. యెందుకని? బహుశ ప్రేక్షకులు అలవాటు పడలేదేమో!" అన్నారు శ్రీ ప్రమథనాథ బిశి తమ 'రవీంద్ర నాటకాల సంక్షిప్త సమీక్ష'లో.

ఇదే మరొక కోణంనుంచి కూడా విచారణ చేతాము.

గ్రీసుదేశంలో ఏథెన్సు నగరంలో ట్రాజెడీ ప్రదర్శనల పోటీలు క్రీ. పూ. 534 లో ప్రారంభమైనవి. అవి ఆరుపదుల పది పదిహేనువేల మంది ప్రేక్షకుల ఎదుట దేవతోత్సవాలలో ప్రదర్శింపబడేవి. నాగరకులేగాక, ఆడువారూ బానిసలూ కూడా ఖర్చు లేకుండా వచ్చి చూడ వచ్చును. ఆ నాటకాలలో ముగ్గురు వ్రాసిన నాటకాలలో కొన్నిమాత్రమే మనకిప్పుడు ఉపలబ్ధమవుతున్నవి. వాటిలో ఎక్కువ భాగము పోటీలలో నెగ్గినవే. వారిలో మొదటివాడు ఆస్కిలస్ (క్రీ. పూ. 525—456) రెండవవాడు సాఫోక్లీసు (క్రీ. పూ. 496—409) వారిలో మూడవ వాని ట్రాజెడీలను అరిస్టోఫెన్సు అనే కామెడీకర్త (క్రీ. పూ. 450—385) తన నాటకాలలో విపరీతముగా హేళన చేసినాడు. అటువంటి అరిస్టోఫేన్సు కూడా సాఫొక్లీసుమీద కొంత గౌరవమూ, అస్కిలసుమీద భక్తి తాత్పర్యాలూ ప్రదర్శించినాడు.

ఆ ముగ్గురు ట్రాజెడీకర్తలలో మొదటివాడు నాకు కూడా ఎక్కువ అభిమానపాత్రుడు. పాత్రల సంఖ్య పెంచడములోను ఇతి వృత్త గ్రహణములోను రెండవవారు మూడవవారూ నాటకాన్ని వేట కాలానికి ఎక్కువ సన్నిహితము చేసినారనడము నిస్సందేహమే కాని ఆ ఇద్దరూ ఆస్కిలసు కవితాస్థాయిని అందుకోలేదని తోస్తుంది. వారిద్దరేకాదు పాశ్చాత్య నాటక కర్తలలో నేటివరకూ చాలామంది అందుకో లేదనడము అతి యోక్తి కాదు. బ్లాకీ అనే ఆంగ్లానువాదకుడు వానిని లిరికల్ డ్రామాస్ (Lyrical Dramas) అని పేర్కొన్నారు.

అటువంటి ఆస్కిలసు నాటకాలు, ఆథేన్సు జన సామాన్యము పది పదిహేను వేలమంది, ఇప్పటికి 2,500 సంవత్సరాల క్రిందట ప్రదర్శన చూచి ఆనందించిన మహా నాటకాలు. నేటికీ ఉగద్విమర్శకా గ్రణులచేత ఉత్తమశ్రేణి నాటకాలుగా ప్రశంస పొందుతున్న దృశ్య కావ్యాలు నేట కాలమున మన దేశములోనేకాదు, పాశ్చాత్య దేశాలలో ఏ దేశంలోనైనా సరె ప్రదర్శిస్తే, జన సామాన్యము పది నిముషాలు కూడా ఓపికగా భరించలేవు. నేడు మనము పద్యావంతులమనుకొనే జనసామాన్యము కూడా భరించలేనిది కేవల పత్యమూ తాత్కాలికచేత ఆ నాటకాల విలువ తగ్గుతుందా?

ఏ.పి. కి పోనక్కరలేదు షేక్స్‌పియరు నాటకాలు పుట్టి 400 సంవత్సరాలింకా నిండలేదు. ఆయన అద్వితీయ నాటకకర్త అని పాశ్చాత్య విమర్శకుల నిర్ణయము. ఆయన నాటకాలమీదనే, ఇంకా పూర్తిగా నాలుగు శతాబ్దాలూ దాటకముందే సామాజికులకు అభిమానాలు నష్టముగా ఉన్నవి, పోతూవున్నవి, మళ్ళీ వస్తూవున్నవి. నిన్నడూ అవి గీతనాటక కర్తల నాటకాలవలె టిక్కెట్లుకొని పదివేలు పదిహేనువేల జనసమూహాన్ని ఆకట్టలేదు.

అంతదూరము పోనక్కరలేదు. ఇప్పటికి 50 సం. ల క్రిందటి వరకూ వీధులలో ఆరుబయలు ప్రదర్శింపబడుతూ జనాదరము పొందుతూ వచ్చిన కూచిపూడివారి వీధి నాటకాలు, గొల్ల భాగవతులు అవి—ఇంక ఇతర భాగవతులవీ నాటకాలు ఉన్నవి. కూచిపూడివారు పద్ధతులు కాలానుగుణంగా కొంత మార్పు చేసుకొని పట్టణవాసులను ఆకర్షించగలుగుతున్నారు ఇప్పటికీ కొంతవరకు. కాని తక్కినవారు నేడు మారుమూలపల్లెలలోనే తప్ప నగరవాసులను ఆకర్షింప లేకున్నారు. వాటికన్నిటికీ ప్రదర్శనార్హత ఉన్నదనవలెనా, లేదనవలెనా?

కాళిదాసు నాటకత్రయమున్నది. వాటిలో శాకుంతలముమాత్రము (ఆంధ్రానువాదము) ఇప్పటికి 40 ఏళ్ల క్రిందటివరకూ ప్రదర్శింప బడుతూ ఉండేది శ్రీ యడవల్లివంటి ప్రసిద్ధ నటుల ప్రతిభవల్ల రక్తికట్టేది. తక్కిన రెండు నాటకాలూ ప్రదర్శింపబడ్డట్లు తెలియ వచ్చుటలేదు. ఈమధ్య శాకుంతలం కూడా ప్రదర్శన భాగ్యానికి నోచుకున్నట్లు లేదు. కాళిదాసుతో సమానుడో, అంతకంటె అధికుడో అని భావింపబడే భవభూతి మహాకవి ఉన్నాడు. ఆయన నాటకానువాదాలు ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడ్డట్లు లేదు. ఎక్కడైనా ప్రదర్శింపబడినా జనాన్ని ఆకర్షించిన జాడ లేదు.

భాసునిపేర నేడు చలామణి అవుతున్న నాటకాలు ప్రధానంగా ప్రదర్శనంకోసము నటులు సిద్ధం చేసుకున్న నాటకాంతరాలుగా కన బడుతున్నవి. వాటికి చిన్న ఆంధ్రానువాదాలు వచ్చినవికాని విరివిగా వాటి ప్రదర్శనలు జరిగినట్లు లేదు. దీనికంతటికీ కారణమేమిటి?

ఒకానొకప్పుడు నటులు తమ అద్భుతమైన గాత్రాలతో, సంగీత ప్రస్తారంతో ఆంధ్ర ప్రేక్షకులను ఉర్రూత లూగించిన పద్య ప్రధాన నాటకాలు నేడు వినబడుతున్నవి అప్పుడు ప్రేక్షకులు అభిమానంతో విన్సు ఒన్సుమోరులు వర్షించేవారు. అది నాటక రక్తికి న్యాయంగా భంగకరమైనా, పూర్వము విన్న వన్సుమోరులువస్తే నాటకమంత గొప్పగా రక్తి కట్టేదనుకొనేవారుగదా!

ఆ రోజులలో కేవల వచన నాటకాలు రంగ స్థలానికి పనికి రావనుకొనేవారు. కాని నేడు పద్య ప్రధాన నాటకాలు అస్వాభావికములని ఈసడిస్తూ, వచన నాటకాలనే మహా నగరాలలోని ప్రేక్షకులు అభి మానిస్తున్నారు.

ఈవిధంగాచూస్తే దేశ కాల పాత్రలనుబట్టి ప్రదర్శన విష యంలో ఇట్టి ఒడుదుడుకులు విన్నయినా సంభవిస్తున్నది. సంభ వించక తప్పదు కూడాను. కాబట్టి ఏదైనా ఒక నాటకము విలువ కట్టే ప్పుడు దాని ప్రదర్శనార్హతను గూర్చి దీర్ఘ విచారణ చేయుడము కావ్య కర్తకు అన్యాయము చేయుడం కాదా?

## 3

ఆంధ్రదేశంలో ఒకానొకప్పుడు విస్తారంగా ప్రదర్శించబడిన కొన్ని నాటకాలను గూర్చి విచారిద్దాము.

శ్రీ చిలకమర్తి 'గయోపాఖ్యాన నాటకము' ఒకానొకప్పుడు పొందిన ప్రసిద్ధి ఇంతంత కాదు. అందులో కృష్ణార్జునులు ఒకరినొకరు అధిక్షేపించుకున్న పద్యాలు,

"అల్లుడా రమ్మని యాదరంబున బిల్వ
బంపు మామనుబట్టి చంపగలమె!"

ఇత్యాదులు బహుప్రసిద్ధమైనవి. శ్రీ జయంతి రామయ్యపంతులుగారి వంటి సహృదయ విద్వాంసులు ఆ నాటక సమీక్ష చేస్తూ ఆ ప్రసిద్ధ పద్యాలనే ఉదాహరించి ఎంతో అనౌచిత్యముకలవని నిరూపించారు. ఉదాత్త పురుషులైన కృష్ణార్జునులకు సందర్భవశాత్తుగా పోరు కలిగినా నీచ పురుషులవలె కలహించినట్లు అందులో కనబడుతున్నదని ఎవరైనా ఒప్పుకోక తప్పదు. అనౌచిత్యముకంటె రసభంగము కలిగించేది ఎంకొకటి ఉండదు కదా!

పాండవోద్యోగ విజయాలున్నవి. అవి పూర్వము గొప్ప నాటకులైన నటులు ప్రదర్శించినప్పుడు గొప్పగా రక్తి కట్టేవి. ఆపాటల వణితులనే నేడు కూడా సమర్థవంతంగానో అసమర్థంగానో అనుకరించి కొంత రక్తి కట్టించగలుగుతున్నారు. కాని ఆ కాస్త సంగీతము కూడా మనహాయిస్తే ఇప్పుడవి రక్తి కట్టగలవా, ఏ నాటక రంగస్థలం మీదనైనా!

1973 జనవం నాట్యకళ సంచికలో కురుక్షేత్ర సంగ్రామ ప్రదర్శనము గూర్చి శ్రీ కె. ఆర్. కె. మోహన్ వ్రాసిన వ్యాసంచూస్తే ఆయనకు ఎంత అసంతృప్తి కలిగిందో వెల్లడి లవుతుంది.

"చింతామణి' నాటక ప్రదర్శనములను గురించి కూడా ఆ వ్యాసంలోనే తీవ్రమైన అసంతృప్తిని వెల్లడించారు.

నాటక ప్రదర్శనము విజయవంతము కావడానికి ఎన్నో నాటకేతరములైన సహకారము లభించవలె దీనికి తగిన ప్రదర్శకుడు, నటులు రంగస్థలాహార్యములు. ప్రేక్షకులూ సందర్శించినప్పుడేకాని దాని ప్రదర్శన యోగ్యత నిర్ణయించలేము. కాబట్టి నేటి సాహిత్య విమర్శకులు, సమీక్షకులు నాటకాల శ్రద్ధగానో, అశ్రద్ధగానో చదివి తేలికగా వాటిని ప్రయోగార్హాలుకావని తేల్చివేసి నీళ్ళ నమిలివేయడము న్యాయమేనా? తొందరపాటుకాదా? నాటక కర్తలు మౌనము వహిస్తా రెందువల్ల!

## 4

ఇప్పుడిక నాటకీయత, దృశ్యత్వము అనేమాట లేమిటో విచారిద్దాము!

శ్రవ్య కావ్యాలు చదువుతున్నప్పుడు కూడ కొన్ని భాగాలు మనకు కళ్ళకు కట్టినట్లు ఉంటాయి. అట్టివి చదువరుల కందరికీ అనుభవంలో ఉన్నదె. అటువంటి లక్షణాన్ని దృశ్యత్వమనగూడదా?

మరికొన్ని భాగాలు నాటకీయముగా ఉన్నవంటున్నాము. ఒక కథా భాగంలో అనేక పాత్రలు రకరకాలుగా పాత్రోచితంగా సంభాషించడం వల్ల అక్కడ నాటకీయత ఉన్నదంటాము. అట్టి రచన చేయుటములో ఆంధ్ర కవులలో తిక్కన సోమయాజులకు అగ్రస్థానమిస్తున్నాము.

ఇంకొక విధమైన నాటకీయత కూడా సంఘటనలలో కానవస్తున్నది. సంస్కృత మహాభారతంలో సర్పసత్రము చివరి ఘట్టము అద్భుతమైన నాటకీయతతో ఉన్నది. మహానాగు లెందరో సత్రాగ్నికి ఆహుతి అయినారు. కాని ప్రధానాహుతి కావలసిన తక్షకుడు రాలేదు. పిలిచినా రావడంలేదు. అతడు ఇంద్ర శరణుడై ఉన్నాడని తెలిసింది. అతన్ని ఆకర్షించేందుకు ఋత్విక్కులు బ్రహ్మదండాన్ని ఉద్దీపింపజేస్తున్నారు. కాని అప్పటికే ఆ సత్రము ఆపు చేయించడానికి ఆస్తీకుడు వచ్చి జనమేజయుణ్ణి అక్కడి ఋత్విక్కులను సభాసదులను ముగ్ధులనుగా చేసి ఉన్నాడు. ఇంద్ర శరణుడై ఉంటే తక్షకుణ్ణి ఇంద్రునితోసహా బ్రహ్మదండంతో లాగమని జనమేజయుడు ఋత్విక్కులను ఆదేశించాడు. బ్రహ్మదండానికి భయపడి ఇంద్రుడు తక్షకుణ్ణి వదలి పారిపోయినాడు. తక్షకుడు భయంతో అవశుడై యజ్ఞశాల చుట్టూ గిరగిర తిరుగుతున్నాడు. అప్పుడు పురోహితుడు ఆనందంతో వచ్చి "తక్షకుడు వస్తున్నాడు. అతడు త్వరగా వచ్చేందుకై ఎదుటవున్న వర్చస్వి అన ఆస్తీకునికి దానమేదైనా చేయి" అని సలహా యిచ్చాడు. జనమేజయుడు ఆనందంతో వరము కోరుకొమ్మన్నాడు ఆస్తీకుణ్ణి. "ఈ సత్రము ఆపివేయవలసినది. ఇక ఒక్క సర్పము కూడా అగ్నిలో పడరాదు" అని కోరాడు. మరో వరము కోరుకోమని రాజు బతిమాలినాడు. ఈ సంభాషణ జరుగుతుండగా అగ్నిలో పడబోతున్న తక్షకుణ్ణి

ఆస్తికుడు చేయెత్తి ఆపినాడు. ఏ పని సాధించడానికి వరమీయదలచి నాడో ఆ వరమే ఆ పనికి భంగకకారి ఐనది ఇటువంటి ఘట్టాలు శ్రవ్య కావ్యాలలో గూడా నాటకీయంగా—Dramatic గా ఉన్న వంటాము కదా !

ఇటువంటి నాటకీయతలకు దృశ్యకావ్యాలేకాక, శ్రవ్య కావ్యాలు కూడా పనికివస్తవికదా! శాకుంతలంలో శకుంతల తుమ్మెదలవల బాధ పడుతుంటే చెలికత్తె దుష్యంతుణ్ణి పిలవమంటుంది చమత్కారంగా సరిగ్గా దుష్యంతుడే వస్తాడు. అటువంటివి నాటకీయత గల సన్నివేశాలు!

## 5

ఐతే మరి దృశ్య కావ్యాలకూ శ్రవ్య కావ్యాలకూ బేధమే లేదా? కావ్యత్వములో ఎంత మాత్రం బేధం లేదు బేధమున్నది రూపంలోనే దృశ్య కావ్యాలలో కవి కథను స్వయంగా చెప్పక పాత్రలచేత మాట్లాడించి చెప్పిస్తాడు అందువల్ల కొన్ని నియమాలకు బద్ధుడై ఉంటాడు ఆ చెప్పే పద్ధతి దేశ కాలాలనుబట్టి మారవచ్చు మనవీధినాటకాలలో సత్యభామ ప్రవేశిస్తూనే, "భామనే సత్యభామనే" అని ఇత్యాదిగా పాడుతూ అద్భుతంగా నృత్యం చేస్తుంది అట్టిది నేటి నవ నాగరిక నాటకాలలో వికృతంగా ఉండ వచ్చు చెలికత్తె అనవలసినమాటలు సూత్రధారుడే అంటూ ఉంటాడు ఇదికూడా ఇప్పుడు వికృతంగానూ, అస్వాభావికంగానూ, కనబడవచ్చు. కాని ఇంకో విధంగా చూస్తే ఆ పద్ధతిలోనే ఎక్కువ స్వాభావికత ఉన్నదేమో అనిపిస్తుంది ప్రేక్షకుల కందరికీ, ఆ వేషం వేసుకొని వచ్చి పాడేదీ ఆడేది సత్యభామకాదనీ సత్యభామ వేషధారి నటుడని, స్పష్టంగా తెలుసు. మరి చెలికతె కోసమని ఇంకొకరికి రంగు పూసి వేషం వేసి, ప్రవేశపెట్టడం మాని అందుకు బదులు సద్య స్ఫురణకు గల సూత్రధారుడే చెలికత్తె మాటలు అందిస్తూ ఉంటే వచ్చే నష్టమేమిటి? ఈ పద్ధతి వల్ల పైగా సత్యభామ, నటన మీద నృత్యం మీద అభినయం మీద ప్రేక్షకుల దృష్టి ద్విగుణీకృతంగా కేంద్రీకరిస్తుంది గదా! అసలది భామాకలాపము! ఒక విధమైన దృశ్య కావ్యము.

షేక్స్పియరు కాలంలోకూడా తెరలు ఉండేవి కాదుట. వీధిలో జరిగిన దృశ్యం ప్రదర్శించేప్పుడు పైన 'వీధి' అని బల్లమీద వ్రాసి కట్టే వారట. ఈ కాలపు ప్రేక్షకులకంటే ఆ కాలపు వారికి భావనా బలము ఎక్కువ ఉండేదేమో కూడాను.

కాబట్టి దృశ్య కావ్యాలు బహురూపాలు ధరించి ప్రదర్శనపొంద వచ్చు అలవాటు, సంప్రదాయము, నిర్మాణ చాతుర్యము, రుచి—ఎన్నో కారణాల ఏకమై రూపకాలను—దృశ్య కావ్యాలను పుట్టిస్తవి వాటి దృశ్యత్వానికి, మనము అనుకొన్న ఒకానొక ప్రదర్శనశాలా, ప్రేక్షకులూ మాత్రమే గీటు రాళ్ళు కావు!

## 6

ఎప్పుడో ఆంగ్లకవి లార్డు బైరను ఈ క్రింది వాక్యాలు తన (Marino Faliero Doge of Venice) మారినో ఫలీ రోడ్జ్ ఆవ్ వెనిస్ అనే నాటకము పీఠికలో వ్రాసినాడు

"I have had no view to the stage, In its present stage it is, perhaps, not a very exalted object of ambition, besides, I have been too much behind the scenes to have thought it so at any time. And I cannot conceive any man of irritable feeling putting himself to the mercies of an audience The sneering reader, and the loud critic, and the tart review, are scattered and distant calamities, but the trampling of an intelligent or of an ingnorant audience on a production which, be it good or bad, has been a mental labour to the writer, is a palpable and immediate grievance, heightened by a man's doubt of their competency to judge, and his certainty of his own imprudence in electing them as Judges. Were I capable of writing a play which could be deemed stage-worthy, success would give me no pleasure, and failure great pain. It is for this reason that, even during the time of being on one of the committies of one of the theatres, I have never made the attempt, and never will"

Preface to 'Marino Faliero, Doge of Venice.

బైరను కవి తొందర పాటూ ఆవేశమూ కలవాడు పైగా తన నాటక ప్రదర్శన మొకటి విఫల మైనందున విసిగి వ్రాసినాడని కూడా అన వచ్చు కాని జగత్ప్రసిద్ధమైన Flaust వంటి ఉత్తమ నాటకాలూ ఇంకా ఎన్నో ఇతర రచనలూ చేసిన గెటీ గత శతాబ్దిలో పాశ్చాత్యప్రపంచ మంతటిచేత మన్నన లందిన గొప్ప మనిషి గదా! పైగా ఆయన డ్యూక్ ఆఫ్ వీమరు స్థాపించిన కోర్టు నాటక శాలకు బహుకాలము డైరెక్టరుగా పనిచేసిన వాడగుటచే ఎంతో నాటక ప్రదర్శనానుభవమున్న వాడు. ఆయన ఏమన్నాడో చూదాము!

"One can show the public no greater respect than in forbearing to treat it as a mob The mob hurry unprepared to the theatre, demand that which may be immediately enjoyed desire to stare, be amazed, laugh, weep, and therefore compel the managers, who are dependent on them to descend more or less to their level"

(From notes to Bayard Taylor's translation of 'Faust Part 1' at Page 160—Pub. Ward Lock & Co, London 1911)

వాళ్ళిద్దరూ పాత కాలపు వాళ్ళు, కవులు. ఆ కాలపు వంగదేశములో మంచి విమర్శకులు ఐన ప్రమథనాథ బిశి రవీంద్ర నాటకాల సమీక్ష నుండి మరికొన్ని వాక్యాలు చూదాము.

"అదీకాక వ్యాపార రంగ స్థలాల మీద ప్రసిద్ధి కెక్కిన నాటకాలన్ని, వృత్తిగా నటించే నటీ నటుల్ని ఆశ్రయించి వుండడం వల్ల ప్రసిద్ధి కెక్కినవే. వాటిల్లోది ఒక విధమైన సామూహిక శిల్పం. రవీంద్రుడు నాటకాలు ఏకాంతంలో ఆవిర్భవించాయి. కాదా, అంటే వారి కుటుంబం వాతావరణంలో యిది ఆయన తన ఒక్కడి ప్రయత్నం వల్ల సృష్టించి ప్రయోగించినవి. అంచేత వీటిలో వున్న సహజ సంపద ప్రధానంగా కావ్య సౌందర్యం.

"నాటకంలో వున్న సాహిత్య సౌందర్యాన్ని అప్రధానంగాభావించే విమర్శకులెందరో వున్నారు వాళ్ళ లభిప్రాయంలో కేవలం ప్రేక్షకుల్ని రంజింప జేయడమే నాటకాల యేకైక ప్రయోజనం. ఇూ అభిప్రాయాన్ని ఆమోదించడానికి వీల్లేదు నాటకం ముఖ్యంగా సాహిత్యం, దాన్ని ఆ దృష్టితో సమీక్షించడమే వుచితం

"ఆ దృష్టితో గనక చూస్తే రవీంద్రుడినాటకాలు అమూల్యమైన రత్నాలు!! 3

## 7

శ్రవ్య కావ్యాలకు శ్రవత్యముకాక కావ్యత్వము ప్రధానమైనట్లే దృశ్య కావ్యాలకు కూడా దృశ్యత్వముకాక, కావ్యత్వమే ప్రధాన మని బుద్ధివంతులు అంగీకరించక తప్పదు ఆకాశవాణితో శ్రవ్యనాటికలు అవతరించడము గమనింప దగిన మరొక ఆధునిక కాల విశేషము కూడాను!

కొందరు ప్రదర్శకులను దృష్టిలో పెట్టుకొని నాటకాలు నేటి కవులు పలువురు వ్రాస్తున్నారు తరచుగా! అందువల్లనే నాటిలో ప్రదర్శనార్హత, ఎట్లా ఉన్నా, కావ్యత్వము పూర్తిగా పోషిస్తున్నది కావ్యత్వము మంచిస్థాయిలో లేని, నాటకాలే ప్రదర్శనలలో విజయవంతము అవుతుండడము విషాదకరము కావ్యాలుగా ఎక్కువ విలువ లేని,నాటక ప్రదర్శనలకు నేటి జనం ఎగబడుతున్నారంటే, ఇప్పటి పరిస్థితి అటు కవులకుగాని, ఇటు ప్రదర్శకులకు, నటులకు, ప్రేక్షకులకుగాని ఏమంత సంతోషింప దగ్గ విషయం కాదు గౌరవాస్పదమైనది అంతకంటే కాదు!

ముందు మంచి కావ్యత్వమున్న నాటకాలు కవులురచించవలె అట్టి నాటినే ప్రదర్శకులు గ్రహించవలె నటులు ప్రదర్శించ వలె సామాజికులు చూచి ఆనందించటము నేర్చుకోవలె

ఆ థేన్సులో ఆరు బయుల కవిత్రయము ప్రదర్శించిన రూపకాలు 2, 500 సంవత్సరముల క్రిందట చూచి ఆలకించి,ఆనందించి మెప్పు ప్రకటించిన అశేష జనానీకాన్ని నేడు రంగస్థలంమీద,విశేషాదరం, పొందుతున్న నాటకాలు చూచి ఆనందిస్తున్న సామాన్యప్రజలతో పోల్చి చూస్తే, ఈ 2, 500ల సంవత్సరాలలో ప్రజానీకానికి కావ్యాస్వాదన శక్తి, ఎంత దిగజారి పోయినదా అనిపిస్తుంది ఇది సహృదయులంతా విచార పడవలసిన విషయము నాగరికత పెరిగినదా, మరే మైనదీ, అని బుద్ధిమంతులు ఆత్మ విచారణ చేసుకో వలసిన దిది!

ప్రాచీన గ్రీకు నాటకకర్తల నాటక ప్రదర్శనా లిప్పుడు లేకపోయినా, అవి నేటికీ ఉత్తమ కావ్యాలుగా నిలిచి ఉన్నవి ముందూ ఉంటవి భాసుని పేర ప్రసిద్ధికి వచ్చిన నాటకాలు, కాళిదాస భవభూతులవీ, శూద్రకుని మృచ్ఛకటికము, హర్ష నాటకాలు, ముద్రారాక్షసము , వేణీ సంహారము వంటివే కాక, మురారి అనర్ఘ రాఘవము, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమూ కూడా, ఎన్నటికీ ఉత్తమ నాటకాలుగా సాహిత్యంలో నిలిచి ఉంటవి. నాటకానికి శాశ్వతత్వమిచ్చేది దాని కావ్యగుణము కాని ప్రదర్శనీయత్వము కాదు.

నాటక కర్తయే, నాటక కవియే, ప్రజాపతి అతడు దర్శకులను నటులను, సామాజికులను శాసించే స్థితిలో ఉండవలె గానీ, దర్శకులు నటులు, సామాజికులూ, శాసించినట్లు వారి కందరికీ,దాసానుదాసుడై కవి తన రచన సాగిస్తే ఉత్తమ నాటకాలు పుట్టవు

ఆంధ్ర దేశములోనే కాదు, ఇతర రాష్ట్రాలలోన ఉత్తమనాటకాలు రాక పోలేదు వచ్చినవి నాటి మొహం చూచే నాథుడు లేడు. ప్రదర్శన యోగ్యత, అనే ఒక అవ్యవస్థమైన మాట ఆధారంగా చేసుకుని కవులను దిగజార దీస్తున్నారు

ముందు ఉత్తమ నాటక కావ్యాలు వెదకి, వాటిని ఎట్లా ప్రదర్శించవలెనో, ఆలోచించవలసిన విధి, ప్రదర్శకులది అవి చూచి ఆనందించడము ప్రేక్షకుల నెమ్మదిగా నేర్చుకోవలసిన విషయము

రంగస్థలం యవనికల రంగులూ, పాత్ర ధారుల తళుకులూ, వాళ్ళ కంఠాల గమకులూ, వాళ్ళ అంగ విన్యాసాల బెళుకులూ—ఇవి అన్నీ తాత్కాలికమైనవే అవి అన్నీ చెరిగిపోయి, ఏమ తమైన తర్వాత కూడా శాశ్వతంగా నిలిచేది నాటకంలోని శబ్దమే దాని కావ్యత్వమే! అది దృశ్యత్వానికే కాక, శ్రవ్యత్వానికి గూడా అతీతమైన మహాగుణము. ఆ గుణమే ప్రపంచంలో సాహిత్యంలోనైనా పుట్టిన ఉత్తమ నాటకాలను నేటికీ సహృదయుల హృదయ రంగాలలో నిత్యనూతనంగానాట్యము చేయిస్తున్నది ముందు చేయిస్తుంది?

"జయంతితే సుకృతినో రససిద్ధా కవీశ్వరా
నాస్తియేషాం యశః కాయే జరామరణజం భయమ్"

---

3 రవీంద్రుని నాటకాలు ద్వితీయ సంపుటము అనువాదము శ్రీ అబ్బూరి రామకృష్ణరావు, ప్రచురణ సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ.

# తెలుగునాట ప్రజనన తంత్రాలు: దేవతలు

## శ్రీ తిరుమల రామచంద్ర

ఆదిమానవుడు అన్నాన్వేషణ దశనుంచి అన్నోత్పాదన దశకు చేరేవేళకే రెండు ప్రత్యేక వృత్తులు ఏర్పడ్డాయి ఒకటి పశుపాలనం, రెండు వ్యవసాయం. అన్నాన్వేషణ దశ పేరు ఇది జంతువుల వేట కావచ్చు, చేపల వేట కావచ్చు, కాయగూరలు, గెంజాగెడుసు వేట కూడ కావచ్చు. ఈ అన్నీ కూడ కొన్నికొన్ని గణాలకు బాగా తెలుసును నది తీరాలలో, జలాశయ తటాలలో అడవులు బాగా దట్టంగా పెరుగుతాయి. తృణజీవులయిన జంతువులు పుష్కలంగా లభిస్తాయి రకరకాల తృణాలు కూడా ఏపుగా పెరుగుతాయి అందుకని, అటువంటి ప్రాంతాలలో అన్నాన్వేషణ చేసేవారికి మూడు రకాల వేటలను ప్రకృతి ఏర్పాటు చేస్తుంది

వేట జంతువులు గాని, జలాశయాల చేపలు కాని, ఎక్కువ కష్టం లేకుండ దొరికే ప్రాంతాల్లో గణాలు ఎక్కువ కాలం నిలువ ఉండుకోడానికి అవకాశం వుంటుంది. నదితీరాలలో అయితే మెట్ల మీదో సరస్సుల తీరాలలో అయితే గట్టుల మీదో ఈ గణాలు నిలిచి, అక్కడ నుంచి ఆహారాన్వేషణకు బయలుదేరి, తిరిగి విడిదికి, చేరుకోవడం పరిపాటి లవుతుంది. ఈ అన్వేషణలో గణంలోని ఆబాలగోపాలమూ పాలుగొంటుంది. అన్న సేకరణకు ఎవరికి తోచినంత శ్రమ వారు చేస్తుంటారు సేకరించిన అన్నాన్ని ఎవరి అవసరానికి తగినంత వారు ఆరగిస్తారు ఓపిక కొలది పని, అవసరం కొలదీ అనుభవం అనేది ఆనాటి గణాలకు ఏకైక ధర్మ సూత్రం

ఇలాటి ధర్మసూత్రం మనకు యజ్ఞభాగ నిర్ణయంలో, వేదాలలో కనిపిస్తుంది అన్నాన్వేషణలో వారివారి శక్తిని అనుసరించి అందరూ పాల్గొని, అవసరాలకు అనువైన భాగాలు చేసుకొని అనుభవించే ఆదిమగణ కాలపు శ్రుతులు వేదాల్లో కనిపిస్తాయి. సమాజం పరిణమించిన తర్వాత ఆ స్మృతులను నెమరు వేసుకొని, అలాటి కాలం మళ్ళీ తిరిగి వస్తే బాగుండును అన్న వాంఛ కూడా వేదమంత్రాలలో మనకు కనిపిస్తుంది అప్పుడు ఏమి కాలం? అప్పటి మనుష్యులు, ఎలా వుండేవారు? వారిలో వారికి ఎలాటి సంబంధాలుండేవి? సంపాదించిన ఆహారం వారు ఎలా అనుభవించే వారు?— మొదలయిన ప్రశ్నలకు జవాబుగా అధర్వణాద్ఋష్ణముయిన ఈ మంత్రం ఉదాహరించవచ్చు —

> 'సంజానీధ్వం, సంపృచ్ఛధ్వం
> సంవో మనాంసి జానతామ్,
> దేవాభాగం యథాపూర్వే
> సంజానానా ఉపాసతే'

కొండపుష్టి కలవారు సంతువును తరుముతూ పోతే ఎడబిడ్డ, ఒడిబిడ్డల బరువుతో పరుగులు పెట్టలేని తల్లులు పడుచువారు పరుగెత్తిన జాడ వెంట మందమందంగా నడిచే వారు అలా నడుస్తూ, అటూ ఇటూ ఉన్న కాయా కసురూ కోసి, నోట పెట్టుకొనే పిల్లలను అదలిస్తూ, ఆ కాయ మంచిదవునో కాదో చవిచూస్తూ, కొరికి కంటికి ఇంపుగా కనిపించిన గింజా గెడుసును ముట్టి చూస్తూ, మూచూస్తూ, నాచూస్తూ పోయే తల్లులకు అనుకోకుండానే పరుగులెత్తని స్థిరమైన ఆహారం దొరకడం అబ్బురమేమీకాదు అలా దొరికిన ఆహారాన్ని తృప్తిది తినగా, తనవారి కోసం, తన బిడ్డల కోసం సంచిలు సేకరించి పంతలో చరాహారాన్ని పట్టి పడుచువాళ్ళు కోలాహలంగా ఎదురు కావడం కూడ మనం ఊహించుకో వచ్చు.

ఇలా చరాహార స్థిరాహారాలు సేకరించుకొని తమ విడిది గట్టుకు చేరుకుంటుంది గణం. కలిసి తిన్న తర్వాత సంతాహారంలో మిగిలేవి డొక్కలు, తోలు ముక్కలు, ఎముకలూను. కాయా కసురూ తిన్నది తినగా మిగిలింది గట్టు మీద చెలా చెదరుగా పడుతుంది త్వరగా కొన్ని జలసమృద్ధి కలిగిన ఆ ప్రాంతంలో ఆహారాన్వేషణకు తండాతో సహా తరలి పోవలసిన అవసరం అట్టే వుండదు. అయినప్పుడు వేట దారిలో మాత్రమే కంటికి నోటికీ తగిలే తిండిమొక్కలు తమ విడిది గట్టు మీదే మొలకలెత్తడం గమనించారు తల్లులు ఇలా మొలకలెత్తిన మొలకల రహస్యం తెలుసుకోడానికి ప్రజనన శీలలయిన తల్లులకు ఎక్కువ కాలం పట్టలేదు. దానితో అన్నోత్పాదన విజ్ఞానానికి బీజావాపన జరిగింది

### వ్యవసాయం — మాతృస్వామికం :

ఎండిన విత్తు సారనేలను పడి తొలకరితో చెమ్మగిల్లి పాలుపోసుకొని, మొలకలెత్తి పెరిగి వెన్నువేసి, వంద విత్తులుగా పరిణమించడాన్ని చూచిన తల్లులు ప్రయత్నపూర్వకంగా పంట మొదలు పెట్టారు. దానితో చూస్తూ చూస్తుండగానే చెంగలించి పారిపోయే అన్నం కన్నా తన ఎదుపొజ్జలలో పుట్టి పెరిగే అన్నం ఎంతో ఆత్మస్థైర్యాన్నిచ్చింది గణానికి అడవి నుంచి అడవికి, వాగు నుంచి వంకకు, నిరంతరం తిరగడం తప్పింది. ఉన్న గట్టు మీదే నిబ్బరంగా నిలవడానికి వీలు ఏర్పడింది. అదివరకు కండబలంతో ఆహారం కొనివచ్చే పడుచు వారు అడియూసు పడవలసిన పని తప్పింది అయితే వారు మాత్రం ఈ అన్నోత్పాదనం ఒటుకును ఆకళించుకోలేకపోయారు. ప్రజనన శీలలైన తల్లులకు మాత్రమే తెలిసిన గుప్తవిద్యగా, మహావిద్యగా మిగిలిపోయింది నాటి వ్యవసాయం అందుకనే ఆదిమ వ్యావసాయిక గణాలు అవి ఉత్తర అమెరికాలో ఉన్నా, అర్జంటీనాలో వున్నా, కాస్పియన్ సముద్రతీరంలో వున్నా, కాకసస (కాకసస్) పర్వతాలలో వున్నా, నైలూ పరీవాహకతీరాలలో వున్నా, గంగాసింధు మైదానాలలో వున్నా, కృష్ణాగోదావరుల లంకలలో వున్నా, కావేటి ఒడ్డున వున్నా, ఎక్కడ వున్నా మాతృస్వామికాలుగానే వుండేవని చరిత్రకారులు ముక్తకంఠంతో చెబుతున్నారు.

కాలం మారి, వ్యవసాయ విధానం మారి, సమాజం మారి ముందుకు సాగిన చోట కూడ, వ్యవసాయానికి మాతృ సంబంధం

వాడు దానికి సమకాలీనమైన సుమేరు, అస్సీరియా, సైంధవ నాగరికతా కాలం నాడు వ్యవసాయ పద్ధతి ఇదే.

ఏటికి ఈవల ఆవల ఒకే జీవన విధానం గల గణాలున్నప్పుడు ఏరువాక వల్ల ఇద్దరికి లాభం వస్తుంది. కాని, ఇద్దరి వ్యవసాయకులు, అద్దరి పశుపాలకులు ఉన్నప్పుడు ఒకరికి లాభం, మరొకరికి నష్టం వస్తుంది. నీరు మెట్టకెక్కి, నేలను పదును చేసి సాదుక యోగ్యం చేసే, అటు తృణ భూములన్నిటినీ ముంచెత్తి ఆలకు కాలాడకుండా చేస్తుంది. గోత్ర ప్రాంతంలో— అంటే గోవు తిరిగే మేర, పచ్చిక బయలులో — వరద తీసే వరకు —ఆవుకు మేత వుండదు. ఆవిధంగా ఏరువాక ఒకరికి అన్నకర్త ఆయితే, మరొకరికి అన్నహర్త అవుతున్నది. ఏరువాకకు మూలమైన అడ్డుకట్టను తొలగిస్తేకాని, గోత్రాల్లో వరద తగ్గదు. అవి తొలగిస్తే క్షేత్రాలకు నీరెక్కదు. ఈ గోత్ర క్షేత్ర వైరుధ్యానికి మూలమైన అడ్డుకట్ట దగ్గర జరిగిన సంఘర్షణలే వేదాలలో దేవాసుర సమరాలుగా, ముఖ్యంగా ఇంద్రవృత్ర యుద్ధాలుగా మనకు కనిపిస్తాయి. "వృత్రుడు నల్లగా, పాములాగ మెలికలు తిరిగి నదికి అడ్డంగా పడి జలాన్ని నిరోధిస్తున్నాడు. ఓ ఇంద్రా, ఈ వృత్రుణ్ణి సంహరించి జలాన్ని విడిపించు!" అన్న ఇంద్ర సూక్తాలు ఋగ్వేదం నిండా కనిపిస్తాయి. వృత్రుణ్ని ఛేదిస్తే అతడు నదీగర్భంలో పడిపోయాడని వృత్రమాత అతని మీద పడి ఏడ్చిందని వర్ణనలూ కనిపిస్తాయి. ఏమైతేనేం, వృత్రుణ్ణి సంహరించగానే గోత్రాలలో వరదలు తీసేవి క్షేత్రాలు తడిసేవి కావు. మరి నాలుగు నాళ్ళ తర్వాత వృత్రుడు మళ్ళీ ప్రత్యక్షమయ్యేవాడు. గోత్రపతులు గోల పెట్టేవారు. హవిర్భాగాలను, సోమరసాన్ని సమకూర్చుకుని ఉద్గాత ఎలుగెత్తి పిలిస్తే, అవి ఆరగించి ఇంద్రుడు, వెయ్యంచుల వనకత్తితో వృత్రుని మీద మళ్ళీ విరుచుకుపడేవాడు. ఒకొక్కప్పుడు వృత్ర హననంతో తృప్తిపడక ఆవలి గట్టున వున్న క్షేత్రాలను చిందరవందర చేసి క్షేత్రపాలకులను హతమార్చి వారి ఇళ్ళను ఆక్రమించుకొనడం కూడ ఋగ్వేదంలో కనిపిస్తుంది. అసురభాషలో —అస్సీరిలో — వ్యవసాయక్షేత్రాన్ని పుర అనేవారు. పురులను ధ్వంసం చేసేవాడు కాబట్టే ఇంద్రునికి, పురధ్వంసి, పురహంతా, పురందర అనే బిరుదులు వచ్చాయి. అయితే, మన సాంప్రదాయిక పండితులు పుర అంటే, ఇప్పటి మన అవగాహనను బట్టి పట్టణాలు అని అర్థం చెబుతున్నారు. అయినప్పుడు, "నవశాకం నవతి పురధ్వంసీ" అన్న మంత్రంలో శంబరాసురునికి చెందిన తొంబది పురాలను ధ్వంసం చేసి "దశవేశ్మాని" పది యిళ్లను నట్టుకున్నాడు ఇంద్రుడు అన్న అర్థం కుదరకపోగా అపహాస్యంగాను వుంటుంది. తొంభయి తొమ్మిది వ్యవసాయ క్షేత్రాలు ధ్వంసం చేసి, పది కుటుంబ గేహాలను పట్టుకొన్నాడని అర్థం చెప్పుకొన్నప్పుడు ఋగ్వేదం నాటి చారిత్రక వాస్తవికత స్పష్టంగా బోధపడుతుంది.

ఈ స్థితిలో వ్యవసాయ విరోధులయిన వైదికవర్గం వ్యవసాయం పేరున కల్పించిన దేవతలు అర్వాచీనులే అవుతారు గాని, ప్రాచీనులు కాజాలరు. ఇప్పటి సప్తమాతృకలే వ్యవసాయ దేవతలు, ప్రజనన తాంత్రిక శక్తులు అనడం సహేతుకం కాదు. అయినప్పుడు మొహెంజదారో కాలం నుంచి సారంపర్యంగా వస్తున్న వ్యవసాయానికి అతిప్రాచీన దేవతలు వుండడం సహజం కదా! అయి నప్పుడు ఆ దేవత ఎవరు?

## పొలి :

ఇప్పుడు మనకు పూర్తి అర్థం తెలియని కొన్ని చిత్రపదాలు వ్యవసాయం తోను, వ్యవసాయ ఫలంతోను సంబంధించినవి కనిపిస్తున్నాయి. అలాటివాటిలో ముఖ్యమైనది పొలి. కళ్లంమీద గింజలు కొలిచే టప్పుడుగాని, షావుకారు అమ్మకానికి కొలిచి ఇచ్చేటప్పుడుగాని, మొదటి కొలతను ఒక్కటి అని ఎంచే అలవాటు మనకు లేదు. తొలికొలత తో మన వారు "పొలిగలుగు" అంటారు. షావుకారయితే మొదటి కొలతకు "పొలిగలుగు", రెండో కొలతకు "లాభం" అని ఎంచి, ఆపై నుంచి మూడు, నాలుగు అని లెక్కపెడుతాడు. కొన్నిచోట్ల కొలత లేకుండానే పొలిగలుగు చెప్పి, మొదటి కొలతకే "లాభం" అనే అలవాటు కూడవుంది. ఏమైతేనేం, పండించిన రైతు, పంట వినిమయం చేసుకొన్న షావుకారు కూడ అనుదినం కోరేది "పొలికలుగాలి" అని.

ఏమిటీ పొలికలుగడం? పొలి అంటే అర్థం ఏమిటి? మనకు పొలికేక, పొలిబొబ్బ, పొలితొక్కడం, పొలిమేరలాంటి మరికొన్ని పదాలతో ఈ పొలి కనిపిస్తుంది. పొలికేక పొలిబొబ్బ అంటే, పెద్ద అరుపు అని ఇప్పటి నైఘంటుకార్థం. పొలిమేర అంటే గ్రామం సరిహద్దు అని ఇప్పటి అర్థం. ఇవికాక పోలమ్మ, పోలేరమ్మ, అనే దేవతలు, పోలాల అమావాస్య అనే ఒక పండుగ, పొలిగాడు అనే ఒక దేవుడు, ఆ దేవునిమీద "రావేలు గలవాడ, రార పొలిగాడ!" అనే పాటలు కూడ వున్నాయి. ఈపొలికి ముందు ఒక అక్షరం చేరిన ఉప్పాలి, ఉప్పలూరు, ఉప్పలపాడు లాంటి గ్రామాలు, ఉప్పలయ్య, ఉప్పలమ్మ వంటి పేర్లూ వున్నాయి.

ఇంత పదజాలం దొరికినా, పొలి, పోలేరు, ఉప్పల అంటే ఏమిటో స్పష్టంగా చెప్పగలిగిన సమాచారం సాంప్రదాయికంగా వచ్చింది మాత్రం కాదు పోతే, పోలాల అమావాస్య పండుగ జేసే విధానాన్ని పరిశీలించి, అలాటి విధానాలే మరెక్కడైనా వున్నాయేమో చూసి, తేఘారుచేస్తే పొలి అనేది మన అతిప్రాచీనమయిన ప్రజనన దేవత అనిస్పష్టమవుతుంది.

## పోలాల అమావాస్య :

ఈ అమావాస్య శ్రావణ మాసంలో వస్తుంది. దీనికే పోలాంబా వ్రతమని, పోలేరమ్మ నోమని అనేక నామధేయాలున్నాయి. కొన్ని బ్రాహ్మణ కుటుంబాలలో ఈ వ్రతం తప్పనిసరిగా చేస్తారు. ఆనాడు రకరకాల కూరగాయలు అన్నీ కలగలుపు చేసి కూరవండుతారు. ఒక కందమొక్కనుతెచ్చి, దానికే పోలేరమ్మ అని పేరుపెట్టి పూజ చేస్తారు. తర్వాత, ఒక చాకి ముత్తైదును పిలిచి, పసుపు, కుంకుమ ఇచ్చి, అన్నోపహారమిస్తారు. కలవారు చీరసారె పెట్టి పూజించడమూ వుంది.

ఈ వ్రతం, దీని ఫలశ్రుతి ఈ రోజులలో ఎలా వున్నప్పటికీ, వ్రత విధానంలో మూడుముఖ్య విషయాలు మనకు కనిపిస్తాయి. ఒక్కటి: దొరికిన కూరగాయలన్నిటితో కలగలుపువంట. రెండు:— కందమొక్క పూజ. మూడు:— చాకి ముత్తైదు ప్రాముఖ్యం. వీటిని అర్థమేమిటని అడిగితే, ఆచారం అంటారేగాని, సంతృప్తికరమైన వ్యాఖ్యచేయలేకపోతున్నారు. పంటలకాలంలో వచ్చే పండుగ కాబట్టి పంటలపట్ల ఆదరణ,

అభిమానం కలగలపుకూర వ్యక్తం చేస్తుందని సరిపెట్టుకోవచ్చు. కంద పిలకపూజ వృక్షపూజ అందామా, మనకు పవిత్రమైన వృక్షాలు ఎన్నో వున్నాయి. అశ్వత్థం వుంది. అశ్వత్థ ప్రదక్షిణాలున్నాయి. ఉసిరిచెట్టు, ఉసిరిపూజలూ వున్నాయి. వృక్షపూజకు ప్రత్యక్ష సాక్షిగా ఇంటింటా తులసీ బృందావనాలున్నాయి. ఇవికాక, వైదికులకు పవిత్రమైన ఉదుంబర న్యగ్రోధపలాశ వృక్షాలున్నాయి ఇంద్రునికి ప్రీతిపాత్రమైన మద్దిచెట్టు వుంది మహావృక్షమనుకుంటే, అక్షయవటం పిల్లలు వూరూరా కనిపిస్తాయి అయినప్పుడు, ఎందుకూ చెందని కంద పిలకకు మాత్రమే పూజ చేయడమేమిటి? వైదిక, లౌకిక సంస్కృత సంప్రదాయాలు దీనికి సమాధానమివ్వడం లేదు. ఇక అగ్రవర్ణాలయిన బ్రాహ్మణులు రైతులకు సైతం కులం తక్కువ వారయిన చాకి ముత్తైదువలను పూజించడమేమిటి? దీనికి శాక్తతంత్రంలో కొంత ఆధారం కనిపిస్తుంది. కౌలాచార శాక్తులు పంచకన్యలను పూజిస్తారు. వారి సంప్రదాయం ప్రకారం కన్యలంటే అవివాహితలైన అమ్మాయిలుకారు వారు, కుల కన్యలు. వారి కన్యాత్వం ఎప్పటికీ చెక్కుచెదరదు. అలాటివారిలో కనిష్ఠకాధిష్ఠిత రజకి. మిగతావారు చర్మకారిణి, శిల్పిని, మొదలయినవారు. అయినప్పటికీ రజకీ పూజకు సరైన ఆకారం కనిపించదు.

## కృష్ణాసియనుల ఆచారం :

ఇందుకు మనం చరిత్రకు పూర్వపు చరిత్రను తవ్వితీయవలసి వుంటుంది. మానుష శాస్త్రజ్ఞులు తెలుగువారిని ఆస్ట్రలాయిడ్ జాతులలో చేరుస్తారు. ఇప్పుడు ఆస్ట్రలాయిడ్ మహాజాతికి చెందిన కుదుళ్ళు నాల్గు మాత్రమే సాంకర్యం లేకుండా మిగిలి వున్నాయి. అందులో ఇంకా మాతృ పరంపర దశను మరిచిపోకుండా, మోటు వ్యవసాయమే ప్రధానవృత్తిగాగల వారు కృష్ణాసియనులు. వీరినే శాస్త్రజ్ఞులు మెలినీషియనులు అంటారు. మెలనిన్ అంటే నల్లరంగు. వీరు న్యూజిలాండు దగ్గర గల ట్రోబియాండ్ దీవులలో వున్నారు.

వీరు, వ్యవసాయపు తొలిదశలో వున్నారు. కాబట్టి వీరి వ్యావసాయిక తాంత్రిక సాధనాలు స్పష్టంగా, అర్థవంతంగా మనకు కనిపిస్తాయి. ప్రతివ్యావసాయిక జాతిలాగే ఈ జాతిలో కూడా కడుపు చలవగల తల్లికి గౌరవం ఎక్కువ. వంధ్యకు సమాజంలో గౌరవం లేకపోవడమేకాక, ఆమెను అంటరానిదానినిగాను చూస్తారు ఆ సమాజంలో వ్యవసాయం ఇప్పటికీ స్త్రీలది. ప్రయోజన దేవతలు స్త్రీలు. వారి పౌరోహిత్యం కూడ స్త్రీలదే.

సమాజంలో చిన్న చూపునకు గురి అయిన స్త్రీలు. ప్రజనన దేవతల అనుగ్రహం సంపాదనం కోసం ఈ పురోహితలను ఆశ్రయించడం అలవాటు ఇటువంటప్పుడు, వృద్ధపురోహిత ఈ వంధ్యను ఒకచోట కూర్చోబెట్టి ఎక్కువ సంతుకలిగి కడుపు చల్లగా వున్న తల్లికట్టు విడిచిన బట్టలను తెచ్చి, ఆమెమీద కప్పుతుంది. ఆ తర్వాత కొంత తంతునడిపి, రెండుచేతులు పైకెత్తి, "ఉ పోలేరో!" అని తమజాతి ప్రజననదేవతను ఆహ్వానించి, ఈ వంధ్యను ఆవహించమని కోరుతుంది. వారిభాషలో ఓ అన్న సంబోధనార్థకం ఆదిలోవస్తే "ఉ" అవుతుంది. అప్పుడ "ఉపోలేరో! అన్న మంత్రం మన ఇప్పటి భాషలో "ఓ పోలేరు" అవుతుంది. దీనిని బట్టి కృష్ణాసియనుల ప్రజనన దేవతపేరు పోలేరు అని తేలుతుంది.

ఈ ప్రజనన తంత్రంలో ప్రధానమయిన అంశం పదిమంది బిడ్డలను కన్నతల్లి కట్టువిడిచిన వస్త్రం మలవస్త్రం, తదితర వైయక్తిక సామగ్రి తంత్రప్రయోగానికి అత్యవసర మన్న సంగతి తంత్రశాస్త్రంతో పరిచయమున్న వారికందరికీ తెలుసు. సమాజం బాగా పెరిగి, వివిధవృత్తులుగా విడివడిన తర్వాత కడుపు చలవగలిగిన తల్లి కట్టువిడిచిన వస్త్రం మంచి పని కోసమైనా బాహాటంగా సంపాదించడం సాధ్యంకాదు. తాంత్రికుల మతం ప్రకారం వైయక్తిక సామగ్రితో మంచి పనీ చేయవచ్చు. స్తంభన మారణాది దుష్ప్రయోగాలూ చేయవచ్చు. అందుకని, తన మంచినీ, తన పిల్లలమంచినీ, తన కడుపు చలవనూ కోరే ఏ తల్లీ అభివృద్ధి సమాజంలో ఆ వైయక్తిక వస్తువులను ఇచ్ఛికంగా ఇవ్వదు. అలాంటప్పుడు కడుపు చలవగల తల్లుల కట్టువిడిచిన వస్త్రాన్ని సేకరించగల శక్తి ఒక్క రజకి మాత్రమే కలదు.

ఇప్పుడు, పోలేరమ్మ వ్రతంలో పోలేరు పదానికి మూలంతో పాటు రజకి ప్రాముఖ్యం కూడ మనకు దొరికింది.

ఆస్ట్రలాయిడ్ జాతులలో ప్రజనన దేవతపేరు "పోలేరు" అని మనకు కృష్ణాసియనుల అలవాటును బట్టి తెలిసింది. కానీ, దీనికి అర్థం ఏమిటో పోలేరు స్వరూపమేమిటో తెలుసుకోవాలంటే, కృష్ణాసియనుల కన్నా ఇంకా వెనుకపడివున్న తక్కువ కుదుళ్లను తడువవలసి వుంటుంది. అలాంటివారిలో ఒక కుదురు లంకలోని వెద్దాలు. మరొకటి అండమాను దీవులలోని నిగ్రిటోలు ఇంకొకరు ఆస్ట్రేలియా ఆదివాసులు. వీరు విభిన్న పరిణామదశలలో వున్నారు పండితులైన వారు, పరిశోధకులు ఈ జాతుల జీవనవిధానాలను, నమ్మకాలను భాషను పరిశీలిస్తే తెలుగువారి తొలినాటి ముచ్చట్లెన్నో వెలుగులోకి వస్తాయి.

ఇప్పుడు, తెలుగునాట కొన్ని బ్రాహ్మణ కుటుంబాలలో వున్న పోలాంబా వ్రతాన్ని తిరిగి పరిశీలిద్దాం. ఈ వ్రతంలో మనకు కనిపించినవి మూడు ముఖ్యాంశాలు గదా! కలగలపుకూర నేలతల్లి ప్రజనన శక్తి ఇబ్బడి ముబ్బడిగా పెరిగిన దానికి నిదర్శనం. కూరగాయలను వేర వేరుగా కాకుండా కలగలిపి వండడం ఆదిమజీవన విధానానికి శేషచిహ్నం ప్రజనన శక్తికి ప్రతీక కందపిలక చిన్న బోడిపెను విత్తగా, అది అంతకు కొన్ని వందలరెట్లు పెరుగుతుంది. ఒక అంశం ఎత్తగ, ఇన్ని వందల అంశాన్ని ఫలించె మొలక మనకు నిత్యం కనిపించే వాటిలో మరొకటిలేదు. అందుకనే ఎన్నో పవిత్రవృక్షాలున్నా, కందపిలకతే పోలేరమ్మ ముందు అగ్రపీఠం. ఇక చాకి ముత్తైదువ పూజ ఆమెవల్ల పాలివస్త్రం కావాలి దాన్ని సాధించాలంటే, ఆమెను ఎంతో మంచి చేసుకోవలసిన అవసరం వుంది. ఆదరించాలి, అభినందించాలి, అర్చించాలి, ఉడుగరలివ్వాలి, ఉపాయనాలివ్వాలి అదే అలవాటు నేటికీ నిలిచింది, అసలు పాలివస్త్రం సంగతీ, అర్థమూ కూడా పోయాయి.

## పోలి పదాలు :

పోలి, పోలేరు, పోలేరమ్మ, పోలే, పోలం, లాంటి పదాలన్నిటికీ తెలుగువారి తొలి ప్రజనన దేవత అయిన పోలేరు మూలమని ఇప్పుడు వివరంగా తేలింది

ప్రజనన ప్రక్రియ కంతటికీ మూలం క్షేత్రం అది ప్రజననశీలంగా వుండడం కోసం తాంత్రిక క్రియలు జరిపి దానికి పోలం అని

పేరు పెట్టారు. సామూహికంగా వ్యవసాయం చేసే కుటుంబాలన్నీ కలిసి, పొలిని ఆవాహన చేసిన క్షేత్రాల చుట్టూ ఒక గిరిగీసేవారు. ఆ గిరికి పొలిమేర అని పేరు

అయితే, ఈ పొలిని ఆవాహించడం, పొలిమేరను నిర్ణయించడం ఎలా జరిగేది? ఆ తాంత్రిక ప్రక్రియ ఏమిటి? ఓషధులలో ప్రజనన ప్రతీక కందపిలక అయితే, జంతువులలో అలాటిది పందిపిల్ల. ప్రాచీన వ్యావసాయిక దేశాలన్నిటిలోను పందిని ప్రత్యక్ష ప్రజననశక్తిగా భావించి ఆరాధించేవారు. మన దేశంలో, మన తెలుగునాటా అంతే

నిన్న మొన్నటి వరకు గ్రామ ప్రజలంతా కలిసి పొలితంత్రాలలో పాల్గొనే వారు. వీరంతా గ్రామం పొలిమేరకు చేరి చిన్నగొయ్యి తవ్వి అందులో ఒక పందిపిల్లను పడవేసి, మహావేశంతో అరుస్తూ, బొబ్బలు పెడుతూ, దానిని కసి తీర కాళ్ళతో తొక్కేవారు. పొలంలో వున్న దుష్టశక్తులు ఈ కేకలకు పెడబొబ్బలకు భయపడి పారిపోగా, కాలికింద నలిగిన పందిపిల్ల ప్రజననశక్తి గ్రామం పొలాలన్నింటికి వ్యాపిస్తుందని తొలి తెలుగువారి నమ్మకం. ఆ నమ్మకం లేకపోయినా, ఆ అర్థం తెలియక పోయినా, నిన్న మొన్నటి వరకు పొలి తొక్కడం తెలుగు పల్లెలలో ఆచరంగా వుండేది. ఇప్పటికీ మారుమూల పల్లెలలో వుండవచ్చు. అలా తొక్కిన తర్వాత, కేకలు బొబ్బలు పెడుతూ, ఆయకట్టు పొలాల చుట్టూ తిరిగి వచ్చేవారు. ఆ విధంగా తాము స్థాపించిన పొలికి ఒక ఆన, హద్దు ఏర్పడింది. ఇప్పుడు పొలిమేర అంటే గ్రామ నివేశనసీమ అని అర్థం మిగిలింది. అలాగే అర్థంలేని కేకలకు, బొబ్బలకు పొలికేక, పొలి బొబ్బ అన్న అర్థం మిగిలింది. పొలి తొలికాలపు పొలి వ్యవసాయంలో పురుషాధిక్యంతోపాటు తాను కూడ పురుషరూపం దాల్చి పొలిపాటలలో పొలిగాడుగా ప్రత్యక్షమయింది. అయితే మనకు తోలుబొమ్మలలోను, వీధి నాటకాలలోను హాస్యగాడుగా మరొక పొలిగాడు— జుట్టుపోలిగాడు దర్శనమిస్తాడు. వీడెవడు? ఎక్కడినుంచి వూడిపడ్డాడు?

## ప్రజనన క్రియ—కామతంత్రం

జుట్టుపోలిగాడు నిజానికి కేవలం హాస్యగాడు మాత్రమేకాదు, ప్రజనన శక్తి పుష్కలంగా గల రసికుడు. పానుగంటివారి సాక్షిలో "తోలుబొమ్మలు" అన్న వ్యాసం చదివిన వారికి ఈ జుట్టుపోలిగాడి ప్రతిభ అర్థమవుతుంది. జుట్టుపోలిగాడి ప్రియురాలు బంగారక్క. ఆమె వానికి మేనత్త. మేనత్త మేనల్లుడి సరసం మనకు ఇప్పుడు కాస్త ఎబ్బెట్టుగానే వుండవచ్చు. అయితే, "అత్త బోయిన నానికి ఆయుష్యమెక్కువ" అన్న మన వారి సామెతను వేమకూర వేంకటకవి సుభద్రార్జునుల వావి విషయంలో గుర్తుకుతెచ్చి, కావ్యత్వ గౌరవం కల్పించాడు. ఏమైనా, సామెతగాను, వేమకూరవారి కవిత్వంలోను, తోలుబొమ్మలాటలోను దీనిని సహిస్తామే కాని, అది ఒకనాటి మన సమాజ నీతి అంటే మాత్రం ఒప్పుకోలేము

కాని, మనకు పొలి ప్రసాదించిన ఆ కృష్ణాసియనులను అర్థం చేసుకుంటే, ఈ సమస్య కూడా పరిష్కారమవుతుంది. ఆ సమాజంలో వావి కలిసినవారు, కలియనివారు చాలా స్పష్టంగా వుంటారు. కలియని వారితో కలుసుకోవడం పెద్ద తప్పు. తను తప్పినదాన్ని బాహాటంగా ఒప్పుకొన్న ఆ స్త్రీలతో ఆత్మహత్య చేసుకోవడం ఒక్కటే ప్రాయశ్చిత్తం. వావి కలియనివారిలో ప్రధానురాలు తోబుట్టువు. ఇప్పటికీ హిందూ సమాజంలో తోబుట్టువు పట్ల గౌరవం, వావి తప్పడం పట్ల నిషేధం మనకూ కృష్ణాసియనులకూ వున్న సంబంధాన్ని నిరూపిస్తుంది. ఇక వావి కలిసిన వారిలో అగ్రగణ్యురాలు మేనత్త. వారి భాషలో ఆమెను "అత్తగు గూ" అంటారు. మేనత్తతో మేలమాడకపోతే తప్పు. అయితే సామాన్యంగా మేనత్తతో మేనల్లునికి వయస్సులో చాల వ్యత్యాసం వుంటుంది కనుక అది పచ్చి ఎరిహాసాలవరకే పరిమితమవుతుంది. మేనత్త ప్రతినిధి ఆమె కూతురు. తనను, తనకూతురుని, తనకు అందుబాటులో వున్న ఇతర కన్యలను తెచ్చి మేనల్లునికి అప్పగించడం ఆమె విధి. వయస్సులో ఎంత వ్యత్యాసమున్నా, మేనల్లునికి తొలిపాఠాలు నేర్పేది సాధారణంగా మేనత్తే. అది కూడ ఆమె బాధ్యత. అలాంటి ఆచారంలోనుంచి పుట్టిన పాత్రలు మన బంగారక్క, పొలిగాడూను. హిరణ్య గర్భమనే బంగారక్క, దానికి ప్రజనన శక్తి కల్పించగల యువకుడే పొలిగాడు.

బిడ్డలు పుట్టుకకు స్త్రీ పురుష కామిక ప్రవృత్తే కారణమని తెలుసుకొన్న తొలి వ్యవసాయ దారిణులకు నేల తల్లి కడుపు పండటకు కూడ అలాటిదే అవసరమన్న భావం కలగడం సహజం. అందుకే భూదేవిలో కామోద్దీపన కలిగించడం కోసం ప్రజనన తంత్రంలో అనేక క్రియలు వెలిశాయి. ఒకటి— వాచికం. ప్రజనన క్రియలను చిలవలు, పలవలుగా వర్ణించడం. ఒకనాడు ఇలాటి వర్ణనకు ఎంతో పవిత్రత వుండేది. అప్రస్తుతంగా అలాటి వర్ణనలు చేయడం తప్పుగా భావించేవారు. ఆ భావం రానురాను అలాటి వర్ణనలనే తప్పు ఆరోపించి వేడు బూతులుగా తిట్లుగా పరిగణిస్తున్నాము. రెండవది — కాయికం. స్త్రీ పురుష సాముదాయిక కామక్రీడలు నేలలోనూ ఉద్దీప్తి కలిగిస్తాయని ఆనాటి వారి నమ్మకం. ఇవి ఒకనాడు సమాజంలో పవిత్రాలుగాను, గౌరవప్రదాలుగాను వుండి రానురాను బూతుగా పరిగణిత మయాయి.

అయితే, వ్యవసాయ భౌతిక సాధనాలు పెద్దగా పెంపొందనంత వరకు సమాజమూ, సమాజనీతి ఎంతగా పెంపొందినా, తాంత్రిక సాధనాల అవసరం పూర్తిగా పోదు. మనదేశంలో పరోక్ష జ్ఞానాలయిన తర్క, తత్త్వ శాస్త్రాలు ఇతరులకు ఆశ్చర్యం కలిగించేటంతగా పెంపొంది వచ్చినా, ప్రత్యక్ష శాస్త్రాలయిన సాంకేతిక యంత్ర శాస్త్రాలు పెద్దగా పెరగకపోవడం వల్ల, మన వ్యవసాయ పద్ధతులలో చెప్పుకోదగ్గ మార్పు రాలేదు. మొహెంజోదారో కాలంనాటి దుంపనాగలే నేటికి వుంది. నాటి మోట, ఏతము, గూడలు వంటి జలయంత్రాలే నేటికీ నడుస్తున్నాయి. నిన్న మొన్నటివరకు గోమయమే ప్రధానమైన ఎరువు. ఇలాగ భౌతిక సాధనాలలో పెంపుదల లేకపోవడం వల్ల, తాంత్రిక సాధనాల అవసరం ఏదో ఒక రూపంలో వుండి తీరుతుంది. పెంపొందించిన తత్త్వాలు ఎంత కొట్లాడినా తాంత్రిక సాధనాలను పూర్తిగా ఓడించలేవు.

అందుకే నమే నిన్న మొన్నటివరకు కామోద్దీపక శిల్పాలు, చిత్రాలు దేవాలయాలంకరణకు తప్పనిసరి అయ్యాయి. ఈ కామోద్దీపన ప్రక్రియకు సులభంగా అందుబాటులో వుండే దేవదాసీ గణాలు, దేవాలయ వ్యవస్థలో భాగమయ్యాయి. నిత్యమూ కాకపోయినా, ఏడాదికొకసారయినా భూమికి ప్రజననశక్తిని ప్రసాదించడంలో సహాయపడే కలనారందరూ పాల్గొనాలన్న నియమం కొన్ని పండుగల రూపంలో మిగిలింది. అలాంటి పండుగలలో అనతీతమే, నేటి హోళీ. ఇది ఉత్తరాదిన ఎక్కువ

ప్రచారంలో వున్న హోలీలో నుండే పుట్టిన పండుగ. హోలి హోలీగా మారడం భాషాశాస్త్రరీత్యా సర్వసాధారణం పైగా, హోలీకి సంబంధించిన సంస్కృత వాఙ్మయంలో హోలాకి, హోలాకాలతో పాటు హోలీ హోలాకాలు గూడ పర్యాయాలయ్యాయి. అవైదికమైన పండుగలు, ఆచారాలు అన్నిటినీ, ముఖ్యంగా ప్రజనన తాంత్రికోత్సవాల నన్నిటినీ శాస్త్రబద్ధం, వేద సంప్రదాయ సమ్మతం అనడం కోసం హోలాక న్యాయం కనిపెట్టారు పూర్వమీమాంసకులు. హోలాకా న్యాయమంటే హోలి పండుగవలె అని అర్థం. హోలీలాంటి పండుగను మనదేశంలోనే కాదు, వ్యావసాయిక సమాజంగా మొదలయిన ప్రతిదేశంలోను వుంది. ఇటు ఆస్ట్రలాయిడ్ జాతులకు చెందిన హోలి, తాంత్రికత, అటు సుమేరియా నాగరికతకు చెందిన తమ్ముజ్, ఇష్టారీల తాంత్రికత కలిసి, నేటి హోలీగా రూపొందింది. సుమేరియా తమ్ముజ్, ఇష్టారీలు అనేక దేశాల్లో అనేక రూపాలెత్తారు. తమ్ముజ్ గ్రీకుల ఆడోనిస్ అయినాడు. ఇష్టారీ వారి కామదేవత అయిన వీనస్ అయింది. మధ్యలో దిమిత్రి, ప్రొసర్పైన్ కథలుగా రూపొందారు. తమ్ముజ్ ఇష్టారీలు ఇద్దరూ దేవతలు. ఇష్టారీ తమ్ముజ్ ను ప్రేమిస్తుంది. వారి ప్రేమ ఫలించకముందే తమ్ముజ్ మరణిస్తాడు. ఇష్టారీ ప్రియుణ్ని వెతుకుతూ పాతాళానికి వెళ్లి దేవతలతో పోరి తమ్ముజ్‌ను సాధించుకొంటుంది. అయితే, ఆరునెలలు మాత్రమే భూమిమీద ఆమెతో వుంటాడు. మిగత ఆరు నెలలు తప్పనిసరిగా పాతాళంలో వుండాలి. విత్తనం ఆరునెలలు మృతావస్థలో పడివుండడాన్ని, మిగిలిన ఆరునెలలు జీవచైతన్యంతో మొక్కగా పెరిగి ఫలించడాన్ని ఈ కథలో చూచారు పండితులు. తమ్ముజ్ మృతి, పునర్జన్మల ఉత్సవాన్ని వ్యవసాయోత్సవంగా పశ్చిమదేశాలలో జరుపడం రివాజు. తమ్ముజ్ మరణానికి శోకం, పునరుత్థానానికి సంతోషం, మధ్యలో భూమి ప్రజనన శక్తికి ప్రోద్దీపకంగా బూతుపాటలు, ఆటలు, తమ్ముజ్ మృతదేహ దహనం, ప్రజననశక్తి ప్రోద్దీపకంగా ఆ బూడిదను పొలాలనిండ చల్లడం వర్షతంత్రక్రియగా నీరు ఎగజిమ్మడం — వీటన్నిటినీ కలిపి జర్మనీలో, ఇటలీలో, ఫ్రాన్సులో, రష్యాలో పశ్చిమాసియా అంతటా పూర్వం పెద్ద పండుగగా జరిపేవారు. మనదేశపు హోలీలోనూ ఈ అన్ని తాంత్రిక క్రియలూ వున్నాయి. కామదహనం చేస్తారు. కాముడు కాలిపోయినందుకు కల్ల ఏడ్పులు ఏడుస్తారు. బూతుపాటలు పాడతారు. బూడిద విరజిమ్ముతారు. రంగునీరు ఎగజిమ్ముతారు. కొందరు రైకల పండుగ కూడ చేసుకుంటారు.

## తంత్ర ప్రాబల్యం:

మన దేశంలో వ్యవసాయం వ్యాప్తిచెందిన కొలదీ వ్యవసాయదారుల తాంత్రిక సాధనాలను ఆదరించి అభిమానించిన వారు మాత్రమే వారి మధ్యన మనగలిగిన పరిస్థితి వుండేది. అందుకనే ఎంత వేదవేదాంగ వేత్తలయిన వారైనా తాంత్రిక విద్య చేపట్టనిదే రైతులమధ్య మనుగడ సాగించలేక పోయేవారు. వ్యవసాయదారులలో పలుకుబడి, తద్వారా స్థిర జీవనావకాశం సంపాదింపగోరేవారంతా తమ తత్త్వాలు, తమ ధర్మాలు, ఏవైనప్పటికీ తంత్ర విద్యను మన్నించక తప్పలేదు. అందుకే బౌద్ధమతం కూడ వజ్రయానమనే ఒక తంత్రప్రక్రియను అనుసరించవలసివచ్చింది. అదివరకు ప్రజలలో వున్న వ్యవసాయదేవతలకు కొత్త పేర్లు పెట్టి స్వీకరించవలసి వచ్చింది. శంకర భగవత్పాదులవంటివారు తాను పునరుద్ధరించిన షణ్మతాలలో శక్తి తంత్రానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి పొగడక తప్పలేదు. భక్తిపారమ్యాన్ని బోధించిన విశిష్టాద్వైతులు కూడా మార్పులు చేర్పులతో తంత్రవిద్యను చేపట్టవలసి వచ్చింది.

వ్యవసాయగణాలు అభివృద్ధి పొంది అదివరకు స్థిరపడిన సమాజంలో అంతర్భాగమయ్యేటప్పుడు ఆయా గణపురోహితులు, సమాజ పురోహిత వర్గంలో చేరిపోయారు. అందుకనే అతి ప్రాచీన గణాలలో కనిపించే అనేక అవైదికాచారాలు, సంప్రదాయాలు నాటి మన బ్రాహ్మణ్యంలో కనిపిస్తాయి. తెలుగుజాతి ఒక్క ఆస్ట్రలాయిడ్ జాతినుంచి మాత్రమే ఏర్పడిందికాదు. ఇందులో పురు, కురు, తురు, భరతాది ఆర్యగణాలు, సుమేరు, అసుర, యూదు ఆది అసురగణాలు, మంగోల్ మహాజాతికి చెందిన శుక్లాసియను గణాలు — అంటే పాలినీషియను గణాలు — కూడా చేరాయి. భర్తృహీనకు కేశముండనం పాలినీషియన్ ఆచారం. ఈ గణాలన్నీ జాతిలో లీనమయినప్పుడు, ఆయా గణ పురోహితులు తమతమ గణసంప్రదాయాలతో సహా బ్రాహ్మణవర్గంలో చేరారు. అలాగే గణముఖ్యులు క్షత్రియవర్గంలో చేరిపోయారు. భిల్లగణం నుంచి పెంపొందిన గణముఖ్యులు మేవార్ మహారాణాలై సూర్యవంశ క్షత్రియులయ్యారు. గోండ్‌గణాల నుంచి వచ్చిన ముఖ్యులు చందేలా మహారాజులై సుక్షత్రియ వంశ్యులయ్యారు. పురోహితవర్గం వీరికి సూర్య చంద్రులతో చుట్టరికం అల్లి ఆర్షసంప్రదాయానికి, పురాణ సంప్రదాయానికీ అతికింది.

దేశంలో వ్యవసాయం ప్రధానవృత్తిగా వున్నంత వరకు, వైజ్ఞానిక రంగాలలో సమాజం సాధిస్తున్న ప్రగతికి వ్యవసాయం దూరంగా వున్నంతవరకు వ్యవసాయోత్పత్తి సాధనాలలో ఎదుగు — బొదుగు లేనంత వరకు తాంత్రికసాధనాల ప్రాబల్యం తప్పదు.

ఒక రకమైన తాంత్రిక పద్ధతికి కాలదోషం పట్టినప్పుడు మరొక పద్ధతి కొత్తవేషంతో ముందుకు వస్తుంది. సాంప్రదాయిక తాంత్రికుల స్థానే కొత్త ఆహార్యంతో, కొత్త వాచికంతో కొత్త తాంత్రికులు పుట్టుకు వస్తారు. ఏ శక్తులవల్ల వ్యవసాయ సంపద పెరుగుతున్నదో తెలియని అజ్ఞానం వున్నంతకాలం పొలిగలుగు, పొలిగలుగు అన్న దీవన వినిపిస్తూనే వుంటుంది. పొలికేకలు వినిపిస్తూనే వుంటాయి.

మిత్రులు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారితో తరచు చర్చించిన విషయాల సారాంశమే ఈ వ్యాసం. వారికి చాల ఋణపడి వున్నాను. శ్రీమతి పేరంచ అనసూయమ్మ నుంచి పోలేరమ్మ, ముత్యాలమ్మ నోముల వివరాలు తెలుసుకున్నాను. ఆమె జానపద విజ్ఞానఖని. ఆమెకు నా కృతజ్ఞతలు.

ఈ వ్యాసానికి ఆధారమయిన పుస్తకాలను క్రింద పేర్కొంటున్నాను —


ఋగ్వేదం,

అథర్వణ వేదం,

The Sexual life of Sovages in North-Western Malanesia—Sri Bromslow Malinnoski.

Sex and Repression in Sovage Society—Some Author.

Golden Bough—Sir J. G Frazer.

Our oriental Heritage—Will Durent.

# తిరుపతి వేంకటకవుల దేవీభాగవతము

## శ్రీ పి. గణపతిశాస్త్రి

సమగ్రసాహిత్య దృక్పథంతో పరిశీలిస్తే తిరుపతి వేంకటకవులు మన ఆధునికాంధ్ర కవితా ప్రస్థానానికి ఆద్యులని విమర్శకులందరు అంగీకరిస్తారు అయితే దీనిలో కొన్ని అభిప్రాయభేదాలు లేకపోలేదు కొంత లోతుగా ఆలోచిస్తే ఏ కవితోద్యమమయినా అకస్మాత్తుగా అవతరించదని స్పష్టపడుతుంది తెలుగు కవితలో కూడా ఈ ఆధునికతలో క్రమక్రమంగా గానే రూపొందిందే గాని ఒక్కసారిగా ఉద్భవించలేదు.

వెంకట పార్వతీశ్వర కవులు, శ్రీ రాయప్రోలు సుబ్బారావు, గురుజాడ అప్పారావు, ఆ పైన సాహితీసమితికవులు మాత్రమే ప్రత్యేకించి ఆధునిక కవితోద్యమానికి ఆద్యులని అభిమానించి వివదించేవారనేకులున్నారు వీరిలో కొందరు గురుజాడ అప్పారావు ఒక్కరు మాత్రమే మన ఆధునిక కవిత్వానికి అంకురార్పణ చేసిన ఆది కవి అని అభిమానిస్తారు మరి కొందరు వెంకటపార్వతీశ్వరకవులకు, ఇంకా కొందరు శ్రీ రాయప్రోలు వారికి ఈ గౌరవం కల్పిస్తారు. నిజానికి తిరుపతి వేంకటకవులతోనే ఈ ఆధునికత బాగా మొలకెత్తింది ఆ తరువాత పైన పేర్కొన్న వారందరు కొద్దిగానో గొప్పగానో మన ఆధునిక కవితా సరస్వతికి శాయశక్తులా చేయూత ఇచ్చినవాళ్ళే.

## తిరుపతి వేంకటకవుల విశిష్టత

తిరుపతి వేంకటకవు లిద్దరు జన్మించక మునుపు ఆంధ్రకవిత చిత్రకవిత్వ శృంఖలాబంధనాలలో చిక్కుకుని చిట్లం కట్టినట్టి విద్వాంసులకు మాత్రమే వినోదదాయకంగా ఉండేది, ఆ పరిస్థితిలో కింకవీంద్ర ఘటా పంచాననమనెడి ఘన బిరుద కంకణం ధరించిన ఈ కవులిద్దరు శ్రోతలకందరికి సులభగ్రాహ్యమై, హృద్యమమయిన తమ నిరర్గళాశు కవితావాహినితో అష్టావధాన శతావధానాలెన్నో గొప్పగా నిర్వహించి, సహృదయుల మన్ననలందుకున్నారు శ్రవణానందాది వివిధ కావ్యాలతో, పాండవోద్యోగ విజయాది నాటకాలతో ఆంధ్రప్రజానీకం హృదయాలలోనే ఆస్థానకవీశ్వరులయినారు! అంతేకాదు వారి సమాన కాలీనులు ఆటు పిమ్మట ప్రఖ్యాతిపొందిన కవీశ్వరులనేకులు తిరుపతి వేంకటకవుల శిష్యులమనో, ప్రశిష్యులమనో ప్రకటించుకుని అది తమకొక గొప్ప గణ్యత అని ఆనందించారు. తెనుగుకవిత్వానికి సువిశాలమయిన ప్రజాహృదయంలో ప్రవేశం మొట్టమొదటగా ఈ జంటకవులతోనే ప్రారంభమయింది. అష్టావధానంలాగకాక, శతావధానం చాలామంది పృచ్ఛకులతో, శ్రోతలతో నిండిన ప్రక్రియ అదిగాక ఇది ప్రత్యేకించి ఆశు కవితా ప్రధానమై, శతావధానుల స్వాదు కవితా, చాతురికొక్క చక్కనిగీటురాయిగా పరిణమించింది సునిశితమయిన జ్ఞాపకశక్తితో శీఘ్రంగా పద్యాలల్లగల శతావధాను లనేకులుండవచ్చును కాని తిరుపతి వేంకటకవులిద్దరు ఆశుకవితామార్గంలోనే చమత్కారాలతో, చలోక్తులతో, జాను తెనుగు పలుకులతో జాతీయతా పూర్ణమయిన సరస కవితాసౌరభం గుభాళించక లేకాదు. కనకనే వీరి కవితాప్రస్థానానికి ఒక విశిష్టత ఏర్పడింది.

## మన పురాణాల ప్రత్యేకత

ఆంధ్ర మహాభారతంతోనే మన పురాణ రచనకు అంకుర్పారణ జరిగింది నిజానికిది ఇతిహాసమే గాని పురాణం కాదు అయినా ఆటుపిమ్మట బయలుదేరిన తెనుగు పురాణాల రచనల కన్నింటికి ఇది ఒక మేలుబంతిగా పరిణమించింది ఇక్కడ ఒక విషయం ముఖ్యంగా గుర్తించుకోవాలి మన కవిత్రయం వారుగాని, ఆ పైన కాశీఖండ భీమఖండాదులు రచించిన శ్రీనాథాదులుగాని తమ కవితా సృష్టి అంతా చాలావరకు స్వతంత్రంగానే కొనసాగించారు అంతేగాని, అనువాదాలుగాగాని, అనుసరణలుగాగాని వీరు తమ రచనలేవి కొనసాగించలేదు నిజానికి మన మహా భారతాది రచనలన్ని మొత్తంమీద స్వకపోలకల్పితాలయిన మహనీయ కావ్యాలే! ఈ మహా కావ్యాల మూలాల సంస్కృత రచనలు నిండు పైడిగనులవంటివి ఆ గనులలో నుండి సేకరించిన పైడి అంతా వీరు మేలిమి బంగారుగా రూపొందించి, దానితో ఆంధ్రవాణికి ఎనలేని వెలలేని వింతనగలెన్నో సమర్పించారు ఇంతమాత్రాన వీరు స్వతంత్రకవులు కారనుకోవడం సరి కాదు షేక్స్పియరు తాను రచించిన నాటకాల కథలు గాథలు, ఇతివృత్తాలు సంఘటనలు చాలావరకు పూర్వరచనల నుండి సేకరించినట్లు విమర్శకులు నిరూపిస్తున్నారు అంతమాత్రాన ఆ మహాకవి సర్వస్వతంత్రతలో కెక్కడ భంగం కలగలేదు దీనికి కాళిదాస మహాకవి అభిజ్ఞాన శాకుంతలం కూడా ఒక చక్కని తార్కాణమే దీనిలోని కథ, ప్రధానమయిన ఘట్టాలు మహాభారతంలోనే కాకవస్తున్నాయి అయితే ఇదే మూలకథగా స్వీకరించి, చక్కగా మెరుగులు దిద్ది కాళిదాస మహాకవి తన రూపకంతో కవికుల గురువన్న ఘన ప్రతిష్ఠ గడించుకున్నాడు ఇలాగే ఇదే ఇతివృత్తంతో బాటు మహాభారతంలోని ఘట్టాలు కూడా అనుసరించిన పిల్లలమర్రి పినవీరభద్రకవి సర్వస్వతంత్ర కవిగా సహృదయుల మన్నన లందుకున్నాడు

## దేవీ భాగవత రచన

తిరుపతి వేంకటకవులు కూడా తమ దేవీభాగవతంలో ఇదే విధమయిన ధోరణి అవలంబించారు అదేమి విచిత్ర దురదృష్టమోగాని, మన తెనుగుమహాభారతంగాని, భాగవతంగాని, భాస్కర రామాయణంగాని ఒకేఒక్క చేతిమీదుగా పూర్తికాలేదు తిరుపతి వేంకటకవుల దేవీభాగవతం కూడా ఇదేవిధంగా అయిదారుగురి చేతుల మీదుగా సమగ్రత సంతరించుకున్నది మన భారత భాగవత రామాయణాలు అనేక కవులచేతుల మీదుగా పూర్తి కావడానికి సారస్వత చరిత్ర పరిశోధకులు అనేకవిధాల కారణాలు పేర్కొంటున్నారు అయితే తిరుపతి వేంకటేశ్వరుల దేవీ భాగవతానికి అనేక కవులు చేయూత ఇవ్వడానికి ఆకవీశ్వరుల అపారమయిన శిష్యవాత్సల్యమే అభిమానమే ప్రధానకారణము.

## రచనా కాలము

తిరుపతి వెంకటకవుల దేవీభాగవతం మొట్టమొదట వారి షష్టిపూర్తి మహోత్సవ సమయంలో వెలువడింది ఆ తరువాత దీనికి 1952

ప్రతులతో ద్వితీయ ముద్రణము, 1962 లో తృతీయ ముద్రణము వెలువడ్డాయి. అయితే దీని రచన ఇంచుమించుగా ఇరవై శతాబ్ది ప్రారంభ సమయానికి పూర్తి అయిఉండవచ్చును.

మొత్తంమీద దీనిలోని 12 స్కంధాలలోను నవమ దశమ స్కంధాలు తక్క మిగిలిన పది స్కంధాలు తిరుపతి వేంకటకవులే రచించారు. ఈ పది స్కంధాలలోను తిరిగి దివాకర్ల తిరుపతిశాస్త్రి రచించిన వెన్నో చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి రచించిన వెన్నో మనకిప్పుడు స్పష్టముగా తెలియదు. ఈ జంటకవులు తాము రచించిన గ్రంథాల నన్నింటిని తిరుపతి వేంకటకవులిద్దరు రూపొందించిన రచనలుగానే ప్రకటించుకున్నారు. అయితే తిరుపతిశాస్త్రి రచన ప్రౌఢ కవితా పరిణతితో నిండినదని, వెంకటశాస్త్రి రచన ఇంతకన్నా ఎక్కువగా స్వాదువని, జనమనోరంజకమని విమర్శక లోకంలో ఒక విఖ్యాతి వ్యాపించింది.

వీరిద్దరు విడిచివేసి అప్పగించిన దశమస్కంధం రచించిన కవి చెళ్లపిళ్ల చిన వెంకటశాస్త్రి. ఈయన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి పినతండ్రి కుమారులు. చిన్ననాట ఆయన వద్దనే విద్యాభ్యాసం చేసి, కవితలో ప్రవీణులయి, తమ గురువరేణ్యుల అంగీకృతితో, ఆశీర్వాదంతో దశమస్కంధం పూర్తి చేశారు. అయినా ఇది తిరుపతి వేంకటకవి కృతిలాగే రచించి వారిలాగే చర్ల బ్రహ్మయశాస్త్రి పేర కృతి సమర్పణ చేశారు. ఇక నవమస్కంధం రచించిన వారు ముగ్గురు. వీరిలో రామకృష్ణ కవు లిద్దరు. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి కుమారులు శ్రీ వేంకటావధానిగారు మూడవ వారు. ఈ రామకృష్ణ కవులలో మొదటి వారు ఆకొండి రామమూర్తి. రెండవవారు నిశ్శంకుల కృష్ణమూర్తి. వీరుభయులు తూర్పు గోదావరిజిల్లా మురమళ్ల పోలవరం గ్రామ వాస్తవ్యులు. ఆకొండి రామమూర్తి సాంప్రదాయకంగా సుప్రసిద్ధాయుర్వేద వైద్యులు. ఇక నిశ్శంకుల కృష్ణమూర్తి మురమళ్ల పోలవరం గ్రామ కరణము. వీరిద్దరు సహాధ్యాయులు. సన్నిహిత మిత్రులు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిని చిరకాలంనించి పీడిస్తున్న అజీర్ణ రుగ్మత ఆకొండి రామమూర్తి వైద్య చాతురితో పూర్తిగా నయమయింది. చెళ్లపిళ్ల కవికి తిరిగి పరిపూర్ణారోగ్యం కలిగింది. ఈ వైద్యంకోసం చెళ్లపిళ్ల కవి 1898 ప్రాంతంలో మురమళ్ల పోలవరం వెళ్లి అక్కడ ఆకొండి రామమూర్తి కవి ఇంట కొంతకాలం పాటున్నారు. అదే సందర్భంలో రామకృష్ణ కవుల నిద్దరిని దేవీభాగవతంలో నవమ స్కంధం తెనిగించ వలసిందని ప్రోత్సహించారు. దాని ఫలితమే ఈ రచన.

అయితే ఇక్కడ ఒక్క విషయం మాత్రం స్పష్టంగా బోధ పడడం లేదు. మూల సంస్కృతదేవీ భాగవతంలో పన్నెండు స్కంధాల లోను ఉన్న అధ్యాయాలన్ని కలిసి మొత్తం మీద మూడుమారుల మీద పదిహేనిమిది. సంస్కృతదేవీ భాగవతంలోని అధ్యాయాల విభజన పద్ధతి తిరుపతి వెంకటకవు లనుసరించలేదు. మొత్తం మీద దేవీభాగవతం అంతా పన్నెండు స్కంధాలుగానే రచించారు అంతే. నవమ స్కంధం మిగిలిన స్కంధాలన్నిటికన్న చాలా పెద్దది. దీనిలో అయిదు పదులదాకా అధ్యాయాలున్నాయి.

ఈ అధ్యాయాలలో మొట్టమొదటి అయిదు, చిట్టచివరి రెండు అధ్యాయాలు మాత్రమే తాము తెనిగించామని అంటున్నారు శ్రీ వేంకటావధానిగారు.

"సాకల్యం బొనరించి [illegible],
విశ్వ శ్రేయమౌనం గోర్చు మే
శ్రీ కల్యాణద మైన కృత్యములు
వాసిన్ బున్నెముం బంతగా
నా కాంక్షించియు, ఆదినై దు తుది రెం
డధ్యాయముల్ పేర్మితో
వాకున్ పిడిన రామకృష్ణులకు
సంధానింతు గ్రైవేయకృషిన్"

అయితే తిరుపతి వెంకట కవుల దేవీభాగవతంలో అధ్యాయ విభజన లేక పోయినందువల్ల వెంకటావధానిగారి రచన ఎక్కడనించి ప్రారంభించిందో స్పష్టపడడం లేదు తాము సమర్థులయినా రామకృష్ణకవులే భాగం తెనిగించక తమకు విడిచి వేశారంటున్నారు శ్రీ వేంకటావధానిగారు కాని తృతీయ దేవీ భాగవత ముద్రణ పీఠికలో రామకృష్ణ కవులు నవమస్కంధ రచనలో ఏదో కారణం వల్ల కొంతభాగం ప్రక్షిప్తమయినదని, కనక, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారా ప్రక్షిప్త భాగం పూరించారని వ్రాస్తున్నారు చెళ్లపిళ్లవారి కుమారులు శ్రీ చెళ్లపిళ్ల దుర్గేశ్వర శాస్త్రిగారు ప్రక్షిప్తమయినదంటే శిథిలమయినదని వీరి అభిప్రాయం? లేకపోతే వేరొక రెవరయినా ఆయాభాగాలలో తమ కవిత చేరిస్తే అది తొలగించి, శ్రీ వేంకటావధానిగారా భాగం పూరించారనా వీరి వివరణ ఏది ఏమయినా ఈ విషయంలో పాఠకుల సందేహం తొలగించి, వేరొక ముద్రణలోనయినా విస్పష్టంగా ప్రకటించి ఆ భాగం ప్రత్యేక శీర్షికతో ముద్రించవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉన్నది

## దేవీభాగవతం మహాపురాణమే

దేవీ భాగవతం మహాపురాణమా? లేక ఇది ఉపపురాణమా? శ్రీ కృష్ణపరమయిన శ్రీమద్భాగవతమే మహాపురాణమా? అని చాలా కాలం నించి ఒక వివాదం విద్వాంసులలో చెలరేగింది దీనికి తిరుపతి వేంకటకవులు తమ దేవీభాగవత ప్రస్తావనలో ఇచ్చిన ప్రతి సమాధానం మరి తిరుగులేనిదని అనిపిస్తుంది

"వ్యాసు డొనర్చినట్టి యరి
భారత మన్యపురాణజాలమున్
జేసిన మీద దీని దగ
జేసితిరేని, గవిత్వ శైలి యొంత
యై సరి వచ్చు వేరొకటి
యన్యకృతంబని తోచుగాని, యా
వ్యాసుని శైలిగా, దిది మహా
కవి, వేద్యము గాక యుండునే"

సంస్కృత దేవీభాగవతశైలి, శ్రీ మద్భాగవతశైలి జాగ్రత్తగా పరిశీలించినప్పుడు శ్రీ మద్భాగవతం కన్న దేవీ భాగవతమే బహు ప్రాచీనమని స్ఫురిస్తుంది ఈ మహాపురాణంలో అడు గడుగునా, ఆర్షప్రయోగాలు, సంధులు కోకొల్లలుగా గోచరిస్తాయి అదిగాక సంస్కృతదేవీ భాగవత వ్యాఖ్యాత నీలకంఠ పండితుడు కూడా తన వ్యాఖ్యాన ప్రారంభంలో దేవీభాగవతమే కృష్ణద్వైపాయనకృతమని సహేతుకంగా చక్కగా నిరూపించాడు. అత్యంత [illegible]

వతం వ్యాసదేవకృతమని నిశ్చయించారు. ఇంకా లోతుగా పరిశీలిస్తే ఆయా ఘట్టాలలో, పురాణ కథన పద్ధతిలో శ్రీమద్భాగవతం దేవీ భాగవతానుకరణమని నిశ్చయించుకోవచ్చును. తిరుపతి వేంకట కవులు నిరూపించినట్లు ఆయా చారిత్రికాధారాల జోలికి పోక, కేవలం శైలిని బట్టి పరిశీలిస్తే దేవీభాగవతమే కృష్ణ ద్వైపాయన కృతమని సునిశిత పరిశీలకుల కందరికీ తప్పక స్ఫురించి తీరుతుంది. అయితే దీనిలో రాధా పూజాది సంప్రదాయాలు కొన్ని ఆధునికాలని కొంత రసవ చ్చును గాని, ఇవి ప్రక్షిప్తాలయి ఉండవచ్చును.

## అభిమాన కృతి

తిరుపతి వేంకట కవులు ఎన్ని గ్రంథాలు రచించినా దేవీ భాగవతమే ఆ జంటకవుల అభిమానకృతి అని స్పష్టపడుతుంది. దీనిలో వారు తమ పూర్వుల ప్రశస్తి చేసి, విద్యాభ్యాసాలు మొదలయినవన్ని ఉగ్గడించి, విశేషంగా చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గురు ప్రశంసతో ఆ మహనీయుని పేర తమ కృతి అంకితం చేసి కృతకృత్యులమయినామని ఆనందించారు. ఇంతేకాక, దీనిలో మనకున్న చిన్న తెనుగు వ్యాకరణాన్ని గురించి దానిని బట్టి ఆయా ప్రయోగాల సాధుత్వాసాధుత్వాల నిర్ణయాలను గూర్చి విశేషంగా చర్చించి తాము మహాకవుల ప్రయోగాలే ఒరవడిగా గ్రహించి రచన చేస్తున్నామని, సంకుచితమయిన తెనుగు వ్యాకరణం పరిధిలో ఇది కొనసాగలేదని విస్పష్టంగా వివరించారు. వ్యావహారిక గ్రాంథికాంధ్ర భాషల వివాదాల సమయం నిఖ్యాతికెక్కిన వీరి "తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది" అన్న పద్యం దేవీభాగవతంలోనిదే!

> "తెలుగునకున్న వ్యాకరణ
> దీపము చిన్నది, గ్రాహ్యమంచు వె
> ద్దలు కొనియాడు భారతము
> తప్పని శిక్యము గాను, దానితో
> గలిగిన లక్ష్య భేదములు
> వాదన కాద్యతి సంగ్రహించి, వి
> జ్ఞుల గతి నిందు గూర్చెదరు
> చక్కగ దిర్పతి వేంకటేశ్వరుల్"
>
> — ప్రథమ స్కంధము— 35

> "వ్యాకరణ మొక్క త్రోవ, మ
> హా కవు లొక్క త్రోవ, కోశమఖిల మొక్క త్రో
> వై కనుపట్టెడి నీ భా
> షా కావ్యమ్ములను దరుచు చదివిన కొందిన్"
>
> — ప్రథమ స్కంధము— 26

## ప్రథమ దేవీభాగవతము

ఎన్ని పురాణాలున్నా అంతకు మునుపు వెలసిల్లిన మహాకవులెవ్వరూ దేవీభాగవతం తెనిగించలేదని తామే మొట్టమొదటుగా దీనిని చేపట్టామని తిరుపతి వేంకటేశ్వరు లన్నారు.

> "ఎన్ని పురాణమ్ములు ఆ
> మన్నియు నాంధ్రీకరించి, యనుకంపన గా
> కున్నన్ దీనిని విడుతురె,
> పన్నియు భట్టాదికవి జనమ్ములు మాకున్?"

నాకు తెలిసినంతవరకు పద్యాత్మకాలయిన ఆంధ్ర దేవీ భాగవతాలు ఇంకా మూడున్నాయి. ఈ భాగవతాల రచయితలు ములుగు పాపయారాధ్యులు, దాసు శ్రీరాములు, శ్రీ నోరి నరసింహశాస్త్రి. వీరిలో పాపయారాధ్యుల దేవీభాగవతం తిరుపతి వేంకటకవుల దేవీభాగవతం కన్న రచనలో కొంచెం ప్రాచీనమయినది. అయితే ఈ పద్యాన్నిబట్టి అది ఈ జంట కవుల దేవీభాగవత రచనా కాలానికి ఇంకా వెలువడలేదని, దాని సంగతి వీరికి తెలియనే తెలియదని వూహించుకోవలసి ఉన్నది.

## ఊర్వశీ పురూరవ ఘట్టము

ఊర్వశిగాథ ఋగ్వేద సూక్తంలోనే వినవస్తున్నది. ఈ ఊర్వశి రవీంద్రుని ఊర్వశీ కృతిలో బహుమనోహరంగా, ఆదర్శ సౌందర్యనిధిగా సాక్షాత్కరిస్తున్నది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఊర్వశి కావ్యంలో ఈ ఊర్వశి మరింత ఆదర్శమనోహారిణిగా మైమరిపింప జేస్తున్నది. అదీ గాక ఈమె నారాయణదేవుని ఊరువులనుండి అవతరించిన అతిలోక సౌందర్యశాలిని

అయితే వ్యాసమహర్షి దేవీభాగవతంలో ఊర్వశి సౌందర్యం కన్న క్రౌర్యమే అత్యధికము! మూల దేవీభాగవతంలో ఈ క్రౌర్యమొక పరాకాష్ఠ చేరుకుంటుంది. పురూరవుడు ఉన్మత్తుడై దేశదేశాలలో ఊర్వశికోసం పరిభ్రమిస్తూ కురుక్షేత్రంలో ఆ సుందరిని చూచి పరిపరి విధాల వాపోతాడు. తానింక మరణించనున్నట్లు, పసికట్టిన తోడేళ్లు, కాకులు పైబడి భక్షించగలవని మొరపెట్టుకుంటాడు. ఊర్వశి ప్రగాఢాలింగన భాగ్యంతో వివశమయిన తన దేహం క్రూరమృగాలపాలు కాగలదని పలవరిస్తాడు. ఆమెకోసం పలుదేశాలలో పరిభ్రమించి నేలపై కూలి సొబోతున్నట్లు వాపోతాడు. ఆ మూల శ్లోకా లివి

> "అయి! జాయే! తిష్ఠ! తిష్ఠ! ఘోరే వచ్యక్త్యు మర్హసి
> మాం త్వం త్వన్మన సంక్రాంతం వశగం చాద్య నాగసమ్
> సకో హో యం పతత్యద్య దేవి దూరం హృతస్త్వయా
> ఖాదం త్వేనం వృకాః కాకాః త్వయా త్యక్తం వరోరుయత్"
>
> — ప్రథమస్కంధము, త్రయోదశాధ్యాయము.

ఈ క్రౌర్యం తిరుపతి వేంకటకవుల దేవీభాగవతంలో చాలా చెప్ప బడింది. వారిది విడిచివేసి, ఊర్వశి దేవవేశ్య కన్యక ఆమెకి చపలచిత్తం సహజమే అన్నట్లు సమర్థించారు. అంతే!

> "వెలయాండ్రెక్కడ కూర్మలెక్కడ?
> దయా నిశ్వాస భావమ్మ లె
> క్కడ? లో లో దలపోయ నేరకిటు మా శ్వేం
> బూనగా జెల్ల ని
> కలలోనైనను వార కామినుల పాం
> గత్యంబు వాంఛింతురే!
> కలదే మాత్రము గట్టినట్టి
> మగడొక్కండంచు మా జాతికిన్"

అంటుంది ఊర్వశి. ఈ వేశ్యా ధోరణి ప్రసక్తి మూల దేవీభాగవతంలో లేదు. తిరుపతి వేంకట కవుల కాలంలో బాగా వ్యాప్తి పొందిన దేవదాసీ వృత్తి నిర్మూలనోద్యమ ప్రచారమే దనిక దోహదం కలిగించి ఉండవచ్చును. వారి స్వకపోలకల్పితమయిన శ్రవణానందంలో కూడా ప్రధాన లక్ష్యమిదే! సంస్కృత దేవీభాగవతంలో, ఈ ఘట్టంలో వ్యాస మహర్షి హృదయంలో చెలరేగిన సాధనలో స్త్రీ క్రౌర్య వర్ణనమే ప్రధాన లక్ష్యము. దాని ఉదాహరణమే ఈ ఊర్వశీ పురూరవుల చరిత్ర వర్ణనము.

దీనితో అనావశ్యకమైనటువంటి శేక్స్యదోషాలు ప్రసక్తి రొప్పించడంవల్ల ఆ ప్రధాన లక్ష్యం నెరవేరలేదు! వేరొకచోట వీరి భాగవతంలో ఇటువంటిదే ఇంకొక వారంగనా దూషణ ప్రసక్తి కనిపిస్తుంది.

మూలంలో ఊర్వశి పురూరవ చక్రవర్తిని "మూర్ఖ!" అని సంబోధిస్తుంది. తిరుపతి వేంకటకవులు పై పద్యంలో ఆ సంబోధన "మౌర్ఖ్యం బూనగా జెల్లునే!" అని మార్చి ఈ ఘట్టంలో ఊర్వశి క్రౌర్యం బాగా తగ్గించివేశారు. ఈ ఘట్టం వీరి రచన కుత్కృష్టత కలిగించడం లేదు.

దేవీ భాగవతం ప్రథమ ముద్రణ జరిగినప్పుడు దానిలో కొన్ని సవరణలు దిగబడి పోయినట్లు వేంకటశాస్త్రి అన్నారని వారి కుమారులు పెద్దపిన్న దుర్గేశ్వరశాస్త్రి తమ పీఠికలో తెలియజేశారు. ఆ సవరణలు కొన్ని వేంకటశాస్త్రి స్వయంగా శ్రీదుర్గేశ్వర శాస్త్రిగారికి తెలియజేశారట. అవి అన్ని తిరిగి ద్వితీయ ముద్రణలో చేర్చారట. అయితే ఇంకా కొన్ని మిగిలిపోయి ఉండవచ్చునని అవి తెలియజేసిన విదుల తమ కృతజ్ఞత వెల్లడించుకో గలమని వారంటున్నారు. ఇటువంటి సవరణ కొక చిన్న ఉదాహరణ.

"వెలయాండ్రెక్కడ గూర్మి యెక్కడ ద
యా విశ్వాస భావమ్ము! లె
క్కడ"

ఇక్కడ రెండవ పాదంలో ప్రాసలో ల బదులు "డ" పడి ప్రాస భంగమయింది. ఇది చిన్న సవరణవల్ల తిన్నబడే పద్యంకాదు. కనకనే దీనిని మార్చక, అలాగే విడిచివేశారనుకుంటాము. ఇటువంటి పట్టులలో పెద్ద మార్పు చెయ్యడం కన్న అలాగ విడిచిపెట్టి, అధోజ్ఞాపికలో సూచించడమే సరియైన ప్రచురణ పద్ధతి.

## సరస సరళ కవిత

తిరుపతి వేంకటకవులు చాలా ఘట్టాలలో స్వతంత్ర ధోరణి అవలంభించారని అనుకున్నాము. దీనికి వారికి సహజమయిన విలక్షణమైన కవితా ధోరణి తోడయింది. ఇదే ఊర్వశీ పురూరవ ఘట్టంలో పురూరవుని పీసం వారి స్వకపోల కల్పన కొక చక్కని ఉదాహరణ. దీనిలోని భావాలేవి మూలంలో లేవు.

సీ. "రమణి! నీయాలింగనము చొప్పడమి నాకు
రాత్రులెల్లను శివరాత్రు లాయె.
పూబోడి! నీదు తాంబూల మబ్బమి నాకు
దినములెల్లను హరి దినము లాయె!
తలిరు నీ కెమ్మోవి తేనె లబ్బమి నాకు
ఋతువు లెల్లను గ్రీష్మ ఋతువు లాయె!
కలికి! నీతో బొత్తు గలిగియుండమి నాకు
క్షణములెల్లను గత క్షణము లాయె!
గీ. లలన! నీనవ్వుగవ్వు వెన్నెలలకు బోక
భాగ్యమబ్బమి నా కెల్ల పక్షములను
కృష్ణపక్షములాయె! నీరీతి నొప్పు
కాల మెగతి వేగింతునే లతాంగి!"

— ప్రథమ స్కంధము 398

ఇది వీరి సరళ సహజ కవితా ధోరణి. అలాగని ఈ పదంత సర్వత్ర ఒకే విధంగా కొనసాగిందని భావించడం పొరపాటే అవుతుంది. ఆయా ఘట్టాల కనుగుణంగా వీరనేక విధాల శైలీ మార్గాలనుసరించారు. ఇది దేవీస్తుతి పరమయిన ఉత్పలమాలిక

"తల్లి! జగత్త్రయీ భరణ
దక్షకటాక్ష కళా విలాస, యుతో
త్పుల్లసముల్ల సత్కమల
తుల్యముఖీ! ప్రకృతి స్వరూపిణీ!
పల్లవపాణి! నిత్య శివ
భాగ్యవిధాయిని, సర్వరూప సం
ధేల్లిత దేహ! దివ్యపదవి
పరిభాసిని! మత్తకాశినీ!"

ఇలాగ వీరి వివిధ శైలి విన్యాసాలకెన్నయినా తార్కాణాలు చెప్పవచ్చును. తిరుపతి వేంకట కవుల దేవీభాగవతం వారి కవితా రచనలన్నింటిలోను తలమానికము. ఇది వారు తమ ప్రత్యేక నైపుణ్య ప్రదర్శించుకున్న అభిమాన కృతి. ఆధునికాంధ్ర కవిత్వ పరిణామంలో పరిణతిలో ప్రప్రథమంగా పేర్కొనదగినది ఈ దేవీభాగవతమే. ఈ తరుణంలో వీరి ప్రముఖ శిష్యులు కాటూరి పింగళి కవులిరువురూ తమ సౌందరనందంలో వేంకటశాస్త్రిని గురించి చేసిన ఈ ప్రశస్తిలో అతిశయోక్తి లేదు.

"కేవలనాడు బొత్తుపకు కేల్
గలపం దలపోసి కాదు, వి
వేకము మెచ్చగాఁ గవిత
చెప్పగనేర్తు మటంచు గాదు, వి
ఖ్యాతిక గా దికేమనిన
సద్యశ సాంద్రకవి ప్రపంచ వి
ఖ్యాతకు భక్తిమై మడుగిరల్
మటియుంచెడి స్వామియే మమున్!"

# తెలుగులో అసమాపకక్రియ: క్త్వార్థకం

శ్రీ చేకూరి రామారావు

ఒకటికన్నా ఎక్కువ క్రియలున్న తెలుగువాక్యంలో—చివరిక్రియ సమాపక రూపంలోనూ, మిగతా క్రియలు అసమాపక రూపంలోనూ ఉండవచ్చు. తెలుగులో సమాపక అసమాపక క్రియలను గుర్తుపట్టటం తేలిక. ఏవో కొన్ని క్రియలకు తప్ప (తెలుగు, వచ్చు, వంటివి) సమాపక క్రియలన్నిటికీ చివర కర్తృ పదాన్ని సూచించే క్రియా విభక్తులు (ను, ము, వు, డు, దు, రు,) చేరతై. భూతకాలిక వ్యతిరేక క్రియా రూపాల వంటి వాటిల్లో (రాలేదు, పోలేదు, కాలేదు వంటివి) కర్తృబోధకమైన క్రియా విభక్తులు లేక పోయినా కొన్ని ఇతరాధారాల వల్ల సమాపక క్రియల్ని గుర్తుపట్టవచ్చు. అసమాపకక్రియలకు క్రియా విభక్తులు చేరవు. కాలబోధక ప్రత్యయాలకు సరూపమైన ప్రత్యయాలు చేరతై.

అసమాపక క్రియల్ని రెండు రకాలుగా విభజించవచ్చు. సమాపక క్రియా వ్యాపారానికన్నా ముందు జరగటానికి ఉద్దేశించిన వ్యాపారాన్ని సూచించేవాటిని క్త్వార్థకాలని, సమాపక క్రియావ్యాపారంతో పాటే జరిగే వ్యాపారాల్ని సూచించే వాటిని శత్రర్థకాలనీ వ్యవహరించటం సాంప్రదాయికం. తెలుగులో నీటికన్నా తేలికయిన మాటలు రచనా వ్యవహారంలో కనిపించటం లేదు గనుక ప్రస్తుతానికి వాటి ప్రయోగౌచిత్యాన్ని గురించిన విచికిత్స మానేసి వాటిని యథాతథంగా వాడుతున్నారు.

క్త్వార్థక క్రియారూపం ధాతువుకు—ఇ అనే ప్రత్యయం చేర్చటం వల్ల ఏర్పడుతుంది. దీనికి వ్యతిరేక రూపాలు రెండున్నై. ఒకటి—అకుండా, రెండోది—అక, అనే ప్రత్యయాలు చేర్చటంవల్ల ఏర్పడతై. శత్రర్థకరూపం—తూ —టూ అనే ప్రత్యయారూపాలు చేర్చటం వల్ల (అన్వాదులకు —టూ, మిగతా ధాతువులకు—తూ చేరుతుంది.) ఏర్పడుతుంది. తిను ధాతువులు ఉదాహరణగా గ్రహిస్తే రూపాలు ఇట్లా ఉంటై.

క్త్వార్థక: తిని, తినకుండా, తినక

శత్రర్థక: తింటూ.

ఈ క్రియలతో వాక్యాలిట్లా ఉంటై.

1. సుజాత అన్నంతిని నిద్రపోయింది.
2. సుజాత అన్నంతినకుండా నిద్ర పోయింది.
* 3. సుజాత అన్నం తినక నిద్ర పోయింది.
4. సుజాత అన్నంతినక చిక్కి పోయింది.
5. సుజాత అన్నం తింటూ నిద్రపోయింది.

వీటిలో వాక్యం (3) అధునిక భాషలో వ్యాకరణ సమ్మతంకాదు. ప్రాచీన భాషలో ఇట్లాంటి ప్రయోగాలు వ్యాకరణ సమ్మతాలు. ప్రాచీన భాషలో తినకుండా, తినక వంట రెండు క్రియా రూపాలూ ఒకే అర్థంలో వాడబడినట్లు కనిపిస్తున్నది. అధునిక భాషలో ఈ రెండు రూపాలూ వేరుబడి భిన్న ప్రయోజనాల్ని నిర్వహిస్తున్నై.

ఈ వ్యాసం క్త్వార్థక క్రియా ప్రయోగాలకే పరిమితం. క్త్వార్థక క్రియ చాలా అర్థాల్లో ప్రయుక్తమవుతుంది. వాటిల్లో కొన్ని మాత్రమే ప్రస్తుతానికి పరిశీలిస్తాము. అన్నిటినీ పరిశీలించక పోవటానికి వ్యాస విస్తరభీతి ఒక్కటే కారణంకాదు. వాటిల్లో సూత్రీకరణకు సరిగా లొంగనివి చాలా ఉన్నై. ఇంకా కొంతపరిశోధన జరిగితేనే గాని కాస్తో కూస్తో సంతృప్తి కరంగా వాటినిగురించి చెప్పటం సాధ్యం పడదు.

క్త్వార్థక ప్రయోగ రహస్యాల్ని ప్రాచీన వ్యాకర్తలు కూడా కొంతవరకు గ్రహించారు. ఉదాహరణకు బాల వ్యాకర్త "సమానాశ్రయంబులం బూర్వ కాలంబునం దివర్ణకంబగు" (క్రియ—38) అనే సూత్రంలో ఏకాశ్రితమైన భిన్న వ్యాపారాలున్నప్పుడు క్త్వార్థక క్రియలు పూర్వవ్యాపారాల్ని బోధిస్తయ్యని సూచించాడు. ఉదాహరణకు ఈ క్రింది వాక్యాల్ని గమనించండి.

1. సుజాత అన్నంతిని నిద్ర పోయింది.
* 6. సుజాత అన్నంతిని సుజాత నిద్రపోయింది.
* 7. సుజాత అన్నంతిని ఆఅమ్మాయి నిద్రపోయింది.
* 8. సుజాత అన్నంతిని సుశీల నిద్ర పోయింది.

ఈ పై వాక్యాల్లో (ఈ వ్యాసంలో మిగతా చోట్లకూడా) పువ్వు గుర్తులున్న వాక్యాలు వ్యాకరణ విరుద్ధాలు. మొదటి వాక్యంలో అన్నంతిను, నిద్రపోవు అనే రెండు వాక్యాలకూ ఆశ్రయమైన కర్త సుజాతే. వాక్యం (6)లో కూడా రెండు వ్యాపాలకూ సుజాతే కర్త అయినా, కర్తృపదం పునరావృతం కావటం వల్ల, అర్థబోధ కలుగుతున్నా వాక్యం సరి అయిందికాదు. వాక్యం (7)లో సుజాత ఆఅమ్మాయి అనే పదాలతో ఒకే కర్తని వ్యవకర సూచించదల్చుకున్నా తెలుగు వాక్యం అందుకు అనుమతించదు. వాక్యం (8)లో రెండు వ్యాపారాలకూ కర్తలు వేరు వేరు. అందు వల్ల ఈ వాక్యంకూడా వ్యాకరణ విరుద్ధమే అవుతున్నది. పై వాక్యాల్ని బట్టి క్త్వార్థక ప్రవర్తనము గురించి ఈ కింది విధి నిషేధాల్ని గ్రహించవచ్చు.

భిన్న వ్యాపార బోధకమైన వాక్యంలో క్త్వార్థక, క్రియాశ్రయమైన కర్త, సమాపక క్రియాశ్రయమైన కర్త ఒకటే అయి ఉండాలి. అందులో పునరుక్తమైన కర్తృపదాలు లోపించాలి. కర్తృపదాలు సమరూపకమూ సమబోధకమూ అయినప్పుడు ఇట్లాంటిలోపం జరుగుతుంది. (దీన్నే సనామబంధలోపసూత్రమని పరివర్తన వ్యాకర్తలూ వ్యవరిస్తారు.)

పైన చెప్పిన నియమాలు క్త్వార్థకం బదులు శత్రర్థకం ఉన్నా వర్తిస్తై. అందువల్ల పై సూత్రీకరణలో శత్రర్థక క్రియను కూడా చేర్చుకోవాలి. అందుకు ఈ క్రింది వ్యాకరణ విరుద్ధ వాక్యం ఉదాహరణగా గ్రహించవచ్చు.

9. సుజాత అన్నం తింటూ సుశీల నిద్ర పోయింది.

ద్వ్యర్థక త్ర్యర్థక వాక్యాలకు సమానార్థకాలుగా కనిపించే వాక్యాలు కొన్ని ఉన్నై.

10. సుజాత అన్నం తిన్న తరువాత నిద్ర పోయింది.

11. సుజాత అన్నం తింటూ ఉండగా నిద్ర పోయింది

వాక్యం (10) వాక్యం (1) కి, వాక్యం 11) వాక్యం (5) కూ క్రమంగా సమానార్థకాలు. అయితే 10, 11 వాక్యాలు వాటి సమానార్థక వాక్యాల కన్నా ప్రవర్తనలో భిన్నాలు. ఈ వాక్యాలు భిన్న కర్తలను సహిస్తై. పూర్వోదాహృత వాక్యాలు భిన్నకర్తలను సహించవు. అంటే 12, 13 వాక్యాలు వ్యాకరణ సమ్మతాలు.

12. సుజాత అన్నం తిన్న తరవాత సుశీల నిద్ర పోయింది.

13. సుజాత అన్నం తింటూ ఉండగా సుశీల నిద్ర పోయింది.

వ్యాకరణ సమ్మతమయితే 8, 9 వాక్యాలు క్రమంగా 12,13 వాక్యాలకు సమానార్థకాలయి ఉండేవి సమానార్థకమైన వాక్య ద్వయంలో భిన్న వ్యాకరణ నియమాలుండటం విశేషం. నిజానికి ఇవి సమానార్థకాలు కాకుండా అయినా ఉండాలి. విశేషమైన కారణమేదైనా ఉండి ఉండాలి. అందుకు ఊహించిన కారణం పరివర్తన సిద్ధాంతాన్ననుసరించి ఈ క్రింది బొమ్మల ద్వారా సూచింబడుతుంది (చూ. బొమ్మలు 1,2,3.

బొమ్మ 1




(10) (12) రెండూ కూడా గుప్త నిర్మాణంలో రెండేసి వాక్యాలు కలవటం వల్ల ఏర్పడ్డయ్. కర్తృపదాలు వేరైనప్పుడు తరవాత అనే శబ్దాన్ని రెండు వాక్యాల మధ్య చేర్చినప్పుడు వాక్యం (12) నిష్పన్నం అవుతుంది. కర్తృ పదాలు ఒకటే అయినప్పుడు సనామబంధలోప సూత్రం వల్ల రెండో వాక్యంలో సుజాత అనేనామబంధం లోపిస్తుంది. అప్పుడు చెట్టుబొమ్మ ఇట్లా ఉంటుంది. (చూ బొమ్మ2)

బొమ్మ 2




(సనామ బంధ లోప సూత్రం తరవాత)

సరిగ్గా ఈ సమయంలో రాస్ ప్రతిపాదించిన వృక్షచ్ఛేదన నియమాన్ననుసరించి కొమ్మలేని 'వాక్య' తొలగించ బడుతుంది. అతరువాత క్రియాబంధసంహార సూత్రప్రకారం రెండు క్రియాబంధాలు ఒక చోట చేర్చ బడతై. ఈ సూత్ర ప్రవర్తన తరవాత నిర్మాణ సూచికా వృక్షం ఇట్లా ఉంటుంది. (చూ. బొమ్మ3).

బొమ్మ 3




(క్రియా బంధ సంహార సూత్రం తరవాత)

రాస్ ప్రతిపాదించిన ఇంకో నియమం ప్రకారం ఒకమూలం నుంచి సరూపమైన పిలక మొలిస్తే, తన కొమ్మల్నిమూలానికి చేర్చి తను తొలగి పోతుంది. పై బొమ్మలో ఉన్న ఒక 'వాక్యం' గుర్తు అట్లాంటి పిలక గనుక అది తొలగించ బడుతుంది. ఆతరువాత రెండు క్రియాబంధాల మధ్య తరవాత చేర్చటం కాని లేక పూర్వక్రియను ద్వ్యర్థకంగా మార్చటం గాని పరివర్తన సూత్రం ద్వారా జరగాలి. పైన పేర్కొన్న బాల వ్యాకరణ సూత్రం సరిగ్గ ఈ సమయంలో ప్రవర్తించే పరివర్తన సూత్రమన్న మాట. తరవాత అనేశబ్దం చేరిస్తే వాక్యం 10 నిష్పన్న మవుతుంది. (తిన్నది తరవాత 7 తిన్నతరవాత) బాలవ్యాకర్త చెప్పిన సూత్రం ప్రవర్తిస్తే వాక్యం (1) నిష్పన్న మవుతుంది.

పరివర్తన వ్యాకరణంలో వాక్య నిర్మాణాన్ని చెట్టు బొమ్మల ద్వారా సూచిస్తారు. చెట్టు బొమ్మల ఉపమానాన్ని బట్టి ఆలోచిస్తే పైన రాస్ ప్రతిపాదించిన వృక్షచ్ఛేదన నియమాలను దోహద క్రియలుగా సంభావించ వచ్చు. వ్యాకరణ సమ్మత వాక్యాలను నిష్పాదించటానికి ఈ దోహదక్రియలు అవసరం. ఇవి సర్వ వ్యాకరణాలకు అవసరమయ్యే నియామాలు పైన పేర్కొన్న బాల వ్యాకరణ సూత్రంలో ఈ క్రిందివివరణ కనిపిస్తున్నది. సమాన కర్తృకంబులకు సమానాశ్రయంబులనుటంచేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి పడిసె నిత్యాది సిద్ధంబయ్యె. ఈ వివరణను బట్టి ధాత్వర్థ వ్యాపారాశ్రయత్వానికి, కర్తకూ భేదాన్ని సూచించ దల్చుకున్నట్టు తెలుస్తున్నది. అయితే కారక పరిచ్ఛేదంలో మూడో సూత్ర వివరణలో "ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాబడు" అని నిర్వచించబడింది. అంటే ఒకచోట (కారక పరిచ్ఛేదంలో) కర్తను గుప్త నిర్మాణపు కర్తగానూ, ఇంకో చోట (క్రియాపరిచ్ఛేదంలో) వ్యక్తనిర్మాణపు కర్తగానూ భావించినట్టు కనిపిస్తున్నది. చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి పడిసె అనే వాక్యంలో "చేత ప్రత్యయం "కర్తకు చేత వర్ణకంబగు" అనే సూత్రంవల్లనే రావాలి. (ఇక్కడ కర్త గుప్త నిర్మాణపు కర్త). కొట్టు అనే క్రియకు చైత్రుడే ఆశ్రయం. అట్లాకాదంటే చేత వర్ణకం రావటానికి వేరే సూత్రం లేదు. కాని మొదటి క్రియ ద్వ్యర్థక క్రియగా మారాలంటే మైత్రుడు ఆశ్రయం కావాలి. అందువల్ల బాలవ్యాకర్త చేసిన ఈ రెండు వివరణల మధ్య వ్యత్యాసం కనిపిస్తున్నది. ఇదే నిజమయితే బాల వ్యాకర్త గుప్త వ్యక్త నిర్మాణాల మధ్య భేదం గుర్తించినా, దాన్ని సర్వత్రా పాటించ లేదని చెప్పాల్సి ఉంటుంది.

బాలవ్యాకర్త గుప్త వ్యక్త నిర్మాణాలమధ్య పడ్డపొరపాటు ఒక ముఖ్య విషయాన్ని తెలియపరుస్తున్నది. ఒక వాక్యంలో క్త్వార్థక క్రియ ఉన్న వాక్య భాగానికి, ప్రధాన క్రియ ఉన్న వాక్యభాగానికి గుప్త నిర్మాణపు కర్తలు వేరైనా వ్యక్త నిర్మాణపు కర్తలు ఒకటే కావాలి. ఈ నియమాన్ని వ్యక్త నిర్మాణపు నియమంగా (**Surface structure constraint**) గా గుర్తించాలి. పై నియమానికి ఉదాహరణలుగా ఈ క్రింది వాక్యాలను గ్రహించవచ్చు.

14. సుజాత(సుబ్బారావుని) తిరస్కరించి బాధ పడింది.

15. సుజాత (సుబ్బారావుచేత) తిరస్కరించబడి బాధపడింది.

*16. సుబ్బారావు సుజాతను తిరస్కరించి సుజాత బాధపడింది.

వాక్యం (14) గుప్త నిర్మాణంలో కర్త వ్యక్త నిర్మాణంలో కర్త ఒకటే. వాక్యం (15)లో రెండు భాగాలకు గుప్త నిర్మాణపు కర్తలు వేరు. కాని వ్యక్తనిర్మాణపు కర్తలు ఒకటే కావటంవల్ల వ్యాకరణ సమ్మత మయింది. వాక్యం(16)(15) కన్నా గుప్త నిర్మాణానికి ఎక్కువ సన్నిహితం. అయినా వ్యక్త నిర్మాణపు కర్తలు వేరుకావటం వల్ల వ్యాకరణ విరుద్ధమయింది. వాక్యం(15) కు ఈవిధంగా గుప్త నిర్మాణాన్ని సూచించవచ్చు. (చూ. బొమ్మ4).

బొమ్మ 4




కర్తృపదాలు వేరుకావటంవల్ల ఇంతకుపూర్వం చేర్కొన్న సనామ బంధలోప సూత్రం కాని, క్రియాబంధం సంహార సూత్రంకాని ప్రవర్తించవు. రెండు వాక్యాల మధ్య తర్వాత అనే శబ్దాన్ని అనుసంధిస్తే వ్యాకరణసమ్మతమైన వాక్యం నిష్పన్న మవుతుంది. ఇక్కడ మొదటి వాక్యంలో కర్మణి సూత్రం ప్రవర్తించటానికి వీలుంది. కర్మణి సూత్ర ప్రవర్తనకు కర్తృకర్మ పదాలు భిన్నం కావాలి. ఈసూత్ర కర్తృకర్మపదాల స్థానాన్ని వ్యత్యయ పరుస్తుంది. ఈ సూత్రం ప్రవరించింతరవాత చెట్టు ఇట్లా ఉంటుంది. (చూ.బొమ్మ 5.)

బొమ్మ 5




(కర్మణి సూత్రం తరవాత)

ఇప్పుడు సనామబంధ లోప సూత్రం, క్రియాబంధ సంహార సూత్రం, ఆయా సందర్భాల్లో వ్యక్తచ్ఛేదన నియమాలు (లేకదోహద నియమాలు) ప్రవర్తిస్తై. అప్పుడు బాల వ్యాకరణ ప్రతిపాదించిన పరివర్తన సూత్రం ప్రవర్తించి వాక్యం (15) నిష్పన్నమవుతుంది. బాల వ్యాకర్త సూత్రాన్ని క్త్వార్థక సూత్రం అనవచ్చు. దీన్నిబట్టి పరివర్తన సూత్రాలు ఒక నిర్దిష్ట క్రమంలో ప్రవర్తిస్తాయని కూడా గ్రహించవచ్చు. ఇంతవరకూ చర్చించిన పరివర్తన సూత్రాలను అవి వర్తించే క్రమంలో ఈవిధంగా ఏర్పాటు చేయవచ్చు. వ్యాకరణ నిర్మాణంలో మార్పులు తెచ్చే సూత్రాలు గనుక వీటిని పరివర్తన సూత్రా లంటారు.

పరివర్తన సూత్రాలు:

1. కర్మణి సూత్రం (వికల్పం).
2. సనామ బంధలోప సూత్రం (నిత్యం).
3. క్రియాబంధ సంహార సూత్రం (నిత్యం).
4. క్త్వార్థక సూత్రం (వికల్పం).
5. తరవాత—బంధసూత్రం (నిత్యం).
6. —పడు లోప సూత్రం (వికల్పం).

వీటిల్లో మొదటి మూడు సూత్రాలకు విస్తృతమైన ప్రవర్తన ఉంది ఈ సూత్రాలు ఈ వరసలోనే వర్తించాలి ఇందుకు వాక్యం(15) న ఉదాహరణగా గ్రహించ వచ్చు. వికల్పమైన కర్మణి సూత్రం ప్రవర్తించినప్పుడు వాక్యం (14) నిష్పన్నమవుతుంది. వాక్యం (12)లో 2, 3, సూత్రాలు ప్రవర్తించవు. కర్తలువేరు కావటం వల్ల క్త్వార్థక సూత్రం కూడా ప్రవర్తించదు. అప్పుడు ''తరవాత—బంధ'' సూత్రం నిత్యంగా ప్రవర్తిస్తుంది వాక్యం (10) ని నిష్పన్నం చెయ్యటానికి 2,3 సూత్రాలు ఆ క్రమంలో వర్తించి, వికల్పమైన క్త్వార్థక సూత్రం ప్రవర్తించకపోతే తరవాత బంధ సూత్రం నిత్యంగా ప్రవర్తిస్తుంది. కాని ఈవాక్యాన్ని గమనించండి.

? 17. సుజాత అన్నంతిని, తరవాత నిద్రపోయింది.

వాక్యం 10ని, 17 తో పోల్చిచూస్తే కొన్ని భేదాలు కనిపిస్తున్నై. (10)ని అవ్యవహితంగా ఉచ్చరించాలి. 17ని అవ్యవహితంగా ఉచ్చరించ కూడదు. అందువల్ల ఈ రెండు వాక్యాలు నిష్పాదనలో భేదం ఉండి ఉండాలి. దీన్నిబట్టి చూస్తే క్రియాబంధ సంహారసూత్రం (17)కు వర్తించినట్టు లేదు. ఇది వర్తించలేదంటే దీన్ని అడ్డుకున్నది ఏదో ఉండి ఉండాలి. పైన పేర్కొన్న వ్యక్తచ్ఛేదన నియమం ఇక్కడ వర్తింపలేదని తెలుస్తుంది. అంటే వాక్యం(17)లో కనిపించే 'తరవాత' ఏదో సూత్రమైన తరవాత— బంధ సూత్రంవల్ల చేర్చింది కాదని, అంతకుముందే ఉన్నదని తేలుతుంది. సనామ బంధలోప సూత్రం వర్తించిన తరువాత వాక్యం 17కు నిర్మాణం ఇట్లా ఉంటుంది. (చూ బొమ్మ 6.)

బొమ్మ 6




(సనామ బంధ సూత్రం తరవాత)

ఇంతకుపూర్వం పేర్కొన్న వ్యక్తచ్ఛేదన నియమం ఇక్కడ వర్తించదు. అప్పుడు నాలుగో సూత్రం వర్తించి వాక్యం(17) నిష్పన్న

మైంది సౌలభ్యం కోసం మళ్ళీ ఉదాహరిస్తున్న (10) (17) వాక్యాలను ఇప్పుడు పోల్చి చూడండి.

10. సుజాత అన్నం తిన్నతరవాత నిద్రపోయింది.

17. సుజాత అన్నంతిని, తరవాత నిద్రపోయింది.

పై వాక్యాలు (10)ని ఎందుకు అవ్యవహితంగా ఉచ్చరిస్తున్నామో, (17)ని ఎందుకు వ్యవహితంగానే ఉచ్చరిస్తున్నామో ఇప్పుడు కారణం తెలుసుకోవచ్చు. వాక్యం (10)లో వ్యక్తచ్ఛేదన నియమం వర్తించి, క్రియాబంధ సంహార సూత్రానికి అవకాశం కల్పించింది. వాక్యం (17)లో ఆ నియమం వర్తించక, క్రియాబంధసంహార సూత్రానికవకాశం లేకుండా చేసింది. అందువల్ల (17)వాక్యం సంహారవే అవుతుందన్నమాట అంటే (17)ని వ్యక్తనిర్మాణంలో కూడా రెండు వాక్యాల సమ్మేళనంగానే అర్థం చేసుకుంటున్నామని ఈ వివరణ తాత్పర్యం.

పైన పట్టికగా ఇచ్చిన సూత్రాల్లో ఆరో సూత్రాన్ని గురించి ఇంతవరకు చర్చించలేదు. అందుకు ముందుగా ఈ వాక్యాల్ని పరిశీలించండి.

18 సుబ్బారావు తిరస్కరించి అవమానించ బడ్డాడు.

19 సుబ్బారావు తిరస్కరించబడి అవమానించ బడ్డాడు

వాక్యం (19)లో అర్థం స్పష్టం. తిరస్కరించబడ్డది సుబ్బారావే, అవమానించ బడ్డది సుబ్బారావుదే గుప్త నిర్మాణంలో మూల వాక్యాలు రెండిట్లోనూ సుబ్బారావు కర్మపదం. ఆ రెండింటికీ కర్మణి సూత్రం వర్తించి సుబ్బారావు కర్తృపదస్థానం ఆక్రమించి సమాన బంధ లోప సూత్రం, క్రియాబంధ సంహార సూత్రం, క్త్వార్థక సూత్రం క్రమంగా వర్తించివాక్యం (19) నిష్పన్నమైంది. క్రియా పదాలో ఉన్న పడు శబ్దంకర్మణి సూత్రం అదనంగా చేర్చింది. ఈ సూత్రం గుప్త కర్తకు చేత వర్ణకాన్ని, క్రియకు పడు ధాతువునూ చేరుస్తుంది.

వాక్యం (18)కి రెండర్థాలున్నై. ఒక అర్థంలో ఇది (19)కి సమానం. ఇంకో అర్థంలో గుప్త నిర్మాణంలో సుబ్బారావు తిరస్కరించ అనే క్రియకు కర్తగానూ, అవమానించు క్రియకు కర్మగానూ వూహిస్తున్నాం. అంటే సుబ్బారావు ఎవర్నో తిరస్కరించాడు, ఆ 'ఎవరో' సుబ్బారావును అవమానించారు అన్న అర్థం రావచ్చు. అప్పుడు రెండో వాక్యానికి మాత్రమే కర్మణి సూత్రం వర్తించింది. అప్పటి నిర్మాణం మీద సమాన బంధలోప సూత్రం, క్రియాబంధ సంహార సూత్రం, క్త్వార్థక సూత్రం (19) లాగే క్రమంగా వర్తించి (18) నిష్పన్నమైంది. అయితే ఈ వాక్యానికి (19) తో సమానమైన అర్థం ఎట్లా వచ్చిందో ఆలోచించాలి. అందుకోసమే వికల్పమైన పడు లోప సూత్రం. (19)ని నిష్పన్నం చెయ్యటానికి పై సూత్రాలు వర్తించిన తరవాత ఆరో సూత్రాన్ని వర్తింపజేస్తే పడు లోపం జరిగి (18) నిష్పన్నమైంది. అందువల్లనే (18) (19) తో సమానార్థకం కాగలిగింది క్రియాబంధ సంహారసూత్రం వల్ల రెండు క్రియా పదాలు అవ్యవహిత స్థితికి వస్తే పడు లోప సూత్రం వికల్పంగా వర్తించి పూర్వపదాల్లో 'పడు' శబ్దాన్ని లోపింప జేస్తుంది. ఇక్కడ అవ్యవహితంగా అనే నియమం సార్థకం. రెండు కర్మణి క్రియల మధ్య ఇంకో పదం వస్తే పడు లోప సూత్రాన్ని వర్తించ నియ్యకుండా అడ్డుకుంటుంది. అంటే వాక్యం (18)లో రెండు క్రియలకూ మధ్యన ఇంకేదైనా చేరిస్తే, (19) తో సమానార్థకం కాలేదన్న మాట. ఉదాహరణకు వాక్యం (20) (19)తో సమానార్థకం కాజాలదు.

20. సుబ్బారావు తిరస్కరించి ఘోరంగా అవమానించ బడ్డాడు.

ఈ పడులోప సూత్రానికి విషయాలైన ఈ వాక్యాన్ని పరిశీలించండి.

* 21 ఇచ్చట కాఫీగింజలను పొడరుచేసి ఇవ్వబడును.

ఈవాక్యం హైదరాబాదు సుల్తాన్ బజారులో రెండేళ్ళ కిందటి వరకూ కనిపించేది కర్మణిసూత్రం అసంపూర్ణంగా ప్రవర్తించటం వల్ల ఈ వాక్యం తప్పు అయింది. ధాతువుకు పడు శబ్దాన్ని చేర్చిన కర్మణిసూత్రం గుప్తకర్మను వ్యక్తకర్తగా కూడా మార్చాలి. కాని ను శబ్దం వల్ల కాఫీగింజలను అనే శబ్దంవ్యక్త నిర్మాణంలోనూ కర్మగానే మిగిలి పోయింది. ను శబ్దాన్ని తొలగిస్తే వాక్యం సరి అయింది అవుతుంది పడు లోప సూత్రం వర్తించటం వల్ల పొడరు చేసి అనే రూపం సిద్ధించింది. పడు లోపసూత్రం వర్తించిన తర్వాత వాక్యం 18 లాగా ఇది భిన్నార్థబోధకం కాక పోవటానికి కారణం పొడరుచేయు అనే క్రియకు కాఫీ గింజలు గుప్త నిర్మాణంలో కర్తగా ప్రవర్తించలేదు అంతేకాక పై వాక్యంలో తరవాత—బంధ సూత్రం వర్తించటానికి వీల్లేదు. ఉదాహరణకు—

* 22 ఎ. కాఫీగింజలు పొడరు చేసి, తరవాత ఇవ్వబడును.

బి. కాఫీగింజలు పొడరు చేసినతరవాత ఇవ్వబడును.

ఉద్దేశించిన అర్థంలో పై రెండు వాక్యాలూ వ్యాకరణ విరుద్ధాలు. కాఫీ గింజలు పై వాక్యాల్లో వ్యక్తకర్త కాలేదు. ఈ క్రియకూ, మిగతా క్రియలకూ ఉన్న భేదం గుర్తించదగింది. వ్యాపార పూర్వం ఉన్న కాఫీ గింజలు వ్యాపారానంతరం ఉండవు. వ్యాపారానంతరం ఉండేది కాఫీ పొడి మాత్రమే. పూర్వ భౌతిక రూపాన్ని మార్చే వ్యాపారాలను సూచించే క్రియలున్నప్పుడు తరువాత బంధ సూత్రం వర్తించదన్న నియమం ఏర్పర్చుకోవాలి.

1970 ఎండా కాలంలో తిరుపతి కొండ మీద గుడి ఆవరణలో ఈ క్రింది వాక్యం కనిపించింది.

* 23. ఇచ్చట యాత్రికులు ఉచితముగా చెప్పులు ఉంచుకొని వాపసు ఇవ్వబడును.

ఇవ్వబడును అనే క్రియకు చెప్పులు వ్యక్త నిర్మాణపు కర్త. యాత్రికులు గుప్త వ్యక్త నిర్మాణాలు రెండిట్లోనూ ఉంచుకొను అనే క్రియకు కర్త. వ్యక్త నిర్మాణపు కర్తలు వేరైనందున పై వాక్యం వ్యాకరణ విరుద్ధమైంది. పై వాక్యంలో యాత్రికులు అన్న శబ్దం తొలగిస్తే వ్యాకరణ సమ్మత మవుతుంది. అప్పుడు చెప్పులు రెండు క్రియలకూ కర్త కాగలుగుతుంది. పడు లోప సూత్రం వర్తించి ఉద్దే

శించిన అర్థాన్ని భంగం కలగకుండా సరి అయిన వాక్యం నిష్పన్నం అవుతుంది. ఇంత వరకూ జరిగిన చర్చలో క్త్వార్థక క్రియా ప్రవర్తనలో గమనించిన నియమాలను సౌలభ్యం కోసం కింద ఇస్తున్నాను.

1. భిన్న వ్యాపారాలను ఒక వాక్యంలో చెప్పినప్పుడు ప్రధాన వ్యాపారం కన్నా పూర్వం జరుగటానికి ఉద్దేశించిన వ్యాపారాల్ని బోధించే క్రియలు క్త్వార్థక రూపంలో ఉంటై.

2. ఈ రకపు వాక్యాల్లో వ్యక్త నిర్మాణపు కర్త ఒకటే అయి ఉండాలి. గుప్త నిర్మాణపు కర్తలు వేరు కావచ్చు.

3. ఈ వాక్యాల్లో క్రియ లన్నిటికీ గుప్తనిర్మాణపు కర్త ఒకటే అయి సమాపక క్రియ కర్మణి రూపంలో ఉంటే క్త్వార్థక క్రియ ఏ రూపంలో ఉన్నా కర్మణి తుల్యంగానే భావించాలి.

ఈ పై చర్చ అంతా మనుష్య వాచక శబ్దాలు కర్తృపదాలుగా ఉన్న వాక్యాలను దృష్టిలో పెట్టుకొని జరిగింది. ఈ నియమాలు ప్రాణి వాచక శబ్దాలు. ఏవి కర్తృ పదాలుగా ఉన్నా వర్తిస్తై. అప్రాణి వాచక శబ్దాలు కర్తృపదాలుగా ఉన్నప్పుడు ఏం జరుగుతుందో ఇంకా పరిశీలించాల్సి ఉంది. అంతేకాక క్త్వార్థక క్రియకున్న పెక్కు ప్రయోజనాల్లో పూర్వం వ్యాపార బోధకత ఒకటి మాత్రమే. ఇదిగాక ఇంకా చాలా ప్రయోజనాలున్నై, ఉదాహరణకు ఈ కింది వాక్యాలను పరిశీలించండి.

24. పావనములైన శిరోజములం దెమల్చి పాపవహుడిచ్చి తెచ్చె.
(భార. సభా. 2—216.)

25. ఏనెన్నడు చొల్చి చూచి యెఱుఁగను నిన్నున్.
(భార. ఆది. 4—100)

26. జగత్కార్య పూర్వాలోల ద్యుమణిఁ జూచి చూపటు ప్రభాతా క్షిర్యులై రేచ్చటన్ (భార—ఆది—6—31)

27. ఉత్సవ సందర్శనోత్సుకు లై పోయి కడుఁబెద్దప్రొద్దయ్యె.
(భార—ఆది—7—209)

ప్రాచీన భాషలోనుంచి ఇచ్చిన పై ప్రయోగాల్లో క్త్వార్థక క్రియ భిన్న పద్ధతుల్లో ప్రయోగించ బడింది. అవి అన్నీ ఆధునిక భాషలో కూడా ఉన్నై. అంతేకాక నేటిభాషలో ఈ వాక్యాలను గమనించండి.

29. అతను పొద్దుపోయి ఇంటికి వచ్చాడు.

* 30. అతను వాన కురిసి ఇంటికి వచ్చాడు.

పై రెంటిలో రెండోది వ్యాకరణ విరుద్ధం. మొదటిది వ్యాకరణ సమ్మతం.

క్త్వార్థక క్రియకున్న ప్రయోగా లన్నిటినీ పరిశీలించి సూత్రీకరించాల్సిన అవసరం ఉంది. ఆ పని ఇంకోసారి.

ఈ వ్యాసంలో ప్రతి పాదించిన విషయాలు ప్రధానంగా ఆధునిక భాషనుంచి సేకరించినవి. ప్రాచీన భాషకూ, ఆధునిక భాషకూ వాక్య నిర్మాణానికి సంబంధించిన ముఖ్య విషయాల్లో తేడా ఉండదు. నిజానికీ ఈ వ్యాసంలో పరిశీలించి గమనించిన విశేషాలు చాలా వరకు ఇతర ద్రావిడ భాషలకు కూడా వర్తిస్తై. ఈవ్యాసంలో ప్రతిపాదించిన సూత్రాలు కొద్ది మార్పులతో భారతీయ భాషలన్నిటికీ వర్తించటానికి కూడా వీలుంది. భారతీయ భాష లన్నిటిలోను క్త్వార్థక క్రియా ప్రవర్తనలో కొన్ని సామ్యాలున్నై, అట్లాంటి వాటిని కొన్ని ఈ వ్యాస కర్త హిందీ, బెంగాలీ, భాషల్లో గమనించాడు. వ్యాసవిస్తరణ భీతి వల్ల ఇతర భాషలనుంచి ఉదాహరణలు ఈ వ్యాసంలో ఇయ్యలేదు.

తెలుగులో క్త్వార్థక క్రియా ప్రవర్తనను పరివర్తన సిద్ధాంత దృష్టితో పరిశీలించి నియమాలను గమనించటం ఈ వ్యాసానికి ముఖ్య లక్ష్యం. ఆ పని తెలుగు భాషలోనే చెయ్యటం రెండో లక్ష్యం వీటిల్లో లోపాలకు బాధ్యుల వ్యాస కర్తదే.

## పరిభాష

| | |
|---|---|
| కర్మణి సూత్రం | Passive rule |
| క్రియాబంధ సంహారం. | Verb Phrase Coniunction |
| గుప్త నిర్మాణం | Deep Structure |
| గుప్త (నిర్మాణ) కర్త. | Deep (Structure) Subject |
| పదబంధ నిర్మాణ వృక్షం | Phrase Structure tree |
| పదబంధ నిర్మాణ సూచిక | Phrase Marker |
| పరివర్తన సిద్ధాంతం | Transformatinal theory |
| పరి వర్తన సూత్రం | Transformational rule |
| వాక్య సంహారం | Sentence Conjunction |
| వృక్షచ్ఛేదం నియమాలు | Tree Pruning Constraints |
| వ్యక్త నిర్మాణం | Surface Structure |
| వ్యక్త (నిర్మాణ) కర్త. | Surface(Structure) Subject |
| వ్యక్తనిర్మాణ నియమం. | Surface Structnre Constraint |
| సనామ బంధలోప సూత్రం. | Equi N P deletion |

# మన ఆర్థిక వ్యవస్థ - స్థితిగతులు

శ్రీ వి. శ్రీరామచంద్ర

స్వాతంత్ర్యం వచ్చి పాతిక సంవత్సరాలైనా మన ఆర్థిక వ్యవస్థ కొక స్థిరమైన గమ్యము, మన విధానాలకొక నిర్దిష్ట స్వరూపము ఏర్పడలేదు. ఎప్పటికప్పుడు తాత్కాలిక సమస్యలతోనే సతమత మవుతూ ఉండటం వలన, దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా రూపొందించిన ప్రణాళికలు సరైన ఫలితాల నియ్యడంలేదు. ప్రభుత్వం వాగ్దానాలు చేసినంత మేరకు తమ జీవన పరిస్థితులు మెరుగు పడనందున ప్రజలలో అసంతృప్తి నెలకొందుతున్నది. మొదట్లో, ఉన్నంతగా కాక రాగల 'మంచిరోజు' కోసం ఎదురు చూసే శక్తి యిప్పుడు జనంలో సన్నగిలి పోతున్నది. ఆ వచ్చేదేదో తక్కువ స్థాయిలోనైనా త్వరగా వస్తే మంచిదనే ఆతురత హెచ్చవుతున్నది.

రెండు మూడు సంవత్సరాలు వానలు సరిగా కురిసి పంటలు పండిన పిదప మరల ఈ సంవత్సరం అకాలం వచ్చింది. దేశంలోని ఆహారధాన్యాల నిలువలు చాలక దిగుమతి చేసుకొన వలసిన అవసరం కలిగింది. అనేక ప్రాంతాలు కరువు కాటకాలకు గురయ్యాయి. ఆఖరికి కొన్నిచోట్ల త్రాగడానికి నీరు కూడా మైళ్ళ దూరం నుంచి తెచ్చుకొన వలసి వస్తున్నది. మరొక వంక, ధరలు అదుపు లేకుండా ఎదుగుతున్నాయి. అసలే అంతంత మాత్రంగా ఉన్న జీవన ప్రమాణాలు దీనితో మరింత దిగజారిపోయాయి. విదేశ సహాయం కొరవడటం వలన ఉత్పత్తికి అవసరమైన పెట్టుబడి వనరులు తగ్గిపోయాయి. ప్రైవేటు రంగంలో పెట్టుబడి క్రితం ఆరేడు సంవత్సరాల నుంచీ గొర్రె తోక బెత్తెడుగా ఉండిపోయింది. ప్రభుత్వరంగంలో అసమర్థత పెరిగి ఉత్పాదక శక్తి పడిపోతున్నది. ఇక్కడ గోరంతను కొండంతగా చేసి చిత్రించడం లేదు. యధార్థాన్ని గుర్తించడమూ, అంగీకరించడమూ కూడా సరైన చర్యలు తీసుకొనడానికి తోడ్పడతాయి.

ప్రస్తుతం మన ఆర్థికవ్యవస్థ ఎదుర్కొంటున్న పలు సమస్యలను కూలంకషంగా చర్చించడం, వాటి పరిష్కారానికి అనువైన విధానాలను స్థూలంగా సూచించడం యీ వ్యాసం యొక్క ఉద్దేశ్యం. ఇందులో మొదటిభాగంలో ఆర్థికవ్యవస్థ యొక్క నిర్మాణానికి (Structure) సంబంధించిన సమస్యలను గురించి, రెండవభాగంలో ఆహారం, ధరలు, నిరుద్యోగం మొదలైన వాటిని గురించి మూడవభాగంలో ఆయా సమస్యల పట్ల ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలను గురించి విశ్లేషించడం జరుగుతుంది. ఇంత విస్తృతమైన విషయాన్ని విశదీకరించేటప్పుడు సందర్భాను సారంగా గణాంకాలను (Statistics) ఉదహరించవలసి వస్తుంది. కాని, వీలయినంతవరకు విషయ విశ్లేషణకు ప్రాధాన్యం ఇచ్చి పాఠకులకు అంకెల భారం కలుగకుండా చూడటానికి ప్రయత్నిస్తాను. విడివిడిగా సమస్యలను గురించి చర్చించేటప్పుడు వ్యవస్థలోని లోటు పాట్లను, విధానాలలోని ఎగుడుదిగుళ్ళను కూడా పరామర్శించవలసి వస్తుంది. అందుచేత, ఎంత కట్టుదిట్టంగా విషయ విభజన చేసినప్పటికీ, కొంత పునరుక్తి దోషం అనివార్యం అని హెచ్చరించడం మేలైన ఆదినివార్యం.

## 1. ఆర్థిక వ్యవస్థ నిర్మాణం

1. ప్రణాళికా బద్ధమైన ఆర్థిక ప్రగతి మార్గంలో మనం ప్రయాణం ఆరంభించేటప్పటికి వ్యవసాయం అత్యంత ప్రముఖ పరిశ్రమగా ఉండేది. జాతీయాదాయంలో అరువది శాతం పైచిలుకు వ్యవసాయం, పాడి, మత్స్య పరిశ్రమల నుంచే లభించేది. శ్రామికశక్తి కూడా సహజంగా యీ రంగంలోనే కేంద్రీకృతమై ఉన్నది. దేశ జనాభాలో ఎనుబది శాతం పైగా ప్రజలు గ్రామీణ ప్రాంతాలలో నివసించేవారే. అభివృద్ధి పొందిన దేశాల అనుభవాన్ని బట్టి చూస్తే ఆర్థిక ప్రగతి సిద్ధించిన కొలదీ, జాతీయాదాయంలో వ్యవసాయ రంగం యొక్క వాటా తగ్గి పరిశ్రమల భాగం పెరుగుతున్నదనీ, పారిశ్రామికరంగంలోనే ఉద్యోగావకాశాలు విస్తృతంగా లభిస్తుంటాయని తెలుస్తుంది. అమెరికా వంటి చోట్ల పది శాతంలోపు జనులు మాత్రమే వ్యవసాయరంగంలో పని చేస్తున్నారు. మరి మనదేశంలో డెబ్బది శాతం పైచిలుకు భూమి, పశువుల మీద ఆధారపడి జీవిస్తున్న వారే. అంటే వారి వ్యాపకం కేవలం భుక్తి గడిచేటంతవరకే తప్ప జీవనప్రమాణాలు పెంచుకోడానికి, ఆధునిక వస్తువుల వినియోగాన్ని ప్రోత్సహించడానికి పనికి వచ్చేదికాదు. పై పెచ్చు, అభివృద్ధికి అవసరమైన వనరులను సమకూర్చవలసిన బాధ్యత వ్యవసాయరంగం మీద ఉన్నది. ఇటువంటి పరిస్థితులలో పరిశ్రమల స్థాపనకు తీవ్ర కృషి చేయడం అవసరమని ప్రభుత్వం భావించింది. మొదటి ప్రణాళిక తప్ప మిగిలిన మూడు ప్రణాళికలలోనూ పారిశ్రామికరంగానికే ప్రాధాన్యం ఇవ్వబడింది. అయినప్పటికీ వింత ఏమిటంటే, జాతీయాదాయంలో వివిధ రంగాల వాటాల నిష్పత్తి 1950 నుంచి 1970 నాటికి ఏవిధంగానూ మారలేదు. ఏవో ఒకటిరెండు కొత్త రంగాలు వెలిశాయి. లఘుపరిశ్రమల రంగం, వాణిజ్యం —బాంకింగ్ వంటి 'సేవా రంగం' (Services Sector) మాత్రం విస్తరించాయి. అలాగే 1951, 1971 జనాభా లెక్కల వివరాలలో గ్రామీణ—నగర వాసుల నిష్పత్తి కూడా మారలేదు. వ్యవసాయం మీద ఆధారపడి జీవించే వారిసంఖ్య అలాగే ఉన్నది. దీనినిబట్టి తెలుస్తున్న దేమిటంటే వ్యావసాయిక పారిశ్రామికరంగాల నిష్పత్తిని మార్చ తలపెట్టిన ప్రయత్నం జయప్రదం కాలేదు.

ఇక్కడ ఒక ప్రశ్న మొలకెత్తవచ్చును. వ్యవసాయ రంగాన్ని ఆర్థికాభివృద్ధి కోసం కుంచింప చెయడం తప్పనిసరి కాదు. కేవలం, వ్యవసాయం మీద ఆధారపడి ప్రగతి చెందిన దేశాలు (ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, నార్వే, హాలండ్) లేవా? అన్నది యీ ప్రశ్న. దీనికి సమాధానం చెప్పడం తేలిక. ఆదేశాలు చిన్నవి. జనాభా చాలా స్వల్పం,

పైగా పారిశ్రామికాభివృద్ధికి ఆవశ్యకమైన ఖనిజ సంపద లేదు. జనాభా స్వల్పం కావడం వలన, వ్యవసాయ ఉత్పత్తి విధానాలలో సాంకేతిక మైన మార్పులు వచ్చినప్పటికీ నిరుద్యోగ సమస్య ప్రబల లేదు. అందు చేత పారిశ్రామిక రంగాన్ని విశాలపర్చి ప్రత్యామ్నాయ ఉద్యోగావకాశాలను కల్పించవలసిన అవసరం లేకపోయింది. మనదేశంలో పరిస్థితి అలా కాదు. విశాలమైన దేశం, అపారమైన ఖనిజ సంపద, బహుళమైన జనాభా. ఆ దేశాల లాగా వ్యవసాయం మీద దృష్టిని కేంద్రీకరించి, పారిశ్రామిక వస్తువులను దిగుమతి చేసుకోవడం సాధ్యంకాదు. అలాగే, వ్యవసాయరంగంలో యాంత్రిక సాధనాలు వచ్చినట్లయితే నిరుద్యోగ సమస్య పెరిగిపోతుంది. పారిశ్రామిక రంగాన్ని విస్తృతపరిస్తే తప్ప వారికి ఉద్యోగావకాశాలు కల్పించలేము. పైగా యింత విశాలమైన వ్యవసాయరంగంలో నూతన పద్ధతులు ప్రవేశపెట్టాలన్నప్పటికీ, పారిశ్రామిక ప్రగతి తప్పనిసరి అవుతుంది. మొత్తంమీద మన పారిశ్రామికోత్పత్తి ఎన్నో రెట్లు పెరిగినప్పటికీ, వ్యవసాయ, పారిశ్రామిక రంగాలకు సంబంధించి నంతవరకూ మన ఆర్థిక వ్యవస్థ యొక్క నిర్మాణ స్వరూపం మారలేదు.

2. కేంద్రీకృత ప్రణాళికా విధానం(Centralized planning) అమలులో ఉన్న దేశాల వలె కాక మనదేశంలో ప్రైవేటు రంగానికి ప్రత్యేక స్థానం యీయబడింది. ఒకవిధంగా, ఈ రంగంలోని వనరులు, మూలధనం ప్రభుత్వరంగంలోకంటె చాలా విస్తారమైనవి. స్వాతంత్ర్యానికి పూర్వం రైల్వేలు, పోస్టు, టెలిగ్రాఫ్, రక్షణ పరికరాల ఉత్పత్తి వంటి సంస్థలు తప్ప దేశ ఆర్థికవ్యవస్థ మొత్తం ప్రైవేటు రంగంలోనే కేంద్రీకరింపబడింది. 1956 వరకూ, అంటే మొదటి ప్రణాళిక అంతం వరకూ, ప్రైవేటు రంగం యొక్క పాత్ర దాని పట్ల ప్రభుత్వ దృక్పథాన్ని గురించి ఏవిధమైన నిర్దిష్ట విధానమూ రూపొందించబడలేదు. 1956 లో ఇండస్ట్రియల్ పాలసీ రిజొల్యూషన్ వెలువడింది. దీని ప్రకారం పరిశ్రమలన్నీ మూడు వర్గాలుగా విభజింపబడ్డాయి. ఇనుము— ఉక్కు, యంత్ర పరికరాల ఉత్పత్తి పరిశ్రమలు, ఖనిజాల త్రవ్వకం శుభ్రం చేయడం, విద్యుత్ పరికరాల ఉత్పత్తి, రక్షణ సాధనాల ఉత్పత్తికి సంబంధించిన పరిశ్రమలు ప్రథమ వర్గానికి చెందినవి. ఈ వర్గంలో పరిశ్రమలన్నీ ప్రభుత్వ అధీనంలో ఉంటాయి. అయితే అప్పటి వరకూ ప్రైవేటు రంగంలో ఉన్న సంస్థలు కొనసాగేందుకు ప్రభుత్వం అనుమతించవచ్చును. రసాయనద్రవ్యాలు, ఎరువులు, రబ్బరు, అల్యూమినియం, మాంగనీసు, తగరం వంటి లోహాలకు సంబంధించిన పరిశ్రమలు రెండవ రకానికి చెందినవి. వీటి పెంపుదలలో ప్రభుత్వరంగం ప్రధాన పాత్ర వహించాలనీ, ఎంతో అవసరమైతేనే ప్రైవేటు సంస్థలను అనుమతించాలనీ నిర్ణయించడమైనది. మిగిలిన పరిశ్రమలన్నీ మూడవ వర్గానికి చెందినవి. వీటిని పూర్తిగా ప్రైవేటు రంగం యొక్క పరిధికి వదిలివేశారు. అయితే ప్రభుత్వరంగం కూడా సంస్థలు నెలకొల్పే హక్కు పొందింది. మన ఆర్థిక వ్యవస్థలో వ్యక్తిగత, ప్రభుత్వరంగాల పాత్ర యీనాటికీ యీ 1956 ప్రకటన ప్రకారం నడుస్తున్నాయి. కాని యీవిధమైన మిశ్రమ ఆర్థిక వ్యవస్థ వలన కొన్ని చిక్కులు తలెత్తుతున్నాయి. ఈ చికాకులను తొలగించడానికి ప్రైవేటు, ప్రభుత్వ రంగాల పాత్రలను గురించి ప్రభుత్వం మరింత స్థిరమైన విధానానికి కట్టుబడి ఉండాల్సి వస్తుంది.

2.(అ) ఈ సమస్యలలో మొదటిది ప్రణాళికల రూపకల్పనకు సంబంధించినది. ప్రణాళికలు వివిధ పరిశ్రమలలో దేశం మొత్తానికి లక్ష్యాలను నిర్ణయిస్తాయి. ఈ లక్ష్యాలను సాధించే బాధ్యత ప్రైవేటురంగంమీద పబ్లిక్ రంగంమీద కూడా ఉన్నది. ప్రభుత్వమే ఈ లక్ష్యాలను రూపొందిస్తుందికాబట్టి ఏదోవిధంగా వనరులను ప్రోగుచేసి తన కర్తవ్యం నెరవేర్చడానికి ప్రయత్నిస్తుంది. కానీ ప్రభుత్వం నిర్ణయించిన లక్ష్యాల సాధనలో తోడ్పడానికి ప్రైవేటు రంగం ఎందుకు ఉత్సాహం చూపించాలి? మార్కెట్టు శక్తుల సూచనల ప్రకారం తమ లాభసాటి అయిన రంగంలోనే దిగడానికి పూనుకుంటుంది. మార్కెటు వ్యవస్థ ప్రకారం లాభదాయకమైన పరిశ్రమలు, ప్రభుత్వం నిర్ణయించిన లక్ష్యాలు ఒకటే కాకపోవచ్చును, సాధారణంగా కావు. అటువంటప్పుడు, ప్రైవేటు రంగం తోడ్పాటు లేక ప్రణాళికలు దెబ్బతినే అవకాశం ఉన్నది. అందుచేత ప్రైవేటు రంగాన్ని కూడా ప్రణాళికాబద్ధమైన మార్గంలో నడిపించడానికి ప్రభుత్వం చేతుల్లో కొన్ని ఆయుధాలు అవసరం. ఇండస్ట్రియల్ లైసెన్సింగ్ పాలసీ యిందుకు కొంతవరకూ పనికి వస్తుంది. అయితే ప్రైవేటు వనరులు ప్రణాళికా లక్ష్యాల వెలుపలకు పోకుండా ఇది చూడగలుగుతుందే కాని లక్ష్యాలు సిద్ధించే మార్గం వేసి పోయేటట్లు చేయలేదు. ఇందువలన ప్రణాళికలు జయప్రదం కాకపోయే అవకాశం ఉన్నది. ఆర్థిక ప్రణాళికలలో కొంత భాగం మార్కెట్ వ్యవస్థ మీద ఆధారపడి, మరికొంత భాగం ప్రభుత్వం నిర్ణయించిన లక్ష్యాల మీద ఆధారపడి పని చేయడం కొన్ని ప్రత్యేక సమస్యలు తలెత్తుతున్నాయి. వీటిని తొలగించడానికి మన ప్రణాళికా నిర్మాణంలోనే మౌలికమైన మార్పులు తేవాలి. వీలైతే ప్రభుత్వ రంగానికొక ప్రణాళిక, ప్రైవేటురంగానికొక ప్రణాళిక రూపొందించడం బాగుంటుందేమో! ప్రభుత్వ ప్రణాళిక అన్ని అంశాలను సుస్పష్టంగా నిర్వచించవచ్చును, ప్రైవేటు ప్రణాళిక స్థూలంగా ప్రధాన అవసరాలను, లక్ష్యాలను నిర్దేశించవచ్చును. రెండవ పక్షంగా కొన్ని పరిశ్రమలను పూర్తిగా ప్రభుత్వరంగంలోనూ, కొన్నింటిని పూర్తిగా ప్రైవేటురంగంలోనూ వదిలి వేయడం ఒక మార్గం. అప్పుడు ప్రణాళికలను జయప్రదంగా అమలు జరపడానికి ఆర్థిక వ్యవస్థను కట్టుదిట్టంగా నిర్వహించడానికి వీలవుతుంది.

2.(ఆ) రెండవ సమస్య వ్యక్తిగత రంగంమీద ప్రభుత్వం కట్టుడులకుసంబంధించినది. అరుదైన వనరులని సరిగా వినియోగించుకోవడానికీ, వ్యక్తిగత రంగాన్ని జాతీయ లక్ష్యాల వైపు నడిపించడానికి ప్రభుత్వం చేతుల్లో కొన్ని అధికారాలు ఉండాలి. వ్యక్తిగత రంగం ఉండటం అవసరం అని అంగీకరించిన పరిస్థితుల్లో ఆ రంగం, సమర్థవంతంగా పని చేసేందుకు వీలయిన చర్యలు తీసుకోవాలి. 1966 నుంచి వ్యక్తిగత రంగంలో పెట్టుబడి సన్నగిల్లిపోయింది. పరిశ్రమల కోసం బ్యాంకు రుణాల గిరాకీ పడిపోయింది. 1969 'మొనాపొలి కంట్రోలు' చట్టం వచ్చింది. 1970 లో దత్ కమిటీ రిపోర్టు మీద ఆధారపడి ఇండస్ట్రియల్ లైసెన్సింగ్ పాలసీ చట్టం

వచ్చింది. మళ్ళీ ఇటీవల కొద్దిరోజుల క్రితం ప్రభుత్వం ఒక నూతన విధానాన్ని ప్రకటించింది. అయితే 1956 నాటి ప్రకటనే ఇంకా ప్రభుత్వ విధానాలకు ప్రాతిపదికగా పని చేస్తున్నదని ప్రభుత్వం అంటున్నది యధార్థానికి ఈ ప్రకటనలో పరిశ్రమల వర్గీకరణను మినహాయించి మరేమీ చెప్పుకోదగిన అంశం లేదు. నాల్గవ ప్రణాళికలో పరిశ్రమల ఉత్పత్తి లక్ష్యాలను దృష్టిలో ఉంచుకుని 1970 లో లైసెన్సింగ్ పాలసీ రూపొందించబడింది. ఎవరైనా ఏదైనా పరిశ్రమను స్థాపించాలంటే మొనాపొలీ చట్టం క్రింద, లైసెన్సింగ్ పాలిసీ చట్టం క్రింద అనుమతి లభిస్తే తప్ప వీలుకాదు. 30 కోట్ల రూపాయలు మించిన పారిశ్రామిక సంపత్తి (Industrial assets) కల పారిశ్రామిక యాజమాన్యాలను 'మొనాపలీ' లుగా 1969 చట్టం నిర్ణయిస్తుంది. దీని ప్రకారం, మొనాపలీలుగా గుర్తింపబడిన సంస్థలు కొత్త పరిశ్రమలు స్థాపించడానికీ, పాతవి వ్యాపింపజేయడానికీ వీలు లేదు. అంతకు లోబడిన సంపత్తి కలవారు 1970 లైసెన్సింగ్ పాలిసీ క్రింద ప్రణాళికల లక్ష్యాల కనుగుణంగా ఉన్న పరిశ్రమలను స్థాపించడానికి అనుమతి పొందుతాయి. అయితే లైసెన్సింగ్ పాలిసీ కూడా 20 కోట్ల రూపాయలకు మించి సంపత్తికల సంస్థలను విస్తరించకుండా నిరుత్సాహపరచాలని సూచిస్తున్నది. వేరు వేరు ప్రయోజనాల కుద్దేశించిన ఈ రెండు చట్టాల పరిధులను విస్పష్టంగా నిర్వచించాలని పారిశ్రామిక వేత్తల వాదం. ప్రభుత్వం ఈ వాదాన్ని గమనించి నట్లున్నది. అయిదవ ప్రణాళికలో పారిశ్రామికోత్పత్తి లక్ష్యాల కనుగుణంగా లైసెన్సింగ్ పాలిసీ పని చేస్తుందనీ, సంపద యొక్క వికేంద్రీకరణకు 'మొనా పొలీ కంట్రోలు' చట్టం వినియోగపడుతుందనీ ప్రభుత్వం ప్రకటించింది. ఈ విషయంలో ప్రభుత్వం మరింత విస్పష్టమైన విధానాన్ని రూపొందిస్తే తప్ప వ్యక్తిగత రంగం సరిగా పని చేయక పోవచ్చును. నాల్గవ ప్రణాళిక అమలు జరపడానికి మనం రెండు మూడుసంవత్సరాలు వేచి ఉండవలసి వచ్చింది. మళ్ళీ అటువంటి పరిస్థితి ఏర్పడకుండా చూడాలి. ప్రస్తుతం ఇంకా రెండు సమస్యలున్నాయి. వ్యక్తిగత రంగంలోని పరిశ్రమలకు ప్రభుత్వ సంస్థలుఇచ్చిన రుణాలను 'ఈక్విటీ షేర్లు' గా మార్చే విషయం, జాయింట్ సెక్టరు యొక్క రూపు రేఖలను గురించి చర్చ అన్నవి రెండు ముఖ్యమైనవి. వీటిని గురించి కూడా త్వరలో స్పష్టమైన నిర్ణయానికి రావడం అవసరం.

౨. (ఇ) మూడవ సమస్య ప్రభుత్వ రంగం యొక్క పాలనా వ్యవస్థకు సంబంధించినది. ప్రస్తుతం ప్రభుత్వరంగం పనిచేస్తున్న తీరు సమర్థతకు ఎంతో దూరంగా ఉన్నది. లాభాలు ఆర్జించ గలిగిన సంస్థలు చాలా తక్కువ. అక్కడ క్కడ వనరుల దురుపయోగం కూడా జరగడం కద్దు. ఈ పరిస్థితిని తొలగించడం చాలా అవసరం. కేవలం లాభాలు ఆర్జించడమే ప్రభుత్వ లక్ష్యం కాక పోవచ్చు. కానీ, సంస్థలను విస్తరింప జేయడానికీ పెట్టుబడిని పెంచడానికీ ప్రభుత్వరంగంలో కూడా లాభాలు ఆర్జించడం అవసరం. పైగా వస్తువుల ఉత్పత్తికి వినియోగించిన వనరుల ఖర్చయినా పూర్తిగా తేలాలి. ప్రభుత్వ రంగంలో అన్నింటికంటె పెద్దదైన హిందూస్థాన్ స్టీల్ లిమిటెడ్ ప్రతి సంవత్సరమూ కోట్ల రూపాయల నష్టంతో నడుస్తున్నది. తరచుగా, ఫాక్టరీలు మూసి వేయబడుతున్నాయి. ఈ అవ్యవస్థకు ముఖ్యంగా రెండు కారణాలున్నాయి. మొదటిది, ఉద్యోగుల నియామకంలో నిర్దిష్టమైన ప్రమాణాలు లేకపోవడం, రెండవది, కార్మిక సమస్యలు. జనరల్ ఎడ్మినిస్ట్రేషనులో అనుభవం పొందిన వాళ్ళు పారిశ్రామిక సంస్థలను నడపడానికి పనికిరారు. ఇందుకు ప్రత్యేకమైన శిక్షణ, దృష్టి, అనుభవం చాలా అవసరం. ఉన్నత పదవుల నియామకంలో రాజకీయప్రమేయం కూడా జొరబడుతున్నది. ప్రభుత్వ రంగం సంస్థలలో పనిజేయడానికి ఐ. ఏ. ఎస్. లాటి పద్ధతులు లేక ఒక ప్రత్యేక విధానంద్వారా ఉద్యోగులను సమకూర్చుకోవాలి. సాధ్యమైనంత వరకూ, సంస్థలకు స్వతంత్ర ప్రతిపత్తినిచ్చి, సమర్థతతో పని చేసిన సంస్థల కార్య నిర్వాహకులకు Incentives ఇవ్వడం ఉపయోగకరం. కార్మిక సంఘాల గుర్తింపు పట్ల, పరిపాలనా నిర్వహణలో కార్మికుల ప్రాతినిధ్యం పట్ల, వారి యోగక్షేమాల పట్ల ప్రభుత్వం మరింత ధ్యానంతో వ్యవహరించాలి. కేవలం లాభాలు మాత్రమే సమర్థతకు నిదర్శనం కాక పోయినప్పటికీ ఖర్చు గిట్టుబడి కాకపోతే ఆర్థికవ్యవస్థ రాను రానూ ఇబ్బందుల పాలవుతుంది. అయిదవ పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వరంగంలో పెట్టుబడి ఇనుమడించింది. రానురాను ఇంకా విస్తరించే అవకాశం అవసరం ఉన్నవి. అందుచేత దీర్ఘకాలిక విధానాలను రూపొందించి అందుకనుగుణంగా చర్యలు తీసుకోవాలి.

ప్రభుత్వ వ్యక్తిగత రంగాల మధ్య సంబంధ బాంధవ్యాలను గురించి ఇటీవల మరొక వాదం వచ్చింది. ప్రభుత్వం సమకూర్చిన పెట్టుబడితో వ్యక్తిగత రంగంలోని కార్య నిర్వహణ క్రింద జాయింట్ సెక్టర్' అమలులోకి రావాలని శ్రీ తాతా ఒక ప్రతిపాదన చేశారు. ఈ జాయింట్ సెక్టర్ యొక్క రూపు రేఖలను గురించి అనేక వూహాగానాలు సాగుతున్నాయి. ఇటీవలనే ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. దాని ప్రకారం 26నుంచి 49 శాతం వరకూ షేర్లు ప్రభుత్వ అధీనంలో ఉండేటట్లు, తదనుగుణంగా డైరక్టర్ల బోర్డులో ప్రాతినిధ్యం ఉండేటట్లు, దైనందిన కార్యనిర్వహణ, ఉద్యోగుల నియామకం విషయంలో వ్యక్తిగత రంగానికి అధికారంఇచ్చేటట్లు నిర్ణయించింది. అయినప్పటికీ దీనిని గురించి ఇంకా వాదప్రతివాదాలు కొనసాగుతునే ఉన్నాయి. వ్యక్తిగత రంగంలోని సంస్థలకు ప్రభుత్వ ఆర్థిక సంస్థలు (లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్, ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బాంకు, యూనిట్ ట్రస్ట్ ఆప్ ఇండియా వంటి సంస్థలు) ఇచ్చిన ఋణాలను షేర్లక్రింద మార్చేవిషయం మీద వాదోప వాదాలు కొనసాగుతున్నాయి. మొత్తం మీద ప్రభుత్వ వ్యక్తిగత రంగాల పాత్రలను గురించి వాటి సంబంధ బాంధవ్యాలను గురించి ఇప్పుడు దేశంలో పెద్దపెట్టున చర్చ కొనసాగుతున్నది. ఈ విషయం మీద ప్రభుత్వం తీసుకునే నిర్ణయం ప్రజాభిమతానికి, జాతీయ లక్ష్యసాధనకు అనుగుణంగా ఉండటం తప్పనిసరి.

**3.** ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి సంబంధించిన మూడవ సమస్య వనరుల సేకరణ (Resource Mobilization) మొదటి ప్రణాళికను మినహాయించి మిగిలిన వాటిలో దేనిలోనూ అనుకున్న

పరిమాణంలో పెట్టుబడి వనరులు సమకూరలేదు. దీనికి ముఖ్యమైన కారణం మన ప్రణాళికా విధానంలో ధరల మార్పులకు తగిన పరిగణన నీయక పోవడమే. ధనరూపంలో మనం అనుకున్న ప్రకారం పెట్టుబడి పెట్టినప్పటికీ, ధరలు పెరుగుతున్న పరిస్థితులలో దాని అసలు విలువపడిపోతున్నది. అందుచేతనే నిర్దిష్టమైన జాతియాదాయపు పెరుగుదల రేటుకు మనం చాలా దూరంలో ఉన్నాం. ఈ పడిపోతున్న విలువకు సరిపడేటట్లు హెచ్చు వనరులను మనం సేకరించ లేక పోతున్నాం. యిందుకు ముఖ్య కారణమేమిటి?

ప్రణాళికలకు వనరులు ముఖ్యంగా యీ క్రింది విధంగా లభ్యమవుతున్నాయి. (1) పన్నులు, యితర సుంకాలు (2) ప్రైవేటు పరిశ్రమల పొదుపు (3) విదేశ సహాయం (4) అప్పులు. ప్రైవేటు రంగంలోని పొదుపు యీనాటికి ప్రణాళికల వనరులలో అధికభాగం సమకూరుస్తున్నది. తర్వాత, పన్నులు అత్యధిక ప్రాముఖ్యం వహిస్తున్నాయి. విదేశ సహాయం సాధ్యమైనంతవరకూ తగ్గించి వేయాలన్నది మన ప్రణాళికల లక్ష్యం. అప్పులలో రిజర్వు బ్యాంకువద్ద నుంచి కేంద్రం పుచ్చుకునే ధనం, రాష్ట్రాలు పుచ్చుకునే ఓవర్ డ్రాఫ్టులు ముఖ్యమైనవి. దీనిని డెఫిసిట్ ఫైనాన్సింగ్ అని కూడా అంటారు

3. (అ.) ప్రభుత్వం వసూలు చేసే పన్నుల ఆదాయం అత్యధికభాగం పరోక్షపు పన్నుల నుంచి లభిస్తున్నది. వస్తువులు వనరుల వినియోగం మీద విధించే యీ పరోక్షపు పన్నులు ఎక్కువగా పట్టణవాసుల మీదనే పడుతున్నాయి. కారణం యిక్కడ, పారిశ్రామికరంగంలో ఉత్పత్తి అయిన వస్తువుల వినియోగంచాలా హెచ్చు. మన గ్రామీణ ప్రాంతాలలో వినియోగ పద్ధతులు (Consumption Patterns) చాలా సంవత్సరాల నుంచీ మారలేదు. అనురాను యీపన్నులు యింకా ఆదాయం సమకూర్చి పెట్టేస్థితి దాటిపోతున్నాయి. అందుచేత పన్నుల కోసం క్రొత్తమార్గాల నన్వేషించక తప్పదు. జాతియాదాయంలో 50 శాతం సమకూర్చే వ్యవసాయ రంగంమీద పన్నులభారం చాలా స్వల్పంగా ఉన్నదన్నమాట అందరూ అంగీకరించే సత్యం. కానీ యీరంగంలో పన్నులు వసూలు చేసేందుకు అవసరమైన సమర్థయంత్రాంగం మనకు యింకా సమకూరలేదు. పైగా యిందుకు అవసరమైన చొరవ, రాజకీయసాహసం రాష్ట్ర ప్రభుత్వాలకు లేవు. ఇటీవలనే రాజుకమిటీ భూమిశిస్తును రద్దుచేసి దాని బదులు వ్యవసాయభూకమతాల పన్ను విధించాలని సూచించింది. యిందువలన ప్రస్తుతం భూమిశిస్తు వలన లభించే సుమారు రు 150 కోట్లేకాక అదనంగా మరొక 200 కోట్ల రూపాయలు వసూలు చేయవచ్చునని అంచనా. కాని యీ విషయంలో యింక విస్తారమైన పరిశోధనలు జరుగవలసి ఉన్నది. రాజుకమిటీ సిఫార్సులను అమలు జరపాలంటే, దేశంలో ఉన్న ప్రతికమతం యొక్క వివరాలను సేకరించ వలసి ఉన్నది. దీనికి ఆంగంలో, Cadestral Survey అంటారు. ఈరకమైన సర్వే జరపటానికి ఎంతో ఖర్చు అవుతుంది. పైపెచ్చు కొన్ని ప్రాథమిక పరిశోధనల వలన తేలిన విషయ మేమంటంటే యీపన్ను విధింపు వలన యిప్పుడు వచ్చు భూమిశిస్తు కంటే కూడా తక్కువ ఆదాయమే లభ్యమవుతుంది అని. ఏమైనప్పటికీ, యిటీవల వ్యవసాయ పద్ధతులలో వచ్చిన మార్పుల వలన ఈరంగంలో వ్యక్తుల ఆదాయం పెరిగింది. Relative Prices కూడా 1962—63 నుంచీ వ్యవసాయవస్తువుల కనుకూలంగానూ, పారిశ్రామిక వస్తువులకు వ్యతిరేకంగానూ మారాయి. ఇటువంటి పరిస్థితులలో—వ్యవసాయ రంగంనుంచీ ప్రత్యక్షపు పన్నులను వసూలుచేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ పన్నులు ఆస్తి, సంపద మీద, ఆదాయం మీదకూడా విధించబడాలి. ఇందుకు దీర్ఘకాలిక దృష్ట్యా సరైన చర్యలు తీసుకోవాలి. లేక పోతే, మన ప్రణాళికలకు అవసరమైన వనరులు సమకూర్చడం కష్టం అవుతుంది. ప్రభుత్వరంగంలోని పరిశ్రమలు ఆర్జించే లాభాలను పెట్టుబడికి వినియోగించుకోవచ్చును. కానీ యీ పరిశ్రమలన్నీ దాదాపు నష్టంతోనే నడుస్తున్నాయి. అందుచేత యీ అవకాశం లేదు

3 (ఆ.) వ్యక్తిగిత రంగంలోని లాభాలు పన్నుల రూపంలో కొంతభాగం, డివిడెండ్ల రూపంలో కొంతభాగం పోగా మిగిలినవి పెట్టుబడికి వినియోగింప బడుతున్నాయి. ప్రభుత్వం చట్టరీత్యా అనేక నిర్బంధాలు విధించినప్పటికీ డివిడెండ్లు ఎంతో పెరుగుతూనే ఉన్నది. ఇందులో అధిక భాగం విలాస వస్తువుల వినియోగానికే ఉపయోగిత మవుతున్నది. అందుచేత వ్యక్తిగతరంగం కూడా ఆర్థిక వనరుల కోసం ప్రభుత్వం సంస్థలైన లైఫ్ యిన్సూరెన్సు కార్పొరేషను, యూనిట్ ట్రస్ట్ ఆఫ్ యిండియా, ఇండస్ట్రియల్ ఫైనాన్సు కార్పొరేషను, ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బాంకు, యితర బాంకుల మీద ఆధారపడి ఉండవలసి వస్తున్నది. ఈ పరిస్థితిని నివారించాలంటే వ్యక్తిగత రంగం లాభాలను వర్తమాన వినియోగానికి (Carrent Consumtion) ఉపయోగించకుండా నివృత్తించే నిర్బంధాలను విధించుకో వలసివున్నది

3 (ఇ) రెండు ప్రణాళిక అవసరాలలో నాల్గవవంతు వరకూ విదేశ సహాయం సమకూర్చింది. ఈ శాతం (25%) కొంత తగ్గినప్పటికీ మూడవ ప్రణాళికలో కూడా చాలావరకు విదేశసహాయం మీద మనం ఆధారపడవలసి వచ్చింది. ఆహారధాన్యాల కొరతవలన యీ అవసరం మరింత పెరిగింది. అయితే మూడవ ప్రణాళికలో దేశీయవనరుల మీద ఆధారపడి విదేశ సహాయానికి స్వస్తి చెప్పడం ఒక లక్ష్యంగా ఉద్ఘాటించాం. నాల్గవ ప్రణాళికలోకూడా యిదేలక్ష్యం పునరుద్ఘాటితమయింది. మళ్ళీ అయిదవ ప్రణాళికలో కూడా అదే అంటున్నాం. ప్రస్తుతపు అంచనాల ప్రకారం 1980 నాటికి Net Foreign aid, అంటే యిదివరకు తీసుకున్న అప్పులు, వాటిమీద వడ్డీ తీర్చడానికి తీసుకునే అప్పులు తప్ప మిగిలిన సహాయం, ఏదీ ఉండరాదు. కానీ యిదపూర్వపు అనుభవాన్ని బట్టి చూస్తే, ఎంతవరకు సాధ్యమవుతుందో తెలియదు. అయితే విదేశ సహాయం అందుబాటు పరిస్థితికూడా అంత సంతృప్తికరంగాలేదు. పారిశ్రామిక దేశాలు సహాయం అందజేయడానికి యిదివరకులాగా ఉత్సాహం చూపడం లేదు. అభివృద్ధి పొందిన దేశాల జాతీయాదాయంలో ఒకశాతం విదేశ సహాయం క్రింద అందజేయాలని అనేక అంతర్జాతీయ సమావేశాలలో నిర్ణయింపబడింది. అయినప్పటికీ ఒక్క స్వీడన్ మినహాయించి మరే దేశమూ యిందుకు సంసిద్ధం కాలేదు. మనకు

అత్యధిక సహాయం అందజేసిన అమెరికాకూడా సాలుకు తలకు ఒకటి రెండు డాలర్లకు మించి ఇవ్వలేదు. అదే కొరియా, థాయిలాండువంటి దేశాలలో సాలుకు తలకు 90 డాలర్ల వరకూ సహాయం అందజేసింది. రాజకీయకారణాలు యిందులో చాలా ముఖ్యపాత్ర వహిస్తున్నాయి. విదేశ సహాయం లేకపోయినా, ఎగుమతులను పెంపొందించుకున్నట్లయితే, మన పెట్టుబడికి అవసరమైన యంత్రసామగ్రి, రసాయన ద్రవ్యాలు, ముడిసరుకును దిగుమతి చేసుకొనవచ్చును. కాని విదేశ వ్యాపారానికి కూడ పరిస్థితులు అంత ప్రోత్సాహజనకంగా లేవు. పూర్వం మన ఎగుమతులు ప్రధానంగా వ్యవసాయం వస్తువుల రూపంలో ఉండేవి. కానీ పరిశ్రమలు క్రమంగా విస్తరించిన కొద్దీ మన విదేశ వ్యాపారపు స్వరూప స్వభావాలు మారిపోవలసి ఉన్నది. కానీ అభివృద్ధి పొందిన దేశాలు మన పారిశ్రామిక వస్తువులను దిగుమతి చేసుకోడానికి సుముఖంగా లేవు. పైపెచ్చు పన్నులు, కోటాల రూపంలో అనేక నిర్బంధాలు విధిస్తున్నాయి. మరి వెనుకబడిన దేశాలు ఎల్లకాలమూ వ్యవసాయ వస్తువుల మీదనే ఆధారపడి ఉండలేవు. విదేశమారకం ఆర్జించకపోతే, అప్పులు తీర్చే మార్గం కూడా మరేమీ ఉన్నట్టు కనబడదు. సాంకేతిక పురోగతి సాధించి, తక్కువధరలకు నాణ్యమైన వస్తువుల నందజేయగలిగితే కొంతవరకు మనం ఎగుమతులను పెంచుకొనవచ్చును. కానీ యిందుకు దిగుమతులు కూడా ఎంతో అవసరం. అప్పుడే ప్రపంచ మార్కెట్‌తో మన సంబంధాలు గట్టిపడి విదేశవ్యాపారం సమృద్ధిగా సాగుతుంది. అయితే ప్రస్తుతం మన ఎగుమతులు జాతీయాదాయంలో 5 లేక 6 శాతం మించలేవు. ఇంత విశాలమైన దేశంలో, విస్తారమైన వనరులు నిరుపయోగంగా పడిఉన్నప్పుడు, విదేశ వ్యాపార రంగానికి అనుగుణంగా పథకాలను రూపొందించడం కొంచెం కష్టమే కావచ్చు. కానీ, దిగుమతి కోతల కంటే ఎగుమతి ప్రోత్సాహాలకు ఉచితస్థానం యిచ్చి విదేశీమారకం ఆర్జించుకునే మార్గం వెదకాలి. లేకపోతే, విదేశ సహాయానికి స్వస్తి చెప్పడం అన్న లక్ష్యాన్ని మనం సాధించడం ఎలా ఉన్నప్పటికి అది మనకు లభించే అవకాశాలే మృగ్యంకావచ్చు. అప్పుడు విచారించి లాభంలేదు. అందుచేత యిప్పటినుంచే మేల్కొని విదేశ వ్యాపారానికి మన ప్రణాళికల రూపకల్పనలో తగిన స్థానాన్ని యివ్వాలి.

3. (ఈ) డెఫిసిట్ ఫైనాన్సింగ్, లేక లోటుబడ్జెట్ విధానం వలన ప్రభుత్వ ఖర్చుకు అవసరమైన ధనాన్ని సమకూర్చుకుంటుంది. అయితే యిందువలన ధరలు పెరుగుతాయి. నిజమైన వస్తువుల సరఫరా పెరుగకుండానే దేశంలో ఎక్కువధనం చలామణి అవడం వలన వస్తువులకు గిరాకీ పెరిగి ధరలు ఎదుగుతాయి. అయితే యీ ఎదుగుదల ఆర్థికాభివృద్ధికి కొంతవరకు దోహదం చేస్తుంది. ధరలు పెరగడం వలన, స్థిరమైన ఆదాయం కలవాళ్ళ వస్తువినియోగం (Real Consumption) తగ్గుతుంది. పొదుపు పెరిగి పెట్టుబడికి వలసిన వనరులు సమకూరుతాయి. అయితే కట్టడిలేకుండా అదనపు ద్రవ్యాన్ని విడుదల చేసినట్లయితే నష్టాలు ఎక్కువ అవుతాయి. ఇప్పటివరకూ మనదేశంలో దాదాపు 5 వేల కోట్ల రూపాయల డెఫిసిట్ ఫైనాన్సింగ్ జరిగింది. 5వ ప్రణాళికలో 1000 కోట్ల రూపాయల వరకూ యిందువలన సేకరించాలని తలుస్తున్నది ప్రభుత్వం. కానీ, ఇది ప్రభుత్వం — రిజర్వు బ్యాంకుల చేతుల్లో పని అయినప్పటికీ, ధరలు మరింత తీవ్రంగా పెరిగే అవకాశం ఉన్నది. అందుచేత అదనపు ద్రవ్యం విడుదలను నిరిత పరిమితం చేస్తే అంత మంచిది. ధరలు పెరుగకుండా ఉండాలంటే, వస్తూత్పత్తి ఎంత శాతంలో పెరుగుతున్నదో అంతేశాతంలో ద్రవ్యం కూడా విడుదల చేయాలి. హెచ్చుతగ్గులు ధరల స్థాయిలో మార్పులు కొనివస్తాయి. ఈ మార్పులు ఆర్థిక వ్యవస్థనే అస్తవ్యస్తం చేయవచ్చును.

ఆయా కారణాలవలన మన ఆర్థిక ప్రణాళికలకు వనరులు సేకరించడం విషయంలో యింకా తీవ్రమైన పరిశోధన, కృషి జరుగవలసి ఉన్నది. లేని ఎడల ప్రణాళికల లక్ష్యాలను తగ్గించి కొద్దిపాటి ప్రగతితోనే సంతృప్తి పడవలసి ఉన్నది. అది మన ప్రజానీకానికి సంతృప్తిదాయకం కాజాలదు.

## 2. వర్తమాన సమస్యలు

ఒక విధంగా వర్తమాన సమస్యలన్నీ వ్యవస్థాత్మకమైన సమస్యలే. దీర్ఘకాలిక ప్రణాళికల ద్వారా సిద్ధించినవే. కానీ వాటిని పరిష్కరించడానికి అత్యవసరంగా తీసుకొనవలసిన చర్యలు కొన్ని ఉన్నాయి. కొంత పరిష్కారం మన వ్యవస్థలోని లోటుపాట్లను తొలగించడం ద్వారా లభిస్తుంది. ఆహారసమస్య, ధరలపెరుగుదల, నిరుద్యోగం, పేదరికం వంటి సమస్యల విషయంలో కొన్ని సత్వర చర్యలు గైకొంటే తప్ప పరిస్థితి చేయిదాటిపోయే ప్రమాదం ఉన్నది.

మన ఆహార సమస్య పరిష్కారంలో ముఖ్యంగా మూడంశాలున్నాయి. మొదటిది, ఉత్పత్తిస్థాయిని పెంచి హెచ్చుతగ్గులు లేకుండా స్థిరీకరించడం, రెండవది, ఆహార పదార్థాలను అవసరమైన ప్రాంతాలకు త్వరగా పంపిణీ చేయడానికి వీలయిన వ్యవస్థను రూపొందించడం, మూడవది, జనానికి ముఖ్యంగా పిల్లలకు, పుష్టికరమైన ఆహారాన్ని అందించడం. విచిత్రమేమిటంటే, వ్యవసాయ రంగంలో మనం ఎంత ప్రగతిసాధించినప్పటికీ తలసరి లభ్యమయ్యే ఆహారపదార్థాల పరిమాణం 1950 నుంచీ నేటివరకూ ఎంతమాత్రమూ పెరగలేదు. అడపాదడపా కరువుకాటకాలు కూడా తధ్యమవుతున్నాయి. కొన్నిచోట్ల అదనపు ఆహార ధాన్యాలు ఉంటే మరికొన్ని చోట్ల కొరత ఏర్పడుతున్నది.

ధరల పెరుగుదల చాలా విషమరూపం ధరిస్తున్నది. ప్రభుత్వం తయారుచేసి ప్రచురిస్తున్న గణాంకాలు యధార్థ పరిస్థితిని సరిగా ప్రతిబింబించడంలేదు. పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి అయిన అనేక వస్తువులు ప్రభుత్వపు ధరల నిబంధనలకు లోబడిఉన్నాయి. అయినప్పటికీ, బహిరంగ విపణి (Open Market) లో హెచ్చు ధరలకు ఎవరికి ఎంతఅవసరమో అంతవరకూ కొనుక్కొనే గలుగుతున్న విషయం విదితమే. ధరలమీద కంట్రోళ్ళు పెరిగినకొలదీ ప్రభుత్వ గణాంకాలకు, యధార్థ స్థితికి తారతమ్యం పెరిగిపోతున్నది. ధరల పెరుగుదల వలన ప్రభుత్వోద్యోగులు హెచ్చుజీతాల కోసం ఆందోళన చేయడం, దీనివలన మళ్ళీ ధరలు పెరగడం జరుగుతున్నది. ఇందువలన మన ప్రణాళికల అంచనాలు తారుమారు కావడం, సాంఘిక న్యాయం యొక్క లక్ష్యానికి విరుద్ధంగా ఆదాయ విభజనలో విపరీతాలు సంభవిస్తున్నాయి.

నిరుద్యోగ నిర్మూలన మొదటి ప్రణాళికాకాలం నుంచీ నేటివరకూ మన ఆర్థిక విధానం యొక్క ప్రముఖ లక్ష్యంగా పరిగణించబడుతున్నది. కానీ యీ నాటివరకూ యీ సమస్య యొక్క స్వరూప స్వభావాలను

గురించిగానీ, పరిమితిని గురించిగానీ సరైన అంచనాలు లేకపోవడం విస్మయకారకం. 1970 లో ప్రణాళికాసంఘం నియమించిన నిపుణుల సంఘం అంచనాల ప్రకారం దేశంలో నిరుద్యోగం 7—8 శాతం మించి లేదు. అమెరికా యింగ్లండు వంటి దేశాలలోనే ఈశాతం మించి నిరుద్యోగం ప్రబలుతున్నది. అటువంటప్పుడు యీ అంకెలను మనం స్వీకరించేటప్పుడు చాలా అప్రమత్తతతో వ్యవహరించాలి. వ్యవసాయరంగం ప్రధానంగాకల మనదేశంలో ప్రచ్ఛన్న నిరుద్యోగం (Disguised Unemployment) యొక్క సమస్యను పరిష్కరించవలసిన అవసరం ఉన్నది. అదేవిధంగా పట్టణ ప్రాంతాలలో విద్యావంతుల నిరుద్యోగం పెరిగి పోతున్నది. విద్యావిధానానికి ఆర్థిక వ్యవస్థలో ఉద్యోగావసరాలకు సంబంధం లేకుండా పోతున్నది. ప్రతి సంవత్సరమూ జనాభా పెరుగుదల వలన ఏర్పడిన నిరుద్యోగ సమస్యను పరిష్కరించటం మాట అటుంచి పూర్వం నుంచి సంక్రమించిన నిరుద్యోగాన్నే పరిష్కరించలేకపోతున్నాం. నిరుద్యోగ నిర్మూలనం ఒక లక్ష్యంగా మనం పరిగణించినప్పటికీ, మనయితర విధానాలు అందుకు భిన్నంగా పని చేస్తున్నాయి. అయిదవ ప్రణాళిక ముసాయిదాలో నిరుద్యోగ నిర్మూలన సాంఘిక న్యాయం సమకూర్చడానికి ప్రధాన సాధనంగా పేర్కొనబడింది. యిందుకోసం ఉత్పత్తి విధానాలను మార్చవలసి ఉన్నది.

ఈ సమస్యలన్నీ అనూచానంగా వస్తున్నవే. తాత్కాలిక విధానాల ద్వారా వీటిని పూర్తిగా పరిష్కరించడం సాధ్యంకాదు. అందుచేత, మన ఆర్థిక విధానం వ్యవస్థాత్మకమైన మార్పులు తీసుకురావడానికి కృషి చేస్తూనే ప్రత్యేక చర్యలద్వారా యీ అత్యవసర సమస్యల దుష్ప్రభావాన్ని తగ్గించే ప్రయత్నం చేయాలి.

## 3. ప్రభుత్వ విధానాలు

నియమిత లక్ష్యాలను సాధించడానికి ప్రభుత్వం అనేక విధానాలను ఉపయోగించవచ్చు. అయితే ఒక్కొక్క లక్ష్యానికి యీ విధానాలను ప్రత్యేకంగా సంకలనం చేసి వాడినప్పటికీ, ఒక విధానం మీద ప్రాముఖ్యం ఉంచాలి. ఈ విషయంలో మన ప్రభుత్వం అనుసరిస్తున్న పద్ధతి లోపభూయిష్ఠమైనది. పన్నులసేకరణ, ప్రభుత్వ ఖర్చు వివరాలకు సంబంధించిన బడ్జెటు విధానం ఆదినుంచీ మన ప్రభుత్వపు ప్రధాన సాధనంగా ఉంటూవస్తున్నది. ద్రవ్యవిధానానికి (Monetary Policy) ఎటువంటి ప్రత్యేక ప్రతిపత్తి యివ్వలేదు. ప్రణాళికల రూపకల్పనలో ముఖ్యమైన లోపం ద్రవ్యం, ధరలను గురించి సరైన విశ్లేషణ లేకపోవడమే. ఆర్థిక ప్రగతికి సంబంధించినంతవరకూ ద్రవ్యం తటస్థంగా వుంటుందనీ, అది కేవలం వస్తుమారకానికి ఉపయోగించేదీ అన్న పూర్వపు అభిప్రాయం ఏనాడో తిరస్కృతమైంది. ప్రగతిశక్తిని ప్రోత్సహించడానికి ద్రవ్యం చాలా ఉపకరిస్తుందని యీనాటి అనేక ఆర్థిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అదనపు ద్రవ్యం ముఖ్యంగా మూడు మార్గాల ద్వారా లభ్యమవుతుంది. ఒకటి, డెఫిసిట్ బడ్జెటుపద్ధతి, రెండు అంతర్జాతీయ వ్యాపారానికి సంబంధించిన Balance of Payments లో వచ్చే మార్పులు, మూడు ప్రైవేటు రంగానికి బ్యాంకులు సమకూర్చే అప్పులు. ప్రభుత్వం తన ఆదాయాన్ని మించి ఖర్చుపెట్టదలచుకుంటే రిజర్వు బ్యాంకు వద్ద నుంచి అప్పుతీసుకుంటుంది. ఈ అప్పు అదనపు ద్రవ్యం రూపంలో మార్కెట్‌లోకి వస్తుంది. అందువలన కొన్ని వాంఛనీయమైన మరికొన్ని అవాంఛనీయమైన పరిణామాలు సంభవిస్తాయి. ప్రస్తుతం మన ప్రభుత్వం యీ ఫలితాలను దృష్టిలో ఉంచుకొనకుండా తన ఖర్చు అవసరాలను మాత్రమే పరిగణిస్తున్నది. అదే విధంగా ప్రైవేటు రంగంలో పెట్టుబడి అవసరాల దృష్ట్యా బాంకుల పరపతి విధానం నడుస్తున్నది. కానీ అందువలన ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సిద్ధించే ఫలితాలను గమనించడంలేదు. అయిదవ ప్రణాళికాకాలంలో దాదాపు 1000కోట్ల రూపాయలు అదనపు ద్రవ్యం విడుదల ద్వారా సమకూర్చుకోవాలని ప్రభుత్వం యోచిస్తున్నది. ప్రస్తుతం దేశంలో దాదాపు 7000కోట్ల రూపాయల ద్రవ్యం చలామణిలో ఉన్నది. దీనిమీద మరొక వేయికోట్లు కలిపేముందు, ముఖ్యంగా మన లక్ష్యాలను సాధించలేని స్థితిలో ఉన్నప్పుడు, సరైన ద్రవ్యవిధానాన్ని రూపొందించడం చాలా అవసరం. లేకపోతే ఒనగూడే నష్టాలు చాలా తీవ్రమైనవి.

ధరల విషయం కూడా అంతే. మొదటి ప్రణాళికను మినహాయించి మరే దానిలోను మనం నిర్ణయించిన స్థాయిలో పెట్టుబడికి అవసరమైన వనరులు సమకూరలేదు. ధరల పెరుగుదల యిందుకు ముఖ్యకారణం. అయిదవ ప్రణాళికా కాలంలో, 1971—72 ధరల ప్రకారం, 51,556 కోట్ల రూపాయల పెట్టుబడి చెయ్యాలని ప్రభుత్వం యోచిస్తున్నది. గత అనుభవాన్ని బట్టి చూస్తే ప్రతిసంవత్సరం ధరలు సుమారు 8—12 శాతం వరకు పెరగడం తథ్యం. అంటే అయిదు సంవత్సరాలలో 43—65 శాతం వరకూ ధరలు పెరిగితే, మన పెట్టుబడి స్థాయి దాదాపు 80 వేల కోట్ల రూపాయల వరకూ పెరగాలి. ఇంత మొత్తం ఎంత భగీరథ ప్రయత్నం చేసినా సమకూర్చుకొనలేమన్న విషయం ప్రభుత్వానికి తెలియదనుకోవడం కష్టం. చివరకు మన పెట్టుబడి అనుకున్న దానికంటే ఎంతో తక్కువ స్థాయిలో ఉంటుంది. అందువలననే మన లక్ష్యాలకు ఎంతో దూరంలో ఉండిపోతున్నాం. కాబట్టి మన విధానాలలలోనూ, ప్రణాళికల నిర్మాణంలోనూ ధరల స్థాయి, సాపేక్ష ధరల మార్పులను గురించి వివరాలకు ప్రాధాన్యం యివ్వడం ఉచితం అవసరమూను.

ఉపసంహారం :

ఒక రాజకీయనాయకుడు బహిరంగసభలో ప్రసంగిస్తున్నాడు. విషయం ఆర్థికాభ్యుదయం ప్రజలకు ప్రభుత్వం శక్తిసామర్థ్యాల మీద విశ్వాసం కలిగించడం ఆయన ఆశయం. అందుచేత యీ క్రింది వాగ్దానం చేశాడు. 'కొద్ది సంవత్సరాలలో దేశంలోని ప్రజలందరి తలసరి ఆదాయం సగటు తలసరి ఆదాయాని కంటే హెచ్చుగా ఉండేందుకు కృషి చేస్తాం' ఏ స్థాయిలోనైనా, సగటు ఆదాయం కంటే కొందరి ఆదాయం హెచ్చుగానూ, మరికొందరి ఆదాయం తక్కువగానూ ఉంటుందన్న విషయం ఆయనకు తెలియదు పాపం. కాదు — ప్రజలకే తెలియదేమో మరి.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thumb Chetty Street, Madras-1. Editor; S. Radhakrishna.

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ ప్రమాది నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిణః పుత్రాభ్యాం

## చినకృష్ణమూర్తిశాస్త్రి - సుబ్రహ్మణ్యశాస్త్రిభ్యాం ప్రణీతమ్

విఘ్నేశ విధిమార్తండ చంద్రేంద్రోపేంద్ర వందిత। నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే.
వేదమయీం నాదమయీం పరపహోద్య బిందుమయీం
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

## గమనిక

ఈ సంవత్సరమున రాజు. రసాధిపతి బుధుడు మంత్రి శుక్రుడు, సర్వసస్య సముదాయమగు 16 వీసములలో 12 (¾) వీసముల పంట ఫలించును. ఒలరాముడు పశు పాలకుడు. గోష్ఠ ప్రాపకుడు, గోవ బహిష్కర్త యు శ్రీకృష్ణుడు. వరాడ కుంచముల వర్షము, రాత్రియం ద్వార్దా ప్రవేశము వత్సరాది ప్ర. జ్యేష్ఠ శు ౧౦ ఆ. వ వృద్ధగణికా హస్తము తదారభ్య జ్యా ద శు. ఆది. స. బ్రాహ్మణ బాల హస్తమున తదారభ్య కార్తిక బ. ౧౪ శుక్ర ప్ర. యువక బ్రాహ్మణ హస్తమున తదారభ్య ఆవత్సరం లిర్రి బాల బ్రాహ్మణ హస్తమున కుంచముండును. (9—2—1974) మాఘ బ 3 శనివారం సింధునదీ పుష్కర ప్రవేశము రాబోవు ఆనంద నామ సంవత్సరమున జ్యాదసద మదిక మాసము సంభవించును.



## మౌఢ్యములు

వత్సరాది ప్రభృ వైశాఖ శు. ఆది వ. (6—5—1973) శుక్ర మౌఢ్యము, పుష్య బ ౧౧ శని ప్ర (19—1—1974) మాఘ శు 3 శని వ (26—1—74) త్యాగం శుక్ర మౌఢ్యము. మాఘ శు ౯ గు. ప్ర (31—1—1974) ఫాల్గున శు ౯ శని. వ (2—3—74) గురు మౌఢ్యము. మిగిలిన మాసములు శుద్ధములు

| | |
|---|---|
| కల్యాద్బాః | ౫౦౭౪ |
| శాలివాహనశకః | ౧౮౯౫ |
| ఫసలీసన్ | ౧౩౮౨—౮౩ |
| హిజరీసన్ | ౧౩౯౩—౯౪ |
| క్రీస్తుశకము | 1973—74 |
| భారత స్వాతంత్ర్యశకము | 26—27 |

# ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు-1.

## పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యధార్థాకారముగ విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్ర ప్రదేశ మధ్యభాగమునకు చూపబడినది. తిథి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి. శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహాపాతలు గంటలలో మాత్రం చూపబడినవి. యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి. భారత ప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫార్మ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరీసు అండ్ నాటికల్ ఆల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి. నూతన శోధనల యందు కనుగొనబడిన భూకేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధింపబడిన తిథ్యాదికము, గ్రహసంచారము ఇందు ప్రాధాన్యముగ చూపబడినవి. ఈ తిథ్యాది గ్రహ సంచారములే పంచాంగమున ప్రసిద్ధముగ ఆకరమున సరిపడుచున్నవి. న్యాయమును లోకము తెలిసికొనుటకొరకు భేదము గుర్తించ గలందులకు పూర్వపద్ధతి పంచాంగముకూడ ఇందు సంగ్రహముగ చూపబడినది ఇందు చూపబడిన పూర్ణ శాస్త్రీయ పద్ధతియే శాస్త్రీయమని గ్రహింపగలరని మా నిశ్చితాభిప్రాయము. ఇందు తిథ్యాది, ఘటికలు, ఉదయాస్తమయములు, శుభముహూర్తములు, దుర్ముహూర్త వర్జ్యములు, లగ్నాంతకాలములు, నిరయణ గ్రహస్ఫుటములును విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి. దేశాంతర చక్రములును చూపబడినవి. ఇంక వేదాంగ జ్యోతిషమున సూచింపబడిన ఆర్యాద్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేయుచున్నాము—గావున వైదికము సనాతనము గూడ యగుచున్నది. 10 అక్షాంశ లగాయతు 30 అక్షాంశ వరకు ఉన్న ప్రమాణములు యివ్వబడినవి. శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సమన్వయమై యొప్పు ఈ పంచాంగమును గ్రహించి శ్రౌత స్మార్త కర్మల నాచరింప గోరుచున్నాము.

